శ్రీ వేంకటేశాయ నమః.

శ్రీ తరిగొండ లక్ష్మీనృసింహ కరుణాకటాక్షకలిత
కవితావిలాస వసిష్ఠగోత్ర పవిత్రురాలగు
తరిగొండ, వెంకమాంబయను
భక్తురాలిచే నారాశ్వాసంబులుగా రచియింపఁబడిన

# శ్రీ వేంకటాచలమాహాత్మ్యము.




ఈ గ్రంథము

శ్రీ వేంకటేశాష్టోత్తర శతనామస్తోత్రంబుతోఁడ జేర్చి
పండిత పరిష్కృతము గావించి

వేలూరు. కుప్పుస్వామి మొదలారివారిచే

అమెరికన్ డైమెండు ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.

చెన్నపురి :

1924.

వెస్టు వార్డు అండు కంపెనీయందు హాజరుగానుండు

# వేదాంత గ్రంథములు.

శుకబ్రహ్మాకైవల్యము అను శ్రీశుకమహర్షి చరిత్రము:- ఇందు శ్రీశుకమహాఋషికిన్ని రంభకున్ను జరిగిన సంవాద రహస్యము పరమపవిత్రమైనది, బహు యింపును, సొంపును, సూచనను, కలిగించునది. స్త్రీరూపములగు మాయను నిరాకరించు చమత్కారములంగలది. మరియు నారాయణోపనిషత్తు, ఆత్మోపనిషత్తు నందుగల విషయములను తాత్పర్యముతో జనకచక్రవర్తి తన భటులతో నాజ్ఞాపించిన సంవాదములనున్ను తేటతెల్లంబుగ సూచింపుచున్నది. 0 12 0

వేదాంతరహస్య దర్పణమను జ్ఞానసుందరి వివేక సుందరికిం జెప్పిన నూతన విచిత్రపతివ్రతల కథలు:- ఇది రసవంతమై అభిరుచిని పుట్టించి పతివ్రతలు (ముక్తికి) తన భర్తలయెడనుండు సత్వశీలత్వమును గుర్తెరిగి వారిగుణంబులను అయోమయంబులని మనఃపూర్వకమై నిజభక్తిం దేజరిల్లుచు తదనుగుణ్యమై నాథుఁడే దైవంబని పూజలంసల్పుచు పతివ్రతలని ముక్త్యాస్పదమయమగు 23 కథలం గలిగియున్నది. 0 10 0

బ్రహ్మవిద్యారహస్యము:- (వచనకావ్యము) ఇది బ్రహ్మముయొక్క రహస్యమును జ్ఞానముచేత గురువులననుసరించి మాయయొక్క వుపాధిచే తల్లతుణంబు తెలియక యున్నదానిని విచారించి భ్రాంతి జన్యములను నిరాకరించి తనయందుగల మాలిన్యమును తత్వశోధనవల్ల జీవన్ముక్తి పదంబైన వివరమును సంశయనివృత్తి శోధనలను సూచించునది. 0 2 0

పాతంజలయోగశాస్త్రము:- (తాత్పర్యముగలది) ఇది హఠయోగమునం గల విషయములగు యోగములంబోలినదై సూక్ష్మాంశములగు విద్యలను విమర్శచే యోగాంగపరిశీలనవల్ల నిజతత్వమునుగుర్తెరుగు సులభోపాయంబులం బోధించుచున్నది. 1 0 0

ఉపనిషత్సార రత్నావళియను శ్రీరామచంద్ర హనుమంతసంవాదము:- ఇందు 108 ఉపనిషత్తులగు సారములున్ను మరి ముఖ్యములగు దశోపనిషత్తులయొక్క విశేష తాత్పర్యములున్ను, సారాంశముగా బోధింపును. 0 8 0

పౌరుషపారమ్యమను పురుషార్థదీపిక:- ఆంధ్రతాత్పర్యము ఇది వాసిష్ఠరామాయణాంతర్గతము. గాన మనదేశమందు పలుప్రాయులై యుండువారికి తెలివికల్గునట్లు, జ్ఞానవాసిష్ఠమునందలి శ్రీరామున కుపదేశించిన పౌరుషప్రాశస్త్యమును పఠించుటకున్ను దైవవిచారమును నెఱుంగ దగినదని బోధించిన విషయములం దేజరిల్లినది. 0 2 0

యోగవిద్య:- ఇందు 82 యోగాసన రూపపటములతో సమర్చబడినది, సులభోపాయములగు యోగములను తెలియంజేయును. 0 4 0

దృగ్దృశ్య వివేకము:-(దృక్కు, దృశ్యము, వివేకము) అను వేదాంతవేద్యంబును తాత్పర్యసహితముగా శ్లోకములం జూపును. ఇది శ్రీవిద్యారణ్యస్వామి విరచితశ్లోకములోనిది. వేదాంతరహస్యముల [illegible] విశదముగా జెప్పంబడియున్నది. 0 8 0

మా విలాసము:—వెస్టువార్డు అండు కంపెని., చాకలపేట, మదరాసు.

---

బ్రహ్మజ్ఞాన చింతామణియను, సుగుణాకర మహారాజుకథ:— ఇందు మనస్సన్యాసమును ముఖ్యమని జెప్పడమేగాక తత్కాలమున భార్యాబిడ్డలనువదలి మనోవికారమై సంసార బంధములను విశదీకరించక కాషాయ వస్త్రములను ధరించి బాహ్యసన్యాసమే ముఖమని గుర్తెరుగు సన్యాసుల వినోదములను విశదీకరించును. 0 8 0

పరమాత్మలక్షణబోధిని:—(పద్యకావ్యము, టీకా తాత్పర్యము.) ఇందు గురుశిష్యసంవాదముగా తెలుసుకొనునట్టి లక్ష్యలక్షణంబులను 108 పద్యములతో వివరమై సత్యజ్ఞానానందాది గుణాగుణంబును పరబ్రహ్మంబునకు గలవని వక్కాణించుచున్నది. 0 8 0

వేదాంతసార ప్రశ్నోత్తర రత్నావళియను గురుశిష్యసంవాదము:— ఇందు సర్వసారోపనిషత్తు, నిరాలంబోపనిషత్తు, అమృతబిందోపనిషత్తు, మైత్రేయోపనిషత్తు అనెడి ఈ నాల్గు ఉపనిషత్తులున్ను మొదటినుండి కడవరకు సంపూర్ణ తాత్పర్యమును గురుశిష్య ప్రశ్నలు విభాగించుచు నచ్చటచ్చట వుపమాన వుపమేయ వాక్యంబుల నవలంబించి సులభోపాయం బగునది. 1 0 0

శ్రీకృష్ణామృత బోధయను పంద్రెండు రాజులకథలు:— ఇందు శ్రీకృష్ణుడు తన బావమరిదియగు నర్జునునకు వేదాంతవేద్యసూక్ష్మంబగు ద్వాదశరాజులయొక్క అనుభవనీయంబును యెరుకలేని మార్గమును అచ్చటచ్చట వెదజల్లుచు పుట్టుచావుల నిరసించుచు ప్రతిలేని బోధలుం గలది. 0 12 0

హఠయోగప్రదీపిక:— వేదాంతవేద్యము (ఇందు 128 యోగాసనరూప పటములు గలది) యోగాభ్యాసకులకు యోగ్యము. తన్మోక్షమును వెదజల్లును. 2 8 0

శ్రీ సీతారామ హృదయంబను, పదునాలుగురాజులకథలు:— ఇందు శ్రీరాములు ఆంజనేయులకు తద్బోధను యెరుకజేసి వేదాంతవేద్యములగు మోక్షప్రదాయకమైన కథలంగల్గినది. 0 12 0

సచ్చిదానంద బోధామృతమను రాజహంస పరమహంస సంవాదము:— ఇది పింగళయనువేశ్యకును, ఒకసన్యాసికిని జరిగిన సంవాదము. ఇందు సందేహాస్పదంబులగు నేతినేతి వాక్యంబులం గోచరించుచు మిక్కిలి శృంగారంబులగు కథలను గాన్పించుచు, మోక్షసన్యాసమెద్దియో వానినిం గుర్తెరిగింపుచు అజ్ఞానంబుల దొలగించు సూచనంగలది. 0 12 0

వెస్టువార్డు అండు కంపెని.,

చాకలపేట, మదరాసు.

# వి ష య సూ చి క.

## ప్ర థ మా శ్వా స ము.

| | |
|---|---|
| వేంకటాచల పురీవర్ణనము. | 3 |
| షష్ఠ్యంతములు. | 4 |
| నైమిశారణ్య వర్ణనము. | 5 |
| క్రీడాచలము గరుత్మంతుండు శేషగిరికి దెచ్చుట. | 8 |
| బ్రహ్మేంద్రాది కృతస్తోత్రము. | 9 |
| వేంకటాద్రి నామములు. | 13 |
| హరి విటవేషధరుఁ డగుట. | 14 |
| కుమారధారమహిమ. | 17 |
| హరి శంఖణరాజునకు బ్రసన్నుండగుట. | 19 |
| హరిఆత్మారామునికిఁ బ్రసన్నుండగుట. | 20 |
| వేంకటాద్రి యుగభేదంబుల ప్రకాశించుట. | 25 |
| శ్రీరాములు వేంకటాద్రికి వచ్చుట. | 25 |
| వైకుంఠగుహా ప్రభావము. | 28 |

## ద్వి తీ యా శ్వా స ము.

| | |
|---|---|
| ఇంద్రాదులు సత్యలోకమునకు బోవుట. | 33 |
| బ్రహ్మేంద్రాదులు వేంకటాద్రికి వచ్చుట. | 34 |
| దశరథుండు వేంకటాద్రికి వచ్చుట. | 34 |
| వేంకటేశ్వరుండు బ్రహ్మాదులకుఁ బ్రత్యక్షుఁడగుట. | 38 |
| శ్రీమన్నారాయణుని బ్రహ్మాదులు ప్రార్థించుట. | 39 |
| బ్రహ్మోత్సవక్రమము. | 44 |

## తృ తీ యా శ్వా స ము.

| | |
|---|---|
| చక్రరాజవిజయము. | 52 |
| వైష్ణవధర్మము. | 62 |

## విషయసూచిక.


జీవబ్రహ్మ ప్రశంస. 64

అష్టాంగ యోగము. 65

మంత్రయోగము. 70

లయయోగము. 70

శ్రీవేంకటేశ్వరాష్టోత్తర ప్రభావము. 82

నైమిశారణ్యమునులు వేంకటాద్రికి వచ్చుట. 83

మునులు నైమిశారణ్యమునకు జని సూతునుతించుట. 86


## చతుర్థాశ్వాసము.


భవిష్యోత్తర పురాణము. 88

చండాలస్త్రీ బ్రాహ్మణ సంవాదము. 97

పద్మావతితో నారదుండు భాషించుట. 118

శ్రీనివాసుడు మృగవేటలాడుట. 119

పద్మావతిహరిమీద ఱాళ్లు ఱువ్వించుట. 123

రామకథ హరి వకుళకు చెప్పుట. 128

వకుళ నారాయణ పురంబున కరుగుట. 131


## పంచమాశ్వాసము.

## షష్ఠాశ్వాసము.


పద్మపురాణంబను వీరలక్ష్మీవిలాసము. 179




(కృష్ణా జిల్లా.)

# శ్రీ వేంకటేశాష్టోత్తర శతనామశ్లోకాః.

శ్రీ వేంకటేశశ్శ్రీనివాసో లక్ష్మీపతిరనామయః । అమృతాంశో జగ
ద్వంద్యో గోవిందశ్శాశ్వతః ప్రభుః ॥ ౧ ॥ శేషాద్రినిలయో దేవః కేశవో మధుసూ
దనః । అమృతో మాధవః కృష్ణః శ్రీహరిర్జ్ఞానపంజరః ॥ ౨ ॥ శ్రీవత్సవక్షాస్సర్వే
శో గోపాలః పురుషోత్తమః । గోపీశ్వరః పరంజ్యోతిర్వైకుంఠపతిరవ్యయః ॥
౩ ॥ సుధాతనుర్యాదవేంద్రో నిత్యయౌవనరూపవాన్ । చతుర్వేదాత్మకో విష్ణు
రచ్యుతః పద్మినీప్రియః ॥ ౪ ॥ ధరాపతిస్సురపతిర్నిర్మలో దేవపూజితః । చతుర్భు
జశ్చక్రధరస్త్రిధామా త్రిగుణాశ్రయః ॥ ౫ ॥ నిర్వికల్పో నిష్కళంకో నిరాతం
కో నిరంజనః । నిరాభాసో నిత్యతృప్తో నిర్గుణో నిరుపద్రవః ॥ ౬ ॥ గదాధరశ్శార్ఙ్గ
పాణిర్నందకీ శంఖధారకః । అనేకమూర్తిరవ్యక్తః కటిహస్తో వరప్రదః ॥ ౭ ॥
అనేకాత్మా దీనబంధురార్తలోకాభయప్రదః । ఆకాశరాజవరదో యోగి
హృత్పద్మమందిరః ॥ ౮ ॥ దామోదరో జగత్పాలః పాపఘ్నో భక్తవత్సలః ।
త్రివిక్రమశ్శింశుమారో జటామకుటశోభితః ॥ ౯ ॥ శంఖామధ్యోల్లసన్మంజుకింకి
ణ్యాఢ్యకరండకః । నీలమేఘశ్యామతనుర్బిల్వపత్రార్చనప్రియః ॥ జగద్వ్యా
పీ జగత్కర్తా జగత్సాక్షీ జగత్పతిః । చింతితార్థప్రదో జిష్ణుర్దాశార్హో దశరూప
వాన్ ॥ ౧౧ ॥ దేవకీనందనశ్శౌరిర్హయగ్రీవో జనార్దనః । కన్యాశ్రవణతారేజ్యః పీ
తాంబరధరోఽనఘః ॥ ౧౨ ॥ వనమాలీ పద్మనాభో మృగయాసక్తమానసః । అ
శ్వారూఢః ఖడ్గధారీ ధనార్జనసముత్సుకః ॥ ౧౩ ॥ ఘనసారలసన్మధ్యకస్తూరీతిల
కోజ్జ్వలః । సచ్చిదానందరూపశ్చ జగన్మంగళదాయకః ॥ ౧౪ ॥ యజ్ఞరూపో
యజ్ఞభోక్తా చిన్మయః పరమేశ్వరః । పరమార్థప్రదశ్శాంతశ్శ్రీమాన్ దోర్దం
డవిక్రమః ॥ ౧౫ ॥ పరాత్పరం పరబ్రహ్మ శ్రీవిభుర్జగదీశ్వరః । ఏవం శ్రీ వేంకటేశ
స్య నామ్నామష్టోత్తరం శతం ॥ ౧౬ ॥ పఠతాం శృణ్వతాం భక్త్యా సర్వాభీష్ట
ప్రదం శుభం । త్రిసంధ్యం యః పఠేన్నిత్యం సర్వాన్ కామానవాప్నుయాత్ ॥

## ఇతి శ్రీ వేంకటేశాష్టోత్తరశతనామావళిః.

ఓం శ్రీ వేంకటేశాయ
శ్రీనివాసాయ
లక్ష్మీపతయే
అనామయాయ
అమృతాంశాయ
జగద్వంద్యాయ
గోవిందాయ

శాశ్వతాయ
ప్రభవే
శేషాద్రినిలయాయ
దేవాయ
కేశవాయ
మధుసూదనాయ
అమృత[illegible]

మాధవాయ
కృష్ణాయ శ్రీహరయే
జ్ఞానసంచరాయ
శ్రీవత్సవక్షసే
సర్వేశాయ
గోపాలాయ
పురుషోత్తమాయ

గోపీశ్వరాయ
పరంజ్యోతిషే
వైకుంఠపతయే
అవ్యయాయ
సుధాతనవే
యాదవేంద్రాయ
నిత్యయౌవనరూపవతే
చతుర్వేదాత్మకాయ
విష్ణవే । అచ్యుతాయ
పద్మినీప్రియాయ
ధరాపతయే
సురపతయే। నిర్మలాయ
దేవపూజితాయ
చతుర్భుజాయ
చక్రధరాయ
త్రిధామ్నే
త్రిగుణాశ్రయాయ
నిర్వికల్పాయ
నిష్కళంకాయ
నిరాతంకాయ
నిరంజనాయనమః
నిరాభాసాయనమః
నిత్యతృప్తాయ
నిర్గుణాయ
నిరుపద్రవాయ
గదాధరాయ
శార్ఙ్గపాణయే
నందకినే
శంఖధారకాయ

అనేకమూర్తయే
అవ్యక్తాయనమః
కటిహస్తాయ
వరప్రదాయ
అనేకాత్మనే
దీనబంధవే
ఆర్తలోకభయప్రదా
ఆకాశరాజవరదాయ
యోగిహృత్పద్మ మందిరాయ
దామోదరాయ
జగత్పాలాయ
పాపఘ్నాయనమః
భక్తవత్సలాయ
త్రివిక్రమాయ
శింశుమారాయ
జటామకుటశోభితాయ
శంఖమధ్యోల్లసన్మంజు ళాయ
కింకిణ్యాఢ్యకరండకాయ
నీలమేఘశ్యామతనవే
బిల్వపత్రార్చనప్రియా
జగద్వ్యాపినే
జగత్కర్త్రేనమః
జగత్సాక్షిణే
జగత్పతయేనమః
చింతితార్థప్రదాయ
జిష్ణవేనమః
దాశార్హాయ

దశరూపవతే
దేవకీనందనాయ
శౌరయేనమః
హయగ్రీవాయ
జనార్దనాయ
కన్యాశ్రవణతారేజ్యా
పీతాంబరధరాయ
అనఘాయనమః
వనమాలినేనమః
పద్మనాభాయ
మృగయాసక్తమానసా
అశ్వారూఢాయ
ఖడ్గధారిణే
ధనార్జన సముత్సుకాయ
ఘనసారలసన్మధ్యకస్తూరితిలకోజ్జ్వలాయ
సచ్చిదానంద రూపాయ
జగన్మంగళదాయకాయ
యజ్ఞరూపాయ
యజ్ఞభోక్త్రేనమః
చిన్మయాయనమః
పరమేశ్వరాయనమః
పరమార్థప్రదాయ
శాంతాయనమః
శ్రీమతేదోర్దండవిక్రమా
పరాత్పరాయనమః
పరబ్రహ్మణే
శ్రీవిభవేనమః
జగదీశ్వరాయనమః

శ్రీ వేంకటేశాష్టోత్తర శతనామావళిః.

శ్రీ ర స్తు.

# శ్రీవేంకటాచలమాహాత్మ్యము.



శ్లో॥ శ్రీకాంతాత్మ సరోజచండకిరణాం శీతాంశుబింబాననమ్।
శ్రీకంఠాబ్జజ సన్నుతాంఘ్రికమలం చిన్మాత్ర వప్రాకృతమ్।
లోకాతీతమనేక గోపయువతీలోలం పరం సర్వగమ్।
సాకారం తరిగొండ శేషకుధరాధ్యక్షం భజేహంసదా॥

ఉ॥ క్షీర సముద్రమందు సువిశేషమతిన్ జనియించి కూర్మితో। వారిజనాభుదివ్యతర వక్షమునందు వసించి పూర్ణశ్రీం। గారవిలాసలీలల సుఖస్థితి నొప్పుచు భక్తకోటికిన్। గౌరవమొప్పగా నెపుడు గల్మలనిచ్చు సిరిన్ భజించెదన్॥ శా॥ శ్రీవిఘ్నేశుని క్షేత్రపాలకునఁజన్ శ్రీశంకరున్ దుర్గనున్। దేవేంద్రాదుల నాశ్రయింపుదును జిత్తే సత్తగా నాత్మలో। భావింపన్ గుఱిజూపినట్టి గురుసుబ్రహ్మణ్య పాదాబ్జముల్। సేవింతుఁ బరవస్తుతత్త్వమునదిన్ జింతిస్తునశ్రాంతమున్॥ శా॥ అక్షీణాక్షర పంక్తిరీతిమును మధ్యాహ్నంబునన్ నాకుబ్రత్యక్షంబై గురునాది పూరుషుని బ్రత్యక్షంబు గావించి చిత్సాక్షి బ్రహ్మమటంచు జూపుచు దదర్థంబుం గృపం జెప్పినన్। రక్షింపంబని బూను భారతిని గీర్వాణిన్ బ్రశంసించెదన్॥ చ॥ అలఘు నభంబునుండి విమలాక్షరపంక్తుల రీతివచ్చినే। నలసట జెంది యున్నతఱి నాననమందువసించిజ్ఞానముం। గలుగగజేసి మానసవికారములం దొలగించి జిహ్వపై। నిలచినటించు శారదనునిత్యము సన్నుతిసేయుచుండెదన్॥ శా॥ పంకేజాసనుడాలకింప నొగిసత్ప్రావీణ్యమున్ దెల్పుచున్ శంకాతంకము లేక తాళగతులన్ సద్వీణ వాయించి యే। ణాంకున్ హాస్యముసేయనోపు ముఖమందాహ్లాదమున్ జూపు ది। వ్యోంకారాకృతియైన భారతినినే నుప్పొంగి సేవించెదన్॥ సీ॥ విప్రమాతృకలకు వెలిపట్టు తెల్లకల్వలు గంధమౌక్తికంబుల నొసంగి। రాజమాతృకలకు రహిఁ బనిగావులు మృగమదసుమశోణాగ్రమణు లొసంగి। వైశ్యమాతృకలకు బచ్చపట్టులు చంద్ర మరకతంబులు బొండుమల్లె లొసగి। శూద్ర మాతృకల కచ్చుగ నల్లగల్వలు నగరు మొల్లలు నీరహారములిడి। యావన్మాత్నే యి

తేనెయు నాసవమును । బూసగ నర్పించి కృతులు చెప్పుదురు కవులు। నేనొకటి నేరదరిగొండ నృహరి కృపను । భక్తి మ్రొక్కెద మాతృకా శక్తులకును॥ క॥ అలకాశినుండి వెలువడి । వలనుగ మాకొఱకు నంద వర పురమందే । నెలకొని కులదైవతమై ।యలరుచుమమ్మేలు చౌడమాంబను గొలుతున్॥ శా॥ నేవిజ్ఞానము మోసపోవు తఱితానే వచ్చి సప్రేమతో। ధావళ్యాకృతిజూపి మిన్చిన యవిద్యాచ్ఛేదమున్ జేసి మ।ద్భావంబందువసించి లెస్సయగు శబ్దశ్రేణి నిచ్చేహయ । గ్రీవున్ సత్కరుణా పయోధి మదిలో గీర్తించెదన్ నిత్యమున్॥ శా॥ అంతర్యంబున నుంచి సంతతమనంతాఖ్యుం బ్రశంసించెదన్ । స్వాంతంబందు సుపర్ణుడైన వినతా సత్పుత్రు భావించెదన్ । సంతోషం బలరంగ నెల్లపుడు విష్వక్సేను సేవించెదన్ । భ్రాంతుల్దీరగ బూర్వదేశికుల సత్పాదాబ్జము ల్గొల్చెదన్॥ శా॥ ధాత్రిన్ దుష్టనిశాటులం దునిమి సద్ధర్మంబు రక్షించి శౌ । ర్యాటోపంబుపశాంతి జేసి ఫణిపర్యంకంబునన్ నిద్రితుం । డై యొక్కొప్పగ బవ్వళించియును సర్వాధారుడౌ గావునన్ । గూటస్థుండి తడంచు నెన్నుదుమదిన్ గోవింద రాజాహ్వయున్॥ మ॥ అలఘుత్వంబున రావణాద్యఖిలదైత్యాళిన్ వితారించిసల్లలితన్ సీతనుగూడియాత్మపుర ముల్లాసంబుతో జేరి యుజ్జ్వలపట్టంబున కర్హుడై నిలిచి విశ్వస్వామియైయొప్పూటన్।గొలుతున్ సంతతమిష్టదైవమనుచున్ గోదండదీక్షాగురున్॥ శా॥ శృంగారాకృతితోడ వచ్చిపదముల్ శృంగారసారంబుతో।డంగూఢంబుగ జెప్పుసీవనగనట్టే జెప్పలేనన్నన్।ముంగోపంబున జూచిలేచియటనే మ్రొక్కంగమన్నించుత। చ్ఛృంగారోక్తులుతానెపల్కికొనునా శ్రీకృష్ణుసేవించెదన్॥ ఉ॥ కోరినశ్రీనివాసునకు గొంకక నైజనివాసమిచ్చియా।వీరుడొసంగినంత పదివేలని తృప్తిగనారగించుచున్ । గ్రూరతలేక యోగివలె గుప్తతనుండు వరాహ దేవుడే । సారపరాత్మ తత్వమని సన్నుతిసేయుచు నుందు భృత్యునై॥ మ॥ తిరమై శ్రీయలమేలు మంగయురమందే నిల్చిదీపింపగా । బరమైశ్వర్య ధురంధరుండగుచు నాపాలన్ గృపన్నిల్చినుం । దరదివ్యాకృతి నప్పటప్పటికి మోదంబొప్పగా జూపిమ। ద్వరదుండైతగు వేంకటాచలపతిన్ వర్ణింతున్ప్రశాంతమున్॥ ఉ॥ శ్రీరమణీ హృదీశ్వరుని చిన్మయమూర్తిని విశ్వతోముఖున్ । క్షీరసముద్రశాయిని వశీకృతమాయుని దివ్యకాయునిన్ । సారతరార్థముల్దెలిపి సత్కృపతోనను నేలుదేవునిన్ । గూరిమిమీఱ భజింతుదరిగొండనృసింహుని దూరితాంహునిన్॥ క॥ అలసూర్యాది నవగ్రహ । ములను బ్రజాపతులయోగిముఖ్యులద్రిమతం। బులనుద్ధరించుధన్యుల।దలతున్మోక్షాభిలాషదద్దయువేడ్కన్॥ సీ॥ఆదికవీశ్వరుండైనవాల్మీకికివ్యాసమౌనికిగా

ళిదాసకవికిఁ నతిజేసి వరలబ్ధమన్న మాచార్యున కాంధ్రభాషాకవితాధుర్యులగు
చు। మొనయ నన్నయకు దిక్కనసోమయాజికి బోతరాజునకును నీతులైన। కవు
లకు బండితాగ్రణులకు బౌరాణికులకు భక్తిని మ్రొక్కికొనుచు నేను। వేంకటా
చలమాహాత్మ్య విభవములను। బద్యపణితి నిరచియించి భక్తిమెఱయ।
శ్రీనివాసుని పాదరాజీవములకు। బొసఁగ నర్పించెదఁ ముక్తిఁ బొందుకొఱకు॥
సీ॥ పండితాగ్రణులార ప్రజలార యిపుడు నా బాలభాషల సహ్యపడక విను
డి। తల్లిదండ్రులు చిన్నపిల్లల పల్కు లాహ్లాదంబుగా విందురా విధమున।
మీరు నా తప్పొప్పు లేరీతిగానైనఁ గేలిసేయక చిత్తగింపవలయు। నాంధ్ర
గీర్వాణమహాకృతులుండగా నిప్పుడీకృతి విననేలయనక। భక్ష్యములు మె
క్కియూవలబచ్చడియును। నంజుకొనిన విధంబుగా నా ప్రబంధ। మాలకిం
తురుగాకను నాశచేత। నేను జెప్పెద మీరు మన్నించి వినుడు॥ శా॥ నారీతిం
దగ విన్నవించెద గృపన్మాతండ్రులారా వినుం। డారాజీవదళాక్షు సత్కరు
ణ నాయందుండు నైనఁ మదిఁ। సారార్థంబుల నేర్పరించుకొని భాస్వద్భ
క్తియోగక్రమ। శ్రీరమ్యంబుగ నాంధ్రరీతిని బ్రకాశింపఁ గృతిఁ జెప్పెదఁ॥
సీ॥ నా చిన్ననాటనో నా బాలునైన నాచార్యుల చెంత నేజదువ లేదు। పర
గ ఛందస్సులోబడి పద్యములనైన నిక్కంబుగా నేను నేరలేదు। లలికావ్య
నాటకాలంకార శాస్త్రముల్ వీనులనైన నే వినగ లేదు। పూర్వేతిహాసవి
స్ఫురితాంధ్రసత్కృతుల్ శోధించి వరుసగా జూడలేదు। చేరితరిగొండపుర
నారసింహదేవు। డానతిచ్చినరీతిగా నే నిమిత్త। మాత్రమై పల్కుదును స్వ
సామర్థ్యమిప్పు। డరసిచూచిన గాని నాయందు లేదు॥ సీ॥ దారునిర్మితశి
ణైనారూఢిబల్కించు గాయకపురుషుని కరణిగాను। పురుషోత్తముడు దయా
పూర్ణుడై నా జిహ్వయందు దావసియించి యరుదుగాను। బలికించుగావు
న భాగవత పురాణము మరనేద్విపద కావ్యంబుగాను। ద్వాదశస్కంధము
ల్తగ జెప్పి హరికి సమర్పించి శ్రీవేంకటాద్రిమహిమ। మవనిపై రమ్యపద్యకా
వ్యంబు జేసి। శ్రీనివాసుని కే సమర్పింతు నంటి। నీగతో యధిఁ దాటబోయిన
విధమున। నాస్వతంత్రత కిల బుధుల్ నవ్విపోరె॥ గీ॥ నవ్వినను సమ్మతంబనిన
న్నుబ్రోచు। చున్న శ్రీవేంకటేశ్వరుడున్నతముగ। నిరవుకొనియున్న వేంకట

## వేంకటాచలపురవర్ణనము.

గిరిపురంబు। నిపుడు నొకకొంత వర్ణింతు నెట్టులనిన॥ సీ॥ ఘనగోపురము
లుప్రాకార మంటపములు తేరులు సత్పుణ్యతీర్థములును। గమలాప్తకిర
ణసంకలితంబులై ప్రకాశించుచుండెడి హేమశిఖరములును। పావనపరి
వారదేవతాలయములు మహిమనొప్పు విరక్త మఠవరములు। రంగదుత్తుం
గమాతంగ తురంగము లొక్కమరొప్ప బహుసాధు గోగణములు। ముద్దుగా

బల్కు శుకపికములునునీల। కంఠములునుమరాళసంఘములుమఱియు। ఫలచయంబులుతులసి కాదళసుమములు । క్రిక్కిఱిసియుండు వేంకటగిరిపురము న॥ సీ॥ వేదశాస్త్రపురాణ విద్యాప్రసంగ వివేకభాస్వరులైన విప్రవరులు। మహనీయ సత్యధర్మపరాక్రమములచే భుజబలోన్నతులైన భూమిపతులు । రమణీయకృషియు గోరక్షవాణిజ్యము వరసంపదలుగల్గు వైశ్యజనులు। బ్రాహ్మణసేవాప్రభావజ్ఞులై సుదాసులునై మెలంగెడిశూద్రజనులు। తేరువీథులు నమితశృంగారవనము। లమలసుందిరములు బంకజాకరములు। గల్గిమెలగగమర్త్యలోకంబునందు । గీర్తిచేనొప్పు వేంకటగిరిపురంబు॥ సీ॥ ఘనభూవరాహదేవునకు దూర్పునశ్రీనివాసున కీశాన్యభాగమందు। స్ఫటికసుకాంతి సోపానమధ్యమునందు మరకతచ్ఛాయలమలకలొప్పు । బూర్ణమౌశ్రీస్వామిపుష్కరణి జనాఘములహరింపగమహాముఖ్యులైన । తీర్థవాసులు సర్వదేశాగతులకు సత్సంకల్పమును చెప్పిసకలదాన । ధర్మశాస్త్రవివేకవితానములను । జెప్పివిత్తమునపుడుపార్జించిహరికి । నర్పణము సేయవరతీర్థమాచరించి। యనిమిషులమాడ్కివర్తింతు రాఢ్యులగుచు॥ క॥ ఆపుష్కరిణికి బడమట। భూపతియగుకిటికి దూరుపునవేది కపై। వ్యాపకజపతపములచే। దీపింతురుకొందఱచట ద్విజులతిభక్తి॥ సీ॥ మాళవసేపాళమళయాళబంగాళచోళ కొంకణసింధుశూర సేన। సౌవీరకుంతల శకకళింగకిరాతకోసలకేకయ కురురసాళ్వ। ద్రవిడపుళింద విదర్భమహారాష్ట్రబర్బరాభీరాంధ్ర పాండ్యమగధ। కాంభోజకొంకణ కాశ్మీరముఖ్యదేశస్థులువేంకటాచలముజేరి । పుష్కరిణిలోమునిగి లేచిశ్రీభూవరాహ। దేవునీక్షించివేంకటదేవుగాంచి । సకలవస్తువులర్పించి సంతసించి। యాడుచును బాడుచుండుదు రనఘులగుచు॥ క॥ జలరుహసుమఫలపరిమళ । ములుమృగమదసౌరభంబు మొగిధూపస్వా। దులు పునుగుతైలగంధము। లలరుచు వాసించు వేంకటాఖ్యపురమునన్॥ ఉ॥ అప్పురమందు దివ్యతరహాటకకుంభవిరాజమానమై। యొప్పువిమానమధ్యమునను త్తమ పూరుషుడై మహాత్ముడై । యొప్పులకుప్పయై ధరమహోన్నతుడై వెలుగొందుచుండుమా। యప్పుడువేంకటేశ్వరుడహర్ని శముగ్గమలాస మేతుడై॥ గీ॥ అమ్మహాత్మునిచరితంబు లాదిమునులు । సంస్కృతంబుగ జెప్పిరాసరణినృహరి। తెలియజేసినయంతనే దెనుగుగాను । బద్యకావ్యంబురచియింతు భక్తిమెఱయ॥ ॥ హేమాఙ్గాంతకునకు సం। గ్రామభయంకరున కఖిలకారణునకుశ్రీ।

షష్ఠ్యంతములు.

భూమివరాహస్వామికి । గామితఫలనాయకునకు కరుణానిధికిన్॥ క॥ అక్షీణశౌర్యధైర్యా । ధ్యక్షహిరణ్యాక్షరాక్ష సాధిపవక్షో । విక్షోభకనఖరశి

ఖా। దక్షునకతి కోపవిభవ తామ్రాక్షునకుఁ॥ క॥ హారహారహీరద రశర। పారదనారదవిభావిభవగాత్రునకుఁ। గూఢమితోఁ బ్రహ్లాదుని। సారకృపఁ బ్రోచినట్టిశాంతాత్మునకుఁ॥ క॥ చండతరశౌర్యగౌరవ। ఖండీభరదరికిభక్తకలుషజలరుహా। ఖండతరకిరికిశ్రీతరి। గొండన్నృకేసరికి నాదుగుఱికిఁ హరికిఁ॥ క॥ వేంకటగిరినాయకునకు। బంకజభవజనకునకును బరమాత్మునకుఁ। శంకరవరమిత్రునకుగ। లంకవిరహితునకుమోక్షలక్ష్మీపతికిఁ॥ వ॥ అంకితంబుగా నాయొనర్పంబూని నవేంకటాచలమహాత్మ్యంబునకు గథాక్రమం బెట్టిదనిన॥ సీ॥ జంబీరమందార సహకార మాలూరసాలరసాల హింతాలములును। వటబిల్వ బదరికాశ్వత్థ చందనకుందకు

నైమిశారణ్యవర్ణనము.

రువక్రక ముకతక్కోల ములును। నారికేళార్జున నారంగబంధూకపారిజాతాశోకపాటలులును। గాదంబకాంచ నకరవీర పున్నాగకోవిదారమధూక కుటజములును। మొదలుగాగల బహువృక్షములును లతలు। పూచికాచి ఫలింపసంపూర్ణ మగుచు। సర్వకాలంబు లందువసంతబుతువు। రమ్యమై యున్ననైమి శారణ్యమందు॥ క॥ సెలయేఱులు కమలాకర। ములుబహు కాసారబృంద ములుపూర్ణములై। కలకాలము నొకవిధముగ। బొలుపై ప్రవహించు నచటబుధ సేవ్యములై॥ వ॥ అట్టినైమిశారణ్యంబునందు శౌనకాది మహామునులు సూతునివలన సకల పురాణంబులు విని తద నంతరంబున నొక్క శుభదిన మందుసూతుంజూచి భూలోకంబున నూటయెనిమిది తిరుపతులు గలవందు స్వయంవ్యక్తంబులు, శ్రీరంగంబును, శ్రీముష్ణంబును, తోతాద్రియు, సాలగ్రామంబును, బదరికాశ్రమంబును, కాంచియు, వేంకటాచలంబును, ఈయెనిమిది స్వయంవ్యక్తంబులగు-గావున నిందులో విశేషించిన సకలేష్టార్థసిద్ధి ప్రదంబగున స్థలంబెయ్యది దెల్పుమని మఱియునిట్లనిరి॥ క॥ ఘనముగ సర్చారూపము। లనునారాయణుడు భూతలంబున భక్తా। వనుడై విఖ్యాతినిబొం। దినసత్కథమాకు నీవు దెల్పుము సూతా॥ మ॥ అనినన్ సూతుడు నవ్వి మేలు భళిమీరా సత్కృతో ప్రశ్నచే। సినదీలోక హితంబు దీన వరలక్ష్మీకాంతుడు ప్పొంగిమి। మ్మునునన్నుఁ గడతేర్చు గావునమహా ముఖ్యంబుగా జెప్పెదన్। వినుడీతాప సులార చిత్తమలరన్ వీనుల్వినోదింపగన్॥ క॥ శ్రీవేద వ్యాసులకృప। చేవరుస గదోచినవి వచించెద వినుడా। దేవుని చరితములన్నియు।నావశమే తెల్ప మౌనినాయకులారా॥ వ॥ అయిని నాకు తోచి నంతవినిపించెద నెట్లన్న నెనిమిదిస్వ యంవ్యక్తంబులలో వేంకటాచలంబు ఐహికాముష్మికఫలదాయకంబగు గావున నతిశయంబగుచుండునీ

శ్వేతవరాహకల్పంబునందు హరి శేషాద్రియందు ప్రకాశించి నపుణ్యవృత్తాంతంబును వినుండని సూతుం డిట్లనియె॥ సీ॥ నారాయణస్వామి నాభీకమలమందు మునుచతురాస్యుండు జననమొందె। సృష్టికాలమునందు శేషభూతప్రపంచంబు నొప్పుగ సృజనంబుజేసె। నున్నతుడై చతుర్యుగసహస్రంబును జాగరణమున విశ్వమునుబ్రోచె। నప్పుడా దిత్యానలానిలాంబుద పంక్తు లొప్పుగాహ గ్రహులదప్పకుండె। మహిమమీఱ జతుర్దశ మనువులందు। వెలుగుచును విష్ణుదేవుండు విశ్వమెల్ల। బాలనముచేయ గాబ్రహ్మపగలుజరిగె। బద్మజడురాత్రి రాగానెపవ్వళించె॥ సీ॥ ఆబ్రహ్మనిద్రించినట్టి రాతిరివేళ భానుడు ప్రకరాళి ప్రబలజేసె। కాలానలజ్వాల కణముల గ్రక్కగా స్థావరజంగ మచయ ములడగె। ప్రళయవాతూల మంబరమావరించుచు విసవిసనమితమై విసరసాగె। సంవర్తకాది దుస్తర మేఘబృందంబు మిన్నుఘూర్ణిల నార్చిమెఱపు లెసగె। ద్విరదకుంభ నిభంబులై దీర్ఘగతుల। వర్షధారలు గురిసెనివ్వ సుధనీటి। బరువునకు నోర్వలేకలోపలికి గ్రుంగు। నపుడు హైరణ్యలోచనుడార్భటించి॥ వ॥ ధరణీతలంబు నురసాతలంబు నకుంగొని చని యందె బహుకాలంబు క్రీడించు చుండె నంత బ్రహ్మదేవుండు క్రమ్మఱ మేల్కాంచి నసమయంబున హరిపునఃసృష్టిసేయింపను ద్యుక్తుండై శ్వేతవరాహరూపంబు ధరియించి మహాజలంబులోనం జొరఁబడి పాతాళంబు నకుంబోయి ధరణింబై కెత్తుసమయంబున హిరణ్యాక్షుండడ్డంబువచ్చి యుద్ధ సన్నద్ధుండైన నతనితోఘోరయుద్ధంబుచేసి నిజదంష్ట్రాగ్రంబున వానిశిరంబు వ్రయ్యలుసేయ దద్రక్తంబు నంగలసిన ప్రళయజలంబు రక్తతోయంబుకరణిఁ గనిపించి నంజూచి జనలోకవాసులు వెఱగంది నిజయోగదృష్టింజూచి హరిక్రోడాకారుండై చేసిన కృత్యంబు తెలిసితత్ప్రభావంబు నుతింపుచున్న సమయంబున శ్వేతవరాహ స్వామినిజ దంష్ట్రాగ్రంబున భూమిం గ్రుచ్చి పైకెత్తిదెచ్చినంజూచి దేవేంద్రాదులువరాహ స్వామికిబ్రణామంబులాచరించిభేరీమృదంగాదివాద్యంబుల మొఱయించి కుసుమవృష్టి గురియించి యనేకప్రకారంబుల వినుతించి యిట్లనిరి॥ గీ॥ హరి వరాహరూపుండైయసుర ఖండించి। హెచ్చియిటకు ధరను దెచ్చినట్టి। నీవె ధరణినమరనిలుపు మీనీటిపై। ననగయజ్ఞఘోణిహర్ష మెసగ॥ వ॥ నిజఖురంబుల మహాజలంబు నడచిచదరంబుచేసి యానీటి పై భూమిని గుదురు గానిలిపి జనలోకవాసులైన దేవేంద్రాదుల నాదరించి యథాప్రకారంబు గామీమీస్థానంబులనుండుండని నియమించి బ్రహ్మను మేల్కొల్పి పూర్వప్రకారంబుగసృష్టిం జేయుమనియాజ్ఞాపించిపిడ్కొనితలంగిసన్నిహితుండై మొక్కుచున్న

పక్షీంద్రుం జూచి యిట్లనియె॥ క॥ ధారుణి సెట్లు మునిగిన। గారణమున దానినె
త్తు కార్యము కొఱకే। ఘోరాకారము దాల్చితి। నా రూపము జూచి లక్ష్మి నగదె
ఖగేంద్రా॥ క॥ నా రూపంబీ భూమికి। గౌరవముగ దోచి నన్ను గామించెను నే। నీ
రమణిని మోహించితి। నారామామణికి నొప్పు ననివిహగేంద్రా॥ క॥ ఈ కఠిన
శరీరము మఱి। యీకరణిం బెఱుగు సటలు నీ వికృతాక్షుల్। ప్రాకటదంష్ట్రా
యుగమిా.। భీకరతను జూచి లక్ష్మి బెదరు ఖగేంద్రా॥ క॥ ఆ వైకుంఠపురం
బున। కే విధమున వత్తు లక్ష్మి యొకసక్కెముగా। నీ వెవ్వడనుచు నడిగిన।
శ్రీవిష్ణుడ ననుచు జెప్ప సిగ్గగు గరుడా॥ క॥ కావున నచటికి నేరా। నే విధ
మున నైన ధాత్రి నెడ బాయక నిం। దే వసియించెద ననవిని; యా విహగేం
ద్రుండు మ్రొక్కి హరి కిట్లనియెన్॥ మ॥ దేవా ధారుణి నుద్ధరించుటకు ఘో
ర్యాత్వంబు చేమించిర। క్షోణిన్ బరిమార్చి యద్భుతముగా క్షోణీతలం బెత్తు
మిా। ప్రావీణ్యం బిపుడాది దేవత మహాభక్తిన్ బ్రశంసించునం। దేవేం చేయుదు
సందియంబు వలదో దేవోత్తమా మ్రొక్కెదన్॥ క॥ మీ కనపాయినినై యె
తగి। యీ కమలా దేవి వక్షమందుండు సుమిా। సూకరరూపము జూపిన।
నా కాంతకు వెఱపుదోపదయ్య మహాత్మా॥ గీ॥ మీరు సర్వజ్ఞమూర్తులు
మీకు దెలియ। కున్న దే నాకు దోపకీ విన్నపంబు। చేసినా నింక దేవర చిత్త
మునకు సమ్మతంబైన నది లోకసమ్మతంబు॥ వ॥ అని గరుడుండు పునః
ప్రణామంబులం జేసినం జూచి కరుణించి హరి యిట్లనియె॥ సీ॥ అనఘ ఖగేం
ద్ర నే నచటికిప్పుడు రాను ధరణిపై వసియించి దానవులను। మర్దించి సుజను
లమన్నింతు నిక నీవు భోరున వైకుంఠపురము జేరి। వనధిజకడ చని వార్త
లొప్పుగ జెప్పి క్రీడాచలము కొని గెంటకిటకు। రమ్ము పొమ్మన ఖగరాజు హరికి
మ్రొక్కి వైకుంఠపురమార్గము ఖతవాండె। నపుడ కిటియైన విష్ణుడీయవని
జరిగి। తాను వసియింప దగిన సుస్థానమరసి। చూచుచును వచ్చి వచ్చి
యెచ్చోట నిల్వ। సమ్మతము లేక యప్పుడా చక్రధరుడు॥ వ॥ గౌతమీనది
కి దక్షిణంబుగా నఱునది యోజనంబులు దూర్పుసౌరసముద్రంబుగా వై
దుయోజనంబులును దక్షిణంబుగా నుండు సువర్ణముఖరికి నుత్తరంబుగా
నుండు దివ్యస్థలంబు నీక్షించి గరుడాగమనంబున కెదురు చూచుచుండె నంత॥
సీ॥ గరుడుండు వైకుంఠపురి జేరి శ్రీరమాదేవికి మ్రొక్కి ప్రార్థించి పలికె।
నో తల్లి హరి వరాహోగ్రరూపము దాల్చి హైరణ్యనేత్రు నిహతుని జేసి। య
లరసాతలము నందుంట గ్రుంకిన ధర దంష్ట్రాగ్రమున యథాస్థానమునకు। దెచ్చి
చక్కగ నుంచి యచ్చట నిల్వ సంకల్పించి నాడటు గాన నటకు। మొనసి క్రీ
డాచలంబు దెమ్మనుచు నన్ను। బనుపగా వచ్చి నాడ నీ పర్వతంబు। నెత్తు
కొని పోవుటకు సెలవిమ్ము నాగ। సాగరజ యిట్టు లని యెనాశ్చర్యముగను

క్రీడాచలము గరుత్మంతుండు శేషగిరికి దెచ్చుట.

చ॥ హరికిటిరూపనై భవము నద్భుతమొప్పగ నేనుజూచెదఁ। సరగునదోడి తెమ్మనినజాగిలిమ్రొక్కిఖగేంద్రుడిట్లనెఁ।గరుణనురమ్మటంచు బహుగావి నుతించుచు నేనుబిల్చినఁ। ధరణిని వీడిరానని యె దానవహంతశ్వేంద్ర గామినీ॥ గీ॥ సూకరోగ్రమూర్తిమీకు జూపినమీరు। వెఱతురంచు బల్కె విష్ణు వంచు। విహగనాయకుండు విన్నవించి నన్వి। లక్ష్మియిట్లు నెసలక్షణముగ॥గీ॥ నేను దనకు నెపుడు నిత్యానపాయిని। నగుచునుండు లెటిగియద్భుతముగ। ద్రోత్తమాటలన్న క్రోడవి గ్రహుమాయ। వింత దోచెమదికి విహగనాథ॥ క॥ తానేరూపము దాల్చిన। నేనారూపము ధరించి నిశ్చలమతినై। పూనియురంబు ననుండుదు। నానడవడినేడు క్రొత్తయయ్యెఖగేంద్రా॥ క॥ తాని చటికిరాకుండిన। నేనచ్చటికైన వచ్చినిజ ముగగిటినై। యానందించు మహాత్ముని। మానిత వక్షముననుండు మహినిఖగేంద్రా॥ సీ॥ హీనమైతాను ప్రళయాబ్ధిపైనీదునప్పుడు తనవక్షమందెయుంటి। కూర్మరూపము దాల్చికొని యబ్ధిలోమునిగి నప్పుడేమనక తనయందెయుంటి। నంగుష్ఠమాత్రుడై యాకుపై శయనించినప్పుడు నేదనయందెయుంటి। జంద్రచంద్రికలకెచ్చట వేఱు లేక యున్నటువలె నేదనయందె యుంటి। నిప్పుడెడ బాసియుందు నేయెంతకైన। నిచటపరివారములతోడ నచటి కేను। వచ్చి యాక్రోడ విగ్రహు వక్షమందె। నిలిచియుండెద భయమేమి నిర్మలాత్మ॥ క॥ వేడుకలర భూదేవికి। క్రోడాకారంబుదాల్చి కులికెడి హరికిఁ। గ్రీడాచల మొప్పిన దిది। యాడకెకొని పోవుటొప్పునయ్యఖగేంద్రా॥ సీ॥ అనిపల్కిపరి వారమునుదాను నిజకళలోనరవై కుంత మందుంచియొక్క। కళతోడ గ్రీడానగంబుపై కెక్కిరందయుతోడ సిరియాజ్ఞదప్ప కపుడు। గరుడుడాక్రీడాద్రినరుదుగా బెకలించి కొనిశిరంబున నిడికొనిరయమున। ధరణికిదిగి వచ్చుతఱినిబుష్పలతాళులుయ్యాలలటువలె లూగగాను। గనకగిరి మీదనీలాద్రిగ దసియున్న। గరణి హేమాంగు డనదగు గరుడు శిరము। నందుగ్రీడాద్రియొప్పి మహాద్భుతముగ। గగనదిగ్భాగములుదివ్యకళలనెననె॥సీ॥ చన్దనజంబీరచంపక వకుళాదిఫల వృక్ష లతలతోప్రబలు దాని। గనకమహారత్న కాంతులచే మించికనిపించున మితశృంగముల దాని। గలకంఠశుక నీలకంఠ మరాళాదివిహగకూజితముల వెలయు దాని। గమలనీలోత్పలప్రముఖపుష్పోజ్జ్వల రమణీయపద్మాకరములు దాని। లాలితములైన సిద్ధస్థలముల దాని। నమితముక్తుల కాట పట్టయిన దాని। సిరినినీళ్లను భరియించి చెలగు దాని। గాంచి శ్వేత వరాహ విగ్రహుడు నవ్వి॥ క॥ అచ్చెరువుగనా చెం

తకు । వచ్చెనుసిరివచ్చె నీళ్లవచ్చెను గిరియుగ్ । వచ్చెనుబరివారమునా । కిచ్చట సంసారమింక హెచ్చున టంచున్॥ వ॥ వరాహస్వామి సంతసించుచున్నసమయంబున గరుడుండువచ్చియామహాస్వామి చూపిన దివ్యస్థలంబునందు క్రీడాచలంబు నుంచిదండప్రణామంబుచేసినసంతసించివరాహస్వామియప్పర్వతంబెక్కి యా క్రీడాచలంబునందున్న స్వామిపుష్కరిణికిబశ్చిమతటమ్మునసిలిచియున్న సమయంబున బ్రహ్మరుద్రేంద్రసురదిక్పాలకమునియోగిగరుడగంధర్వాదిమహాత్ములువచ్చి శ్వేతవరాహస్వామినివీక్షించిసకలనిగమార్థనిగుంభితోక్తులబహుప్రకారంబులయానందబాష్పధారాకలితనేత్రులై సాష్టాంగదండప్రణామంబులాచరించిజయజయశబ్దంబులుం జేసి ముకుళి

## బ్రహ్మేంద్రాదికృతస్తోత్రము.

తకరకమలులై మఱియునిట్లనిరి॥ దండకము॥ శ్రీమన్మహాశ్వేతసత్రోడరూపాయనిర్లేపభోదప్రదీపాప్రతాపోజ్జ్వలాశ్రీపభూపాహిరణ్యాక్షకాలిన్య దేహాత్రి దంభోళిధారా సురాధార ధాత్రీతలోద్ధారభర్మాద్రిధీరాజగత్పూర్ణచిత్సార భూతాభవాంభోధి పోతాసుమోక్ష ప్రదాతాగుణాతీత వేదార్థనిర్ణీత పూతాత్మదాతా మహాపంచభూత ప్రభూత ప్రపంచాకరాశ్రీకరా సుప్రసన్నాత్మనైమమ్ము రక్షించు మీశారమాధీశ నీసత్వభావంబులెన్నన్ సహస్రాననుండైనదా నోపునే మాకుశక్యంబె నీయుగ్రదంష్ట్రాకరాళాస్యముల్ నీసటల్ వేడిచూడ్కుల్ మహాభీకరాకారముం జూడ మాకేయ సాధ్యంబుగా దోచె లోకంబులో మానవవ్రాతముల్ చూచి భీతిల్ల రేతంద్రి మమ్ముద్ధరింపన్ సదాసౌమ్యరూపంబువేతాల్చి శ్రీభూమినీళాసమేతుండవై దేవతిర్యఙ్మనుష్యాఖ్యజీవాళులం బ్రోచుచున్ సర్వనిత్యోత్సవంబుల్మహాభక్తబృందంబులర్పింపగాదివ్యలీలాప్రభావంబులం జూపుచున్ మీరు క్రీడాచలంబందువేంచేసియుండుండ హేభూపూర్ణకామాగుణస్తోమదేవోత్తమా దేవతసార్వభౌమా తరీగొండధామా నృసింహావరహావతారా నమస్తే నమస్తే నమస్తేనమః॥ మ॥ అని వారెల్ల బహుప్రకారముల వేదాంతోక్తులం బ్రస్తుతింపు చినమోదించి వరాహదేవుడు దయాసింధుండు బ్రహ్మాదులన్ । గసిరుద్రాబ్జజ ముఖ్యులార వికృతాకారంబునే దాల్చితి । త్యునిఖండించితి భూమినెత్తితి మహాతోయంబులన్ దాచితిన్॥ క॥ మీమీసు స్థానముల । న్దామోదముతోడ జేరి యందునపూర్వం । బేమాడ్కి మెలగుచుందురు । రామేరలు దప్పకుండుడమలాత్ములై॥ శా॥ భూమ్యాదుల్మదనుజ్ఞ దప్పక సదాపూర్వస్థితిన్ నిల్చునే । సౌమ్యత్వంబున సాగరాత్మ జనువక స్థానమం దుంచెదన్ । రమ్యాకారము నొంది భూజనముల్ రక్షించియెల్లప్పుడున్ । గామ్యార్థంబులనిచ్చి

వారి భవదుఃఖంబుల్ నివారించెదరన్॥ ఆ॥ అనుచు వారికిట్టులాన తెచ్చి వ
రాహ। దేవుడవుడు సౌమ్యదేహుఁ డగుచు। వరకృపార సంబు వారిపై
జిలికించి। శాంతచిత్తుడై ప్రశస్తముగను॥ సీ॥ క్రీడాచలము మీఁద గెంటకు
న్నట్టి శ్రీసామి పుష్కరిణికి బశ్చిమముగ। భవ్య పుష్కరిణి వాయువ్యకో
ణ సమీపమందు జిత్ర విచిత్ర హర్మ్యములును। దివ్య నీల స్తంభ నవ్యహా
టక కుంభ మరక తోన్నత ముఖమంటపములు। భానుకోటి ప్రభాపరిహా
పకర రత్నగోపుర ప్రాకార కుడ్యములును। గలిగి యప్రాకృతా దిత్య
కాంతికలిత। మహితమాయా విగూఢ విమానమందు। మెఱయు శ్రీభూమి
మి నీళాసమేతుఁడగుచు। శ్వేతకిటి నిల్చి యొప్పె నీభూతలమున॥ వ॥ ఇ
ట్లొప్పుచున్న వరాహస్వామినిఁ జూచి బ్రహ్మరుద్రాదు లానంద మగ్నులై
యనిమిషదృష్టుల వీక్షించుచున్న సమయంబున వరాహదేవుండు విమా
నంబుతోడ నంతర్ధానంబు నొందెనప్పుడు బ్రహ్మాదులు జయజయ శబ్దం
బులు చేసి వరాహస్వామి తిరోహితుండైన దిక్కునకు మ్రొక్కి తత్ప్రభా
వంబుల న్పొగడుచు దమతమనివాసంబులకుం జనిరంత శ్రీభూనీళా దేవు
లును బరివారంబులును హరికి దండ ప్రణామంబు లాచరించినం జూచి సంత
సించి హరిసిరితో నిట్లనియె॥ క॥ సిరినీవు నన్ను గనుగొని। వెఱచెదవని రమ్మను
టకు వెఱచితి నీవై। కరుణను నీళను దోడ్కొని। పరివారము తోడవచ్చు
పని మేలయ్యెన్॥ వ॥ అనిన వినిసిరి యిట్లనియె॥ తే॥ స్వామినినుబాసి యెం
దైన క్షణమునోర్వ। జాలన టుగాన వచ్చితి జగతి కిపుడు। తప్పు సైరించి
మమ్ము నందఱను బ్రోవు। మనిన నవ్వుచు సిరికిట్టు లనియె విభుడు॥ క॥
భూమిం గలయగ వెదకిన। నీమహిత స్థలము దొరకె నిచ్చట నిలువన్।
నా మదికిష్టంబయ్యెను। గోమలి మనకిప్పుడిది వికుంఠం బయ్యెన్॥ సీ॥ ఈ
ఫల ద్రుమములు నీ ప్రసూన లతాళులీ పుణ్య తీర్థమల్దీపలతలు। మున్యా
శ్రమంబులు మోక్ష స్థలంబులు ధన్యంబులైన భూదర వనములు। జూడ
జూడగ నాకు వేడుక జనియించె గాన నిల్చితినిందు మీననయన। భూలో
క వాసులఁ బ్రోవగాఁ దగుకార్యమున్నది గనుక నిందుండవలెను। నాకు
సమ్మతమగు రీతినీదు మదికి। సమ్మతంబైన నిల్తునిచ్చట నటంచు। నడుగ
గావిని సిరిదరహసితవదన। యగుచు నాథునిజూచి యిట్లనియెనపుడు॥ గీ॥
మీరు సర్వజ్ఞు లటుగాన మీరునిల్వ। దన్నచోటనె నిల్చెదమందఱమును।
చింత మాకేల దేవ మీచిత్తమింక। ననిన లక్ష్మిని దనవక్షమందు జేర్చె॥ చ॥
అపుడు వరాహవిగ్రహుడనంతకళాపరిపూర్ణుడై మహా। నిపుణత మీఱగా సిరి
నినీళను ధారుణి నాదరించుచున్। విపులపరాక్రమ క్రమ వివేకవిచక్షణులైన
పార్షదుల్। కపటము లేక కొల్వగ నఖండసుఖస్థితి నొందె నిద్ధరన్॥ తే॥ అనిన దా

పసులిట్లనిరయ్యాసూత। స్వామిపుష్కరిణీప్రభావంబు మాకు।దెలుపవేయ
న్నసూతుడా దివ్యమునుల। గాంచియిట్లనిపల్కెనుత్కంఠమెఱయ॥ సీ॥ ము
నులార వైకుంఠముననుండు క్రీడానగంబుపై స్వామిపుష్కరిణియుండి। పర
గన ప్రాకృతపరిమళోదకమై మహాపూర్ణమైయుండు నచటసిరిని। భూనీళల
నుగూడిపురుషోత్తముడు జలక్రీడలాడుచునుండు వేడుకలర। గ్రీడాచల
ముతోడనీడకు దిగివచ్చివిరజా సమానమై ధరణివెలసి। హరికిసమ్మతము
గుచుగంగాదినదుల। కన్నిటికిమాతృదేవతై యఖిలజనుల। పాపములను
హరింపుచుదాపమడచి। యిష్టకామ్యార్థములను దానిచ్చుచుండు॥ వ॥ ఇట్టి
స్వామిపుష్కరిణీతీర్థ దర్శనపానంబులచేతనే స్త్రీశూద్రజనంబుల నైనగ
డతేర్చుగావున విశేషించిస్నాన సంధ్యాదినిత్యనైమిత్తిక సకలకర్మాచరణు
లైన బ్రాహ్మణోత్తముల పుణ్యంబింతంతనిచెప్పుట కశక్యంబగుచుండునది
యు నుంగాక పుష్కరిణీస్నానంబును నేకాదశీవ్రతంబును సద్గురుపాద సే
వనంబును గల్గుటయత్యంతదుర్లభంబగు చుండుసకలస్థావరజంగమంబులం
దు మానుషజన్మంబను బుష్కరిణీ స్నానంబును వేంకటాద్రియందుజీవిం
చుచుండుటయు మిక్కిలియతిశయంబులగుచుండు గావునవేంకటాద్రిమా
హాత్మ్యంబును బుష్కరిణీప్రభావంబును జెప్పశక్యంబుగాదు కనుకసంక్షే
పంబుగాజెప్పితి నింకనొక్కయితిహాసంబు సెప్పెదవినుండని సూతుండిట్ల
నియె॥ సీ॥ మునుతారకాసురుం డను వానిసేనాని యదిమిచంపిన బ్రహ్మ
హత్యచేత। భీడితుడైనిజ పితృవాక్యమంగీక రించి గ్రక్కుననిర్గమించిమొప
సి। యా వేంకటాద్రికై యభిముఖుడై వచ్చునప్పుడతని బ్రహ్మహత్యజడిసి
యాకుమారువిడిచి యార్చిచెచ్చెర దగ్గిపోయెనంతట తనపుత్రుడలరి। వేం
కటాద్రికివచ్చి వేవేగస్వామి పుష్కరిణీలోనంగ్రుంకి తెప్పునవరాహ। దేవు
నీక్షించి చాలబ్రార్థించిమ్రొక్కి। యపుడుకృతకృత్యుండయ్యెషడాననుం
డు॥ ఉ॥ కావునవేంకటాచలమఘంబుల కెల్లభయంకరంబునై। పావనమై
సువర్ణమణి భాస్వరమైధరణీసురాళికిన్। జీవనమైతపోజన వశీకరమైయజ
రుద్రశక్రసం। సేవితమైసుభక్తులకు శ్రీకరమైపొగడొందు నీధరన్॥ క॥హ
రికల్యాణగుణమ్ముల। ధరణీధరమందునుండు దప్పకయెపుడున్। మరియిం
కెన్నివచించిన। బరమార్థంబొకటె చూడపండితులారా॥ క॥ ఘనమైప్రా
కృతజనముల। కనులకుబాషాణ పంక్తిగాగనిపించున్। అనువుగపుణ్యా
త్ములకును। గనకగిరీంద్రంబు రీతిగాగనిపించున్॥ వ॥ అట్టివేంకటాచలంబు
నందుండివరాహస్వామిజనులకుదృశ్యాదృశ్యుండగుచువర్తించునప్పర్వతం
బుభవతారకంబగుచుండు నిందులకు సందియంబులేదు సత్యంబన్నసూ
తుంజూచి శౌనకుండిట్లనియె॥ ఆ॥ ఆవరాహదేవు డాపర్వతేంద్రమునందుండి

యేమిసేయుచుండెనెవరి । కేమియిచ్చెవినుట కిష్టంబుపుట్టెమా । కావిధం
బుదెల్పుమయ్యసూత॥ క॥ అనవిని సూతుండిట్లనె । ననఘుండువరాహదే
వుడాగిరిమీఁదఁ । ఘనతరముగవసియించుచు । దనకాంతామణులతోడ
తద్దయువేడ్కఁ॥ సీ॥ వనపుష్పలతలచేతను బ్రకాశించుచు నిరవయితగు
పొదరిండ్లయందు । నీలకాంతులచేత జాల నొప్పుచునుండు సలలితసాను
దేశంబులందు । బరిమళపుష్పము లై ప్రవాలుచుండఁగాఁ జల్లనై తగు
పర్ణశాలలందు । గనకమందిరములకై వడిదీపించు రమణీయ గిరిగహ్వ
రములయందు । మెప్పుగాఁ బ్రవాలు పుప్పొడి కుప్పలందు వన్నెకెక్కిన
సెలయేటి దిన్నెలందు । గాంతలను గూడి చక్రి యేకాంతమందు ।
క్రీడ సల్పుచునుండు నాడాడ జెలఁగి॥ చ॥ పరఁగ నధర్మవాదులగు పాటి
జనంబుల నిగ్రహించుచుఁ । వరుసగ ధర్మచిత్తులను వర్ధిలజేయుచు
నుండు నెప్పుడా। హరికివినై జసద్గుణము లైనవిగావుననప్పుడప్పుడుఁ । ధ
రనవతారముల్తఱుచు దాల్చుచునుండును ధర్మకర్తయై॥ సీ॥ మాటిమా
టికినిబ్రహ్మకు రాత్రియైనప్పు డతడు నిద్రింపగానఖిలగురుడు । తానందు
మేల్కనిదనకుక్షిలో విశ్వమునుదాచి కొనియుండి వనజభవుడు । నిద్రమే
ల్కనగానె నిఖిలకారణకార్య యుక్తసృష్టినివానికొప్పగించు । రమణ
తోమీనవరాహాది రూపంబు లటువంటి కాలంబులందుదాల్చు । దుషని
గ్రహమొనరించు శిష్టజనులరక్షణముసేయు నొక్కవరాహకల్ప । మందు
జక్రికిమ్రొక్కి పద్మాసనుండు । వినయముప్పొంగ నిట్లనివిన్నవించె॥ ఉ॥
శ్వేతవరాహరూపనను జేకొనివిన్నపమాలకించి యీ।భూతలమందు శేష
గిరిపూజితమైతగు నందుమీరు వి। ఖ్యాతిగనిల్చియున్న మిముగాంచితరిం
తురుమర్త్యులందఱో । తాతయటంచు బల్కగవిధాతనుజూచి ప్రసన్నచి
త్తుఁడై॥ ఆ॥ చక్రియిట్టులనియె జలజసంభవనీవు । కోరినట్లనేను గ్రోడరూ
ప। ధరుడనగుచు శేషధరణీధరమునందు । నిలిచియుండుననియె నెనరుతో
డ॥ తే॥ అనినవినిమ్రొక్కిచనియె బద్మాసనుండు। శ్వేతకిటి యానిమిత్తం
బుచేతశేష । శిఖరియందు నివాసంబుఁ జేసిజనుల । రక్షణముచేయుచుం
డు బరాకులేక॥ ఆ॥ ఆవికుంఠమందు నాదిత్యమండల । మందుసర్గమందు
హరివసించు । నంతకంటెముఖ్యమని వేంకటాద్రిపైఁ । జక్రధరుఁడు నిల్చె
సమ్మతముగ॥ సీ॥ అనినదాపసులిట్టుల నిరి శేషాద్రిక్రీడాద్రి వేంకటగిరియ
నఁగమూఁడు । నామధేయంబు లేమేమికారణములచేఁ గల్గెనవినీవుచెప్పు
మనిన । వినిసూతు డిట్లనె మునులారమూఁడభిధానంబులే కావుపూని
చూడ । ధరణినొక్కొకనిమిత్తమున నొక్కొకపేరు చెల్లుచుండును శేష
శిఖరికెపుడుఁ । గాననాయాయివృత్తాంత గౌరవములఁ । జూచి భావిం

చినామదిందోచినంత। విశదముగఁ జెప్పెదను మీరువినుఁడటంచు। సూ
తుడిట్లని పల్కె సంప్రీతిమెఱయ॥ క॥ చింతించినయర్థములిపు। డెంతని లేద

## వేంకటాద్రి నామములు.

నకపరులకిచ్చుచునుండుౝ।సంతోషముగానిందున।జింతామణియ నెడుపేరు
శ్రీగిరికొప్పెౝ॥ క॥ జ్ఞానంబిచ్చు కగద్గిన। మానవులందుండి రేని మఱిమ
తిజ్ఞానం। బానాటవృద్ధిఁ బొందును। దానజ్ఞానాద్రియనఁగధరపైనొ
ప్పెౝ॥ క॥ అర్థముఖములగు కోర్కెల। సార్థకములు చేసిజనుల సంర
క్షింపౝ। దీర్ఘములందుండుట నిది। తీర్థాచలమ నెడుపేర దీపితమయ్యెౝ॥
క॥ నిష్కామ తపోధనులకుఁ। బుష్కలము గస్నానపానపూజలొనర్పం।
బుష్కరిణులు గలవందునఁ। బుష్కరశైలంబనంగ భూమిౝ వెలసెౝ॥ క॥
మునువృషభాసు రుఁడనియెడి। యనిమిష కంటకుఁడు దానియందుండి
తపం। బొనరించిన కారణమున। ననఘావృషభాద్రిపేరనవనిన్వెలసెన్॥
క॥ అనిమిషులుమ దంబునఁగనుఁ। గొనఁగదగి తద్గిరినివాత కుంభములుం
డున్। గనుకమహాశోభితమై కనకాచల మనెడుపేర ఘనతరమయ్యెౝ॥
క॥ నారాయణుఁడను విప్రుం। డారూఢి గఁదపముసేసి హరిమెప్పించెన్।
ధారుణిఁదత్కారణమున। నారయనారాయణాద్రియన ఘనమయ్యెన్॥
క॥ ఆవైకుంఠ పురంబున। బావనమై యుండుదానిఁ బక్షీంద్రుఁడు తేఁ।
గావచ్చిన కారణమున। శ్రీవైకుంఠాద్రియనఁ బ్రసిద్ధంబయ్యెన్॥ క॥ నర
సింహుండా దితిసుతు।నరు దుగఖండించి యచటనాప్రహ్లాదుం। గరుణను
బ్రోచిన కతమున। నరసింహగిరీంద్రమ నెడినామము గల్గెన్॥ తే॥ అంజ
నాదేవితఁ పముముంద చటజేసి। పొసగహను మంతుఁడను వరపుత్రు
గాంచె। నపుడుదేవత లెల్లసహాయులగుచు। నాగిరికినంజనాద్రిపేరమ
రనిడిరి॥ క॥ మునుపు వరాహసమూహము। లనిశము వర్తించుచోట నా
హరికిటియై। యనువుగనిల్చిన కతమున। ననఘువరహాద్రిపేర నానగ
మొప్పెౝ॥ క॥ మునుసీలుండ నుపేరిటి। వనచరుఁడా శైలమున నివాస
ముచేసెౝ। గనుకన్నీల గిరీంద్రం। బనగావి ఖ్యాతిఁబొందె నదిధరమీఁ
దౝ॥ క॥ శ్రీకినినాసంబై భూ। లోకములో మానవులు విలోకింపమహా।
శ్రీకరుడై హరియుండఁగఁ। బ్రాకటముగ శ్రీనివాస పర్వతమయ్యెౝ॥ క॥
శ్రీనినురంబు ననిడికొని। శ్రీనారాయణుడు ప్రజకుసి రులిచ్చుచునం।
దానందించుచు నుండఁగ। నానందాచల మనంగనగ్గిరి యొప్పెౝ॥ క॥
శ్రీసతియావ రగిరిపై। వాసంబయి యుండివిపులవైభవమెసగౝ। భాసి
ల్లుచు నుండగనది। శ్రీసద్గిరియన గనొప్పుక్షితి పైనెపుడుౝ॥ క॥ పోడిమి
గాసిరి మొదలగు। చేడియలను గూడియచట శ్రీహరి వేడ్కౝ। గ్రీడించు

చునుండు టనది। క్రీడాచల మనగ ధరను గీర్తిఁ బొందెఁ. క॥ గురుత వైకుంఠంబున। నిరవు గనున్నట్టిదానిసీభూ స్థలికిన్। గరుటామంతుడుదెచ్చుట। నరుదుగ నదిగారుడాద్రియనవిలసిల్లెన్॥ క॥ శేషాకృతి తోడమరివి। శేష్యత్వము నొందిసర్వ శేషినిదనపై। భూషణముగ నిడికొనుటను। శేషాచలమనగ భూప్రసిద్ధంబయ్యెన్॥ గీ॥ అధికధర్మములకు నాటపట్టుధర్మ। సిద్ధిప్రజకుగలుగ జేయుచుండు। నందుచేవృషాద్రి యనునామధేయంబు। దానికొప్పు చుండుధరణి మీద॥ ఆ॥ అమరగా నకారమమృతబీజముకట। ములును సంపదర్థ ములువెలుంగు। నట్టిమూడు గూడియమృత సంపదలిచ్చు। నందుచేత వేంకటాద్రియయ్యెన్॥ వ॥ ఇవ్విధంబున బర్వతంబునకు గల్పభేధంబులచేత ననేకనామంబులు గలుగుచుండు నప్పర్వతమాహాత్మ్యం బింతయని వచింపసురగురుడ చతుర్ముఖషడాస్యస హస్రముఖుల కైనశక్యంబు గాకుండు శ్రీమన్నారా యణుండట్టి పర్వతాగ్రంబున వసించియుండి యందొకకాలంబునద ద్రికినుత్తర భాగంబునందు రమాసమేతుండై వనగిరి శృంగంబులందు వినోదంబుగా విహరించుచున్నసమయంబున॥ సీ॥ భార్యలదోడ తాపసులొక్క కొందఱు శ్రీవేంకటాద్రిని జేరవచ్చి। కందమూలఫలాదికములును బహుపుష్పములు తీర్థములుచూచి మురిసియచట। నిల్వసంకల్పించి నిలయముల్గల్పించి యర్మిలినుండిమహాధ్వరంబు। జేయుచుండగజూచి సిరినివి లోకించి హరియిట్టులనియె నోయబ్ధికన్య। జనులుగన రానియీమహా స్థళమునందు। జేరిమును లధ్వరంబు జేసెడువిధంబు। చూడుమిచ్చటనని దయజూపిమరల। నిట్టులనియెను సంతోషమునను మడింప॥ సీ॥ సతిచూడు మవియజ్ఞశాలస దశ్శాలలవిగొకయిటుచూడుమగ్నిశాల। సఖియహవిర్భాగశాలపత్నిశాల యజమాన

హరివిటవేషధరుడగుట.

శాలలల్లవిగొచూడు। మదిమహా నసగృహం బదియజ్ఞ పాత్రము ల్పశుసుయూపస్తంభ పంక్తులవియె। వారుబుత్విక్కులువీరు నధ్వర్యులు సోమయాజి తడదిసోమిదమ్మ। చక్కగాజూడు మీమహా శ్రౌతకర్మ। చయములెల్లను నాయందె జననమందె। గానసవనస్వ రూపుండ నైననాకు ప్రీతిగాయజ్ఞ ములుబుధు ల్సేతురిట్లు॥ గీ॥ వీరికర్మ నిష్ఠవేడుక గాజూడ। వలయుని పుడుయజ్ఞవాట మునకు। బోయివారు సేయుబుణ్యా వపాయాగ। సరణిజూచు టొప్పుచంద్ర వదన॥ ఉ॥ కావునవేశ్య చందమును గైకొనుమీవు హోయలొప్ప లంగగా। నేవిటకాని కైవడినినిక్కుచుసొచ్చుచు వచ్చియచ్చటం। బావకగుం డమందువప భక్తినిబాహ్మణు లుంచినప్పుడే। నావప నారగించెద బుధావళిమెచ్చ గనీవుచూడగన్॥ సీ॥ అనవిని సిరి

మందహాసాస్యయైకామ రూపిణియై కుల్కుచూపు లెసగ । బరజగందు
రుకావిషా వడపై జల్వా జిలుగు బంగరు పూలచీ రమెఱయ । ముత్యము
ల్మొకు రముల్మొగ్గముద్దగగూర్చ రంగు మించిన పట్టురవి కెవెలుగ। కుచ
భారము నవడకు చునుండు మధ్యమందొగి మేఖలాబాధ మొప్పు చూ
ప।గనులగాటుకగంధలేపనము మేన।నుదుటగస్తూరితిలకంబుకుదురనీల।కుటి
లకుంతలములుముద్దగుల్కబైడి। బొమ్మవలెనొప్పెనపుడు సంపూర్ణకళల॥
సీ॥బటువుముత్యముల పాపటబొట్టురాగిడిజడబిల్లలును గుచ్చులడరి వెలుగ।
బంగారు కడియ ముల్పచ్చలచేకట్లు రతనంపు వంకీల్కరములనమర।
మగరాలకమ్మలు పగడాలపేరులు చెవులను గళమున జెన్నుమిగుల । వ్రే
ళులనూర్మిక ల్వేత్వేఱు తెఱగుల విశువనికాంతిచే వెలుగు చుండ । హం
సచెక్కె నవత్తు ముత్యములు గదల । జిఱుతగజ్జెల మొలనూలు చిందు
ద్రొక్క । గాళ్ళజిఱుగజ్జె లందియల్కవసి మొరయ । శ్రీవనిత విశ్వమో
హినీదేవి యయ్యె॥ క॥ క్రొక్కాఱు మెఱుపు లన్నియు । నొక్కెడగుమి
గూడి నిల్చియున్న విధముగా । గ్రిక్కిఱిసియ ద్భుతంబుగ । మిక్కుటమై
యుండెలక్ష్మిమేని సుగాంతుల్॥ క॥ వరసర సిజమును జేకొని । సురు
చిరముగ దళుకు బెళుకు జూపులతో నా। హరిని విలోకింపగ హరి। చిఱు
నవ్వునసిరిని జూచి చెలువము మీఱ॥సీ॥ ఆకామినీమణికను రూపముగ
జక్రిచక్కనిమనుజ వేషంబు దాల్చె। నదిమెట్లననిన నీలాంబుద వర్ణుండు
నాజాను బాహు డాహ్లాదము ఖుడు । నీలకుంతల యుక్తబాలేందు ఫా
లుండు కంబుకంఠుండు మంగళ కరుండు । నీరజాక్షుండు గంభీర వక్షుడు
సిహ్మమధ్యుండుమన్మథ మన్మథుండు। లలితసౌందర్యవిలసితోల్లాసకలిత।
మందహాసి తాధరుడు సుకుమారు డగుచు । గలికిచూపుల లోన శృంగా
రరసము । పొసగికుల్కగహరి జారపురుషు డయ్యె॥ సీ॥ కనకపుష్పముల
నొప్పినగుసుంబా పాగరాణింప గల్కితు రాయి మెఱయ । దానకట్టిన
పూలదండలు భుజముపై నొఱయుచు మెఱయుచు నూడియాడ । జల్వా
చేసినపైని సరిగంచుదోవతి చుంగులొప్పగ మేనిసొగసు జూప । బరిమగళ
గంధలేపనయుక్త వక్షమం దాణిముత్యంబుల హారమొఱయ। ముత్యముల
గెంపులను నీలములను గూడి । కాంతులనుమించు పోగులు కర్ణములను।
మెఱయుచును దూలియాడగా శ్మిరశాలు । వమరవలె వాటువేసి యు
య్యారమెసగ॥ సీ॥ విలసిత భ్రూలతా విక్షేపణంబు లా యనిమిషపతిభ
నుస్సును జయింప । దంతాళి కాంతి వింతగ వజ్రముల పంక్తి దీధితులను
మించిధిక్కరింప । గర్పూరతాంబూలకేలి తాధరము బింబ ఫలరక్తిమను
జూచిపరి హసింప । మఱియు నాసాగ్రమున నొప్పుమౌక్తిక మున । కిరు

గడలనీల కాంతులనెనసి సొగసు। గానుపింపగ దగుమీసకట్టుమెఱయ। జెక్కుటద్దములను గాంతి పిక్కటిల్ల॥ సీ॥ మేఘంబు పైవెల్గు మెఱుపు తీగలవలె దగినబంగరు జన్నిదములు మెఱయ। ఛురికాయుధంబుసిస్తుగ వామహస్తంబుతో బట్టి ధవళసత్తోయజమును। నుంగరంబుల కాంతులు ప్పొంగుకుడిచేతినొకలీల గాబట్టి యూచికొనుచు। శరణాగతత్రాణబి రుదంబులనదగునందియల్పాదంబులందు మొరయ। మురిసివిటవేషధరుడై నహరిహొయలుగ। జెలగివిటకత్తె వలెనుండుసిరినిగూడి। పాదుకలమెట్టి కొనుచునాప్రబలయజ్ఞ। వాటమును జూచువేడ్కతో వచ్చుచుండె॥ సీ॥ ఆహరి నీక్షించి యాగాధ్యులగు విప్రులిత డెవ్వరోయని నిట్టులనిరి। వనితామణిని గూడివచ్చుచుండెడి వాడుమహిమ నొప్పువసంత మాధవుండో। నలుడో జయంతుడో నలకూబరుండో సురేంద్రుడో చంద్రుడో యీశ్వరుండో। యీమహాటవి కిప్పుడేల వచ్చిరోవీరి కాంతులు గగనదిగ్భాగములను। జాలగప్పెను విప్రుడో క్షత్రియుండో। విప్రుడగు టకు యజ్ఞోపవీతచిహ్న। మమరి యున్న దిక్షత్రియుండ గుటకెడమ। చేతనాయుధమున్నది సిస్తుజూడ। విటునికైవడిను వ్వాడు వేశ్యతోడ॥ ఆ॥ అనుచువారలందఱ ద్భుతంబుగజూడ। వచ్చిశౌరి యజ్ఞవాటమందు। జేరిద్విజుల నడుమసిరి తోడ గూర్చుండి। విడెము సేయుచుండె వేడుకలర॥ క॥ అప్పుడు వానితను వ్రులం। దొప్పినకస్తూరిగంధ ముర్వీసురుల౯। గప్పుచువాసింపగ వా। రప్పద్మద ళాక్షుజూచి యనిరీరీతి౯॥ సీ॥ ఓమహారాజనీ యూరేమి పేరేమి యెవరు నీతలిదండ్రు లిచటికేల। వచ్చితి విప్పుడీవనమందు సవనముల్చే యుచుండె దము నీచిత్తమందు। మామీదదయ యుంచి మామఖంబులకు సహాయుడవై యుండి యసుర వేధ। చోర వేధయుమృగ స్తోమంబుచే వేధ దప్పించు మావంటి తాపసులకు। వసుమతీశ్వరు లేకావవలయు ననెడి। ధర్మపద్ధతి దప్పకధ్వరమునిచట। నీవు సేయించు మాచేత నిర్మలాత్మ। యనినజిరునవ్వు నవ్వియిట్లనియెజక్రి॥ సీ॥ రాజునుగాను ధరామరుండను గాను కడకువైశ్యుడను శూద్రుడను గాను।దలిదండ్రులునులేరు ధరను నాకొక్కని వాసంబులేదు సర్వస్థలముల। సర్వరూపకుడనై చరియించు చుందుదు నగుణుండ నామవర్ణాశ్రమములు। లేవనిపల్కగానావిప్రులిట్లనిరయ్యమీవాక్కులకర్థమిపుడు మాకుదోపదునీ చెంత మచ్చికలర। నిపుడుగూర్చున్న లలి తాంగియెవ్వరనిన। మందహసితాస్యుడగుచున్న మాధవుండు। పలికెనిట్లని వారితో ప్రౌఢి మెఱయ॥ ఆ॥ నాకునేనెకాని నాకెవ్వరును లేరు। వొంటిగాడనగుట నొనరజూచి।వనమునందు బుట్టి వచ్చి మోహినివలె।

నన్నుబట్టెపి యనాదిదయిత॥ క॥ నచ్చికనిపుడిరు పురమును । ముచ్చట
గాగలసి యుంటి మునులగు మీరిం । దచ్చు గనుండుట గనుగొని ।
వచ్చితి మిము మిమ్ముఁజూడ వరగుణులారా॥ సీ॥ ఇచ్చోట మీరంద
ఱేమేమొచేసి సంగీతముల్పాడెడి రీతులేమి యౌదుంబరపుశాఖ లను
రగా జేపట్టి వేర్వేఱ సురలను బిల్చుటేమి । యీయగ్నికుండమే మీ
దాయపాత్రలే మీపశుహింసయే మిన్ని మీరు । నాకు జెప్పుమ
టన్న నాకర్మనిష్టు లిట్లనిరి వపాయాగ మాచరింప । సమయమిదిగాన
వేదోక్త శాస్త్రవిహిత । మగు వపాయాగమొనరించి యపలమీరు ।
మమ్మునడిగిన వెల్ల సమ్మతముగాగ । జెప్పెదము విందుగాక మాయప్పయ
నుచు॥ తే॥ అపుడుసమ్మతిజేసి యాగాధ్యులందు। హరినిగూర్చిన వపాయా
గమాచరించు।సమయమునశంఖచక్రచిహ్నములనచట। నందఱకుజూపి వప
నందిహరిగ్రహించె॥ చ॥ హరిపరమాత్ముడచ్యుతు డనంతుడు నిర్జరులెల్ల
జూడగా।గరములనంది యావపనుగ్రక్కునమెక్కగసంయమీశ్వరుల్। వ
రుసగనందుజిత్తరువువ్రాసిన బొమ్మలరీతిభక్తిచే। బరవశులై రమేశుడగుప
ద్మతలాక్షునిజూచుచుండిరి॥ వ॥ అప్పుడునారాయణుండు శ్రీవత్సలాంచ
నాంచితవిశాలవక్షుండును సకలదివ్యరత్నాభరణ భూషితుండును సహస్ర
కోటిమార్తాండ ప్రభాభాసమానగాత్రుండును వపాపరిమళ మిళితాధరుం
డునునగుచు గరుణాకటాక్ష వీక్షణుడై మునులంజూచి యధికతృప్తింజెంది
తిననిపలికి రమాసహితుండై తిరోధానంబునొందెనంత నవ్విప్రులు సంత
సించి హరిప్రత్యక్షంబుగా వపాగ్రహణంబు చేసినందున కృతార్థులమైతిమి
జన్మంబులు సార్థకంబులయ్యెనని సంతసించి యజ్ఞంబుసమగ్రంబు గావిం
చి యవభృథస్నానంబులుచేసి కృతార్థులైరనిపలికి శౌనకాదులంజూచి
సూతుండుమఱియునిట్లనియె॥ మ॥ మునుజాబాలిమునీంద్రుడీకథ మహాము
ఖ్యంబుగానాకుజె। ప్పెనుసేనా యదిమీకు జెప్పితిని సంప్రీతిన్ రమేశుండు
చే। సినదింకొక్కవిశేషసత్కథ ధరన్ జిత్రేతిహాసంబుగన్ । వినుడాచంద
మటంచు సూతుడనియెన్ వేవేగమోదంబునన్॥ వ॥ యజ్ఞంబున వపా
గ్రహణంబుచేసి బ్రాహ్మణోత్తములరక్షించిన యనంతరంబున శ్రీమన్నా
రాయణుండు సుందర సుకుమారశరీరుండై గిరికి నుత్తరభాగమందే విహ
రించుచున్నసమయంబునం దొక్కనాడు॥ సీ॥ దేశాంతరాగత ద్విజుడువృ
ద్ధశిరస్కు డనుబలహీనుండునాత్మసుతుని । గౌండిన్యుడనువాని గానక

**కుమారధారమహిమ.**

యందందు దావెదకుచువచ్చిదారితప్పి । ఘనవేంకటాద్రి మార్గంబులోజే
రిమహారణ్యమునజొచ్చి యార్తిబొంది।యాకలిదప్పి మెండై నేలపడు వేళద

నసుతు బేర్కొనితల్లడించి । యేరకౌండిన్య యెందుబోయితివటంచు । బహువిధంబులుగాదుఃఖ పడుచుబలుక । దీనరక్షకుడగునాదిదేవుడతని । కెదురుగావచ్చి కరుణతోనిట్టులనియె॥ తే॥ వృద్ధవిప్రుడ యీమహావిపినభూమి ! కేలవచ్చితినవని లోనింకగొన్ని । దినములుంచెదవో లేక దేహమిపుడె। విడిచిపోయెదవో దెల్పు విశదముగను॥ క॥ అనవినివిప్రుండిట్లనె।ననఘ శరీరంబుమీద నాశక్తియుతే। దనిమిషులరుణముదీర్పక। చనుటెట్లనుసందియంబుజనియించె ననెన్॥ క॥ ఆవార్తలువిని యాధవుడావిప్రునికరముబట్టియచ్చటగలయా । పావనతీర్థముజేర్చిన । నావసుధామరుడుస్నానమచ్చటజేసెన్॥ వ॥ ఇట్లుస్నానముచేసిన శతవృద్ధబ్రాహ్మణుండు పదియాఱేండ్లబాలకుమారుండై షోడశకళాపరిపూర్ణుండై నిలిచియున్నసమయమున హరిసహస్రాక్షుండును సహస్రపాదుండును సహస్రశీర్షుండును సహస్రబాహుండునునై యక్కుమారునకు బ్రత్యక్షుండైనంజూచి గగనంబుననుండి దేవేంద్రాదులు దేవదుందుభులు మొరయించి హరిశీర్షంబున గుసుమవర్షంబులు గురియించిపొగడిరప్పుడు విశ్వరూపుండైన హరియవ్విప్రునింజూచి నీకుధనసమృద్ధియగు నింక దేవఋణంబుదీర్చుటకు నాశ్రమంబునకుంజనియాగంబుసేయుమని యానతిచ్చి యంతర్ధానంబునొందె నవ్విప్రుండునునిజాశ్రమంబునకరిగెనివ్విధంబునవృద్ధబ్రాహ్మణుండీతీరంబునందుస్నానముచేసిబాలకుమారుండయ్యెంగావున నీధారాతీర్థంబుకుమారధారయనగాబ్రసిద్ధంబగుగాక యీతీరంబున ద్రిమాసంబులు జితేంద్రియుండైత్రికాలస్నానంబులాచరించినవాడు వజ్రకాయుండై ముదిమిలేక సుఖించుగాకయనినిర్ణయించిదేవతలుచనిరి యీకథజాబాలిమునీశ్వరుండేనాకుజెప్పెనని సూతుండు శౌనకాదులంజూచి మఱియునిట్లనియె॥ సీ॥ వాల్మీకినాకు పూర్వంబునందొక యితిహాసంబుసెప్పె నెట్లనినవినుడు। చంద్రవంశజుడైనశంఖణుడనురాజు కాలవశంబున బేలయగుచు । దనశత్రువులకోడి తానేలురాజ్యంబునెడబాసిపోయి రామేశ్వరంబు । జేరియచ్చటరామ సేతువందుమునింగి వచ్చి యీమీదసువర్ణముఖరి। యందుగ్రుంకి తదుత్తరమందుజాల। రమ్యతరమైన పద్మసరస్సుచెంత । జేరిస్నానముజేసి తత్తీరమందు।నిలిచితాదనలోనిట్లు దలచెనపుడు॥ చ॥ కటకటశాత్రవుల్గినిసి కయ్యముచేసిమదీయరాజ్యముం । దటువలెనాక్రమించిరిపుడన్నము వస్త్రముగల్గుబట్టునే। నెటువలెనోర్తుకష్టమున కీశ్వరుడీగతిజేసె నింకమీ । దటిగతియేమటంచుబరితాపముచేవిపులార్తిబొందుచున్॥ వ॥ ఇట్లనేకవిధంబులశోకాకులితమానసుండైకించిదున్మీలితాక్షుండైనిదురించినట్లుపరవశుండైయున్నసమయంబుననశరీరవాణియిట్లనియె॥ తే॥ నిర్మలాత్మకమదియందునీవుధైర్య। మొం

దుచింతింప కిచటికినుత్తరముగ। క్రోశదూరాన వేంకటకుధరవరము। వెలుగుచున్నదియటకు వేవేగ బొమ్ము॥ వ॥ అప్పర్వతంబునమహాపన్నులకుగామధేనువుచందమునకోర్కాత్ములకుగల్పవృక్షంబునై వడి జింతితార్థంబులిచ్చుచుజింతామణియనుపేరిటబ్రకాశమానంబై యున్నది నిర్హేతుకజాయమానకటాక్షవీక్షణుండై సకలజనార్తినివారకుండయినశ్రీయఃపతియచ్చట వసియించియుండు నందుశ్రీస్వామి పుష్కరిణి సకలాఘ నివారిణియై యిష్టకామ్యార్థఫలదాయినియై శుద్ధోదకపూరితంబై యుండు దత్పశ్చిమ తటంబున వాల్మీకభూధరంబుండు నందునిల్చి త్రిసంధ్యంబునందు బుష్కరిణియందు గ్రుంకులిడి షణ్మాసంబులు విజితేంద్రియుండవై నిష్ఠాగరిష్ఠుండవై శంఖచక్రగదాధరుండయిన శ్రీవేంకటేశ్వరుని భావించి షోడశోపచార పూజలుసమర్పించుచుండుమంత శ్రీస్వామి ప్రసన్నుండై నిన్ను రాజ్యాభిషిక్తు జేయునని పలికిన యశరీర వాక్కులు విని సంతసించి ప్రసన్న మనస్కుండయి లేచివచ్చి వేంకటాచలా రోహణంబు చేసి చంద నాగరుపున్నాగ బీజపూరముఖ్య ఫలపుష్పలతా శోభితంబును జమరీ కస్తూరిమృగ ప్రముఖమృగావాసంబును శుక కలకంఠమయూర రాజహంస విహార కూజిత కలితంబును నయనానంద కరంబునైన వేంకటాద్రి దర్శనంబుచేసి తన్మధ్యంబున దివ్యపరిమళోదక పూర్ణంబును శోణకమల నీలోత్పలపరివృతంబును మత్స్యకచ్ఛప ప్రముఖ జలచర సంకులంబైన స్వామి పుష్కరిణి దర్శనంబుచేసి తత్తీర్థమందు సంకల్ప పూర్వకంబుగా త్రికాలస్నానంబు లాచరించుచుశ్రీ వేంకటేశ్వరస్వామి యవయవధ్యానంబు సేయుచు షణ్మాసంబులు పూజించుచున్న యనంతరంబున॥ సీ॥ హారకుండల కిరీటాది భూషణభర్మ చేల కాంతుల బ్రకాశించువాడు। తులసికాదళ పరిమళ పుష్పహార విరాజత

హరి శంఖణరాజునకు ప్రసన్నుండగుట.

సూక్ష్మోదరంబువాడు। తిలకాంక నిటల ప్రదేశమందు నటించు కమనీయ కుటిలాలకములవాడు। శ్రీవత్స కౌస్తుభ చిహ్నముల్గలవాడు కరుణ నొప్పిన గొప్పకనులవాడు। శంఖచక్ర గదాబ్జ హస్తములవాడు ।నురమునందబ్ధి సుతనుంచి పరగువాడు। నిరుగడల భూమినీళల నొఱయువాడు। దీనపాలన మొనరింప దిట్టరువాడు॥ వ॥ అప్పుడనేక సహస్రకోటిసూర్యప్రకాశ సదృశదివ్య విమాన మధ్య ప్రదేశమందుండి స్వామి పుష్కరిణి మధ్యంబున నిలిచి శంఖణ మహారాజునకు బ్రత్యక్షంబైన సమయంబున బ్రహ్మరుద్రేంద్ర ప్రముఖులువచ్చి భేరీ మృదంగాది మంగళ వాద్యంబులు మొరయించి పుష్పవృష్టి గురియించి నృత్తగీతంబులు గావించి నిగమాంత సూక్తుల వినుతించుచుండిరిప్పుడు శంకణమహారాజు సాష్టాంగ దండప్ర

ణామంబు లాచరించి యిట్లనియె॥ సీ॥ దేవదేవ మహాత్మ దీనరక్షకజగన్నా యక కరుణతో నన్నుజూడు। మునుపు మాపూర్వులకొ నరమీరిచ్చిన పృథ్వి శాత్రవుల కొప్పించివచ్చి। యతి దీనదశనొందినట్టి నాకిప్పుడు ప్రత్యక్షమైతివి పరమపురుష। నాశత్రువు లడ్రదుంచి నారాజ్య మిప్పించుమనిన శంఖణున కిట్లనియెజక్రి। చింతవిడువుము రాజనీ సీమజేరి। పట్టభద్రుండవై యుండు భార్యతోడ।ననుచు జలజగంభీరోక్తి దానానతిచ్చిహరితిరోధాన మొందె నత్యద్భుతముగ॥ తే॥ అప్పుడా బ్రహ్మముఖ్యులు హరినిబొగడి। స్వామిపుష్కరిణీ స్నాన సత్ఫలంబు। హెచ్చి యితనికి స్వామిత్వ మిచ్చెననుచు। జనిరి వారందఱును నిజస్థానములకు॥ ఆ॥ శంఖణుండు నపుడు స్వామి పుష్కరిణికి। మ్రొక్కి శైలమునకు మ్రొక్కి హరికి। మ్రొక్కి భార్యతోడ ముదముతో గిరి డిగ్గి। పోవుచుండ నతనిభూమియందు॥ క॥ విమలుండగు శంఖణురిపు। లమితాశను రాజ్యమేలనన్యోన్యవిరోధము లెసగ బోరిమడిసిరి। క్రమముగ నమ్మహికి రాజుగావలె ననుచున్॥ వ॥ తద్దేశ వాసులు శంఖణ మహారాజును వెదకుచు గోదావరీ తీరంబు జేరిరంత నమ్మార్గంబున శంఖణుండు వచ్చి తత్తీరంబు నందున్న నిజదేశ వాసుల నీక్షించి శత్రునాశన ప్రకారంబు విచారించుకొని కాంభోజదేశంబునకు బోయి శ్రీవేంకటేశ్వర ప్రసాదనంబున బూర్వప్రకారంబుగాబట్టభద్రుండై నిజరాజ్య పరిపాలనంబు సేయుచుండె నదియునుంగాక నింకొక్క యితిహాస వృత్తాంతంబు గల దదివినుండని శౌనకాదులతో సూతుండు మఱియు నిట్లనియె॥ సీ॥ మధ్యరాష్ట్రమున నాత్మారాముడనెడుసద్బ్రాహ్మణుండాఢ్యుండు పండితుండు। దేవభూసురు పూజలేవేళ జేయుచువిహిత ధర్మజ్ఞుడై వెలయుచుండి। యటమీద బిత్రార్జితార్థంబు కాలవశంబున నానాట సమసినంత। దానర్థహీనుడై దారిద్ర్యమున నెమితోచక నాత్మలో దుఃఖపడుచు। నిల్లువెల్వడి శ్రీవెంకటేశునున్న। పర్వత శ్రేష్ఠమునకధో భాగమందు।ధన్యమైయున్న కపిలతీర్థంబు చెంత।జేరిస్నానముచేసితత్తీర్థమందు॥ క॥ కపిలేశ్వరమనునదియం।దపుడాన్హికనిష్ఠనుండియట లేచిమహా।విపినములోపలజొరబడి।చపలతనొక మార్గమందు శైలం బెక్కున్॥ వ॥ తన్మార్గంబునందున్నకపిలతీర్థప్రముఖసప్తదశతీర్థములయందుస్నానంబు చేసినిర్మ

## హరి ఆత్మారామునికిఁ బ్రసన్నుండగుట.

లచిత్తుండైపర్వతారోహణంబుచేయుచుండితన్మార్గ సమీపంబున నుండుగుహామధ్యంబునధ్యానయోగగరిష్ఠుండై యున్న సనత్కుమారుసన్నిధానంబు చేరిసాష్టాంగదండప్రణామంబులాచరించినిలిచిముకులితహస్తుండైవినుతించి యిట్లనియె॥ క॥ శ్రీశ సనత్కుమహాత్మక।పాపాత్ముడనైననన్ను బాలింపకృపతోడం

జేపట్టి ప్రోవవలయును। నీపాదమెదిక్కు-నాకునిర్మలహృదయా॥ క॥ దారిద్ర్యముచేతనుసం। సారంబునువిడిచివచ్చినరగుననిన్నే। జేరితినాకష్టదశన్। వారించిసుఖంబునీయవయ్యామహాత్మా॥ మ॥ అనినందాపసవర్యుడిట్లనియె నీకాయాసమింకేలచే। సినపాపంబునశించుకాలమిదెవచ్చెం బాపమేదంటివా। వినుజన్మాంతరమందు మాధవుని సేవింపఁ వివేకంబులే। కనులోభంబునదానకంటకుడవై గర్వంబుతో నిక్కుచున్ ॥గీ॥ దానమిచ్చువారిదానంబుగొనువారి। ననుసరించి యొకరియందొకరికి। గసరుపుట్టునట్టి కల్లమాటలునీవు। చెప్పిదానహాని చేసినావు॥ క॥ ఆచారవిహీనుడవై। యేచోటల నైనగుడిచి హెచ్చగుజనులన్। జూచిహసించు చునుంటివి। దాచితివర్థంబునీవు దానములీకన్॥ క॥ ఆపాపచయంబిపుడా। కాపిలతీర్థమున గ్రుంకగానె తొలంగెన్। శ్రీపద్మాలయకృపనీ। కీపట్లను గలుగవలె నదెట్లంటేనిన్॥ క॥ వ్యూహామహాలక్ష్మిసదా। శ్రీహరి వక్షస్థలమున జిరభూషణమై। మహాత్మ్యముత్తనెలకొని। బాహుళ్యముతోడ సిరుల భక్తులకిచ్చున్॥ సీ॥ అవ్యూహాలక్ష్మి వృత్తాంతంబువినుదయా లోలతరంగాక్షి లోకమాత। పూర్ణచంద్రనిభాస్య పురుషోత్తమ ప్రియ పద్మాలయా విమల పద్మపాణి। వ్యూహభేదములచే నొనరిమహాలక్ష్మియనఁగీర్తియన జయయనగనొప్పు।గారుణ్యాదివ్యమంగళవిగ్రహమైమహా దీనరక్షణసేయఁబూనియుండు।వినుమ నాయాసముగ భక్తవితతిసేయు। పాపచయ మునడంచి సంపదలనిచ్చు। నామహాదేవి మంత్రమే నాప్తముగను। జెప్పెదను నీవుసద్భక్తి చేజపించు॥ వ॥ మనిపల్కి యంగన్యాస కరన్యాస పూర్వకంబుగా లక్ష్మీమంత్రంబుపదేశించి ధ్యానప్రకారంబు సాంగంబుగా జెప్పి వేంకటాచలంబున కరుగుము శ్రీనివాసుండు నీకుప్రసన్నుండై నీయిష్టార్థంబులనిచ్చుం బొమ్మని యానతిచ్చి సనత్కుమారుగు డంత ధ్యానంబు నొందెనంత నాత్మారామాభిధానుండు భయభ్రాంత చిత్తుండై పులకితశరీరుండై యానందబాష్పధారా కలితనేత్రుడయి తగ్గురుధ్యానంబుసేసి లక్ష్మీమంత్ర జపంబారంభించి జపించుచు నాకాశగంగ భూమికిదిగి వచ్చుచందంబున విరజా నదికైవడి బగమపావనంబులైన తీర్థంబులు శైలాగ్రమందుండిప్రవహించుచుధరణికిదిగివచ్చుచున్నఁ జూచిసంతసించుచుగృతస్నానుడయి పర్వతారోహణంబుజేసి స్వామి పుష్కరిణిఁ [illegible]ద్దు గ్రుంకులిడి జపశీలుండయి హరిధ్యానంబు సేయుచున్న సమయంబున॥ సీ॥ ప్రాకారపఙ్క్తులు బహుమంటపంబులు వివిధసల్కల్యాణ వేది[illegible]। ఘనతరరత్నకాంచననిర్మితంబులై కొమరుమించు ననేకగోపురములు। నమరేంద్రనిలయ సౌధాట్టాలకంబులు సరసమౌక్తికముల చప్పరములు। భానుకోటిప్రభా భా

సమానసురత్న సహితంబుల గుసభాస్తంభములును । గలిగిగంధర్వనగ
ర సంకాశముగుచు । విధిశివేంద్రాదిసిద్ధ సేవితమునగుచు । గీతవర్తనవా
ద్యసంకీర్ణముగుచు । నమరునాక దివ్యధామమధ్యంబునందు॥ సీ॥ కుండ
లాంగదరత్న కోటీరకౌస్తుభముఖభూషణము లంగముల వెలుంగ । రమ
ణీయకనకాంబరంబు చుంగులుజాఱ బరిమళగంధ లేపనము మెఱయ ।నీల
కాంతులనొప్పు నిటలాలకంబులు బాలమిళిందాదిపగిది వెలుగ । నుర
మునందరుదుగా శ్రీవత్సలక్ష్మి మెలంగ శతకోటి మన్మథసదృశుడగుచు।న
పుడుభూనీళలిరుగడ లందు జెలగ । బుండరీకాక్షుడుండున్న భూసురున
కు । దయనుబ్రత్యక్షమయ్యె నత్తరిఁజెనిప్రు। డలరిసాష్టాంగ దండంబులా
చరించె॥ వ॥ ఇట్లుదండ ప్రణామంబుచేసి వినుతింపనేమియుఁదోచక గద్గద
కంఠుండయి నిలిచి యనిమిష దృష్టినీక్షించుచున్న యాత్మారాముని జూచి
నిర్హేతుకజాయమానకటాక్షవీక్షణుడయి హరియిట్లనియె॥ తే॥ నీకుభ
యమేల శ్రీవత్సలక్ష్మికటాక్ష । మిపుడు నీయందుబొందిన దింకమీఁద।
నాయురారోగ్య మైశ్వర్యమమరనీకు । గల్గువిజ్ఞాన నిష్ఠయుగలుగువిప్ర॥
సీ॥ అనిపల్కి మాధవుం డాబ్రాహ్మణున కప్పు డభయంబొసంగి బ్రహ్మా
దిసురలు । తనునుతింపగ దిరోధానంబునొందె నయ్యవనీసురుండు భ
యంబునొంది । యీవార్తలిపుడానలిచ్చినజగధీశు డిందుండి నింతలో
నెందుజనెనో । తలచిచూచిననిది దబ్బరోనిక్క-మో కలగంటినో యను
కళవళమున । గొంతసేపున్న నవఁలసద్గురుని కృపను । హరివరము లిచ్చు
సదినిక్క- మనుచుదలచి । నమ్మిగిరిడిగ్గి తనమందిరంబుజేరి । సిరులనొప్పు
చుదానము ల్సేయుచుండె॥ క॥ ఈకథయును బూర్వమువా । ల్మీకిమునీశ్వ
రుడు చాలమెప్పు దలిర్పన్ । నాకొనరగ జెప్పిననే । మీకిటు సెప్పితి
నిసంయమి ప్రభులారా॥ చ॥ అనినవరాహపర్వత మహత్వము చక్కఁగ
నీవు దెల్పగా । వినిముద మొందెజిత్తమిక వేడుకమీఱ వికుంఠపర్వతం ।
బనవిలసిల్లు సద్గిరిమహత్వముజెప్పుమ టన్చుమానుల । త్యనఘులుసూతు
జూచి విపులాశను బల్కిరటంచు గ్రమ్మఱన్॥ సీ॥ ధీరాత్మ పదియేడు తీ
ర్థంబులాశైలమందుండు నంటివింకా హిమల । వేత్వేఱ వరుసగా వివ
రించి చెప్పుమో యమలాత్మ సూతనీవను చునడుగ । నాసూతుడిట్లనెన
రసియా తీర్థమాహాత్మ్యంబులను జెప్పనల వియుగునె । పెద్దలునాకుజె
ప్పినరీతి గామీకు జెప్పెద వరుసగా జిత్తగింపు । డనుచు సూతుడుబా
దరాయణుని దలచి । మఱియు నిట్లనఁ బల్కెనో మానులార । హరిక
ళాంశజుడయికర్దమాఖ్యమునికి। బుత్రుడయినట్టికపిలుండుపూర్వమందు॥ శా॥
ఆపాతాళమునందుసాంఖ్యవరయోగాభ్యాసంముం జేయుచుం। బాపల్యంబు

నడంచియాకపిలుడుత్సాహంబుతోలింగమం । దాపట్లందగనిల్పియర్చనము
సేయంగ మాహాత్మ్యంబుతో। దీపించెఁ ఘనలింగమిద్ధరను భేదించెఁ మహాదీ
ర్ఘమై॥ ఆ॥ అప్పుడొక్క కాలమందుసురలచేత।జనులచేతబూజగొనగదగి
న।కారణంబువలనగపిలలింగమనంగ। బెరిగివచ్చి నిల్చెపృథ్విమీద॥ ఆ॥ సగర
నందనులకు సద్గతినిచ్చియం । దున్నభోగవతిమహోన్నతముగ। వేగలింగ
మూర్తివెంటసేధరనుభే। దించివచ్చికపిలతీర్థమనగ॥ క॥ ప్రవహించుచుమను
జావళి।భవములహరియించిలోకపావనియయ్యెఁ।దివిజులునరులాలింగము।
నవిరళసద్భక్తిఁ తోడనర్చింతురిలఁ॥ సీ॥ కపిలతీర్థోపరిగా చక్రతీర్థంబుప్రవ
హించుమును దేవపతి యహల్య। నెనయుపాపమునీగ నింద్రుడా చక్రతీర్థ
మున స్నానము జేసిధన్యు డగుచు । జని మొదదు పరివిష్వక్సేన తీర్థంబు
పుణ్యవృద్ధికి హేతు భూత మగుచు । బ్రవహించు చుండు పూర్వమువ
రుణాత్మజుం డైన విష్వక్సే నుడచట దపము। సలుపగా మెచ్చి హరివచ్చి
శంఖచక్ర । యుగళ మపుడిచ్చి పరివార యూథము లకు । గర్తగనతని
నుంచిన కారణమున । నతనిపేరిట నాతీర్థమచటనుండు॥ క॥ పంచాయుధ
తీర్థంబులు । సంచితముగ దానికుపరి యందొప్పునుదీ । పించు ఘనానల
తీర్థము । మించిత దూర్ధ్వంబునన్దు మెఱయుచు నుండుఁ॥ ఆ॥ పరగదా
నికుపరి బ్రహ్మతీర్థముమహా । హత్యనడప నొప్పునందు గ్రుంకు।ప్రజకు
నెల్లపుణ్య ఫలమిచ్చుదానిపై।సప్తమునులతీర్థచయము నుండు॥ ఆ॥ ఒకటి
కంటెనున్న నొకటి యుత్తర దశా । ధికఫలంబు లిచ్చు తీర్థమహిమ। లింత
గొప్పనుండు నెఱిగి బ్రహ్మనులే । చెప్ప లేరు నేను జెప్పగలనె॥ క॥ మఱి
యింకొక్క విశేషం।బరు దుగ జెప్పెదను బూర్వమందొక ధరణీ । సురుఁ
డిలఁగలతీర్థములను । వరుసగనన్నియును జూడవలయు నటంచుఁ॥ సీ॥ పో
యెడి తెరు వందు బురుషోత్తముడు నాడు శయనించినిదురింపస్వప్నమందు।
బల్కెనిట్లుచునో బ్రాహ్మణోత్త మనీవు తీర్థముల్వెదకుచు దిరుగనేల ।
యదెమూడుమీా పుష్కరాద్రి సమీపమం దున్నది దాని యందొప్పు
చున్న । పదియేడుతీర్థముల్పరమ పావనము లాతీర్థంబులలందు విధిక్ర
మముగ । స్నానములుసేయ వరుసగా సకలసిద్ధు । లమరఁగా గల్గునీకు
నీయర్థమందు । సంశయింపకు మనవిని సంతసించి । భూసురుడు మేలు
కొని లేచి బుద్ధియందు॥ తే॥ తలచెనిట్లని శ్రీరమాధవుడు స్వప్న । మం
దు జెప్పిన గతిబుష్కరాద్రి జేరి । యచటితీర్థంబులను గ్రుంకియఖిలసిద్ధు
లేసుబొందెదననిసిశ్చయించివచ్చి॥ వ॥ కపిలతీర్థంబు మొదలుకొని సప్త
దశతీర్థంబులయందు విధిప్రకారంబుల స్నానంబులు చేసి సకల సిద్ధుల
బొందెనని చెప్పిక్రమ్మఱ సూతుండిట్లనియె॥ తే॥ ఆరయగా మూఁడుకో

ట్లునొక్క ర్థకోటి । తీర్థములు గల్గియుండు నత్రిభువన ముల । యందున్శ్రీ
వేంకటాద్రిపై నఖిలతీర్థ । ములుగలిగియుండు గావున ముఖ్యమయ్యె॥ వ॥
ఇట్టివేంకటాద్రి ప్రదక్షిణంబాచరించిన భూప్రదక్షిణంబు చేసిన వారికిగల్గు
నంతపుణ్యఫలంబుసిద్ధించు నింక నొక్కవిశేషంబు గలదది యెట్లన్నహాలా
యుధుండు వేంకటాద్రి శిఖర దర్శనంబు చేసిసకల తీర్థయాత్ర ఫలంబు
బొందెనని వినియుంటి నదియునుంగాక ధర్మ రాజాది పాండుసుతులరణ్య
వాసంబు సేయునరుగు నప్పుడు వారితో శ్రీకృష్ణుండా ప్తంబుగా నిట్లని
యె॥ సీ॥ పాండవాత్మజులార ప్రబలులయ్యునుమీరు కర్మవనంబునగహన
ములను । వసియించు కాలంబు వచ్చెగదామంచి దెట్లైన జయము
మీకిత్తునేను। జింతింప వలవదు శ్రీవేంకటాద్రికి జిరభక్తితో బోయి క్షేత్ర
పాల । పాలితమైనట్టి పరమ పావనతీర్థ సాన్నిధ్యమున నిల్చి స్నానపాన ।
జపములొనరించుచుండుడు సకలపాప । హరణమానటుమీదను నరుల
గెలువ । వచ్చునని కృష్ణుడు పదేశమిచ్చి పనుప । నప్పుడా పాండవులు
వేంకటాద్రి జేరి॥ ఆ॥ క్షేత్రపాలు డున్న సిద్ధస్థల మునందు । నిలిచి స్నాన
పాన నిష్టలచట । సలుపు చుండ నొక్క సంవత్సర ముచనె । నంత వేంక
టేశుడా దరమున॥ సీ॥ పాండ వాగ్రజుని స్వప్నమునందు ప్రత్యక్షమై మ
హారాజమీరరులనెల్ల । సమయించియరఘురాజ్యము సేలు పొండనియాన
తిచ్చిన శమనాత్మ జుండు। మ్రొక్కి గ్రక్కున లేచిముదమంది భీమార్జునా
దులకాస్వప్నమపుడుసెప్పి।తడయక భార్యతో దమ్ములతో వేంకటాద్రి చెచ్చె
రడిగ్గి యడవులందు । వాసములుచేసి యటుతఱివచ్చి నపుడు। శత్రువుల
గెల్చిజయ మొందిసామ జాఖ్య । నగరమున బట్టభద్రుడైనందసుతుని ।
ననుసరించుచు నుండెధర్మాత్మ జుండు॥ చ॥ గుఱుతుగ బాండు నందనులు
గొన్ని దినంబులు భక్తియుక్తులై। తఱిమిడి నందునిల్చి నకంతంబున బాండ
వతీర్థమంచు । నెత్తఱినరు లెన్ను చుందురురు దానిమహాత్త్వము క్షేత్ర
పాలకుం। డెఱుగుమునీంద్రచంద్రపరులెవ్వరెఱుంగరికేమిసెప్పదుర్॥వ॥ అది
యునుంగాక స్వామి పుష్కరిణికి బూర్వదిగ్భాగంబున జరాహరంబును
పాపఘ్నంబును రసాయనంబునను మూడుతీర్థంబులును హరివసింపదగిన
వైకుంఠ పర్వతగహ్వారంబును అష్టలోహ ఘాతంబులును గలిగి యుండు
నింతయు స్వామి పుష్కరిణికి ద్వావింశతి శరపాత దూరంబున మాయా
తిరోహిత శక్తియిన్నిటి నావరించించి యుండుంగావున దత్తీర్థాదులు బుధు
లకైనగననశక్యంబులగుచుండు నట్టిమహిమ నొప్పుచున్న వేంకటాచలంబం
దు గుంటులు నంధులు మూకలు బధిరులు గొడ్డాండ్రు ధన హీనులునైన
వారుయందు లేరు శ్రద్ధా గరిష్ఠులై హరియందు భక్తిన్యాసంబుచేసి

నిస్సంశయులై నమ్మియున్న వారికి దనుపద్రవంబులు నివారితంబులై సుఖంబు గలుగు నదియుకుంగాక తత్పర్వతంబునకు యుగభేదంబుల

వేంకటాద్రియుగభేదంబుల ప్రకాశించుట,

చేత నొక్కొక్క విశేషంబు కలుగుచుండు నదిమెట్లనిన॥ సీ॥ ఆవేంకటాద్రి మహాత్మ్యంబుగ నొక్కతఱిశ్రీని వాసునికరణి వెలుగు । నొక వేళ గనకాద్రిమొప్పున జూపట్టు నొకవేళ జ్ఞానసంయుక్త మగును । గనిపించు నొకవేళ ఘనమణి రూపమై కనిపించు భూషణ క్రమము గాను । గనిపించు నొకవేళ గలికాలమున యందు భాషాణగిరిరీతి బ్రజకుదో చు। నందుచేవేంకటాద్రిమహత్వమెఱిగి। చెప్ప లేడింతయనిలూది శేషుడైన విభుధజనములు చెప్ప గావిననయంత । జెప్పితిని గాని నేనంత జెప్ప లేను॥క॥ అని యిటుసూతుడు పలుకగ। విని శౌనక ముఖ్యులనిరి వేంకటగిరిస। ద్ఘనత రమహిమము లెంతగ। వినినంబరి తృప్తి లేదుపీకుల కనఘా॥క॥ కావున పెద్ద లుదెల్పిన। శ్రీవేంకటగిరి మహావిచిత్రమహిమలక్ । భావింపగవరుసగసి । వేవేడ్కగ జెప్పు సూతివిమలఖ్యాతా॥ గీ॥ అనిన జైమినిమును చెప్పి నట్టి రామ। చరితమిపుడేను జెప్పెద సావధాన। మతినివినుడయ్య మరలనిమూనివరు ల। గాంచిసూతుడు పల్కె నుత్కంఠ మెఱయ॥ సీ॥ దనుజారిపూర్వంబు దశ రథాత్మజుడనజనియుంచిగాధేయుజన్న మమర। గాచిశంకర కార్ముకంబును ఖండించిజానకిచేబట్టి జామదగ్న్య। బలమార్చిసాకేతపట్టణంబులు జేరిజనకా జ్ఞగైకొనిచనియరణ్య। వాసంబుచేయ రావణుడనుదనుజుండు లలనుసీత ను దనలంక కెలమి । బట్టికొనిపోవ రామ భూపాలకుండు। రావణునిద్రుంచుకొఱ కుసుగ్రీవుతోడ। నాంజనేయాదికపులతోనపుడు వేంక । టాద్రిచెంత నెలంక కునరుగుచుండె॥ డీ॥ అంజనాదేవిశ్రీవేంకటాద్రిమీద । నుండి రాముడుబ హు కపితండములను। గూడివచ్చుటగనిపైడికొండడిగ్గి। మొసనిమెదురుగ

శ్రీరాములు వేంకటాద్రికివచ్చుట.

జని రాఘవునకు మ్రొక్కి॥క॥ ఘనుడా రాముడువిష్ణుం। డనిమనమున నిశ్చయిం చి యతిశయభక్తిన్ । వినుతులు సేయుచునచ్చట। నెనలేని ముదంబుమీఱ నిట్లనిపల్కెన్॥ఉ॥ రామసుకీర్తికామబహు రాక్షసయూథవిరామసద్గుణా। స్తో మదినేంద్రవంశఘనతోయధితామరసాస్యభీమనీ। శ్రీమహితప్రభావమును శేషుడుసన్నుతి సేయలేడునే । నేమినుతింప నేర్తు జగదీశ్వర మ్రొక్కెద నన్నుగావవే॥ సీ॥ ఈవేంకటాద్రిపై నే వర్తింపుదుగావున నాయందు గరుణ నుంచి। వేంకటాద్రికి మీరు విచ్చేయుడనవిని శ్రీరాముడిట్లనె వీరకపుల! స్తో డశీఘ్రంబైన దూర ప్రయాణంబు కలిగియున్నది కార్యఘటనమైన। వెను క నీవనినట్లు వేంకటాద్రికి వత్తు మనగ దేవరదర్శ నార్థమచట । గాచి

యున్నారు మునివరుల్గానవారి । జూడ రావలెననుచు నాచేడె వలుకు । స
మయమున నాంజనేయు డచ్చటికివచ్చి । వినయమున మ్రొక్కి యిట్లని వి
న్నవించె॥ గీ॥ దేవమాతల్లి యంజనాదేవి మనవి । చేసినదిమీరు మన్నిం
చి చిత్తగింప । వలయు నేలన్నగపులెల్ల నలసినారు । గనుక శ్రీవేంకటా
ద్రికి జనుటయొప్పు॥ సీ॥ శ్రీయంజనాశ్రమ సిద్ధస్థలము నందు ఫలసుమవృక్ష
ములలిగియుండు గంద మూలాదులు ఘనపుణ్య తీర్థంబు లందుండు గను
క నేడచటనిల్చి । యవల బోదగునంజనాద్రి దూరముగాదు మన ప్రయా
ణమునకు మార్గమదియె । యటుగాన మాతల్లియందు సత్కృపనుంచి
యటకు రావలె నిపుడనగరాను । చంద్రుడజ్ఞాప్త సుతుని లక్ష్మణునిజూ
చి । మంద హాసితాస్యుడయి హనుమంతు డనుట । వింటిరేయున్న వారు
భూ విభుని జూచి । దేవశ్రీ వేంకటాద్రికి బోవవచ్చు॥ క॥ అనియిట్లు మన
వి చేయగ । వినిరాముడు సంమతించి వేడుకగాన । య్యనిలత నూజుని
నెనరున । గనుగొని యిట్లనియెజాల గౌరవమొప్పన్॥ ఉ॥ మారుతపుత్ర
నీమనవి మామది కిష్టమెయయ్యె నిప్పుడా । సారత రాంజనాఖ్య వరశైల
మమార్గము నందె పోదమా । దానిని వానరావళికి దప్పక చూపుమటం
చు బల్కన । వీరుడు సమ్మతించి కపివీరులబిల్చి ముదంబుమీఱగన్॥ ఆ॥
వేంకటాద్రి మార్గమంకితముగ జూపి । హరిసమూహ విభుని యను మత
మున। రామలక్ష్మణులను రహిమీఱ భుజములం।దుంచికొని బలంబు పెంచి
నడచి॥ ఆ॥ నిక్కి వేంకటాద్రి కెక్కు మార్గమునందు । వరవసుసేంద్రు లెదు
రువచ్చి నిలిచి । బహువిధముల రామభద్రుని వినుతించి । యిట్టులనిరిమో
ద మినుమడింప॥ ఉ॥ రామనృపాల ఘోరతర రావణశౌర్యవిఘాల భవ్య
సు । త్రామసురార్య యోగిజనతాపసపాల కృపాలవాల శ్రీ । భూమిసు
తాత్మలోల పరిపూర్ణసుకీర్తి విశాలవానర । స్తోమముతోడనచ్చు మిము
జూచి కృతార్థులమైతి మిద్దరన్॥ సీ॥ చిరకాలముననుండి శ్రీవేంకటాద్రిపై
దప మొనర్పగ నావిధాతవచ్చి । రామసౌమిత్రులీరమ్య వేంకట శైల
మునకు వచ్చెదరు సమ్మోదమలర । వారువచ్చెడు దాక వదల కిచ్చటనుం
డి వచ్చినప్పుడు మీరువారినచట । సంతోషమున జూచి సత్యలోక మున
కురండు మీరనిన కారణముచేత । నెదురుజూచుచు నుండి మేమిచటమి
మ్మ । గాంచితిమి మాతపంబు లిక్కడ ఫలించె । నింతయేచాలు సెలవి
మ్మ యిపుడు బ్రహ్మ । యున్నలోకము జేరెద మోమహాత్మ॥ మ॥ అని
నన్ రామనృపాలకుండు పరమాహ్లాదంబుతో వారలన్ । గనియోతాప
సవర్యులార మిమునికాంతార మధ్యంబునం । దొనరంగంటిమిసంతసం బా
ద నమీరుత్సాహ ముప్పొంగగా । జనుడజ్ఞోద్భవుడున్న చోటికనుచున్ సం

ప్రీతితోఁ బల్కఁగన్॥ క॥ ఆవానరులు ముదమొందుచు। రామునిచే సెలవునంది
రయమున నపుడే। తామరసోద్భవులోకము। నామోదము మీర జేరిరనఘా
త్మకులై॥ వ॥ తదనంతరంబున రామచంద్రుఁడు తత్పర్వతోత్తర మార్గంబున బ
ర్వతారోహణంబు సేయుచుండి తన్మధ్యంబున యక్షశాపమోక్షంబు చేసి వచ్చి
కందమూలఫలభరితంబైన యంజనాశ్రమమునందు నాకాశగంగ సమీపము
నగపిసమూహములతోడ రామలక్ష్మణులు నిలిచి తత్తీర్థంబున స్నానసంధ్యా
దికృత్యంబును నెరవేర్చి రంజనాదేవి ఫలపుష్పంబులు సమర్పించి పూజింపఁగా
రామలక్ష్మణులు సంతుష్టులై యంజనాదేవి నాదరించి వీడ్కొని తదనంతరంబు
న సుగ్రీవాంగద నల నీల జాంబవత్ప్రముఖ కపిశ్రేష్ఠ పరివృతులై స్వామిపుష్కరి
ణికి వచ్చి జయప్రద సంకల్ప పూర్వకంబుగా స్నానంబు చేసి ఫలపుష్పభరితం
బైన తత్తీర శృంగారవనమునందు సుఖాసీనులై తత్పర్వతంబున వసియించి
యుండి దర్శనార్థంబుగా వచ్చిన మునులకనేక ఫలదానంబులు చేసి పుష్కరి
ణికి నైరుతిభాగంబున నీకపులు నిర్మాణించిన పర్ణశాలలయందు నిలిచియు
న్న సమయంబున నాంజనేయుండును ననేక మధుర ఫలకందములాదులు తే
నెపెరలు తెచ్చి సమర్పించిన బరివారంబులతోడ రామలక్ష్మణు లారగిం
చి పరిపూర్ణులై యయోధ్యా పురంబునందున్న చందంబున సంతసించుచు
న్న సమయంబున॥ సీ॥ ఘనుఁడాంజనేయుండు కపిసమూహము నెల్ల పిలిచి యిట్లని
యె సంప్రీతి మెఱయ। వానరులార యీవనపర్వతములందు చూతజంబూఫల
వ్రాతములును। పనసపండ్లును ద్రాక్షపండ్లును బదరికాఫలములరటిపండ్లు
పాలపండ్లు। మొదలైన బహుఫలంబులు మెక్కఁడానందమున విహరింపుఁడీవన
ములందు। నసినవినికపి బృందంబులపుడు చెలఁగి। ఫలమహీజముల కెగఁబ్రాకి
యార్చి। కావలసినట్టి పండ్లెల్ల గఱచి మెక్కి। పేటులెగఁబ్రాకి బలు తేనెపెర
లుదించి॥ వ॥ అప్పుడా కపివరులు పొంగి తేనెపెరలఁ జించి ప్రోవులు జేసి మూ
కుప్పలు పంచికొని నబ్బురపాటున జప్పరించనొండొరుల ఱొప్పుచు మ
క్కు చిట్లించుచు బ్రక్కలు గ్రోకుచు జెవులు బొంగ్రించుచు నొకరితోఁ
నొకరు కఱచుచు నొక్కరి చెవుల నొక్కరు చప్పరించుచు బండ్లుగీటించి కన్ను
లు బిక్కరించి కిసురింతలిడుచు గొండకొండకు లంఘించుచు నిట్లనేక ప్రకా
రంబుల బర్వతాకారులైన కపులు నిజజాతికు చేష్టలు చేయుచు నుండి యుంద
ఱొక దిక్కుగుంపులై కూర్చుండి యొకరినిజూచి యొక్కరిట్లనిరి॥ క॥ బహుప
ర్వతములు చూచితి। మహహాయీ పర్వతేంద్ర మత్యద్భుతమీ। మహి మ
ములింతింతని ధర। నహినాథునికైన బొగడనలవియె తెలుపన్॥ క॥ రాము
ఁడచేనిచ్చట। కామోదముతోడ వచ్చి యఖిలఫలంబుల్। కామించి
[illegible]మిపు। డేమేలో నరింపవచ్చు నినకులపతికిన్॥ సీ॥ శ్రీరాఘవుని

కపుకారంబుచేయు రావణునివాలములతోనణఁగఁజుట్టి। పట్టితెచ్చి టరామ
భద్రుని ముందఱబడనైతుమనిమించిపలుకువారు। నాలవణాబ్ధితోనాద్రి
కూటాద్రితోనాలంకదెత్తమిందనెడువారు। పంక్తికంధరుడింక బాతా
ళమందున్న నీడ్చితెత్తుమటంచు నెగురువారు। గగనమందున్న జంద్ర
భాస్కరులతోడ। నసురనిటుపట్టితేవచ్చు ననెడివారు। నుబ్బితబ్బిబ్బు
లైన గుచుండువారు। కూరిమిని రామజయమునే కోరువారు॥ వ॥ ఇవ్వి
ధంబుననందఱు పలువిధంబులుబలుకుచు లేచివిహరించుచుండి స్వామిపు
ష్కరిణీకీశాన భాగంబునందొక్క గిరిగహ్వరంబు నీక్షించిగజగవయగ
వాక్షగంధమాదన మైందద్వివిధ ప్రముఖులైనవానరులయ్యంధ కారబిలం
బుజొరబడికిచకొట్టుకొనుచు బరిగిబరిగి పోవుచుండి యందొక్క దివ్యజ్యో
తినీక్షించితత్సమీపంబున కరుగుచున్న సమయంబున॥ సీ॥ ఆగుహలోద
త్తహాటకనవరత్న గోపురప్రాకారకుడ్యతతులు। వజ్రకవాటములైవ్వైడూ
ర్యమాణిక్యమరకతమౌక్తిక మంటపములు। ప్రాసాదముల్చిత్రభవనసమూ
హముల్పచ్చతోరణములు హెచ్చిమెఱయ। హేమరథంబులుసామజాశ్వము
నులు। విహరింపదగు శతవిధులనొప్ప। విమలగానంబులును నృత్తవివిధవా
ద్య! తతులుఘోషింప సౌందర్యవతులుమెలఁగ। నరచతుర్భుజులును గదా
ధరులుశంఖ! చక్రపాణులు నచటనేసంచరింప॥ తే॥ అమరియప్రాకృతం
బైమహాప్రకాశ। మహిమచేనొప్పు నప్పురమధ్యమందు। గాంచనాద్రిని

వైకుంఠగుహాప్రభావము.

భంబై ప్రకాశయుతము। భానుసంకాశమైన విమానమందు॥ సీ॥ నీలా
భ్రగాత్రుండు నీరజనేత్రుండు నాజానుబాహుండు నచ్యుతుండు। గనకాం
బరుండుసత్కంబు కంఠుడు సల్లలిత సద్భూషణాలంకృతుండు। శంఖచక్ర
గదాబ్జ సహితహస్తుండు మహాత్ముండు పూర్ణ చంద్రాననుండు। సురుచిర
సుందరసుకుమార దేహుండు విమల సత్కారుణ్యవీక్షణుండు। నగుచుఘ
నభోగిభోగపర్యంకమందు। వాసిమీఱగగూర్చుండి వామపదము। ముడి
చికొనికుడిపాదంబు పుడమిమీద। నింపుగాజాచియుండె లక్ష్మీశ్వరుండు॥
క॥ కరములురెండాఫణిపై। నిరవుగనూది కొనిలక్ష్మియెదపై వెలుగఁగ।
ధరణియునీళయుభక్తిని। నిరుగడలవసించివేడ్క నెనయఁగమిగులన్॥ వ॥ ఇ
వ్విధంబున సుఖాసీనుండై యున్నపరమపురుషునికి గరుడసుందరీమణులు
శ్వేతచ్ఛత్రంబులు వటచామరంబులు వీవనందందుగుంపులుగూడి శంఖచ
క్రగదా పాణులు శ్వేతాంబర శ్వేతపుష్పమాలికాలంకృతులై పరివేష్టిం
చికొలువ కోటిసూర్యప్రకాశుండై కొలువున్నపరమపురుషుని సంతోష
మగ్నులై చూచుచున్నకపుల నీక్షించియందొక వేత్రహస్తుండు తెలుపావ

చ్చిన భీతిల్లి మార్గంబునుగానక యందందు బ్రాకులాడుచు గికురించుచు
న్నకపులంజూచి కరుణాయత్తచిత్తుండై యావేత్రహస్తుండు మార్గంబు
జూప నక్కపులా మార్గమునసీవలవచ్చి యాశ్చర్యంబు నొందితమలోదా
మువితర్కించి యిట్లనిరి॥ సీ॥ శ్రీరామచంద్రుని చెలగి గెల్వగ లేకరావణుం
డుగుహాంతరాళమందు। జేరిరాక్షస మాయలీరీతిగాజూపెనని తోచుచు
న్న దిండనెడువార। లాపజ్క్షికంతు మాయలుగావు భావింప హరి
మాయగావలెననెడువారు। నీసంశయము దీరనీమాటు గుహాలోనికరిగి
క్రమ్మఱజూతమనెడువారు। మనముమాత్రమె పోరాదు మర్కటముల।
నన్నిటిని గూడి పోవచ్చు ననెడివారు। నపుడు కలగంటిమిది దబ్బరనె
డువారు। నమృతమేలగు నిక్కమో యనెడువారు॥ వ॥ ఈప్రకారంబులనం
దఱన్ని విధంబుల సంశయించుచునాగుహామరల జూడబోయినగన బడకుం
డెనంతట విస్మయం బొందుచు గపిసమూహంబుల చెంతజేరి యావృత్తాం
తంబు చెప్పిన గపులందఱుం బర్వతగుహలు వెదకి హరినిగనిన గుహాను
గానకవచ్చి రామచంద్రునకు దండప్రణామంబులు జేసి గుహా వృత్తాంతం
బు విన్నవించిన రామచంద్రుండు చిఱునవ్వు నవ్వి యిట్లనియె॥ సీ॥ దేవర్షి
రాజ నదీమూలములు పరీక్షించి నిర్ణయముగా జెప్పరాదు। మహిమా
ఢ్యుడైన రమామనోహరుడిందు జరియించురీతి దబ్బరనరాదు। హరిగిరి
మహిమముల్వారికె తెలియునుగాని దేవతలకునైన దెలియబోదు। వేంకటా
చలమందు వివిధ మహిమలుండు మించి పరీక్షింపమీకు తగదు। మంచి
దైనను గాదు వేమి మాధవుండు। కరుణతో మీకు బొడసూపెగాన మీ
రు! ధన్యులయితిరి పొండ నిదయనుబల్కి। యలరి రాఘవుడాదిసం బచ
ట నుండి॥ క॥ మఱునాడా శైలముదిగి। హరిబలముల గూడి రాముడతి
శూరుండై। త్వరగాజ నిలవణాబ్ధిని।గిరులిడి బంధించిమించి కీర్తిజెలంగెన్॥
చ॥ కపులును దమ్ముడుం గొలువగా నటలంకకు బోయి యచ్చటన్। వి
పుల బలంబుతోన సురవిరులనెల్ల వధించి ధీరతం। గుపితుని గుంభకర్ణు
నిలగూలిచి రావణుతోడ బోరియా। చపలుని ద్రుంచె రాఘవుడు సర్వ
మునులున్సర లున్నతింపగన్॥ సీ॥ సీతనచ్చట బరీక్షించి రాముండు చేపట్టి
విభీషణు భక్తిమెచ్చి। యతనికి లంకలో నమర బట్టముగట్టి జానకిలక్ష్మణ
సహితుడగుచు। వానర సమితితోవర పుష్పకము నెక్కి రమ్యసాకేత పు
రంబు జేరి। భరత శత్రుఘ్నులు భక్తితో గొలువగా పట్టాభిషిక్తుడై ప్ర
జలనెల్ల। నుచితకరుణను బాలింపు చుండెననిన। మానిపుంగవుల నిట్లు
మర్కటములు। పోయి గుహాయందు జూచినపురుషు డెవడు। తెలుపు
మాతు డిట్లని పలికె నపుడు॥ శా॥ వైకుంఠం బెడబాసి శేష గిరిపై

వర్తించు నారాయణుం । డాకాలంబున నాగుహాంతరమునఁ దా వానర
శ్రేణికిఁ । జోకంజూప నిజస్వరూపము కపుంగోచ్ఛేద్యంబుగా జూచిభూ ।
లోకంబాదు వచింపగా నెఱిగి రీలోకంబు లోమర్త్యులుఁ ॥ వ॥ ఇవ్విధ
మున గిరి గహ్వరంబునందుండి హరి హరి సమూహమునకు వైకుంఠం
బు చూపినందున నాగుహా వైకుంఠ గుహాయన బ్రసిద్ధంబయ్యె నందుని
త్య ముక్తులు సేవింప శ్రీభూనీళాసమేతుండై చక్రధరుండు గాపున ద
ద్వైకుంఠాద్రి జగత్ప్రఖ్యాతంబై యుండునట్టి వైకుంఠ గుహాప్రభావం
బును వినిన వారికి గలిదోషంబంటక పుత్రపౌత్రాభి వృద్ధిగలగిమహదైశ్వ
ర్య సంపన్నులయి మోక్షప్రాప్తు లగుదురనినవిని శౌనకాదులు సూతుని
జూచి యిట్లనిరి॥ క॥ పంకజలోచన దనుజభ । యంకర సుగుణాభిరామ
యవ్యయధామా । శంకరమిత్ర శుభాకర । వేంకటగిరి రమణమానివిను
త వితరణా॥ మాలిని॥ కలశజలధి బాలాక్రాంత శృంగారలీలా । సలలిత
గుణజాలా సామసద్గాన లోలా । ఖలదనుజవిశాలా కాలకర్మాదిమూలా
విలసిత గుణశీలా వేంకటాఖ్యాద్రి పాలా॥

గద్య॥ ఇది శ్రీతరిగొండలక్ష్మీనృసింహ కరుణాకటాక్ష కలితకవి
తావిలాస వసిష్ఠ గోత్రమిత్రకృష్ణ యామాత్య తనూభవ వేంకమాంబా
ప్రణీతంబైన శ్రీవేంకటాచల మహాత్మ్యంబను వరాహ పురాణంబునందు
వేంకట గిరిపుర వర్ణంబును నైమి శారణ్య వర్ణంబును శౌనకాది మహా
మునుల ప్రశ్నయుబ్రహ్మానదీ ప్రళయప్రకారంబును హరి శ్వేతవరాహంబై
హిరణ్యాక్షునిసంహరించి రసాతలగతమైనభూమిని యథాస్థానంబునందుం
చుటయు వరాహస్వామి యనుమతంబున శ్రీభూమి నీళలతోడ వైకుంఠ
మందున్న క్రీడాచలంబును గరుడుండు కొనివచ్చి భూలోకమందు నిల్పుట
యు వరాహస్వామి తత్పర్వతారోహణంబు చేసి యుండుండుటయు బ్ర
హ్మేంద్రాదులు వచ్చి యాస్వామికి మ్రొక్కి వినుతించుటయు వరాహ
స్వామి శేషాద్రియందు విహరించుటయు బుష్కరిణీ మహాత్మ్యంబును
వేంకటాద్రికి నొక్కొక్క నిమిత్తంబు నొక్కొక్కనామంబు గలుగుటయు
వరాహస్వామి క్రీడానగరంబునకు నుత్తరదిగ్భాగంబున విహరించుచుం
డిశ్రీసతియుం దానును విటవేష ధరుడయి మునులయజ్ఞ శాలయందు
ప్రవేశించి వపాగ్రహణంబుచేయుటయు దేశాంతరగతుండయిన వృద్ధబ్రా
హ్మణుని హరి కుమారధారయందు స్నానంబు చేయించి బాలకుమా
రునిగా జేసిపంపుటయు శంఖణ మహారాజునకు శ్రీనివాసుండు పుష్కరి
ణియందు బ్రత్యక్షంబయి రక్షించుటయు నాత్మారాముడను బ్రాహ్మణు
నకు హరి బ్రసన్నుండై భాగ్యంబు నిచ్చుటయు గపిలలింగ కపిల తీర్థాది

సప్తదశతీర్థ ప్రభావంబులును తీర్థయాత్ర వోవు విప్రునకు స్వప్నమందు హరి ప్రసన్నుండై పుష్కరాద్రి యందు గలతీర్థంబుల జూపుటయు ధర్మరాజాదు లొక్క సంవత్సరము వేంకటాద్రియం దొక్కపుణ్య తీర్థంబునాశ్రయించి యుండుటయు యుగ భేదములచేత వేంకటాద్రి ప్రకాశించు చిహ్నములును రావణసంహారణార్థంబుగా నరుగు నప్పుడు రామచంద్రుం డొక్క దినము వేంకటాద్రి యందువసియించి యుండుటయు వైకుంఠ గుహాయందు గపులకు బరమ పురుషుండు ప్రత్యక్షం బగుటయు ననుకథలంగల ప్రథమాశ్వాసము.

సంపూర్ణము.

శ్రీ రస్తు.

# శ్రీవేంకటాచలమాహాత్మ్యము-ద్వితీయాశ్వాసము.

క॥ వ్యాసమునీశ్వరహృదయని। వాసచిదు ల్లాసదుగ్ధ వారిధిశయనా। నాస వవందిత పద యుగ। భాసుర తరిగొండనృహరి భవదురితారీ॥ గీ॥ విశ్వచర్యలె ల్లవిశదంబుగానీవు। తెలిసి నావు మాకు దెలుపగలవు। గానవిష్ణు కథలు క్రమమొప్పగామాకు। దెలుపు సూతవిమలధీసమేత॥ క॥ మాయావియగుచువిష్ణుం। డాయాస్థలములవసించి యట భక్తులకున్। నాయకిము గగని పించుచు। నాయెడ గనిపింపకుండు నంటివిసూతా॥ సీ॥ అంజనాద్రిసమాను డయినశ్రీస్వామి నందెవ్వరు నిల్పినా రిరవుచేసి। యెవ్వరు ప్రార్థింప నీశ్వరుడచ్చోట నిలుకడగానిల్చె నిత్యుడగుచు। నా రీతి దెల్పునివని మునులడుగగా నాసూతుడనియె నావ్యాసమౌని। చెప్పినకథమీరు జెప్పెద నెట్లన్న సనకాదియోగుల శాపమంటి। జయుదువిజయుండు దితియందు జననమొంది। కనకలోచనుడును హేమకశిపుడనగ। ధరణిపై బుట్టి సాధుబాధల నొనర్ప। సరగగిటియై హిరణ్యాలోచనుని ద్రుంచె॥ గీ॥ అపుడు భర్మకశిపు డాగ్రహోదగ్రుడై। సాధుభక్తతతికి బాధజేసె। నందునెన్నృసింహు డైచ క్రియాదైత్యు। కడుపుజించిచం పెగ్రౌర్య మెసగ ॥సీ॥ పరమ భక్తుండై నప్రహ్లాదురక్షించె నటులేగిక నకాక్షు డాహిరణ్య। కశిపుడునటుకొంత కాలంబునకు గుంభకర్ణరావణులనగాజనించి। రామచంద్రునిచేత భూమిపై బడుదాక బాధించుచుండిరి సాధువులను। గావునశ క్రాది దేవత ల్మౌనులునారావణుని దుర్గుణాళిహ

రికి। మనవి చేసెదమనిపోయి ఘనసుధాబ్ధి। తీరమును జేరిపలికిరో దేవ దేవ। రావణుని బాధతప్పించి నీవుమమ్ము। బాలనముసేయ వలయునో పరమపురుష॥ వ॥ అని యివ్విధంబున క్షీరాబ్ధి కుత్తరభాగంబున నిలిచి దేవేంద్రాదిదేవతలును మహామునులును ననేకప్రకారంబుల వేదాంతగుంభితోక్తులవినుతించిమఱియునిట్లనిరి॥ ఉ॥ దేవసుధాబ్ధివాసబహుదీనదయాపరచిత్త గింపవే! రావణనామధేయుడొక రాక్షసుడద్భుతపాపకర్ముడై। భూవలయంబునందుగృతపుణ్యుల నేచుచునుండువానిసే। వేవధియింపగా వలయు వేఱొకడెక్కడ లేదు మాధవా॥ క॥ అనియిటువలె బహువిధముల। వినుతించిన బలుకకున్న విష్ణోసహాయం। చనుధ్వని సేయుచు బిలువగ। ననఘుండగు విష్ణు భూతయంబరవీధిన్॥ గీ॥ వచ్చియిట్లులనియె వనజాక్షు డిందులే। డవనిమీద బర్వతాగ్రమందు। మెలగుచుండుచునటకు మీరేగు డిచ్చోట। గలకలంబు సేయవలదు పొండు॥ క॥ అనివాడు పలికిపోయిన। విని మానులు సురలు దేవవిభు డాశ్చర్యం। బునుబొందుచు నందుండక। చనిచని శోధించిరిలను శైలములెల్లన్॥ వ॥ ఇట్లుశోధించిగిరులయందు హరిని గానక వైకుంఠమునందుండు ననిన్శ్చయించి యావైకుంఠమార్గంబు పట్టిపోవుచున్న సమయంబున॥ సీ॥ శరదభ్రశుభ్ర భాస్వర శరీరమునందు శ్వేతప్రకాశ విభూతి మెఱయ। ధవళ సంపూర్ణ చంద్రకళంక మనదగునైల్య వత్కృష్ణాజినంబు వెలుగ సురుచిరారుణ జటాజూటంబు శిరమునదనరబింబంబు చందమునదోప! ననిశంబు నారాయణాష్టాక్షరిని దగబలికింపదగు వీణెపట్టి భుజము। మీదహత్తించి శ్రీహరి మెచ్చునట్టి। వీణెమీటుచుగాన ధురీణుడైన। నారదుడు రాగచూచియానంద మొంది। యింద్రుడ మరసమేతుడై యిట్టులనియె॥ క॥ ఓనారద త్రిభువనముల। మానక చరియింతునీవు మార్గంబులునీ। ధ్యానమునకు గనిపించును। గాన మహాత్ముడవు నీవు ఘనముని చంద్రా॥ సీ॥ శ్రీశైలభూములజేరి రావణుడతి సాధుజనులజూచి బాధపఱచు। గావునవాని నేగతినైన శ్రీర మావరుడె నిర్జింప గావలయు గనుక। విష్ణుదేవుని మేము వెదకుచు క్షీరాబ్ధిజేరి యెంత వినుతించినను మాకు। ప్రత్యక్షమే గాక పలుకులు పలుకక నావిష్ణుడుండగా నంతలోన। జదల దాసిల్చి యొకశంఖ చక్రధరుడు। హరియిచట లేడు భూలోకమందు విపుల। భూధరము మీద నున్నాడు పొండటంచు। జెప్పిపోయెను వాడెందు జేరినాడో॥ క॥ అచ్చట నావార్తలు విని। వచ్చితి మందఱుము మేము వనదుర్గములన్। హెచ్చుగ వెదకితి మాహరి। యెచ్చటబొడ చూపకున్న నీమార్గమునన్॥ క॥ చనుదెంచితి మాదేవుం। డనుపమవైకుంఠపురమునందుండునుగా! వున

రావణ వృత్తాంతము। వినుపించెదమచటహరికి విబుధమునీంద్రా॥ చ॥ అన
విని నారదుండని యెనయ్య వికుంఠమునందు విష్ణుదేవునిగనగాను సేనుబహుళ్లో
త్కలికన్ జననొక్కపార్షదుండని యె వికుంఠమున్ విడిచి యాహరి భూతల
మందులక్ష్మితో నొసరగనొక్క దుర్గమున నుండునుబొమ్మ నెనద్భుతంబుగన్॥
క॥ కావుననచటికి మీరికి బోవలసిన దేమిచక్రిపుత్రునికడకే। పోవుదమా జలజో
ద్భవునికి వివరంబడిగి వృత్తమిందరమనుచున్॥ గీ॥ దేవమౌనిపలుకు దేవేంద్రసుర

ఇంద్రాదులు సత్యలోకమునకు బోవుట.

మునిముఖులు సత్యలోకమునకు బోయి ఘనచతుర్ముఖములు కరచతుష్టయ
మును గలిగి యొప్పుచున్న కమలభవుని॥ సీ॥ కాంచిరచ్చట దప్తకనకాభదే
హుండు లోకవందితుడష్ట లోచనుండు మహాసియదండకమండలుహస్తుండు
బాలభానుప్రభాభాసితుండు నతిశయదివ్యపద్మాసనాసీనుండు పరవశుసజ్జ
నపరివృతుండు నిర్మలసత్కర్మనిష్ఠాగరిష్ఠుండు పరమామృతధ్యాన పరవశుం
డు నగుచునామ్నాయధర్మశాస్త్రాదులాగను। వింతవింతగ మూర్తిభవించి
మెలగ। జేరిసావిత్రిగాయత్రిభారతియును। గొలువగా గొల్వునందున్న
జలజభవుడు॥ ఆ॥ దేవతలను మునులభావించి చూడగా। నంత వారునజు
ని చెంతజేరి। మ్రొక్కి హస్తములను ముకుళించినిలువగా। వారిజూచిప
లికె వనజభవుడు॥ క॥ ఎక్కడవచ్చితిరందఱు। నిక్కడకూర్చుండు డను
చు నెంతో కరుణన్। జక్కగదము మన్నింపగ। నక్కడగూర్చుండ వార్ల
కజుడిట్లనియెన్॥ గీ॥ అందఱికిమీకు కుశలమే యనుచునజుడు। పలుక
వారిట్లనిరి మీలలితకరుణ। వలనమాకెల్ల కుశలమిానఱకు ధరను।
జాలబుట్టిన దిపుడొక్క సంకటంబు॥ వ॥ అదియెట్లన్నను రావణప్రేరితులై
రాక్షసులు శ్రీశైలప్రాంత భూములందు జేరి జనులను మమ్మునసేక ప్రకా
రంబుల బాధించుచుందురు రెట్లనిన॥ క॥ మనుజులగబళింపుచు వా। రని
శము బహుపాపకర్ములై గర్వముతో। డను మదమెంత యుమేఱగ। ము
నులను బాధింతురిపుడు మూఢాత్ములై॥ వ॥ ఇవ్విధంబున రాక్షసులబు
రికొల్పి సాధు బాధగావించుచున్న రావణుండు నశింపక లోకంబులకు శు
భంబుగలుగ దనిమఱియు నిట్లనిరి॥ క॥ పాపాత్మకుడగు వానికి। శాపము
పెట్టకను మేము శాంతాత్ములమై। యాపత్కి కంతుద్రుంపను। శ్రీపతి
యేగాక యెవరిచే గాదనుచున్॥ సీ॥ వరసుధాంబుధియందు వైకుంఠపు
రమందు త్రిభువనంబుల మేముతిరిగి వెదకి। వచ్చితిమందెందు వాసుదేవు
డు లేడు కావున మేము మీకడకువచ్చి। శరణుబొందితిమి శ్రీహరివసింపు
చునుండుచోటు మీరే మాకు జూపవలయు। సర్వజ్ఞులగుమీరు చక్రివి
హారంబు లెఱిగియుండుదురు మాకెఱుగరావు। చెలగితపముల విష్ణు

ముల్చేసిమీకు । నమితరోషము బుట్టించునట్టి దనుజు । నడపదగు శక్తి
యుక్తు లాహరికిగలుగు । నందుచేనింత వెదకెద మసురహరుని॥ క॥ అని
వారందఱు పలుకగ । వనజజుఁడిట్లనియె నిపుడువాఁడెవ్వరిచే । తనుజావఁడు
కాలమువ । చ్చినయపుడొక నరుఁడువాని శిరములద్రుంచున్॥ క॥ దేవత
లాదిగ నెవ్వరి । చేనవధ్యుఁడు గాక యెపుడు జీవించుటకై । రావణుఁ డుగ్రత
తపంబును । గావించెను వానిగెల్వఁగా దెవ్వరికిన్॥ సీ॥ దానికుపాయంబు
నేనుజెప్పెదమీకు శ్రీవేంకటాద్రిపై జేరియున్న । హరిని శరణుబొందుడ
తఁడు మీయార్తిని వారింపదలచి రావణునికొఱకు । మనుజరూపంబు నై
ననుదాల్చి వానిఖండించి మిమ్మెల్ల రక్షించుమీరు । చింతింపవలవదా
శ్రీవేంకటాద్రికి మీవెంటనేవత్తు మీరునేను । శ్రీనగంబున కేగి దక్షిణము
గాను । బోయి పద్మాక్షునప్పుణ్య భూధరంబు। నందు వెదకి మహాత్ముఁడౌ
నట్టిహరికి । మ్రొక్కరాదగుపని మహా ముఖ్యమిపుడు॥ తే॥ శ్రీవనితతోడ
గూడి మాయావియగుచు । ఖగమృగాదులయందుండి గహన ములను ।
జాలవేడుకతోఁగ్రీడ సల్పుచుండు । నింగుచేనెందు బొడచూప డీశ్వరుం
డు॥ వ॥ అయిననింక నొక్క విశేషంబు గలదది యెట్లన్నను దశరథుండుపు
త్రార్థియై స్వామి పుష్కరిణి తటంబునందు దపంబుసేయుచుండు నప్పుడా
దశరథునకు హరిప్రత్యక్షంబగునందాక నప్పర్వతంబునందు నిరీక్షించు
చుండు దచ్చట రాజునకు ప్రసన్నుండైన హరికిమ్రొక్కి ప్రార్థింపుదమ
ని దేవతలకీ రహస్యంబుచెప్పి బ్రహ్మ వేంకటాద్రికి నుత్తరభాగంబుననుం
డి హరిని వెదకుచు గిరిప్రదక్షిణంబుచేసి తదనంతరంబున॥ సీ॥ సంతాన
మందారచంపకవకుళ విఖ్యాపితద్రుమవృత మైనదాని । దిక్కులనుస్వా
దుపిక్కటిల్లగ జేయు ఫలపుష్పవితతిచే బ్రబలుదాని । శుకపికప్రముఖ
పక్షులు వినోదములుగా నుప్పొంగిపలుకగా నొప్పుదాని । ఘనగండభే
రుండ కంఠీరవాది మహామృగధ్వనుల మిన్నందుదాని । గరుడగంధర్వయ
క్షకిన్నర గణంబు । లమరమెలగెడి సానుదేశములదాని । నదులుకమలా
కరములు నానాముఖముల । నతిశయింపగ విస్తీర్ణమైన గిరిని॥ చ॥ కను

**బ్రహ్మేంద్రాదులు వేంకటాద్రికివచ్చుట.**

గొని బ్రహ్మముఖ్యులతికౌతుక మొప్పగ నా గిరీంద్రమం । దొనరగ జేరి
యందఱు మహోత్తమతీర్థములందు గ్రుంకుచున్ । వనఫలపుష్పముల్గొ
నుచు వారిజనాభుని బూజసేయుచున్ । సునిశితభక్తి నచ్యుతుని జూచు
టకచ్చట నిల్చిరందఱున్॥ వ॥ ఇట్లునిల్చి స్వామిపుష్కరిణి ప్రముఖ పుణ్య

**దశరథుండు వేంకటాద్రికివచ్చుట.**

తీర్థంబుల నాశ్రయించి తపంబులుసేయుచుండి రంత॥ సీ॥ దశరథు డటు

మీఁద దనకుఁబుత్రులు లేక పరితాపమున నిజగురుని జేరి । మ్రొక్కి యిట్లని
యెనో మునినాథ మీవంటి గురువులుండగ నాకుఁ గొడుకు లేల । కలుగరు
నేనేమి కర్మంబుచేసితి ననిన వశిష్ఠు డిట్లనియె రాజ। ఘనపుణ్యుఁడవె కాని క
లుష కర్మ మొకింత గలదు నందునసుతు లలుగరైరి । కాన గర్మంబు నడప
వేంకట నగమున । కరిగి పుష్కరిణీస్నాన మనుదినంబు । సేయుచు నుదత్త
టమున వసించి తపము। నీవుసల్పుము పాపంబుపోవునవల॥ క॥ ఘనవంశో
ద్ధారకులగు । తనయులు పుట్టెదరు నీకు దాపత్రయమే । లను వేంకట గిరి
కివ్వఁడె । మనమలరఁగ బైనమగుట మంచిది భూపా॥ మ॥ అనఘా వేంకట
నామధేయగిరియందంబోధిజాయుక్తుఁడై । వనజాక్షుండు మహావినోదములు
గావర్తించుచున్నాఁడు గా। వున నీపాపమడంచి నీకు వరపుత్రోత్పత్తి గావించు
నిం।కనుమానింపకుమన్న రాజు పరమాహ్లాదంబు తోనిట్లనెన్॥ క॥ ఆ వేంకటగి
రి యెక్కడ। బావనమైయుండునటకు బయనపు లగ్నం। బీవేళ నేర్పఱింపుము ।
పోవలెనచ్చటికి మౌనిపుంగవ యనినన్॥ సీ॥ అపుడు వశిష్ఠుఁడిట్లనియె గంగానది
కటు దక్షిణంబుగా నాసువర్ణ। ముఖరికి నుత్తరంబుగ నొక్క క్రోశ దూరముగ
గంగకు దక్షిణముగ ద్విశత। యోజన దూరమందుండు వేంకటగిరియందు గం
గానదికతిశయంబు।లగు పుణ్యతీర్థంబు లమితమై ప్రవహించు నన్నిటికతిశయ
మగుచు స్వామి । పుష్కరిణి యొప్పునది దివ్యపుష్పలతలు । మధురఫల
వృక్షములు మహా మహిమనమరి । సర్వకాలంబు లందువసంతఋతువు।
లీలగాఁగాచి పూచి ఫలించునచట॥ సీ॥ మేరుసమానమై తేరు శృంగారించి
నటువలె శ్రీవెంకటాద్రియొప్పు । రమణీయమగు చైత్రరథము చందంబు
గా గన్నులపండువై గానుపించు ! గిన్నర గంధర్వగీర్వాణభామినీ గాన
నృత్తములందు గలిగియుండు । ఘనకులాచలముల గాంచి నవ్వుచు హేమ
శిఖరాశిచే బ్రకాశించుచుండు। బ్రాకృతులు చూడ బాషాణపర్వతంబు। కర
ణిగన్పించు నాశైలగౌరవంబు। శేషుడయినను వర్ణించి చెప్పగలడె। శక్యమే
నాకు దశరథచక్రవర్తి॥ గీ॥ వెంకటాద్రికి బయనమీవేళ జేయ। వలయునిది
శుభలగ్నమో వసుమతీశ । యనిన విని పఙ్క్తిరథుడు పుత్రార్థియగుచు ।
నాగురునితోడ శ్రీగంగ కరిగియుచట॥ వ॥ దశరథుండు వంశాభివృద్ధిసంక
ల్పపూర్వకంబుగా గంగాస్నానంబుచేసి జపతపంబులును షోడశమహా
దానంబులును జేసి యందు గ్రుంకుచువచ్చి వచ్చి యుత్తుంగశృంగసమేతంబై
ఫలపుష్పభరితంబై చైత్రరథసదృశంబై యొప్పుచున్న వేంకటాచలంబు
నారోహించి తద్గిరిగహ్వర సానుదేశ ప్రముఖ సిద్ధస్థలంబుల నీక్షించుచు
వచ్చి తదనంతరంబును॥ సీ॥ పద్మనీలోత్పల ప్రముఖాంబుజశ్రేణు లందు
ఝుంకారంబుల ఝులు సేయ । వనజనాళంబుల ఘనమరాళంబులు తుండంబు

లందంటి నూలియాడ । మత్స్య కచ్ఛపముఖ్య మహానీయ జలచరబృందంబు లీదుచు సందడింపఁ । దఱఁగలు సుడులు భాస్వరములై కనుపింపఁ బూర్ణమౌ శ్రీస్వామి పుష్కరిణిని । జూచిదశరథుఁ డప్పుడు చోద్యమంది మ్రొక్కి తత్తీరములనుండు ముని వరులను । గాంచిసద్భక్తిశోఁగరకమలములను లలితుఁడై మోడ్చి యచ్చోటనిలిచి యుండెౕవ॥ ఇట్లునిలిచి దశరథుండు చూడ నప్పుష్కరిణీ తీరంబునం దనేక దివ్య ఫలపుష్ప వృక్షభరితంబులైన శృంగారవనంబుల యందనేకజటాధరులును సిద్ధాసనసింహాసన భద్రాసన గోముఖాసనస్వస్తికాసన ప్రముఖాసనాసీనులై రేచకపూరక కుంభకయుక్త ప్రాణాయామంబులు సేయువారును ఆధారస్వాధిష్ఠాన మణిపూరకానాహత విశుద్ధాజ్ఞాచక్రంబులయందున్న పంచాశద్వర్ణంబుల నవలోకించుచు తత్తదధిష్ఠాన దేవతల నజపావిధానంబుగా నర్చించుచు నాడీశోధనంబుచేసి క్రమక్రమంబుగా షడాధారంబులు భేదించిసుషుమ్నా నాడీమార్గంబున నూర్ధ్వముఖంబుగాగ మనించి సహస్రారకమలాంతర్గతసుధాబిందు పానానుభవంబునఁబరవశులై సొక్కుచుండువారును హృదయకమల కర్ణికామధ్యంబున నంగుష్ఠమాత్రుండై ప్రకాశించుచున్న పరమపురుషుని ధ్యానించితదనుబంధంబున నానందించువారునుసాంఖ్యతారకామనస్క యోగాభ్యాస పరవశులై యంతరలక్ష్య మధ్యలక్ష్యావలోకనంబులు సేయువారును శ్రోత్రనేత్ర నాసాపుట నిరోధంబుచేసి యాత్మప్రత్యయప్రకారంబునీక్షించుచు దశవిధనాదంబు లాలకించువారును అంతర్లక్ష్యంబునుండి యఱగంటి చూపున స్వరూపధ్యానంబుసేయువారును గనులు మూసిశిరంబువంచి యూర్ధ్వదృష్టింగళా మాత్రంబునిల్పువారును ఇదమిద్ధమనుట మఱచియెఱుకమాత్రంబై శేషించి కేవలాత్మానుభావం సేయువారును స్థూలజిహ్వాగ్రంబునుదమపరి సూక్ష్మజిహ్వాగ్రంబు దాకునట్లుగాజొనుపుచు దదేకనిష్ఠచే లంబికాయోగాభ్యాసంబు చేయువారును యివ్విధంబున ధ్యానషణ్ముఖి శాంభవీరాధాయంత్రఖేచరీముద్రాభ్యాసపరులై యోగానుష్ఠానపరులైనవారును నేకపాదస్థులై సవితృమండలమధ్యవర్తియైన నారాయణవిగ్రహంబును నవలోకించువారును బంచాగ్నిమధ్యంబునందు గూర్చుండి మహాఘోరతపంబు సేయువారును నృసింహానుష్టుభంబును రామతారకంబును గోపాలమంత్రంబును వరాహమంత్రంబును వాసుదేవ ద్వాదశాక్షరంబును నారాయణాష్టాక్షరంబును శుద్ధప్రణవమంత్రబును నిత్యాదిస ప్తకోటి మహామంత్రంబులంగన్యాస కరన్యాస ధ్యాన పూర్వకంబుగా నేకాగ్రచిత్తంబున జపంబులు సేయువారును శ్రీమన్నారాయణవిగ్రహంబును బాటించుచుషోడశోపచారపూజలు సమర్పిం

చుచునారాయణమంత్రపారాయణులైసదాగును వ్యాఘ్రకృష్ణాజిన వల్క-
లాంబరులై వాతాంబుపర్ణ కందమూలఫలాహారులునై యిట్లనేకవిధంబుల
గర్మజ్ఞానభక్తివైరాగ్య జపతపహోమాదిసకల సత్కర్మనిష్ఠులైయున్న
మహా మునిజనుల మధ్యంబు నందు॥ సీ॥ అలఘుచతుర్బాహువులు చ
తుర్ముఖములు నెనిమిది కన్నులు ననలసదృశ । తనువు దీపింపగా ధ్యాన
యోగసునిష్ఠనూని పద్మాసనాసీడగుచు । ననుపమ నారాయణాష్టాక్ష
రీజపకలితుడై నాశికాగ్రమునదృష్టి । హత్తించిస్ఫటిక సదక్షమాలికచేత
బట్టిచిత్తము బిగబట్టి చక్ర । పాణిపదముల యందుంచిపరమభక్తి। చేభర
న్యాసయోగ సంసిద్ధుడగుచు। వనజసంభవుడుండగాగనివసిష్ఠ।సంయమీం
ద్రుడు చాల నాశ్చర్యమొందె॥ ఉ॥ ఆమునులందఱచ్చట మహాద్భుతనిష్ఠల
నుండురీతులన్ ।దామరసోద్భవుండుపరతత్త్వవివేకవిచారశీలుడై।యామధు
సూదనున్ హృదయమందుగనుంగొనునిశ్చలత్వమున్ ।భూమిపుడాత్మనద్భు
తముబొందుచుజూడవసిష్ఠుడిట్లనెన్॥ తే॥దశరథేశ్వర యీమహాతాపసులను
గూడిపద్మజుండిచట నెక్కు-నతపంబు। సేయుచున్నాడుగావున శ్రీశుడింక।నమ
రవిరికి ప్రత్యక్షమగుట నిజము॥ తే॥ ధన్యుడగు సర్వలోకపితామహుండు ।
భక్తిమెఱయ నివాతదీపంబువలెను । దానుజలింపకున్నాడుగాన న
జుని । మెచ్చిప్రత్యక్షమగును లక్ష్మివిభుండు॥ ఉ॥ కావునదివ్య పుష్కరిణి
కామఫల ప్రదయించు నమ్మియో । భూవర నీవతిత్వరగ బుష్కరిణీజల
మందు గ్రుంకి స । త్పావనభక్తినిష్ఠను జపంబొనరింపు మటన్ననవ్విధా ।
త్రీవిభుడిట్లనెన్ బరమదేశికతజ్జప మీవుసెప్పవే॥ సీ॥ అనినశ్రీవేంకటేశా
ష్టాక్షరీమంత్ర మావశిష్ఠుండు పుత్రార్థియైన । దశరథేశ్వరునకుదయను
పదేశంబు సేయగానృపతి వసిష్ఠమునిని। బూజించికూర్చుండి పుత్రార్థియై
మహానిష్ఠుఁడై జపమందుఁజేయుచుండె। నపుడుశుచిభూతుడై వసిష్ఠుడు
తపమొక దిక్కుగా వించుచుండెనంత । మిన్ను ఘూర్ణిల్లగా నవమేఘ
బృంద । ముఱిమినట్లుమహాధ్వని యొకటివొడమె। నాధ్వనికిధ్యానపరవశు
లైనబ్రహ్మ । దేవముఖ్యులుకన్నులం దెఱచి రపుడు॥ తే॥ దశరథుండు
లేచి వెఱగంది ధాతృముఖ్యు । లైనసురలకు మునులకు నలరి మ్రొక్కె ।
నపుడు వంశాభివృద్ధి నీకగునటంచు । నందఱారాజు దీవించిరద్భుతముగ॥
క॥ ఆకాశంబునఁబొడమిన । భీకరరభసంబు చెవుల భేదించినది। దీకాలమ
భ్రఘోషం । బీకరణిని బుట్టదగిన హేతువదేమో॥ క॥ అనియందఱు
గగనదిశఁ । గనుగొనుచుండగ నేక కమలాప్తులు గూ । డినయట్టులనతి
తేజము । గనిపించెను దానిఁజూడ ఘనతర మగుచున్॥ క॥ జ్వాలనగ్రహ
నక్షత్రము । లలఘుత టిల్లతలనేకు లగుఁజంద్రములుం గో । గలిసినగతిఁ బటిత

ద్యుతి । విలసితముగ నభమునిండె విస్మయకరమై॥ క॥ ఎక్కడఁజూచిన కాంతులు । క్రిక్కిఱిసినఁ జూడ లేక గీర్వాణముఖుల్ । తక్కక కన్నులు మూసిరి । యక్కడనే చూచుచుండెనజుడతిభక్తిన్॥ సీ॥ అప్పుడు కోటిసహస్రమార్తాండ ప్రభానిభంబైనవి మానమందు । బెనగననేకగోపురములనేకంబులైనప్రాకారములుహర్మ్యములును । లలితంబులైననీలస్తంభములుబహుపటువజ్రపద్వార బంధములును। భర్మక వాటముల్భాసురవిద్రుమమంటపంబులు దీర్ఘమందిరములు । కాంచనోన్నత గోపురకలశములును। భూరిమరకతముల నొప్పుతోరణములు । ఘనతరధ్వజములు పతాకలును మెఱయ । బంచవర్ణద్యుతుల నొప్పుపట్టణమున॥ తే॥ పుష్పమౌక్తికహారముభూరికలశ । జాలముల నాటి గాలికిఁ దూలియాడఁ । గలికిచిల్కలుశిఖికలకంఠములును । గులికిపలుకుచు నాదందుఁగునిసి మెలఁగ॥ వ॥ ఇవ్విధంబున నొప్పుచున్నపట్టణమధ్యంబున సభామంటపంబును దన్మధ్యంబున

### వేంకటేశ్వరుఁడు బ్రహ్మాదులకుఁ బ్రత్యక్షమగుట.

సహస్రమణిస్తంభయుక్తంబైన క్రీడామంటపంబు ప్రకాశించిఁదన్మంటపచతుర్ద్వారంబులయందు ద్వారపాలకులు నిలిచియుందు రప్పురంబునందు రంగదుత్తుంగ మాతంగ తురంగ సంఘంబులు మెఱుంగు రాజవీధులునున వహావనాలంకృత సుందరీ జనసమూహంబులును మెలంగుచుండుదురీ ప్రకారంబుననేకచిత్రవిచిత్రకలితంబైనదివ్యవిమానంబువీక్షించియగస్త్యవసిష్ఠప్రముఖులయినమహాఋషులనీక్షించిబ్రహ్మయిట్లనియె॥ చ॥ మునివరులారమజ్జనకుముఖ్యవిమానలసత్ప్రకాశమా। దినకరచంద్రపావకులదీధితులఁ హసియించుచున్ మహా । ఘనతరమైననభోదిశనుగన్పడుచున్న దిచూతమంచున । య్యనిమిష తాపసోత్తముల నందఱఁబిల్చిప్రమోద చిత్తుఁడై॥ సీ॥ అంబరమార్గమందిరిగి విమానపూర్వ ద్వారమున జొచ్చివనజభవుఁడు। పోవుచుండగ జూచి పురహూత ముఖసురసంయముల్దశరథ చక్రవర్తి । యజుడు పోయిన మార్గమందావి మానంబునందు బ్రవేశించి యచట విష్ణు । నంతరాంతరములం దరుగుగా వెదుకుచు భయభక్తులెసగ నా బ్రహ్మమునులు । వాసుదేవుని వీక్షించు వాంఛమించ । మనములుప్పొంగనాస్థాన మంటపముల । లోఁబ్రవేశించి రప్పుడా లోక కర్త । యైననారాయణుండు దయాళు డగుచ॥ వ॥ క్రీడామంటప మధ్యంబున నవరత్నస్థగితంబైన పద్మపీఠంబునందుఁ బ్రాకృత ప్రకాశుండై॥ సీ॥ మకుటకౌస్తుభరత్న మకరకుండలములు ఘన మేకలాంగద కంకణములు । వరనవమాలికావైజయంతులదీప్తి నమరుగ్రైవేయక హారములును । గనకాంబరము నీల కాంతులనీను దేహమునందు వెలుఁగఁగా నభయదాన । కలి

తదక్షిణకరకమలంబు పానన చరణంబులర్చింపఁ దెరువు చూప। వామహ
స్తాంబుజము కటిసీమ నొప్పఁ। దక్కినటువంటి రెండు హస్తములశంఖ।
చక్రయుగళి ప్రకాశింపశాంతి మెసఁగ। సర్వతోముఖుఁడై దయాస్వాంతుఁడ
గుచు॥ క॥ హరిముద మొందుచు నుండిన। తఱినాహరి వక్షమందుదగు
భూషణమై। సిరి వెలుగగనిరుగడలను। ధరణియునీళయు వసించితద్ధయు
మెఱయన్॥ సీ॥ నీలమేఘము నందు నిలిచిన క్రొక్కారు మెఱుపుకైవిని
సిరియురమునందు। కుడిభాగమున నీళ యెడమభాగంబున భూదేవిబహురత్న
భూషణములు। బంగరంచులకుసుంభావస్త్రములు దాల్చి కుటిలాలకంబులుని
టలములను। లీలగాజాలమిళింద పఙ్క్తులనలె జలియింపగస్తూరితిలకములు
ను। గనులగాటుకగంధలేపనములమర। వరకీటంబులను విరిసరులుగదల।
జంద్రబింబనిభాస్యలాచక్రధరుని। గొలచి మెలగుచు సంతోషకలితులయిరి॥
వ॥ ఇవ్విధంబుననతికోమలతులసీదళచ్ఛాయదేహకాంతినొప్పుచు దక్షిణహ
స్తంబుననీలోత్పలంబుపూనియున్న భూదేవియు విద్యుల్లతాసమానయై ప్ర
కాశించికరంబుల శుభ్రకమలంబుల బట్టియున్న శ్రీదేవియు గమలకర్ణికా
సన్నిభయై దీపించి వామకరంబున శోణాంబుజంబుధరించియుంచి యున్న నీ
ళాదేవియు హరి నొఱసి మెఱయుచుండగా దత్సమీపంబున ఛత్రచామ
రంబులుపట్టి సుందరీమణులు కొలచియున్న సమయంబున శ్రీనివాసుండు
గరుణాకటాక్ష వీక్షణుండై బ్రహ్మేంద్రాదులకు బ్రత్యక్షంబయ్యె నప్పు
డు కమల గర్భాగస్త్య వసిష్ఠాదిమహామునులును సనకసనందనాది మ
హాయోగులునునింద్రాది దేవతలును శ్రీమన్నారాయణునకు సాష్టాంగ
దండ ప్రణామంబులు జయజయశబ్దంబులునుజేసి పులకాంకిత శరీరులు
ను గద్గదకంఠులును సంతోషబాష్ప ధారాపూరితాక్షులునై కరంబు
లుముకుళించియిట్లనిరి॥ దండకము॥ శ్రీమత్పరాకాశశేషాచలాధీశమం
గాముఖోల్లాస మౌనీంద్రహృద్వ్యాస సంపూర్ణశృంగార సద్భక్తమందా

### శ్రీమన్నారాయణుని బ్రహ్మాదులు ప్రార్థించుట.

రమాధుర్య వాక్యాంత మాయాగుణాతీత సర్వార్థ నిర్ణేత సన్మోక్ష సంధా
త శ్రీభూమి నీళాసమేతాంబుజాతాక్ష పాఠీనకూర్మామితక్రోడ రూపా
నృకంఠీరవా వామనా రామ రామామహాసీరహస్తాయశోదార్భకా బు
ద్ధకల్కిప్రభావోజ్జ్వలాకార కాలానురూపప్రకారాద్భుతానంద లీలావ
తారా నిరాకార వేదాంత సారాబ్ధిగంభీర హేమాద్రిధీరా వికారాకరా
పార సంసారదూరా చిదాకార కారుణ్య పూరాగమాగణ్యపుణ్యానుగు
ణ్యా సదాక్షిణ్య హైరణ్య నేత్రాది దైత్యేశ్వరారణ్య దావానలజ్వాల దే
వేంద్ర ముఖ్యామర శ్రేణిపాలా సుశీలాసువర్ణాభచేలా రమాలోల వి

శ్వాదిమూలా మహాయోగిజాలాత్మ కంజాదరోలంబ బింబాధరాకంబు కంఠా నిరాలంబగోవింద నందాత్మజా గోపిబృందావనాదివ్య బృందావనా వాసకందర్ప సౌందర్య మందస్మితా బోపమానా సనానంద కందా ముకుందా గదాశంఖచక్రాద్యనేకా యుధా ఘోర నక్రాంతకాదీనశుండాల సంరక్షకా ఖండచండ ప్రతాపాల సత్కుండలాలంకృతాజాండ భాండోదరానంత శాంతస్వరూపా ఘనిశ్లేపనిర్వాణ మార్గప్రదీపా రణోద్దామ లోకాభిరామాఘ నశ్యామ సంపూర్ణ కామానుహా శత్రుభీమా జితక్రూర భౌమా మునిస్తోమదేవోత్తమా దేవతా సార్వభౌమాసదామిమ్ము సేవించుమమ్మెల్ల రక్షింపు మీశా తరిగొండధామాన్నృసింహా నమస్తేనమస్తేనమః॥ వ॥ అని యివ్విధంబున వినుతించి మ్రొక్కుచున్న బ్రహ్మాదులం గరుణించిచూచి హరిమేఘ గంభీర భాషణంబుల నిట్లనియె॥

ఆ॥ వనజగర్భ నీవువచ్చిన పనియేమి। దెలుపుమనిన బ్రహదేవుడలరి।మరలవినుతిజేసి మధుసూధనునిజూచి। యిట్లులనియె మోదమినుమడింప॥

సీ॥ దేవదేవపరాత్మ దీనరక్షక విన్నవించెద మనవియాలించివినవె। యావిశ్రవః పుత్రుడైన రావణుడు మహాఘోరతపమునున్నా చరించి। సురయక్షకిన్నర గరుడగంధర్వ ప్రముఖులచే మఱియుని ముఖ్యవరము। లడిగెలేదన నూరకానరంబులు వానికిచ్చితి నందున హెచ్చివాడు। లంకలోనుండి బాహుబలము న హెచ్చి। భటులబురి కొల్పి శ్రీగిరి ప్రాంత దేశ। ములజరించి మహాసాధువులకుహింస। సేయుచున్నాడు వాడునశించిపోడు॥

ఆ॥ వరముల డుగువేళ వాడుమానవు పనిచే। మడియకుండువరమునడుగలేదు। గానవానికంత్యకాలంబువచ్చిన।తెలిసివాని ద్రుంచునరుడటంచు॥

క॥ సరసిజగర్భుడు పల్కన।హరిదరహసితాస్యుడగుచు నప్పుడగస్త్యున్।గరుణనుజూచి మహాముని। వరసివిపు డిచటికేలవచ్చి తిననగన్॥

ఉ॥ అప్పుడగస్త్య మౌనిగమలాక్షుని సన్నుతిజేసియిట్లనెన్। ముప్పిరిగొన్నగర్వమున మూర్ఖదశాస్యుడు మర్త్యకోటులన్। దెప్పునద్రుంచుగానజనదీనదశన్ గనలేకతక్కమం। బిప్పుడు మీకు జెప్పదగు హేతువుగల్గగవచ్చితీశ్వరా॥

ఆ॥ పఙ్క్తికంఠుద్రుంచి ప్రజలను రక్షించి। మమ్ముగావుమనుచు మౌనివరుడు। విన్నవింపగాను వినినవ్విసనకాది। యోగివరులజూచి శ్రీగురుండు॥

ఆ॥ ఆదియోగులగుచు నానంద మునను౦డు। వారుమీరునిటకు వచ్చినట్టి। హేతువేమొ తెల్పుడిపుడన్న సనకాది। యోగులిట్లులనిరి యోమహాత్మా॥

క॥ అంతర్యజ్ఞానాత్ముల। సంతతమును జూచుచున్న సద్విగ్రహామున్। వింతగగర్మాత్ములగను। భ్రాంతిని నచ్చితిమి మేముపర మపదేశా॥

చ॥ అనిసనకాదియోగి వరులాత్మ రహస్యవిచా

రలక్షణా । జెనసిన యోగమార్గరతి హెచ్చిన సూక్తులవిన్నవింపగా । విస
ముదమొందినవ్వుచును విష్ణుడు జిష్ణుని జూచి నీవువ । చ్చినపని యేమిమాకిపుడ
చెప్పుమటన్న సురేంద్రుడిట్లనెన్॥ సీ॥ యజ్ఞేశ యజ్ఞాంగ యజ్ఞభావన యజ్ఞ క
ర్మఫలప్రద నిర్మలాత్మ। మాధవ మాపితామహుడు నగస్త్యుండు మనవిచేసినరీ
తిననిశమవని। యందు రావణుడు దురాత్మకుడై మమ్ము బాధించు శ్రీనగప్రాంత
ములను। మునిమనుష్యాదుల మూర్ఖుడై వేధించు వానిమర్దింప నెవ్వాడు లేడు ।
దేవరయమున వానిమర్దించి సకల। జనులమానుల మమ్ము రక్షణము సేయు । శ
క్తియుక్తులు మీయందు జాలగలవు। గాన మేమెల్ల దుర్గనగరమునందు॥ ఆ॥ మి
మ్ము వెదకి వెదకి మీరందు లేకున్న । విపినగిరులయందు వెదకిమూడు । లోక
ములవికుంఠలోకంబునందును। నెరసి వెదకి వెదకి నేటికిచట॥ క॥ మీపాదంబు
లుగంటిమి। తాపముచల్లారె భూతదయుదళుకొత్తర్ । బాపాత్ముడౌ రావణు
నీపట్లనడంచి మమ్ము నేలుము కుందా॥ సీ॥ క్షీరసాగరమును శ్రీవికుంఠము నెడ
వాసి మీరీ శేషపర్వతమున। వసియించియుండి యెవ్వారికి గన్పింపకిచ్చట వేగి
యుండుట హేతువేమి। యిందె మీరుండగా నీలోకవాసుల మించి రావణుడుగా
జించుటేమి। దుష్టులమర్దించి శిష్టులరక్షించు మహనీయసత్కీర్తి మఱచుటేమి।
పరమపూరుష మమ్ము నెప్పటివిధమున । బాలనము సేయబనిబూనిపక్షికం
ఠునడపవేయని మ్రొక్కగానంబుజాక్షు। డబ్జజాదులజూచి యిట్లనియెమగుడ॥
చ॥ జలజజముఖ్యులార మిముసత్కృపమీఱగ నేనె బ్రోచెదన్ । ఖలుడగు
రావణాసురుని గాలము రాగనినేనె త్రుంచెదన్। జెలగుచునబ్ధి దాటిదశశీర్షుడు
క్రమ్మఱనిందువచ్చినన్ । దోలగనడంచి నేనదరదోలెద నెమ్మది నుండుడంద
ఱున్॥ చ॥ అనిహరి పల్కుచున్నతఱి నానిటలాక్షుడు వచ్చి విష్ణుదే । వుని విను
తించి యిట్లనియె భూరికృపాబ్ధి వికుంఠపట్టణం । బును విడనాడి వచ్చి ఫణిభూధర
మందు వసించియుండియున్ । మనుజులకష్టదుర్దశల మాన్పక తేరగ డాగియుం
డు రే॥ సీ॥ మర్త్యలోకమునకు మనుజాశనుల వేధ దప్పింప శేషభూధరమునం
దు । నిలిచి భూప్రజలకు నీవు ప్రత్యక్షమైయున్న రాక్షసులు రాకుందురిటకు ।
వారు రాకుండిన ధీరాత్ములై మానవులు నిన్ను సేవించుచుందురిచట । బొసగ
నీకీగిరి భూలోకవైకుంఠమగుచుండు నిను బాయక నిశమేను । నిలుతు భూలోక
మందిక నేను నిల్వ । దగిన స్థానమొకటి సిద్ధముగను దెల్పు। మిరువురము భూమి
యందుందమింకననగ । నిందిరాధీశ్వరుడు నవ్వి యిట్టులనియె॥ ఉ॥ ఓపరమేశ
నీవిచట నుండుట సమ్మతమయ్యెనాకు నీ । వీపటుపర్వతేంద్రమున క్రిందదిశన్
వసియించియుండుని । ప్రాపున జేసి భూప్రజలు భక్తిసగొందఱు నిన్నుగొల్తురీ।
వీపని సేయుమన్న గిరిజేశుడు సమ్మతి వొందెనయ్యెడన్॥ క॥ హరిహరులీశిగ
లమున । నిరవుగనుండుటకు నజసురేంద్రాదిమునుల్ । పరమాన

జెం। దిరిదశరథుజూచి వాసుదేవుడు పల్కె॥ ఆ॥ దశరథేశ సేనాపసులను
గూడి। యిటకువచ్చినట్టి హేతువేమి। దెలుపుమనిన భక్తి దీపింపగాగ నా।
లేన్యగుండు శ్రీరమేశుజూచి॥ వ॥ కరకమలంబులు ముకుళించి యనేకప్రకా
రంబుల వినుతించి యిట్లనియె॥ తే॥ విశ్వకారణ విశ్వాత్మ విష్ణుదేవ। సంతతా
నంద విగ్రహ చక్రపాణి। మిమ్ము జూడగ మదినెంచి మీకటాక్ష। మిపుడు
గామించి వచ్చితి నిందిరేశ॥ ఆ॥ ఎవరికోఱకు బద్మజేంద్రముఖ్యులు తపం।
బెపుడు సేతురెవరి యిష్టసూక్తు। లెపుడు వినదలంతురెవరి ప్రత్యక్షంబు। కోరు
చుందురట్టి గురుడవీవె॥ గీ॥ విష్ణుదేవ సకల వినుత సంహారణ కా। రణపుర
త్రయంబు గణచినట్టి। సాధనంబె మీకు సాధనంబగు విప్ర। భావమెఱుగ
దరమె బ్రహ్మకైన॥ ఆ॥ సృష్టికర్తలెల్ల శ్రీస్వామి నీదు సిం। హాజ్ఞ మీఱ వెఱచి
యనవరతము। వారివారి పనుల వారు చేయుదురు నీ। కంటె నధికులెచట గలరు
తలప॥ గీ॥ నాశరహితమై యనాది ప్రకాశమై। బట్టబయలనుండు పరమ
పదము। మీనివాసమయ్యె గానమీ సర్వోన్న। తత్వమెఱిగి పొగడ దరమె
నాకు॥ సీ॥ దేవదేవ పరాత్మ దీనుడనై గొంక మనవి చేసెదను సన్మతిని విభుడ।
మీరిచ్చినట్టువంటి భూరిభాగ్యంబులు గలిగియున్నవి వంశగౌరవంబు। నిలు
పంగాదగు పుత్రకులు లేరుగావున జింత బుట్టినది నాచిత్తమందు। పుత్రహీను
నకు సత్పుణ్యలోకములు లేవను వేదపూరుషుండందువలన। దాప మొందుచు
వచ్చినే మీపదములు। నమ్మి సేవించితిని గాన సమ్మతముగ। సత్యధర్మ
పరాక్రమశక్తిమతులు। గలుగు పుత్రుల నొసగవే కమలనాభ॥ క॥ అని
దశరథుడిటు పలుకగ। విని మనమున సంతసించి విష్ణుండపుడి। ట్లనియెను
జన్మాంతరమున। ఘనపాపము చేసినావు గావున నిర్కుఁ॥ తే॥ పుత్రకులు
గల్గరైరనహో భూపయనిన। విని మనంబున లజ్జించి వేగ ధైర్య। కలితుడై
పఙ్క్తిరథుడు దక్కకను మరల। నిందిరాధీశ్వరుని జూచి యిట్టులనియె॥ సీ॥
నారాయణాఖ్యాత నాపూర్వజన్మమం దేను జేసిన పాపమెంతయున్న। నబ్జా
ప్తుడుదయించినపుడంధకారంబు నశియించునటువలె నాయఘంబు। మిము
జూచినప్పుడే సమసిపోయినది నాకింక పాపంబు లేదెట్లనైన। నిపుడు నాతప్పుల
నిరీతి నెన్నక పుత్రులనిచ్చినన్ బుణ్యాగతిని। మీరె పొందింపవలయు నో నిర
జాక్ష। యనిభరన్యాసమప్పుడు హరిపదంబు। లందు జేర్చి మహాదీనుడగుచు
నిలిచి। యున్న దశరథు జూచి పద్మోదరుండు॥ వ॥ అప్పుడు నిర్హేతుక జాయ
మాన కటాక్షవీక్షణామృత బిందుబృందంబులా నృపతియందు జిలికి యిట్ల
నియె॥ సీ॥ దశరథేశ్వర సిరుదాపత్రయంబింక బనిలేదు నేనె నీపాపములను।
హరియించి నిన్ను గృతార్థునిగా జేసి బాహుబలాఢ్యులై ప్రబలిధరను। నా
మానులునైన నలుగురు కొడుకుల నిక నిచ్చెదను నమ్మి నిపురంబు। జేరియచ్చ

టసి పుత్రశోకంబుగా బుత్రకామేష్టిగావింపు క్రమముగాను। నన్ను సేవ్యముజేసించిన
నాల్గుశ్లోక। ములకు జేసంతసించితి ముఖ్య వరము। లిచ్చితిక భూమ్మి నీ భూమి
కి నకు లేశ। యనిన విని పజ్క్తిరథుఁడు శ్రీహరికి మ్రొక్కి॥ వ॥ అనేక విధంబుల
వినుతించి మరల సెలవు గైకొని బ్రహ్మాదులకు మ్రొక్కి దీవనలంది నిజగురువ
సిష్ఠసహితుండై యయోధ్యాపురంబు జేరి పుత్రకామేష్టి ప్రయత్నంబు
యుచుండెనంత॥ ఆ॥ జలజగర్భ నీవు సత్యలోకము బాసి। యిచటనుండి
నింకనుచితమగునె। నేను గొంతకాల మీనగమందుందు। నీవు నీదునింక
నీపురమున॥ క॥ అనిపలికిన హరిపలుకులు। వినికమలజుఁడేమి యనకవిన్న
దనమునఁగో। దవతలలు వంచియుండిన। గనిన గిహరి యిట్టులని మొగారవ
మొప్పన్॥ గీ॥ కొడుక నీవు మదిని గోరినకోరిక। లిచ్చెదను శిరంబులెత్తియ
డుగు। మనిన బ్రహ్మదేవుఁడా హరిపదపద్మ। ములకు మ్రొక్కి లేచి పలికెని
ట్లు॥ సీ॥ జనక మీరిప్పుడీ శైలాగ్రమున నెట్లు నిలిచియున్నారట్లనే జనుల
కు। గనిపించుచుండెద గల్పాంత పర్యంత మదియేల యనిన నీచనవి
మీద। జనియించు మనుజులు సత్యశౌచాచారములవీడి చెడుగురుకలియు
గమున। నటుగాన యముఁడు మహానారకములందు బడద్రోల్చి తిట్టుచు బా
ధబెట్టె। యవలవిడిచిన దుఃఖమగ్నాత్ములగుచు। బుట్టిగిట్టుచు నుందురీ
భూతలమున। వారిగడతేర్పు చటనెవ్వరును లేరు। శ్రీమహాస్వామి మీ
రెరక్షింపవలెను॥ సీ॥ కలియుగంబునయందు గలిగెడిమనుజు లెల్లాపయు
స్వహితులు దురాగ్రహులును। గఠినులు లోభులు కాముకులు ల్వాచకు
లోకద్రోహులు జడమతులు కుత్సితులును। బరదనాసక్తులు పరసతీరతులుఁ
నిర్భాగ్యులు గర్వులు పాపమతులు। సాధుదూషకులు మాత్సర్యసంకలితు
లుజారులు చోరులు సకలపాప। కర్మములు చేసి పడిపోయి కష్టదశల।
బొందుచురుగాన వారిని బ్రోచుకొఱకు। మీరు వేంకటగిరియందె మెలగు
చుండి। వారి నెల్ల నురక్షింపవలయు దండ్రి॥ చ॥ అనవిని విష్ణుడిట్లని మొనారకు
నూరమదీయమానసం। బున గలయర్థ మీవు బహు ముఖ్యముగా వినిపించి
తిందుచే। ఘనతరమైన భూతదయగల్గిన వాడవటంచు మెచ్చితిక్। జనహిత
కారిమైన ఫణిశైలమునం దెవసింతు బద్మజా॥ గీ॥ సకలతీర్థములకు స్వామి
నియైనట్టి। పుష్కరిణి వికుంఠపురమునుండి। వచ్చియీనగమున వసియిం
చియుండగా। బాపమెల్లఁబెంచు బ్రజలకింక॥ సీ॥ ఆవికుంఠంబునఁ వైర
మ్యాదాఖ్యచే దీపించు సత్పుణ్యతీర్థమునకు। నదియును గాకగంగాది తీర్థ
ములకు స్వామినియై యీశేషశైలమందు। ఘనముగానుండు పుష్కరిణి
లోభక్తి. స్నానముల్ చేసనజనులకెల్ల। సకలపాపంబులు సకలరోగం
బులు నశించిపోవును గల్గు సంపదలును। భూమిలోపల వారలకామితార్థ

ములనునేసిత్తుజంతింప వలదునీవు । సంతసించుచునుండు మోజలజగర్భ ।
యనినజక్రినిజూచి యిట్లనియె నజుడు॥ క॥ దనుజులుభూలోకంబున । వన
దుర్గములందు డాగివచ్చి చలముచే । మనుజుల భాధింపుదురటు । గనుక
నుదద్వేధ మాన్పగావలెనీశా॥ తే॥ అనినవినిచ క్రమునుజూచి యంబుజా
క్షు । డనియెగుముదాది వీరులనమరగూడి । వివిధ సాధనములత్తోడ వేగ
బోయి । రాక్షసులద్రుంపు మోచక్రరాజయిపుడు॥ సీ॥ అనవిని యాచక్ర
మబాక్షునకు మ్రొక్కి-కుముదాదివీరులగూడివెడలి । ప్రళయకాలా భీల
భానుబింబమురీతి సరభసంబుగబోయి సకిలదుర్గ । దిగ్దేశములనుండు దేవ
కంటకుల పైగవిసిపోరాడి యాగ్రహముబెంచి । యారాక్షసుల ద్రుంచి
యఖిలదేశంబులుకుదురించివేగ ముకుందుచెంత।నిజబలంబులతో వచ్చినిలి
చిమ్రొక్కి-।స్వామిరావణ బలములసంహరించి।వచ్చితిమి।బోప్రమన వినివా
సుదేవు । డపుడుచక్రము చేపట్టియజునిజూచి॥ ఆ॥ అజుడనీవుచెప్పినటువలె
జక్రంబు । చపలదానవులను సంహరించె । జనులకొఅకునీవు జాలినొంద
కుమింక । బొమ్మటన్ననజుడు పోకయుండె॥ వ॥ ఇట్లున్నవిరించిని జూచిహ
రి మఱియు నిట్లనియె॥ క॥ వనజజనే బొమ్మనినను । నెనరున బోజాలవిపుడు
నిమదిలోగో । రినకోరికన్ మనినను । వినిపద్మజుడిట్టులనియె వినయము
తోడన్॥ సీ॥ దేవమీరునురమాదేవి నావిన్నపమూలింపవలె నదెట్లనినవి
నుడు । వేంకట గిరిమీదవిఖ్యాతినుండ మీకున్నత మైనరథోత్సవంబు ।
జేయింపవలె నదిచిత్తగింపుడటంచు విన్నవించిన మహావిష్ణుడలరి । సిరితో
డసమ్మతించిన బ్రహ్మసంతోష భరితుడై ముని వరుల్ సురలుదాను। న
దిమొదలుగా బ్రయత్నంబుల చటజేసి । విశ్వకర్మను రావించి వివిధచిత్ర।
పురమునిచ్చట నిర్మింపుభూధరంబు। చుట్టుపట్లనురచియింపుపట్టములు॥ చ॥
అనవిని విశ్వకర్మవిపులాద్భుత చిత్రవిచిత్ర రీతులన్ । బెనుపుగ దత్తహే
మపుట భేదనముల్ రచియించి పిమ్మటన్ । ఘనతర మేరుతుల్యముగగాం
చన రత్నరథంబుదీర్చియిచ్చినగని పద్మజుండునిజచిత్తమునందు ముదంబు
నొందుచున్॥ క॥ ఘనుడగు విఖనసుడనుముని।గనుగొని వైఖానసప్రకార
సుసూత్రం । బులకనుకూలతగలిగిన । సునిశిత లగ్నంబు వెదకి చూడు
మునీంద్రా॥ సీ॥ అని బ్రహ్మ పల్కగా నావిఖనసు డిట్టులనియె గన్యా
రాశి యందు సూర్యు । డమర ప్రవేశించి నట్టి మాసమున జత్రాఖ్యన

బ్రహ్మోత్సవక్రమము.

క్షత్రంబునందుశాస్త్ర।మభిమతంబుగనధ్వజారోహణముచేసి యుత్తరాషా
ఢరథోత్సవంబు । గావించిశ్రవణనక్షత్రమందుదీర్థ వారిజేయింపగావలయు
నఘ ।విఖనసుడుపల్క-విని।బ్రహ్మ వేగ లేచి। తక్కకపుణ్యుత్సవప్రయత్నంబు

చేసి।సకలదేశాధిపతులనుత్సవముజూడ।బిలువనంపించెజారులప్రీతినెరయ॥ వ॥ అప్పుడుచారులువోయి హరిమహోత్సవప్రయత్నంబులువినిపించినవారు సంతసించిద్రవిడకర్ణాటకురుకుకురకేకయకోసలబర్బర మహారాష్ట్రిమగధమాళవశూరసేనసుధేష్ణ చోళనేపాళమళయాళ పాండ్యబంగాళపాంచాలకొంకణవిదర్భ కుంకణసౌరాష్ట్ర సౌవీర శకకిరాత యుగంధరాంధ్రవిదేహమత్స్యపులిందచేదిత్రికర్త సింహసింధులాట ఘోట కాంభోజగాశ్మీరాదిదేశాధీశ్వరులుతీవ్రగతుల రథగజతురగాందోళికాది వాహనంబులెక్కి సకుటుంబులై వచ్చుమార్గంబుల యందనేకజనంబులన్నసత్ర నీరాగారంబులునుజలువచప్పరంబులునిర్మించి యనేకవస్త్రభూషణ ఛత్రచామర పాత్రపాదుకావాహనాదిదానంబులుచేయగాగ్రహించి సంతసించుచుబ్రహ్మక్షత్రియవైశ్యశూద్రజనంబులందనేకులైనభక్తులుగోవిందేతినామంబులుగ్గడించుచు వేంకటాచలారోహణంబుచేసి యనేకంబులయిన విడుదులయందునిలిచి తదనంతరంబున బుష్కరిణియందు స్నానంబుచేసి శ్రీవరాహస్వామి నీక్షించి మ్రొక్కి కానుకలు సమర్పించి శ్రీనివాసదర్శనంబుచేసి యనేకవస్త్ర భూషణ ధనరాసులు సమర్పించి మ్రొక్కిసేవించుచుండ నంతనజుండు విష్వక్సేనుని బిలిచి యిట్లనియె॥ క॥ వినుసేనాధిప మాజ్జన। మునకు మహోత్సవము నిచట గొనసాగింప। బనులన్నియు సమకూర్పును। జనుమందల మ్రొక్కియనగ సంతసమొప్పన్॥ సీ॥ అపుడు సేనాపతి హరి కజునకు మ్రొక్కి యందలమెక్కి సానందుడగుచు। దన పరివారములనుగూడి తిరువీధులందు జరించుచు నందటికిని। దగుపనుల్నియమించి ధాతచెంతకువచ్చి యంజలి గావించి యచటచేయ। దగుపనుల్సేయించు దానాధ్యక్షుడై యుండె నావిఖనసుడు దానంతమీద। నకుర మృత్సంగ్రహంబు పుణ్యాహ వాచ। నంబు గావించి వరశ రావంబులమరు। పాలికెలు నవధాన్యము ల్పరగగూర్చి। యొప్పనాగమ విహిత మంత్రోక్తముగను॥ వ॥ హ స్తయం దంకు రార్పణంబును నైవేద్యాదికృత్యంబుల నెఱవేర్చియమ్మఱునా డుదయంబున బుణ్యాహ వాచన వాస్తుహోమగరుడ ప్రతిష్ఠాగరుడధ్వజారోహణ భేరీతాళ తాళన కంకణ ధారణార్చక బహుమానాది కృత్యంబు లొనరించి మఱియును॥ సీ॥ హరికి బూమికి నీళకథికన్యకును నూతనాంబరా భరణంబు లర్పణములు। జేసి శృంగారముల్చేసి హాటకరత్నదీధితులొప్పిన తిరుచయందు। వేంచేపు సేయించి వివిధ మంగళవాద్యములు బూన భోంతిరములను నిండ। మ్రోయుచు నుండగా ముందలదిగ్బలి తిగజల్లు చుండగా ధ్వజపటంబు। ప్రబల చక్రము సేనాది పతియుసడువ మునులుసనకాది యోగులు ఘనసిపొగడ। ఛత్రచామరములుబూనిస

కలదేవ । వినతిగొల్వంగనింతిరుపతిఘనంబు॥ సీ॥ అఖిలవైభవములు నానంద
నిలయంబునకుఁ బ్రదక్షిణముగా నలినభవుఁడు। శ్రీహరి వేంచేపు చేయించుకొని
రాగ విఖసనుఁడట శాస్త్రవిహితసరణి। దప్పిపోనీక చిత్తనుధ్వజారోహణము
నరించియారాత్రి ఘనతరముగ। బొసగ నావాహనము చేసి పూతమైన। దీక్ష మె
అయగ నగ్నిప్రతిష్ఠ చేసి। సకలదైవత్యపారమాత్మికములనగ। దగిన హోమ
ములొనరించితిక్కకపుడు॥ సీ॥ నానావనక్షత్రవరదినవారాదినిత్యహోమం
బులన్నియును నడిపి। దిగ్బలి గూడ దివ్యచక్రంబును వేంచేపు సేయించి వేడు
కలర । దఱుచుగా భేరీమృదంగాదిశుభ వాద్యముల ఘోషణములు దిఙ్ముఖ
ములందుఁ। మ్రోయగా నా బ్రహ్మముఖ్యరథము వెంట నతిశయ శేషవాహన
ముమీద । శ్రీనివాసునినుంచి విమానములకు । బూర్వరీతిఁ బ్రదక్షిణంబుగన
నేక । సేవకులతోడ వేంచేపు చేసియజుఁడు । హరిని స్వస్థానమున జేర్చె నం
తమీద॥ వ॥ ఇట్లు నవకలశ పాలికారాధన నైవేద్య హోమచక్రబలిప్ర
ముఖ నిత్యకృత్యంబును దినదినంబులు నెరవేర్చుచు నలఘు శేషవాహ
నోత్సవంబై మఱునాఁడు దయంబున దలఘు శేష వాహనోత్సవంబును
నారాత్రి హంస వాహనోత్సవంబును మూడవదినంబు దయంబున సిం
హవాహనోత్సవంబును నారాత్రి పుష్ప మౌక్తిక విమానోత్సవంబును
నాలవ దినం బుదయంబున సర్వభూపాలోత్సవంబును నారాత్రి కల్పవృ
క్షోత్సవంబును నైదవదినంబు దయంబున మోహినీవేషధరుండైన హ
రికి నాందోళికోత్సవంబును నారాత్రి గరుడోత్సవంబును నాఱవదిన ము
దయమందు హనుమద్వాహనోత్సవంబును నాసాయంకాలంబు వసంతో
త్సవానంతర మైరావతోత్సవంబును సప్తమదినోదయమందు సూర్య
ప్రభోత్సవంబును నారాత్రి చంద్రప్రభోత్సవంబును నెనిమిదవదినంబు
దయంబున షోడశమహాదానాది విహిత కృత్యంబుల నడిపించు మఱి
యును॥ సీ॥ ఘనతరోన్నతముగా గనకాద్రితుల్యమై రంగు నిగ్గులనొ
ప్పు రథమునందు । నెలవుగా శ్రీభూమి నీళలతో గూడ హరినుంచి బ్రహ్మ
దు లలఘురథము । సాగించుచుండగా సకల దిక్పాలకుల్ గరుడగంధర్వ
కిన్నర గణములు । సిద్ధవిద్యాధరుల్ సేవింప వేద నుంచాభులు మ్రోయగ
మహాద్భుతముగాను । పారిజాతసుమంబులా బ్రహ్మరథము । పైనరంభా
దులట జల్లి పాడియాడి । కనులపండునగా జూడగా ధరిత్రి। యందు సకలమా
నవులు వేంకటాద్రిమీంద॥ సీ॥ ధీరయతుల్ వాసుదేవుని విజ్ఞాన సుమచిర
భక్తుల జూడగాను । నుపనిషత్తులు చెప్పుచో స్మార్తులా హరిం జిత్స్వ
రూపముగ లక్షింపగాను । దత్త్వ భాగులును భేదశ్రుతిసార మీదేవో
త్తముడని తెలియగాను । మొనసి వేదాంతంబు లొనరంగ జదువ వైష్ణవు

లు మాధవభక్తి సలుపగాను। జెలగిహరి కీర్తనలు కవుల్ చెప్పగాను। బుడితులు విని శ్లాఘించుచుండగాను। బ్రాహ్మణ స్త్రీలు పాటలు బాడిహరికి। నెయ్యమున మంగళారతు లియ్యగాను॥ సీ॥ పరమ భాగవతులు భక్తిం బాడుచు నుప్పొంగి యాడుచు నుండగాను। గరములు ద్రిప్పి భోగముస్త్రీలు ముందఱ జతలుగా నృత్యముల్సలుపగాను। క్రమముగా వంది మాగధ సూతబృందము ల్పురుషోత్తమఖ్యాతి పొగడగాను। శిరములగల శమూజ్జేర్చి కొందఱు భక్తులొక్కెడ ప్రేమలుప్పొంగగాను। మొనసి కొందఱు గోవిందయనుచు భక్తి। పరవశత్వముచేమించి పలుకగాను। రథముపై పుష్పతండముల్ రాగయుక్తి సతులు మేడలపైనుండి చల్లగాను॥ వ॥ ఇట్లనేకుల నేక ప్రకారంబులుగా వినోదించుచు వినుతించుచు భక్తి సల్పుచుండగా గనక కమల సుగంధ పుష్పమాలిక హారంబులతోడ దులదూగుచు మేరుసమానంబైన తేరానంద నిలయంబునకు ప్రదక్షిణంబుగా వచ్చి యథాస్థానంబు నందు నిలిచెనంత శ్రీవేంకటేశ్వరుండు శ్రీభూనీళాసమేతంబుగా రథంబుడిగ్గి బ్రహ్మ రుద్రాదులతోడ గల్యాణమంటపంబు నందు బ్రవేశించి నిత్యహోమాదికృత్యములు నెఱవేర్చి సకల దేవ గణములచేత బూజితుడై ద్వజారోహణంబు మొదలుకొని యారగించిన ప్రకారంబుగా ఘృతసూపాన్న ముద్గాన్న తిలాన్న శాల్యన్న మరీచాన్న మాషాన్న గోధూమాన్న ములును బుళియోగిరము గుడాన్నపరమాన్న దధ్యన్నములు నతిరసంబులు వడలు మనోహరంబులు మొదలగున వివిధ భక్ష్యంబులును సమర్పించిన నారగించి తృప్తుండయ్యె బ్రహ్మాదులును నారగించి పరితృప్తిబొంది శ్రీనివాసుని నుచ్చైశ్రవంబు నందుంచి విమాన ప్రదక్షిణంబు సేయించి కల్యాణ మంటపంబు నందు వేంచేపు సేయించి యథాస్థాన మందుంచి పూర్ణాభిషేకంబు చేసి బ్రహ్మఱ జక్రత్తాళ్వారును హరిని శ్రీభూమి నీళలను దిరుచయందు విమాన ప్రదక్షిణంబుగా స్వామి పుష్కరిణీ తీరంబున వేంచేపు సేయించు కొనివచ్చి వరాహ స్వామి ముందఱ మంటపంబు లోనునిచి పంచామృత స్తపనంబును దిరుమంజనంబును జక్రస్థానమై వేద క్రమంబులును నాచరించి బ్రహ్మాదు లవభృథ స్నానంబులు జేసి రప్పుడు వారలంజూచి శ్రీనివాసుండు చేయెత్తి యిట్లనియె॥ సీ॥ బ్రహ్మ రుద్రాది దిక్పాలకు లందఱు నామాటవినుడు నిర్ణయము గాను। శ్రవణంబు నందు నా చక్రంబుతో గూడ స్వామిపుష్కరిణిలో స్నానములను। సల్పు వారలు పూర్వజన్మంబులను జేయుపాపంబులను బాసి భాగ్యవంతు। లైయిహ పరముల యందు సుఖింతురు నాపల్కు నిజముగా నమ్ముడనిన। శంకరుండు పద్మజుండిది సత్యమనుచు। బల్క

రటుమీఁదసకలవైభవములెసఁగ । శ్రీనివాసుఁడుకోవెల జెందియుచట। బొసఁగుక
ల్యాణమంటపంబునవసించె॥ వ॥ మఱియువిఖానసప్రముఖులు ప్రమాణయో
గనిత్యహోమాదికృత్యంబులొనరించిపత్నీసమేతంబుగాహరినివిమానప్రద
క్షిణంబుసేయించిక్రమ్మఱనిజస్థానంబునందుంచిబ్రహ్మాదిదిగ్దేవతాబలియు ను
ద్వాసనంబును ధ్వజావరోహణంబునునంకురారోపణంబును సంపూ
ర్ణహోమంబును గల శోద్వాసనంబును శ్రీస్వామియందుప్రధానకలశావా
హనంబునుగావించిరప్పుడు శ్రీనివాసుండువిఖనసునకుబహుమానంబుజేసిక
నకరత్నఖచితంబైనసభామంటపంబునందు శ్రీభూనీళాసమేతంబుగాసకలది
వ్యభూషణ కనకాంబరపరిమళగంధపుష్ప మాలికాలంకృతుండై బ్రహ్మరు
ద్రేంద్రమునియోగీశ్వరప్రముఖులునుసకలదేశాధీశ్వరులయిన రాజులునుబ
రివేష్టించి కొలువసకలవైభవంబు లంగీకరించుచు గరదీపికా సహస్రంబు
ప్రకాశింప హేమసింహాసనాసీనుండై కొలువుండి బ్రహ్మనుజూచి సంత
సించి యిట్లనియె॥ క॥ కమలజని సంకల్పము । క్రమముగ ఫలియించెమో
ద కలితుడవైతివి । సుమహితము గని యుత్సవ । మమరఁగ బ్రహ్మోత్స
వాఖ్య నవనిన్ వెలయున్॥ చ॥ స్థిరమతితోడ నీవిచట జేసిన దివ్యరథో
త్సవంబు భా । స్వరమగు భక్తినిచ్చటికి వచ్చుచు జూచుచునుండు వాఁడు
దు । స్తర భవఘోర వారధిని దాటి సుఖింతురు వారినెల్ల నే । గరుణను
బ్రోచుచుందుననిది గట్టిగనమ్ము విధాతనీమదిన్॥ శా॥ నారూపంబు మనం
బునన్ దలపుచున్ నాకీర్తన ల్వాడుచున్ ! వేరేచింతలు లేకనాయెడమ
హా విశ్వాసమున్ నిల్పుచున్ । శ్రీరమ్యంబగు భక్తి పెంచినను నర్పించి
వి ధానంబుచే । నారూఢిన్ దగపూజ సేయుజనులం దాసక్తి నేనుంచె
దన్॥ సీ॥ వారి యాపదల నివారింతు భక్తితో వారికి గోరినవరములిత్తు।
ధనరత్న వస్తువాహన ధాన్య సంతానముల నిత్తునదిగాక మోక్షమిత్తు ।
నామీఁదసద్భక్తి నాటించు జనులకు దోడునీడై గాకుతుదనుజేర్తు। నెంతన
మ్మిన వారి కంతటిఫల మిత్తునమ్మ జాలని వారినెమ్మి జెఱతు। నీస్థలంబున
భక్తితో నెవ్వరయిన । నన్నవస్త్రార్థి గృహపాత్ర లార్యజనుల । కొనర
గా దానములు సేయు చున్న ధన్యు । లనుభ వింతురు భాగ్యంబుల నని
యందు॥ వ॥ అనిపల్కి రుద్రేంద్రాదుల జూచి మఱియు నిట్లనియె॥ సీ॥ అ
మర కన్యారాశి కబ్జమిత్రుఁడువచ్చి నప్పుడిట్లుత్సవం బాచరింప । వలయు
మీరందఱు వచ్చి వేడుకగాను ప్రతి వత్సరంబును భక్తి మెఱయ । నీమ
హోత్సవమందఱిచ్చట నడిపించుచుండుడీ యిచటనేనుందునింక। ననిరాజు
లను బిల్చియవనీశులార మీరేడాది కొకమాఱు నీడజేరి। ధరణిపై మీకు
గల్గినద్రవ్యమందు। నాలుగవపాలుగొని తెచ్చినాకునిచ్చి। బూరిసామ్రాజ్యము

లమీరుపొందుచుండు। డనుచుహరిబూమిపతులకిం తిచ్చె॥ సీ॥ మఱియిట్టు
లనియెనిర్మలపుణ్యకర్మము ల్వేలయసల్పుడటంచువిప్రులకును। మఱువకెల్ల
పుడు బ్రాహ్మణకుటుంబములసంరక్షింపుడనిమహారాజులకును। ద్విజులనను
సరించివిహితవాణిజ్యముల్ వసుధసల్పుడటంచు నవైశ్యులకును। విప్రులనెల్ల
సేవించుమదాసులైసుఖియింపుడనుచును శూద్రులకును। నియమములుచే
సియాదరమునిరతముచట। వరుసగాబుష్పతులసికావనములమర। నిర్మితమ్ములు
చేయుడీనిఖిలధర్మ। శరణులనుదప్పకుండుడీశాంతులగుచు॥ వ॥ అనియిట్లుచా
తుర్వర్ణ్యంబులవారికిదగిన సకలధర్మంబుల నుపదేశించి వస్త్రభూషణచం
దన తాంబూలంబులు సన్నిధియందుబహుమానంబుగానిప్పించి మీమీస్థ
లంబులు చేరిమగిడిమదీయోత్సవంబునకు రావలయుననినియమించిన వారం
దఱునుహరికిబ్రణమిల్లి తదాజ్ఞాధారులై వేంకటాచలంబుడిగ్గితమతమదేశం
బుల జేరిరంత హరివిరించిప్రముఖులజూచిమఱియునిట్లనియె। సీ॥ బ్రహ్మదలా
రనాపలుకాలకింపుడీ యీవేంకటాద్రియందెవ్వరైన। ధరణీసురులకన్నదా
నంబుచేసిన నేద్రుప్తిబొంది మన్నింతువారి। నదిగాక సకలవిద్యాదానము
లుసేయువారును మఱివారివంశజులును। వారివంశజులును వారివంశజులును
బుణ్యలోకంబుల బొందగలరు। మొనసిబృందావనముదీర్చి ముఖ్యమై
న। తులసియందుంచి తద్దళంబులనునాకు। భక్తితోనర్పణముసేయు బ్రజ
లకెల్ల। స్వర్గసామ్రాజ్యమిత్తు నిశ్చయముగాను॥ వ॥ ఈప్రకారంబుగా నా
కు తులసదళంబునకు ఫలంబవ్వది దివ్యవత్సరంబులు స్వర్గభోగం బనుభ
వించినయనంతరంబున వారికిముక్తిదంబిత్తుగావున నీవేంకటాద్రియందు స
కలదివ్య పుష్పవనంబులు నిర్మించితత్పుష్పంబులు సద్భక్తి పూర్వకంబు
గానాకర్పించుచు నహంకారవిముక్తులై యుపశాంతులైనవారికి మోక్షం
బునిత్తు నదియునుంగాక ప్రత్యహంబును భక్తిపూర్వకంబుగా షడ్రసోపే
తాన్నంబు యథోచితంబుగా నాకుసమర్పించిన సకలలోకంబులు తృప్తి
బొందునని యిట్లనేకప్రకారంబుల గర్మజ్ఞానభక్తిధర్మ సూక్ష్మంబులు బ్ర
హ్మనులకానతిచ్చి బ్రహ్మకిట్లనియె॥ సీ॥ జలజసంభవనీవు సత్యలోకమువా
సినాకొఱకిచటనిన్నాళ్ళుపలిచి। బ్రహ్మోత్సవాఖ్యచేబ్రబలు మహోత్స
వమిచట జేయించితి వింకువలన। వనధిజాభూనీళలును నేను సంతోషభరి
తులమైతి మీఫణిగిరిన। నిలిచియుండెద మింకనీకు వరంబులేమిత్తు
మన్నను భారతీశుడనియె। జనకననుమున్నె మన్నించినవరంబు। లిచ్చియు
న్నారునాకిప్పుడేమికొఱదువ। యికదిరోధాన మొందకనిచటనెపుడు। నిలి
చియుండుడి నన్నుమన్నించితండ్రి॥ క॥ నరకంబులబడనియ్యక। నరులను
మీరిచటరక్షణముచేసెనదే। వరమింతకన్న వేఱొక। వరమేలను నాకుభ

క్తవరదముకుందా॥ సీ॥ అనవిని హరియిట్లనియె నీమాటసమ్మతమె నా
కింకసుమతముగలదు । వినుమది నాయందువిశ్వసించుచు భక్తిసల్పుచునే
స్పట్టిసాధువులను । బాధించువారు మద్బాహు సమానులైనను నిగ్రహిం
తునిశ్చయముగాను । నన్నెవ్వరేమియన్నను నేనుసహింతు భక్తజనులనె
న్నదాళలేను । జయుడువిజయుండు సనకాదిసంయములకు । మించిచేసిన
యపకృతికొంచెమైన। గొప్పయైవారలను నేలగూల్చినట్టి । సరణి నేనన్న
మాటకుసాక్షిగాదె॥ ఉ॥ భాగవతాపచారమతిపాపముగావున నట్టిద్రో
హమ్ముల్। లోగికచేయువాని యమలోకములోబడద్రోతు వానినే । నేగతి
ద్రోతునింకమరి యెన్నియఘంబులజేసివచ్చినీ । వేగతియంచునన్నిచట వే
డినదీనునిద్రోతు బద్మజా॥ క॥ హరిభక్తులనిందించిన । నరులనుగురుదూషకు
లనునమ్మినవారిన్ । జెఱిచినపాపాత్మకులన్ । నరకంబునద్రోతుగానినాపదమి
య్యన్॥ సీ॥ అతిశయదంబదర్పాద్యభిమాన దురాచారఘోరదురాగ్రహ
ముల। ననుసరించిన మర్త్యులాసురాంశజులుగావున సురాంశజులైన జను
లనెల్ల । బాధింతురటువంటి పాపకర్ములనేనె శిక్షింపదగు పనిసిద్ధమిలను।
దుష్టులమర్దించి దుర్బలులైనట్టి శిష్టులనెల్లరక్షించుకొఱకు । నేను శేషాచ
లమునందు నిలిచియుందు । సత్యలోకమునకుబోయి సకలసృష్టి । నీవుగా
వించుచుండుము నిన్ను నేను । బ్రోచుచుండెద నికలేచిపొమ్ము బ్రహ్మ॥ వ॥
అని బ్రహ్మకానతిచ్చి యింద్రునితో నిట్లనియె॥ ఉ॥ పాకవిరోధి నీవుసురపఙ్క్తు
లనెల్లనుగూడివేడుకన్ । నాకముజేరి యచ్చటఘనంబగు బాహుబలంబు
వెంచిము । లోకములేలు దైత్యులకు లొంగిచలింపకుమింకమీదటన్ । నీ
కుజయంబునిచ్చెదను నెమ్మదినుండుము సురాధినాయకా॥ ఆ॥ అనుచువిష్ణు
దేవుడనిమిషపతికిట్లు । లానతిచ్చి నెయ్యమలరశివుని। గాంచి మందహాసక
లితాస్యుడై స్నేహ । మెనయుభావమెసగ నిట్టులనియె॥ శా॥ గౌరీనాయ
కనామమహోత్సవములంగల్పించి మీరందఱిం । దారూఢంబుగజేరి చూచి
తిరి నేనానందమున్ బొందితిన్। నీరౌప్యాద్రికినీవుపోయి యచటన్ నీభక్త
బృందంబులన్। ధారాళంబుగ బ్రోచుచుండు మతిసద్ధర్మస్థితిన్ శంకరా॥
సీ॥ వైకుంఠమునకంటె వరసుధాంబుధికంటె లలిదివాకరమండలముల కం
టె। ధన్యమైనట్టి శ్వేతద్వీపమునకంటె శేషాచలంబు విశేషముగుచు। వాసిగా
భూలోకవైకుంఠ మననొప్పుచున్నది గనుక నేనుందునిందు। నచటికిదూర్పు
ననమరియున్న సువర్ణముఖరితీరంబున మొనసినీవు । నొనరభూలోకకైలా
సమనగనొప్పు । చున్నపుణ్యస్థలంబు నందుండుమనుచు । జెప్పియప్పుడగ
స్త్యునీక్షించియిట్టు । లనియె శేషాచలేశ్వరుడాదరమున॥ తే॥ పరమపావ
నకుంభసంభవమహాత్మ । నీకుసమ్మతమగుచోట నిష్ఠమెఱయ । జిరతరం

బుగదప మొప్పజేయు మనుచు । జెప్పి సనకాదిమునులరక్షించిపలికె॥ తే॥ యోగివరులార మీరువిరాగమహిమ । నరసిజ్ఞానామృతము గ్రోలి యెపుడు దృప్తి నొందియుచ్ఛా విహారులై యుండుడనుచు । సమ్మతంబుగ బల్కి యాచక్రధరుడు॥ వ॥ అపుడు బ్రహ్మేంద్రరుద్ర కుంభసంభవసనకాదులకి ష్టార్థంబున నానతిచ్చి శ్రీభూనీళాసమేతంబుగా నంతర్విమానంబునందు బ్రవేశించె నంత బ్రహ్మహంసవాహనంబెక్కి సత్యలోకంబుజేరె నింద్రుడైరావతంబెక్కి స్వర్గంబున కరిగె రుద్రుండునంది వాహనంబెక్కి శేషగిరిద క్షిణంబుగా గపిలతీర్థమార్గంబున నరిగికైలాసంబుచేరె నగస్త్యప్రముఖులైనమునులును సనకాదియోగులును స్వామిపుష్కరిణికి నుత్తరభాగంబునందుండు పాపవినాశతీర్థంబు మొదలయిన సకల పుణ్య తీర్థంబులందుగ్రుంకుచు బాపవినాశనోత్తరభాగంబు నందు గొందఱుమునులు తపంబు సేయుచుండిరి అందుకొందఱు మఱియుబుణ్య తీర్థంబులాశ్రయించి తపంబులొనరించుచుండిరి బ్రహ్మోత్సవ క్రమంబగు బ్రహ్మోత్సవ ప్రకారంబు వ్రాసిన చదివిన వినిన వారలకు నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధికలుగునని చెప్పిన సూతుంజూచి శౌనకాదు లిట్లనిరి॥ క॥ సుందరవిగ్రహ ఘనతర । మందరగిరిధర సమస్తమానిహృదబ్జా। నందకర వేంకటాచల। మందిర సురరాజవినుత మాయాతీతా॥ మాలిని॥ సురుచిరగుణవిహారా శుభ్రకీర్తిప్రచారా వనజలధిగభీరా వాసవారిప్రహారా। దురితచయవిదారా దుఃఖసంసారదూరా । గురుశిఖరగిరిధీరా క్రూరగర్వాపహారా॥

గద్యము.

ఇది శ్రీతరిగొండ నృసింహ కరుణాకటాక్షకలిత కవితాచిత్ర కృష్ణయామాత్య తనూభవ వేంకమాంబా ప్రణీతంబైన శ్రీవేంకటాచల మాహాత్మ్యంబను వరాహపురాణంబునందు దేవేంద్రాదులు క్షీరాబ్ధి ప్రముఖస్థలంబులయందు హరిని వెదకుటయు దదనంతరంబున నారదప్రేరితులై బ్రహ్మలోకంబునకుఁ బోవుటయు బ్రహ్మతోడ దేవేంద్రాదులు హరిని వెదకుట కు వేంకటాచలారోహణంబు జేయుటయు దశరథుండు వశిష్ఠయుక్తుండై వేంకటాద్రికివచ్చుటయు బుష్కరిణీతీరంబున బ్రహ్మాదులు తపంబు సేయుటయు శ్రీ వేంకటేశ్వరుండు విమానంబుతో బ్రహ్మాదులకు బ్రసన్నుండగుటయు। స్వామిని బ్రహ్మాదులువినుతించుటయు బ్రహ్మాదులకుహరి ప్రసన్నుండై భాషించుటయు దశరథుండుహరినిస్తోత్రంబు సేయుటయు శ్రీనివాసుండు దశరథునకువరమిచ్చి యయోధ్యకు బనుపుటయు బ్రహ్మోత్సవ ప్రకారంబను కథలంగల.

ద్వితీయాశ్వాసము - సంపూర్ణము.

శ్రీ ర స్తు.

# శ్రీవేంకటాచలమాహాత్మ్యము-తృతీయాశ్వాసము

## చ క్ర రా జ వి జ య ము.

క॥ శ్రీకరనిర్జరమానిత। శీకరసద్భక్తబృందచిత్తవిహారా। రాకేందువదన శుభకర। ప్రాకటకరిగొండనృహరి పాపవిదారీ॥ సీ॥ ఓసూతమేము బ్రహ్మాస్త్రమై నక్రి నీకు నత్యాశ్చర్యముగవింటి మపుడువిష్ణు। చక్రంబుబహు చోరసంఘంబులను నిగ్రహించెనంటివివారినెట్లుద్రుంచె। నారీతివినవేడ్కలైనదిదెల్పవె ననిన సూతుండు సంయములజూచి। మునులారవినుడీయాఘన చక్రమాహాత్మ్యమెఱిగి చెప్పుటకునేనెంతవాడ। నైనజెప్పెదనొకకొంతయనుచు బల్కె। మరలనిట్లనె జక్రంబుమాధవాజ్ఞ। దానుశిరసావహించి సంతసముతోడ। నరిగిఘనరాజ వేషంబునపుడుదాల్చి॥ సీ॥ పటిమమీఱ సహస్రబాహులై మకుటాద్రిరత్నభూషణములురక్తవర్ణ। చేలంబులనుదాల్చి కాలాగ్నిసమదృశదంష్ట్రాకరాళవక్త్రంబుమెఱయ। విపులరథంబెక్కి వివిధసాధనముల ధరియించి వెడలిగంధర్వగణము। లలఘుముద్గరపట్టిసాద్యాయుధములుగైకొని తనవెంటనుగూడినడువ। గుముదుడనువాడు జ్వాలాముఖుండుసకల। సైన్యపక్షులనడిపింపసామజాశ్వ। వారములతోడ ఘనరణభేరిమొఱయ। నిఖిలవాద్యరవంబులు నింగికెగయ॥ వ॥ ఇట్లనేకవైభవంబుల సంగరోన్ముఖుండై చక్రరాజశేఖరుండు శేషాచలంబు మొదలుకొనిపూర్వ సముద్రపర్యంతంబున నప్పర్వతంబులనాక్రమించుకొనిసకలసాధులవధించుచున్నచోరసమూహంబుల వెదకివెదకికుటుంబంబులతోడ సంహరించి దేశబాధనివారించినచక్రరాజుసాన్నిధ్యంబునకు వచ్చితద్దేశవాసులైన సాధుజనులువినుతించియిట్లనిరి॥ తే॥ ఓమహారాజ యీభూమికొక్కప్రభువవు। లేనికతమునబహు సాధుమానవులను। జాలవేధించుచుచోరులజంపితివి। ప్రోచితివిమమ్మునెల్లనో పుణ్యపురుష॥ క॥ ఎక్కడనుండియొయిచటికి। మక్కువతోవచ్చినీవు మాజీవనముల్। దక్కించినపుణ్యాత్ముడ। విక్కడనే నిల్చియుండు మెపుడుమహాత్మా॥ సీ॥ అనిపల్కుసుజనుల నాదరించుచుజక్రరాజుతద్భూమికిరాజునొకని। వెదకిపట్టముగట్టి విప్రులుమొదలైన మంచివారలను రక్షించుమనుచు। వానికినియమించి శ్రీనివాసాద్రికీ మనుజులు రాదగుమార్గములను। దగనేరుపఱిచియాదారులయందు ధర్మాత్ములనుంచి మహాద్భుతముగ। నచటజయభేరివేయించి యాపుడువెడలి। కరులుహయములు రథములుకాల్బలములు।

మొనసిఁ గొల్వఁగ వాద్యములు మ్రోయుచుండ । శౌర్యకార్యధురీణుఁడై చక్ర
రాజు॥ సీ॥ సంతోషభరితుఁడై సరభసంబుగ మించి వివిధదుర్గ్గములవెదకి
కొనుచు । బలిమి నాగ్నేయదిగ్భాగంబునకువచ్చి చోరులవిసరణభేరిన
చట । మొరయించుచును మున్ను మూర్ఖులై విప్రుల బాధించుచున్నట్టి పా
పమతుల । పైఁ దాడివెడలి యార్భటము సేయఁగ వారుదైత్యాంశజులు కా
న ధైర్యమెసఁగ । నాయుధంబులుపూని ఘోరాట్టహాస । కలితులై నిల్చిమిం
చి సంగరముసేయ । బూని రుభయబలంబులు పొంగి యార్చి । పోరుచుం
డిరి యప్పుడద్భుతముగాను॥ క॥ జ్వాలాముఖ కుముదాదులు । నాలోనె
డతాకి యట్టహాసము తోడన్ । గాలాంతకసన్నిభులై । యాలంబొనరించి
త్రుంచి రసురాంశజులన్ ॥ క॥ తక్కినయాదనుజాంశజు । లక్కడఁబడియు
న్న శవములటు ద్రొక్కుచు బో । నిక్కుచు జనిగంధర్వుల । గక్కసము
నఁగొట్టి రమితగదలఘటితులై॥ క॥ అప్పుడు గంధర్వజను । లొప్పక శస్త్రా
స్త్రములను ధరియించి చలం । బొప్పంగరిపు బలములపై । నొప్పుచు
బడఁగూల్చి రధికరోషోద్ధతులై॥ వ॥ అప్పుడు హత శేషులయిన చోరులు
తమదొరలకు దమబలంబులు పడిన క్రమంబు జెప్పినచోరప్రభువులు స్థలదుర్గ్గవ
నదుర్గ్గంబులయందుండి త్రిపురంబులందున్న రాక్షసబలంబులకైవడి ననేకమా
యలబన్నుచు విశి వడియార్చుచు గరవాల శూలముద్గర భిండివాల పరశు పట్టి
సశరచాపపరిఘాద్యనేకసాధనంబులు గొనివచ్చి గంధర్వబలంబులపైఁ గవిసి
నగంధర్వులు నొక్కుమ్మడిఁ జోరప్రభుసంఘంబుల నెదిరించి సడచి యధిక చిత్ర
విచిత్రంబుగా ఘోరయుద్ధంబు సేయుచుండి రప్పుడు భేరీప్రముఖ రణవాద్య
ఘోషణంబులును గంధేభ ఘీంకారంబులును దురంగ హేషారవంబు
లును రథనేమి భీకర శబ్దంబులును దుములంబై దిక్కులు పిక్కటిల్లె న
ప్పు డుభయ బలంబులయందు నొండొరుల శూలంబున గ్రుచ్చియు ఖడ్గం
బుల నఱికియు గదలనడచియు ముసలంబుల నెత్తి నడినెత్తుల దరగ గొట్టి
యు నివ్విధంబున బోరుచున్న ధరణీతలంబున రక్తంబు ప్రవహించుచుం
డె నప్పుడు చోరనాయకులు విజృంభించిరి గంధర్వు లందఱు నాసమయం
బున జ్వాలాముఖుండగు చక్రరాజేంద్రునకు నావృత్తాంతంబు చెప్పిన
విని యతండు రోషభీషణాకారుండై త్రిపురాంతకుండైన కాలరుద్రునికై
వడి నాగ్రహోదగ్రుండై యేనూఱు చేతుల నేనూఱు కార్ముకంబులు
పూని తక్కిన యేనూఱు కరంబుల జండకాండంబులు గ్రహించి ప్ర
త్యాలీఢపాదుండై నిలిచి ధనుర్జ్యా ఘోషణంబులు చేసి శత్రుసమూ
హంబులమీఁద ననేక ఘోరబాణ వర్షంబులు గురియించిన నలిగియు దుని
గియు నష్టంబులునయి పడిన బలం [illegible] చోరనాయకులు మొననిల్వ

కపాటిపోయి తమతమ దుర్గస్థలంబులందు డాగిరంత॥ ఆ॥ చలముపిడక
పుడు చక్రరాజేంద్రుడా। గ్నేయనామధేయ సాయకంబు। వింటగూర్చి వే
గవిమతజనంబుపై। విడువదచ్చరంబు విపినములను॥ క॥ విడివడికాలిచిముడు
తడ!బడిడాగినచోరవీరపట్టుల నెల్లన్।దడయక భస్మము సేసిన।పుడమియు
నవ్వేడిచేత బొగలుచునుండెన్॥ వ॥ఇవ్విధంబుననిర్బీజంబుగా శత్రునాశంబు
చేసియమిత్రవృష్టిగురియించి భూమిని శీతలత్వంబునొందించి ధర్మాధ్యక్షుం
డనువాని నమ్మహికి రాజునుగా జేసి దర్మస్థితి బ్రజల బాలింపుమని నియమిం
చితదనంతరంబున॥ సీ॥ చతురంగ బలములు సందడించు చుమగోల్వధీసుడై దక్షి
ణదిశకుమరలి। వనదుర్గములయందు వరుసగా వెదకుచుజిక్కినచోరుల మొ
క్కపటిచి। వచ్చుచునుండగా నచ్చటనుండిన సజ్జనులెల్ల నా చక్రరాజు। నీక్షిం
చితమపాలి యీశ్వరుండీరీతి వసుధనురక్షింపవచ్చెననుచు। వారుముదమం
దుచుండగా బోరదలచి। లేచి యపుడంగవంగ పుళిందులనెడు। వారు
ముగ్గురు బిడాలుడన్ వాడొకండు। చాలుకుండనియెడువాడు సరభసము
న॥ వ॥ నానా విధంబులైనగదాకుంతముసల ముద్గర శరచాప ఖడ్గప్రము
ఖ సాధనంబులు గొని యనేక చోర బలంబులతోడ జక్రరాజున కెదురు
నడుచుచు దమలోదా మిట్లనిరి॥ సీ॥ ఈరీతిగామన కెదిరించి నిలచిన య
రుల నే నేత్రుంతునని యె నొకడు। గంధేభముల దురంగ సమూహముల
నెల్ల నవనిపై నే గూల్తునని యె నొకడు। గములుగా వచ్చిన కాల్బలంబుల
నెల్ల మొనసి నే నేత్రుంతు నని యె నొకడు। ప్రబల రథంబెక్కి ప్రభుప్ర
చండమున వచ్చినవాని మడియింతు నని యె నొకడు। కమల హయముల
మితిలేని కాల్బలములు।రథము పైనుండి నిక్కడిరాజుతోడ।నిపుడు నేనొక్క
డన సమయింతు ననుచు। మూఘుడై చాలుకుడు మించి మొనసి పలికె॥
వ॥ ఇట్లు పంచమహాపాతకులైన యంగ వంగపుళింద బిడాలచాలుకులని
యెడి దైత్యాంశ సంభవులు ప్రచండోద్దండ బలంబున జక్రరాజు బలం
బున కెదురు నడిచిన జూచి హుంకరించి స్ఫులింగాక్షుండును బలా
ధ్యక్షుండును జ్వాలాకేశుండును గాలాంతకుండును రణఘ్నుండును
జక్రరాజాను మతంబున గరవాల శూలాల ముద్గర బిండివాలకాండ
కోదండ ప్రముఖాద్యాయుధంబులు పూని నిజ బలంబుల బరబలంబు
లపై బురికొల్పుచు దంత ప్రముఖులైన పంచమహాపాతకులంజూచి యి
ట్లనిరి॥ సీ॥ పాపాత్ములార సద్బ్రాహ్మణోత్తములను జెఱచియాచా
రము ల్చెరిచివారి। జీవనంబులనెల్ల జెఱచి యజ్ఞంబులు చెరిచిధర్మము ని
ట్ల చెరిచినట్టి। మీకంత్య కాలంబు మొందొడ్డి వచ్చెనిం కెక్కడ డాగెద
రిపుడుమిమ్ము। ఖండించిమీ డల్లు కంకగృధ్రములకు సకలభూ

తంబులకును । బాసగ నాహారముగనిచ్చి భూసురులను । మేనురక్షింతు
మికమీదమీబలంబు। సాగ దెదిరించిరమ్ముని శౌర్యమెసగ। పలికివిడిసినడియట
వారిపైనగవిసి॥ వ॥ అతిభీషణాకారులై యస్త్రశస్త్రంబుల నొప్పించినదలంగి
పోకనంగవంగాదిరాక్షసాంశసంభవులు ముసలగదాద్యాయుధంబులుగొని
స్ఫులింగాక్షులమీదబడి యతిఘోరయుద్ధంబు చేసిరందు స్ఫులింగాక్షుండం
కుడనువానిబరిమార్చెబలాఢ్యక్షుండువంకుడనువానింద్రుంచెజ్వాలాకేశుడు
పుళిందుడనువానివధించెగాలాంతికుండుబిడాలుండనెడిశూరునిఖండించెరణ
ఘ్నుండుచాలుకుండనుశాత్రవునిసంహరించెనివ్విధంబున దెగిపడినయంగా
దులబలంబులు విఱిగిపారివనదుర్గంబులం డాగెనంత వారిభటులార్భటిం
చుచుద్గమ్ముని జక్రరాజుబలంబులపైగవిసిన జక్రరాజానుమతంబునహాయ
శిరుండు తదల్పంబులపైనర్ధచంద్రబాణప్రయోగంబువేసియందఱిని రెండే
సిఖండంబులుగావించె నపుడు హతశేషులు వెఱచి పఱచిపోయి గుహార
ణ్యంబుల డాగినంజూచి చక్రరాజేంద్రుడు చిత్రబాణప్రయోగంబుచేసిన
తద్బాణంబుగిరివనదుర్గస్థలంబులడాగియున్న రిపుబలంబుహతంబుజేసినచ్చె
నంతదక్షిణభూమినిష్కంటకంబయ్యెనప్పుడుదేవతలు చక్రరాజు శిర్షంబున
గుసుమవర్షంబులు గురియించి యనేక ప్రకారంబుల వినుతించి యిట్లనిరి॥
సీ॥ చక్రరాజోత్తమ సకలపాపాత్ముల సమయించియిచ్చట సాధువులను।
రక్షించితివిని పరాక్రమంబింతని శేషాహియైనను జెప్పగలడె। పరగ శే
షాద్రికి బశ్చిమోత్తరముల జోరులుక్రూరులున్నారు నీవు। వారినిఖండించి
వసుధామరాది సజ్జనులరక్షింపుమో చక్రరాజ। యనుచుబ్రార్థించిదేవ
తలనిరియిట్లు। చక్రమచ్చోట శత్రుశేషమునునిలుప। కంత మోదింపగా
జూచి సంతసించి। బ్రాహ్మణులువచ్చియా చక్రరాజుగాంచి॥ సీ॥ వినుతిం
చిపలికిరో విమలాత్మయీదేశ మందుధర్మాత్ముడైనట్టిరాజు। గలుగనికతన
దుష్కర్ములైచోరులు బాధించుచుండిరి బ్రాహ్మణులను। నీవుమాపాలిటి
దేవుడవైవచ్చి సకలపాపాత్ముల సంహరించి। మమ్ముంరక్షించి తిమ్మహిని
బాలింపగా దగినట్టిరాజు నిద్దరనునిలుపు। మనుచువారెల్ల బ్రార్థింపనపు
డుచక్ర। రాజుతద్ధారుణికి దగురాజునొకని। నిలిపిధర్మంబుదప్పక నీవుజ
నుల। పాలనముసేయుమనిచెప్పి బ్రాహ్మణులను॥ తే॥ కాంచియిట్లనె మీ
రుసత్కర్మనిష్టు। లగుచుసవనములొనరింపు డయ్యుయనుచు। జెప్పగావా
రల-దఱాశీర్వదించి। వీడుకొల్పంగనారాజ వీడుడపుడు॥ వ॥ దక్షిణప్రాంత
గహనంబుల మధ్యంబులయందు వేంకటాద్రికి జనులువచ్చుటకు మార్గం
బు లేర్పఱచి యామార్గంబులందు సుజనులైనవారిని బాలింపమని యచటి
రాజునకు నియమించి తదనంతరంబున॥ సీ॥ అందుండిసకల సైన్యావళుల

నుగూడి జయభేరి వేయించి సంతసించి। పైనమై బుతిప్రాంత దేశములందు
గదలిపోవుచును దుర్గస్థలముల। శోధించిశోధించి చోరులనెల్లను బాధించి
చంపుము బచ్చినుమున। కరిగిమహోన్నతుడై నిజగంధర్వ బలములతో నం
దునిలిచికదన। భేరివేయించియప్పుడ భేద్యవిపుల। విపినదుర్గస్థలంబుల
వెదకివెదకి। చోరులరుద్రంపగా జోరచారులలరి। చెదరితనుదోరయగు
వానిచెంత జేరి॥ క॥ మ్రొక్కుచునిల్లవిరథిపా। యెక్కడనుండి మొదళంబు
లీప్రాంతములన్। గ్రిక్కిరిసిచోరవరులను। దక్కక ఖండించెననగదష్టోష్టుం
డై॥ సీ॥ శివునిగూర్చితపంబు జేసితానెవరిచేఁ జాలనివరముగై కొనినవాడు।
బహుచోరులనుగూడి పర్వతాగ్రములందు జేరిసాధులనుహింసించువాడు।
బలమదోపేతుడై బాటసారులగొట్టి యమితవిత్తముగూర్చి నట్టివాడు। కా
లకింకరులనగాదగినకిరాత బలముల జేబట్టి ప్రబలువాడు। వనములందురి
పుఘ్నుడన్ వాడుగన్న। కొడుకువనకర్తయనువాడు క్రోధమెసగ। నిక్కి
పొంగుచు నక్షౌహిణీబలంబు। గూడవిడివడివచ్చియూ క్రోశమెసగ॥ క॥ ప
లకలుకొమ్ములు తుడుములు। బలముగ హాయించి కొనుచు ప్రతివీరులపై।
నులుకక పడిపోరుండని। సెలవియ్యగ దద్బలములు చెదరక గుమిమై॥ వ॥ తలం
గకగదాకుంత ముసలాద్యాయుధంబులుగొని చక్రరాజబలంబున కెదు
రునడచె నప్పుడనేక సాధనంబులుగొని చక్రరాజభటులు వనకర్తదళంబు
లపైగవిసి యతిఘోరయుద్ధంబుచేసి యక్షౌహిణి కిరాతబలంబునతి త్వరి
తంబుగా సంహరించిరంత రక్తంబువెల్లివిరిసి యేఱులై పాఱుచున్నంజూచి
వనకర్త క్రోధరక్తాక్షుండై నిజసేనాధిపతియైన జ్వాలాపాతుండను వాని
నీక్షించి యిట్లనియె॥ సీ॥ అసహాయశూరులై నట్టియక్షౌహిణి భటులను
జంపిరి పరునిభటులు। కావునసవేగి కరవాలశూలాది సాధనంబులవారి
జంపుమనుచు। దనదోరమైన కాననకర్త చెప్పగా నపుడుజ్వాలాపాతు
డాయుధముల। గైకొనియుష్ట్రాళి గట్టినరథమెక్కి సరభసుడై వచ్చి చక్ర
రాజు। బలముపై బడగా బడబాముఖాఖ్యు। జూచియాచక్రరాజ హోహా
శూరవర్య। రయమునను నీవు వోయికిరాతవిభుని। దళపతిని గొట్టి
గూల్పు మిద్ధరణియందు॥ క॥ సరిగానినీచజనముల। సరిగా నెంచికొని పో
రసహ్యాముగాదీ। వరిగిమహా త్వరితముగా। బోరిగొను మీపాపమతుల
బుణ్యాచరిత్రా॥ క॥ అనిచక్రరాజు పలుకగ। వినియెన్ బడబాముఖుండు
విపులాయుధముల్। గొనియాజ్వాలాపాతా। ఖ్యునిరథమునువిఱిచివాని
గూల్చెధరిత్రిన్॥ ఆ॥ అపుడె విష్ణుచక్రమను నామధేయంబు। గల్గుచక్ర
మెత్తి గహనకర్త। యనెడువానిమీద కనుపగానాచక్ర। మతనిశిరము
దఱిగి యవనిగూల్చె॥ వ॥ ఇవ్విధంబున బడబానలంబు సముద్రోదకంబును

ద్రావినచందంబున గానకర్త సైన్యంబును జక్రరాజ శస్త్రాస్త్ర సంఘా
తంబు సంహరించె దద్భుతమినిష్కంటకంబై ప్రకాశించె నప్పుడు చక్ర
రాజేంద్రుం డరణ్యకంటకవృక్షంబుల నఱికించి సకలభక్తజనంబులు శేషాచ
లంబునకు వచ్చుటకు దగిన మార్గంబుల నేర్పఱిచి తన్మార్గప్రాంతంబుల
బుణ్యాత్ములయిన జనంబులనునిచి తజ్జనంబుల బాలింపదగిన రాజునకు
బట్టంబుగట్టి ధర్మపరిపాలనంబు సేయుమని నియమించి తదనంతరంబున॥
సీ॥ చక్రరాజేంద్రుడు జయభేరి వేయించి చతురంగబలములు జతకుగొలు
వ। ధీరుడై వాయవ్య దిశనుండుచోరుల సమయించుచునువచ్చి శౌర్య
మెసగ। గంకణరాక్షస గాఢాంధకారంబు దట్టమైనట్టి యుత్తరపుదిశకు।
నప్పుడేమరలి సహస్రార్కకరముల కరశేదీర్ఘసహస్ర కరములమరు।
చుండెరెండవచండ మార్తాండుడనగ। నొప్పుచునువేంకటాద్రికి నుత్త
రముగ। నుండు కొండల నడుమ మహోగ్రుడగుచు। సరభసంబుగ నిల్చె
నాచక్ర రాజు॥ వ॥ అప్పుడా చక్రరాజు నీక్షించి భీతినొంది కొందఱు రా
క్షసులు తమదొరయైన భేరుండుని చెంతజేరి యిట్లనిరి॥ సీ॥ చండప్రతాప
భేరుండ ప్రభుస్వామి వినుమద్భుతంబుగా వీరుడొకడు। చతురంగ బల
ముల జతగూడి యున్నాడు కాలాగ్నిరుద్రులబోలినాడు। ఖ్యాతిగా నొక
వేయు చేతులు గలవాడు ఘనరక్తచేలముల్ గట్టినాడు। హారకిరీటకే
యూరముల్ ధరియించి యెక్కువ తేరుపై నెక్కినాడు। మించి భాను
నిగతి బ్రకాశించినాడు। వాడు భయదాంగుడగుచు నున్నాడటంచు।
జెప్పగావిని భేరుండు డప్పుడటకు। రక్కసులతోడ జనిమహోగ్రాద్రిమెస
గ॥ క॥ ఆచక్రరాజుగనుగొని।యాచోటికి దానె రాజననుచుం భేరుం। డేచిన
కింకలుమించి ని। శాచరులన్ జూచి పలికె శౌర్యోద్ధతుడై॥ శా॥ ఓరక్షో
వరులార చూచితిరె వీడు త్యాతిమై మించిన। న్నారూఢాహవమందుగె
ల్చుటకు నేడాసన్నుడై వచ్చినా। డీరాజున్ బరిమార్చి రావణునకేనిష్టం
బు గావించి నా। భేరుండాఖ్యను ధారుణీ తలమునన్ బెంపొందగా జేసె
దన్॥ వ॥ అనిప్రతాపంబులు పలికి నిజచతురంగ బలంబుల చక్రరాజు చ
తురంగ బలములపై బురికొల్పె నప్పుడు చక్రరాజబలంబులు ఘోరంబు
గ రణభేరి వేయించి యట్టహాసంబున నట్టిట్టు చెదరక మిట్టిపడుచు గొట్ట
వచ్చిన భేరుండ బలంబుపైగవిసె తోడిబడక విడివడి కదనపడి గయ్యంబు
జేయుచు గరవాల శూలకుంత ముసలభిండివాల పరశుతోమర పట్టసపరి
ఘాద్యనేక దివ్యాయుధపాణులై యొండొరుల నఱుకుచు బొయుచు
డాయుచు దఱుముచు నుఱుముచు హుంకరించుచు బింకంబులు [illegible]చు
గొట్టుచుదిట్టుచు బెదవులు గఱచుచు మీసంబులు వడివెట్టుచు గోఱలు

గీటించుచు బాహ్యగఱచుచు కన్నులుబిక్కరించుచు గొక్కరించుచు దిక్క
రించుచు గక్కసించుచు నోండొరుల నగ్గించుచు దగ్గించుచు నార్భటిం
చుచు గిలారింపుచు నిట్లనేక ప్రకారంబుల దక్షిణోత్తరసముద్రంబుల
భంగిబాంగి పోరుచుండి తొడలుమెడలును గరంబులు నురంబులును నరం
బులు శిరంబులును నఖములు దెగిపడినవారును మొరపెట్టువారును బొ
రలువారును ప్రాణంబులు విడిచినవారును విడువజాలక యేడ్చువారును
గలిగి రణక్షోణిపూచిన మోదుగుచందంబున దోచుచుండె నప్పుడు రక్త
ప్రవాహంబు వెల్లివిరిసి భోరనిపాఱుచుండె నందు దెగిపడిన కరంబులు
మీనంబులు పదంబులు గర్కటంబులు మిగిలిపడిన తలపుర్రెలు కమఠం
బులు చెదరిపడినచర్మఖండంబులు భేకంబులు కూలినగజతురంగంబులు దీ
వులు భగ్నంబులై పడినచామరంబులు జలపక్షులు శ్వేతచ్ఛత్రంబులు డిండీర
వంబులు తునిగిపడిరక్తంబులోదేలు మిన్న శిరోజలంబులు శైవాలంబులుగా
గ నొప్పుచున్న రక్తప్రవాహంబును గాక గృధ్రాది ఖగంబు లావరించి
యున్న జూచి యనేక భూత భేతాళ పిశాచకంబులు చక్రరాజు చేసినస
మారాధనంబునకురండు రండని యొండొరులంబురికొల్పుకొనిపోయి
తద్రణ భూమి నీక్షించి సంతసించి దమలోదా మిట్లని॥ సీ॥ చక్రరాజేం
ద్రుడి దిక్కరణంబున సమారాధన మొనరించె రారె యనుచు। బి
ల్చుచు గండలుం బ్రేవ్రలు మెదళ్లిత్తో భుజియిన్చుచుండెడి భూతములు
ను। పలుమారు రక్తంబు తల పుర్రెలను ముంచి పొంచి పానముసే
యు భూతములును। గడుపులు నిపురుమి గిట్టున ద్రేపుచు బొరలియాడు
చునుండు భూతములును। గలిగిరణ భూమి యద్భుతక్రమముగాను। వి
పులమైయుండె నప్పుడు విష్ణుచక్ర। రాజుభేరుండు జూచి యాగ్రహము
జేసె।నప్పుడా గ్రహోదగ్రుడునగుచు మించె॥ వ॥ క్రమ్మఱియుద్ధసన్న
ద్ధుడై యెదిరించి హతశేషంబలంబులో వచ్చినజూచిచక్ర రాజేంద్రు
డు గనుబొమలు ముడివెట్టి కన్నుల విస్ఫులింగంబులు చెదర భేరుండుని
జూచె హుంకరించి నప్పుడా హుంకారధ్వనికి ధరణిగంపించె నాసమ
యంబున॥ సీ॥ ఆకాశముగలె దిగంతముల్ గ్రుంగెను ఘనశైలములు గడ
గడవడంకె।దపనచంద్రుల గతుల్ దప్పె ఘోరాకారులైన దైత్యులగుండె
లదరసాగె। బ్రహ్మాండభాండంబు పగిలినయట్లుండె విపరీతవాయువుల్
విసరసాగె। నప్పుడు చక్రమహారాజు పావకుడను వానిబుట్టించి యరుల
పైకిబంపెదత్పావకుడు శత్రుబలముమీద। నతిరయంబున సమ్మోహనా
స్త్రమేసె। నపుడు మేనులుమఱచుచు నసురవరులు। తామతమలోనె పో
రాడిధరను బడిరి॥ గీ॥ చక్రరాజావిధముజూచిజాలినొంది। యిదియధర్మముగ

నుకనవిశిరముచుమించని స్యకయుపసంహరించుమనిన। బావకుండుదానిమర
లించెప్రజ్ఞమెఱయను॥క॥ దనుజులపై పెంపొందక। మునువిసువగనదియువారి
ముక్కలజెవ్రులన్ ।మునుకొనితఱిగినగోపము। పెనగొనభేరుండుడపుడుభీక
రవృత్తిన్॥సీ॥పావకుండనువానిపైబడవచ్చినన్ పావకుడుమూరు తాస్త్రమే
సె।మూడుయోజనములమేనయు దేహముతోడనమర భేరుండునయ్యవిలశ
రము।గొనిపోయి వెంకటకుధరంబు చుట్టుముమ్మాఱుగాద్రిప్పించిమహిసి వేసె
గుళ్ళియున్నటువంటికూష్మాండమవనిపై బడినకై వడిరాక్షసుండునలిగి। పో
యెనాచక్రమాబలంబులనుద్రుంచి।వైచెనటదేవతలుపుష్పవర్షములను।జక్ర
రాజుశిరంబుపై జాలనించి।వచ్చి గూచక్రరాజును మెచ్చియనిరి॥గీ॥ చక్రరాజ
నీవుసకలదుర్మార్గుల।సంహరించిసాధుజనుల నెల్ల। బ్రోచినందువలనబురుషో
త్తమస్వామి।సంతసించెనింక శాంతిబొందు॥వ॥మహాత్మాసీప్రభావంబు వాగ
డబ్రహ్మాదులకుశక్యంబు గాదు కావునదుష్టులనిగ్రహించి శిష్టసంరక్షణంబు
చేసితివింక గదనసన్నాహంబుజాలించి శాంతిబొందిశ్రీవేంకటేశ్వర స్వామి
సన్నిధానంబున కరుగుమని చెప్పి దేవతలుచనిరంత చక్రరాజుయుద్ధంబున
బడిన చతురంగబలంబుల నిజయోగప్రభావంబున గ్రమ్మఱజీవితులం జేసి క
రుణాకటాక్ష వీక్షణామృతబిందు సందోహంబుల వారియందుజిలికించిన
వారుశాంతిబొంది పూర్వప్రకారంబున జక్రరాజునను వర్తించి కొలిచియుం
డిరప్పుడుత్తర దిగ్భాగంబునందు శ్రీవేంకటాద్రికిభక్తులకు రాదగిన మార్గం
బులేర్పరించి తన్మార్గంబులయందు బుణ్యాత్ములైన జనులనిలిపి వారలసం
రక్షించుటకు నందొక్కనిరాజు జేసి శ్రీవేంకటాద్రికి వచ్చుభక్తజనుల నా
దరించుచుండుమని నియమించి యీశానదిగ్భాగంబునజిక్కి చెదరియున్న
చోరులనిర్జించి యష్టదిక్కులయందునిష్కంటకంబుల జేసి దేశంబులశాంతి
బొందించి క్రమ్మఱసకలబలంబులతోడ శ్రీవెంకటాద్రికివచ్చి స్వస్వరూపం
బుననంతర్విమానంబులో బ్రవేశించి హరిదక్షిణకరంబునందు నిలిచియుండె
నిట్లుదేశంబులు సురక్షితంబులైనవెనుక స్వామికిమహోత్సవంబులు సాగు
చుండెనని చెప్పిన సూతుంజూచి క్రమ్మఱశౌనకాదు లిట్లనిరి॥సీ॥ శ్రీనివాస
స్వామిచిత్రచారిత్రము లలితకర్ణరసాయనములు । గనుక మేమెంతవిన్న
నుదృప్తిలేదు శ్రీవెంకటేశ్వరుడిట్లువెలసి శేష। గిరిమీదనుండియే క్రియలం
దునడిపించె నెవ్వరెవ్వరికి నేమేమినొసగె। దెలియగాగ్కృతయుగ త్రేతా
యుగద్వాపరముల యందంత శ్రేక్రమముగాను । జెలగివర్తించుచుండును
కలియుగమున। నేవిధంబుననుండు నాయీశ్వరుండు। నల్పుచుండిన చరిత
ముల్సన్మతముగ। దెలుపవేసూతసత్పూత ధీసమేత॥ మత్తకోకిల॥ అనిము
దంబునశౌనకాది మహారుషీశ్వరు లందఱున్। వనజనేత్రు చరిత్రముల్వాను

వాంఛలఁ డనుప్రశ్నచే। సినవినీతుడు సూతుడిట్లనె శ్రీరమేశుదలంచు
చుఁ। వినుడుసంయములార చెప్పెద వేంకటేశవినోదముల్॥ పంచచామ
రము॥ పరాపరస్వరూపుడైన పంకజాక్షుడాద్యుడై। యరాతివీరులఁ వ
ధించియద్భుత క్రమంబుగాఁ। సురేంద్రవమాని ముఖ్యులెల్ల జోద్యమంది
చూడగాఁ। ధరామరాదిభక్తులఁ ముదంబుమీఱ బ్రోచుచుఁ॥ ఉ॥ భూత
లమం దు నిల్చిపరిపూర్ణుడు తానగుచుండియుఁ జన। వ్రాతముచూడ శేషగి
రివాసుడనంగి జగంబులందు ప్రఖ్యాతినిబొంది భక్తజనులందఱు గొల్వ
గవారికెల్లసం। ప్రీతివరంబులిచ్చి బలుపెట్టుగనుండుర మాసమేతుడై॥ సీ॥
ఆ వేంకటేశ్వరుడరుదుగాగలియుగంబున ఘనమౌనముద్రనుధరించి। య
చటనర్చావిగ్రహంబు కైవడి గాను గర్మనేత్రములకు గానవచ్చు। భక్తుల
తో నైన ప్రత్యక్షమున మాటలాడకు స్వప్నంబు లందు దగిన। మాట
లొప్పుగ జెప్పు మతిమదేమను వేళ నవ్వాల జనును మాయావియగుచు।
మానవులనెల్ల దనయందు మరులుగలుగ। జేసివారలవిత్త మార్జించుకొ
అకు। వారికొకభీతిబుట్టించి వారిచేత। రూకలొప్పించికొని వారిబ్రోచు
నవల॥ క॥ మోక్షముగోరుచు దేహా। పేక్షనుమదిరోసి విడిచిపెట్టుచుదను
నే। వీక్షించు భక్తజనులకు। సాక్షాత్కారముగ జూపుసద్విగ్రహముఁ॥
సీ॥ వైకుంఠమున నుండివచ్చియున్న విమానమెక్కువగా వారికొక్క వేళ।
దగజూపునప్పుడంత ర్ధానమొందిచు నానందనిలయంబు నందునిలిచి। మొ
నసియున్నటువలె జనులకుగనుపించు నంతర్విమానంబు నందెయుండు। నా
విమానము దేవతావళులకుజూపు దీపించ నరులకుజూపకుండు। బొసగ
మనుజులచే బాహ్యపూజలందు। గుప్తముగ దేవపూజ గైకొనుచునుండు।
నరులుతను జేరికోరిన వరములిచ్చి। మహిమముల జూపుచుండుర మావి
భుండు॥ గీ॥ అల్పదాన మైననధికంబు గాజూచి। స్వల్ప పూజనైన సంత
సించి। పుణ్యమోక్షములను బొందించు భక్తుల। నెన్నవశమె వేంకటేశుమ
హిమ॥ క॥ ఘనవేంకటగిరి మహిమం। బును దలపుచువచ్చి మ్రొక్కుపు
ణ్యాత్ములకుఁ। మనమలరగ గనిపించుచు। నెనసినదయతోడ వరము లి
చ్చుచునుండుఁ॥ సీ॥ అప్రాకృతుండుదానై ప్రాకృతినిరీతి దేశప్రజలవెంట
దిరిగి తిరిగి। తనమీద మోహంబు జనియింపగా జేసి ప్రేమ జూపుచు
వారి బిలిపించి। నయభయంబులతోడ నాకొండ కిపుడుమీసొమ్ము
లుముడుపులు చెల్లింటంచు। బలుకుచు వారివెంబడినంటి ముల్లెలువెప్పిం
చుకొనుచును ధీరుడగుచు। వారపుడు వచ్చిసకలోత్సవములు వేంకటా
ద్రిమీదననడిపించు రాధ్యులగుచు। నపుడువారిని మెచ్చి భాగ్యంబులి
చ్చి। మరలబంపుచునుండు నమ్మదనగురుడు॥ తే॥ అట్టియుత్సవకాలంబు

లందుసకల । నిర్జరులువచ్చి పుష్కరిణీ జలమున । స్నానములుజేసి వేంకటేశ్వరునినఖిల । పుష్పములబూజసేతురద్భుతముగాను॥ ఆ॥ సారదిభక్ష్యభోజ్యచోష్య లేహ్యజలంబు । లర్పణంబుసేయ నేర్పుమెఱయ । నారగించు నెవరికైననుగనిపింప । నియ్యడార్క మంబునీశ్వరుండు॥ తే॥ మానితంబగు మాయావిమానమందు । దానునిజరూప మునునుండి ధరనుగృతక । కాంచనానంద నిలయమం దంచితముగ । ఘనశిలావిగ్రహము గీతిగానుపించు॥ సీ॥ స్వల్పదానమునకె సంతుష్టుడగు వారికాయురారోగ్యభాగ్యాదివివిధ। వరములనిచ్చుచు వారినిరక్షించు నతినీచజాతివారైనగాని । భక్తిశోశరణనిపర్వతంబునుజూచి నిలిచి మ్రొక్కసనుమన్నించి బ్రోచు । గర్మాధికారులు గాని మోపిజ్జన శూద్రులకును భక్తిసుస్థిరముగ । వేంకటేశునిచరణారవిందయుగళి।యందువిస్తారముగబట్టునందునలన। మూఢభక్తులగలియుగమునవిశేష।కరుణతో బ్రోచుచుండు వేంకటవిభుండు॥క॥ సాధువుకలియుగమిలపంబు ।సాధువులంగనలుశూద్రజన తతిగనుకీ ।బోధమనంబున దానిక్। మాధవు డొడగూర్చి బ్రోచుమచ్చికమీఱన్ ॥క॥ కావునగలియుగమునయం । దేవిధమునైన వెంకటేశ్వరు చెంతన్। భూవలయమునజనింపను । దేవతలేకోరుదురు సుధీయుతులగుచున్॥ వ॥ కృతత్రేతాద్వాపరంబులయందు బెక్కు వేలయేండ్లుతపంబులు చేసిన హరిప్రసన్నుండగుట దుర్లభంబుగాన గలియుగంబున ముహూర్తమాత్రంబునిశ్చలులైధ్యానించిన శ్రీస్వామిసులభంబుగా బ్రసన్నుండగుచుండు నటుగావున గలియుగంబుత్తమంబని ద్వీపాంతరములనుండు వారును సకలదేశవాసులును గలియుగంబున బ్రకాశమానుండయిన దేవుండు లేడు పుష్కరిణీతీర్థ సమానంబైన తీర్థంబును లేదది సత్యంబుకృతయు గాదిమూడుయుగంబుల వెంకటాద్రికనక మయంబుగా నుండి గలియుగంబున శిలామయంబుగా జనులకుగనిపించుచుండు దద్గిరియందువసించియున్న శ్రీనివాసస్వామిలీలావినోద విహారంబులనంతంబులై యుండుంగావున మీకుసంక్షేపంబుగా జెప్పితి నట్టివేంకటాద్రియందు నిలిచియాచార్య సమాశ్రయణంబుగలిగి విష్ణుభక్తులైన వైష్ణవులం జూచివైమానికులు సంతసించుచుందురు రన్యమతస్థులైనను శ్రీవెంకటేశ్వరునియందు భక్తిసల్పుచుండుదురంమున వారును గృతార్థులగుదురు కలియుగంబునందు జనులతిశయ విత్తార్జనపరులైయనేక దుర్గుణంబులనాశ్రయింతురుగాని హరిని నిశ్చలులై యేకాగ్రచిత్తంబున ధ్యానింపజాలరుధ్యానించి రేని శ్రీనివాసుండు ముక్తి కరతలామలకంబుగా జూపుచుండు సంతతికివైష్ణవధర్మం బుత్తమంబని చెప్పిన సూతుంజూచిశౌన కాదులిట్లనిరి॥ ఉ॥ ఖ్యాతిగశ్రీనివాసుడతి గౌరవమొప్పగ వేంకటాద్రిపై। భూ

## వైష్ణవధర్మము.

తలవాసులఁ గృపనుబ్రోచినసత్కథ వింటిమంచుచే । మాతపములఫలిం
చినవిమంచిది వైష్ణవధర్మమంటివో । సూతతదీయధర్మముల జొప్పడజెప్ప
ముసమ్మతంబుగఁ॥ వ॥ అనినఁ సూతుడుసమ్మతించి మునివర్యులఁ వి
లోకించియు । ట్లనియెఁ ధాత్రినిశుభ్ర ఘోణి ఘనదంష్ట్రాగ్రంబునో నెత్తి
తె । చ్చినమీఁదఁ ధరణీ సమేతుడగుచుఁ శేషాద్రియందుండఁగా। నొనరం
దత్కటిచూచి భూమియపుడత్యుత్సాహముప్పొంగగఁ॥ తే॥ ఇట్టులంచిమె
నుగిటిరూపయీశ్వరేశ । నిర్మలములైన వైష్ణవ ధర్మములను । జెప్పను
న్నను భూమినీక్షించి యాజ్ఞ। పోత్రియిట్లనిపల్కె సంపూర్ణదయను॥ సీ॥
వైష్ణవధర్మము ల్వరుసగానన్నియు జెప్పదేనిపుడు సంక్షేపముగను । జె
ప్పెదనెట్లన్న శ్రీవైష్ణవాచారధర్మంబు లలిగోప్యతరములరయ । విశ్వాస
హృదయులై వినినవారికిబరగతులు సిద్ధించునిష్కర్షగాను । గురుడెధర్మం
బుసద్గురుడె పరమగతిగురుడాత్మ యనినమ్మికొనినవారి । భూరిదురితమున
శియించిపోవుగనుక । నేవిధమునను గురు మర్మమెఱిగిభక్తి। నలుపగాదగు
వారు వైష్ణవులటంచు । జెప్పదగియుండుఁ లోక ప్రసిద్ధిగాను॥ తే॥ ఎన్నిపా
పములొనరించి యున్నగాని। సద్గురుని జేరిశరణన్న సమయమందె । భూరి
దురితమున శియించిపోవు గురుని । శిష్యుడై పాపమావల జేయరాదు॥ వ॥
అదెట్లనినగురు కటాక్షంబు లేకయున్నప్పుడు తెలియకచేసిన పాపంబులను
గురుండు పరిహారంబుచేయనేర్చు నాచార్యానుగ్రహంబుగలిగిన వెనుక
దెలిసిచేసిన పాపంబులగురుండు నిగ్రహింపలేడుగావున దత్పాపంబులు గు
రునిబొందునని తెలిసిబుద్ధిమంతులైన వారు పాపభీతులైయుండ వలయుసా
క్షాద్విష్ణుండెగురుండని తెలియవలయు మనుజమాత్రుండనిచూచిరేని ను
త్తమగతి సిద్ధింపనేరదు సంసార సముద్రంబునో దిగబడిపోవుచున్నసమ
యంబున నుత్తమశాస్త్రధర్మంబను హస్తంబునబట్టి వానిలేవనెత్తి మో
క్షమార్గంబనే తీరంబుననిలిపి తనకుపకారంబుచేసినగురునికి దానుబాపం
బు సేయకుండుటయు ప్రత్యుపకారంబగుచుండు నాచార్యులెట్టివారనిన
నెప్పెదవినుమని వరాహస్వామిభూదేవి నీక్షించిమఱియునిట్లనియె॥ సీ॥
న్యాయమార్గమునందె నడవడిగలవార లెలమి ధర్మాధర్మమెఱుగువారు ।
పుణ్యసత్కర్మతత్పరులగువారలతి శాంతహృదయులౌనట్టివారు । వాది
యందహంకార మమకారదంభ దర్పాదిదుర్గుణముల నడచువారు । ప్రా
రబ్ధకలితాఘ ఘోరసంసారదావానలకీల లకళుకువారు । నవనినిందాస్తు
తులకుమానావమాన । ములకుదగ్గక హెచ్చక భూతదయయు । ము
ఖ్యగుణమును హృద్భావమునుబరోప । కారమునుగల్గు గురువులే భవ్య

లంద్రు॥ సీ॥ అట్టియాచార్యుల కనుగుణులగుశిష్యు లెట్టివారనిన నీవింక విను
ము। విశ్వాసముచు భక్తివినయంబు శాంతియు గమనియ సుగుణముల్గలు
గువారు। సకలమంత్రాంతరసాధనాంతరముల యందు బరాఙ్ముఖులైనవా
రు। సర్వభారంబులాచార్యులపాదంబులందుంచి నిశ్చలులైనవారు। ననిశము
ను బాహ్యభీతులైనట్టివారు। గురుతక్క లేహరియనినమ్మికొనినవారు। మాయలను
వీడిశుశ్రూష సేయువారు। ధరనుసచ్ఛిష్యులని చెప్పదగినవారు॥ వ॥ ఎవ్వరే
నియుముముక్షువులైనవారి కజ్ఞానంబను సంసారబీజంబు నశింపవలె నదిన
శించినను అహంకారమమకారాదులువిడువవు అవివీడినను దేహాభిమానం
బువదలదు అదివదలినను స్వస్వరూపజ్ఞానంబుపుట్టదు అదిపుట్టినను ఐశ్వ
ర్యభోగాపేక్షమానదు అదిమానినను అర్థకామాది రాగద్వేషాదులువీడవు
అవివీడినను పారతంత్ర్య ప్రకారంబు గలుగనేరదు అదికలిగినను శ్రీవై
ష్ణవత్వంబు చేకూడదు అదిచేకూడినను సాత్త్విక పరిగ్రహుండుగాడు సా
త్త్వికపరిగ్రహుండైనను భాగవతపరిగ్రహుండుగాడు భాగవతపరిగ్రహుం
డైనను అనన్యార్హప్రయోజనుండుగా డనన్యార్హప్రయోజనుండైనను అన
న్యార్హశేష భూతుండుగాడు అనన్యార్హశేష భూతుండైనను అనన్యార్హశ
రణుండుకాడు అనన్యార్హ శరణుండయినను అధికారపురుషుండుగాడు అ
ధికారపురుషుండైనను అష్టాక్షరికధికారి యగును॥ సీ॥ అట్టిసచ్ఛిష్యులకా
చార్యులుప దేశమిచ్చి రక్షించురీతె ట్టులనిన। శ్రీవైష్ణవాచా రచిహ్న
మశరణంబు గానుపదేశించి కరుణబెంచి। యష్టాక్షరీ మంత్రమతిశయం
బౌత కన్ననుమంత్రమెందు లేదనుచు జెప్పి। నారాయణుడె మహోన్న
తు డతనినిమించినట్టి దేవుండు లేడనుచు బలికి। పట్టుగాద్వయ చరమప్ర
పత్తిభక్తి। నిష్టలను జెప్పి హరినిధ్యానించువిధము। జెప్పియొప్పు భర
న్యాసచతుస్సుఖంబు। నందుబొందింతు రాచార్యులైనవారు॥ సీ॥ చక్ర
గానాచార్యసంశ్రయణంబైనవెనుక గామాదుల విడిచిపెట్టి। తలపులో
నెపుడహంకారమమతలు లేక విజనస్థలములందు విమలులగుచు। మిత
భోజనంబును మిత సుషుప్తియు మిత సంభాషణంబు లాచార్యభక్తి। య
తిశాంతము పరిగ్రహంబు నారాయణ విగ్రహధ్యానవివేకగుణము। ల
భ్యసింపంగమాన సంబములమగుచు। నిలుచుహరి యందెమదియిట్లు నిల
చెనేని। యున్నతంబగు విష్ణుసాయుజ్యపదవి। నొందుదురు వైష్ణవ శ్రే
ష్ఠులుర్వియందు॥ తె॥ వేంకటేశుడనగునాతు వేడ్కమీఱ। వివిధపరి
చర్య లొనరించి విశ్వసించి। చెలగియాచార్యశుశ్రూష చే యునట్టి। ని
ర్మల శ్రద్ధవైష్ణవధర్మమతివ॥ సీ॥ వరగురువుల గన్నవస్త్రభూషణముల బ్రీతి
రెట్టింప నర్పించువారు। నాసక్తితో దదీయారాధనంబు లుదంచితంబు

గనడిపించువారు। దేశికశ్రీపాద తీర్థప్రసాదముల్ హెచ్చుగా నెంచిగ్రహించువారు। పట్టయినశేష త్వపారతంత్ర్యంబు జీవాత్మధర్మములనియలరువారు। తగనితామస రాజసద్వయమునడచి। యొనరసాత్వికనిష్ఠులై యుండువారు। శాంతియును భూతదయయును సత్యవాక్యములు నుగలవారు వైష్ణవుల్మనరిమాడ॥ వ॥ అనినవినిభూదేవి వైష్ణవధర్మంబున కుసంతసించి జ్ఞానభక్తివైరాగ్యంబులు గలవారు కర్మంబు లనేక్రమంబున నాచరింపవలయు ననినవరాహ స్వామియిట్లనియె॥ సీ॥ భూసురవిజ్ఞానభక్తివైరాగ్యము లలిగిన వారునుగర్మములను। విడువగాదగదదివేదోక్తమార్గంబు గానసల్పందగు కర్మములను। స్నానసంధ్యాదులుశ్రవణముల్ని జశక్తికొలది సల్పందగు కోర్కెవిడిచి। హరికర్పితంబని యాచరించిన జాలసంతుష్టుడగునదె సత్ఫలంబుగనుకవిప్రులు వేదమార్గక్రమమున। జన్మములు చేసిరేనియీశ్వరుడుమెచ్చి। యిష్టఫలముల దావారికిచ్చుచుండు। నాదుచేయజ్ఞములు చేతురార్యులెల్ల॥ వ॥ ఇవ్విధంబున మదాజ్ఞాధారులై నిష్కామసత్కర్మంబు నాచరింప వలయు నట్లాచరింపక మదాజ్ఞోల్లంఘనంబు చేసినవారు దోషయుక్తులగుదురు గావున సద్బ్రాహ్మణులు యజనాది షట్కర్మంబులు నాచరింపుచురందుగొందఱు బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థధర్మంబు లాచరించి తత్త్వజ్ఞులైసన్యసించి కర్మముక్తులైన ప్రణవోచ్చారణంబు సేయుచు నివ్విధంబున సన్యాసవిధి గొన్నియబ్దంబులాచరించి పూర్ణజ్ఞానోదయంబైన పిమ్మట విధివత్తుగా దండ కమండలువులు విడిచి యనఘాత్యాశ్రమం బంగీకరించి శీతోష్ణసుఖదుఃఖాది ద్వంద్వాతీతులై సచ్చిదానంద నిత్యపరిపూర్ణ బ్రహ్మానుసంధానంబు జేయుచుండ వలయు నట్లుచేసిన వారుబ్రహ్మ సాయుజ్యంబునొందుదురని చెప్పి వరాహస్వామినుతియునిట్లనియె॥ సీ॥ వెలదిబ్రహ్మము రెండువిధములై యుండుబరాపరములనందబ్రబలునందు। బరమక్షరంబపర

జీవబ్రహ్మప్రశంస.

మేక్షరంబీక్షరంబుజీవుండక్షరంబువిమల। కూటస్థుడనబడుబాటింపబరమాత్మడతడపరమేశ్వరుండతడగురుడు।పురుషోత్తముడుసర్వపూర్ణుడాబ్రహ్మాంశజుండనదగినజీవుండవిద్య। నట్టిపరిమితిలేనిదేహంబులందు।జొచ్చివెడలుచుబహుమోహశోకవార్ధు। లందుమునుగుచుదేలుచునహముబెంచి। భూరికర్మములొనరించిపుట్టుగిట్టు॥ వ॥ అట్టిజీవుండవిద్యోపాధిచేతబిన్నుండగు ననేకదేహంబు లెత్తుచుండునందుగొన్ని దేహంబులందుండి మిక్కిలి పాపకర్మంబుచేసియధోగతులంబడుచుండు మిక్కిలినిష్కామపుణ్యకర్మంబులు చేసియూర్ధ్వగతిబొందు బుణ్యపాపమిశ్రకర్మంబులుచేసిసుఖదుఃఖంబులను

భవించుచు మర్త్యలోకంబునఁబుట్టుచు గిట్టుచునుండునందు గొందఱుకామభోగాసక్తులై మరియును॥ ఉ॥ కామము చేక్రతుప్రముఖ కర్మములొప్పుగ నాచరించిసు।త్రామపురాదిలోకములదక్కక చేరిసుఖంబుఁబొందియుం। దేమఱియున్న బుణ్యతతులెప్పుడు నాశముఁజెందునప్పుడే। భూమినిబుట్టిక్రమ్మఱ నుబొవుచువచ్చుచునుందురెప్పుడున్॥ వ॥ అందుగొందఱు యోగాభ్యాసనిష్ఠులై సత్పదంబు నొందుదురనినవిని భూదేవియిట్లనియె॥ తే॥ ఘనతరములయినయోగప్రకారములను। దేవసత్కృపతో నాకుఁదెలుపవలయు। ననుచు బ్రార్థింప ముదముంది యావరాహ। దేవుడిట్లనెనా భూమి దేవికపుడు॥

అష్టాంగయోగము

వ. యోగమార్గ క్రమంబెట్లనిన గురూపదేశ క్రమంబుగా యమనియమాసనప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ సమాధులనియెడి యష్టాంగయోగంబులభ్యసింపవలయునందు యమంబెట్టిదనిన॥ సీ॥ జగతియహింసయుసత్యమస్తేయంబు బ్రహ్మచర్యంబార్జవంబు క్షమయు। నతిశయధృతి మితాహారముల్ శౌచంబు నిపదియమములవెంటననిన। సకలజీవులకున్ క్లేశంబుపుట్టింపకున్నట్టి చంద మహింసయనగ బరగు। నవనినందఱికిష్టమైదబ్బరాడకున్నట్టిచందము సత్యమన్నధనము। కోరిమాయల బన్నిగైకొనదలంపు। కుండుటస్తేయ మనబఱునొరులసతుల। మాతృభావనగాఁజూచు మతముబ్రహ్మ। చర్యమన నొప్పుచుండునో సరసిజాక్షి॥ గీ॥ పారదయభూతమైత్రియార్జవమనంగ। నకుటిలత్వమగున్ క్షమయనగనోర్పు। ధృతియునగధైర్యమనదగు మితపుభుక్తి। యనగమితభోజనము శౌచమనగశుద్ధి॥ వ॥ యమంబీపదివిధంబులం జెప్పందగు నింక నియమంబు లెయ్యవియనిన యోగశాస్త్రరతియు సత్పాత్రదానంబును సంతోషంబును లజ్జయు వ్రతంబును మతియును ఆస్తిక్యంబును నీశ్వరార్చనంబును దపంబును జపంబనననొప్పు నీదశవిధంబులయిన నియమంబులందు వాదాస్పదశాస్త్రంబులుదరపోషణార్థంబని నిరసించి మోక్షప్రద శాస్త్రంబు లభ్యసించుట యోగశాస్త్రరతియగు దనకు బ్రాప్తంబైన ధనంబు గురుద్విజాదులకు సమర్పించుచుండుట పాత్రదానంబగు లాభాలాభశుభాశుభ సంయోగవియోగమానావమాన స్తుతినిందాదుల మోదఖేదంబులు లేకయుండుటె సంతోషంబగును సుజనసాంగత్యంబువల్ల దనదుర్గుణంబులదాదలచి తన్నుదానిందించుకొని దుర్గుణంబులమాని సుగుణంబులభ్యసించుటె లజ్జయగు దాసంకల్పించిసేయు మోక్షసాధనంబు విడువకయాచరించుటె వ్రతంబగు దాజేయుయోగంబునకు రోగదారిద్ర్యసంశయ శాస్త్రవాదరసవాద దుర్జనసహవాసాదివిఘ్నంబులువచ్చినను జలింపకుండుటె బుద్ధియగు మ

తభేదపురాణేతిహాసాది సద్గ్రంథంబులను శ్రద్ధతోఁజూచి సారార్థగ్రహ
ణంబుసేయుటయె యాస్తిక్యంబగు నతితేజోమయంబైన యీశ్వరస్వ
రూపంబును గురుముఖంబుగానెఱిఁగి హృత్కమలమందు మనంబునధ్యా
నించి పూజించుటె యీశ్వరార్చనంబగు గురువాక్యంబు సత్యంబుగాన
మ్మి చెప్పిననియమంబుతప్పక కష్టంబునకోర్చినపుడె తపంబగు జప్యాజప్యం
బులయందు దనకుగురుం డుపదేశించినమంత్రంబు నిశ్చలుండై విడువక
జపించుట జపంబగు నీపదియు నియమంబులగు నిట్టియమనియమంబు లిరు
వదియు నంతశ్శుద్ధిప్రదంబులగుంగావున వీనినభ్యసించి యంతశ్శుద్ధినొందికీ
టాదిజంతువులు మెదలకుండునట్టి నిజనస్థలంబునందు జేలాజిన కుశోత్త
రంబుగా నాసనసుఖంబునిర్మించి యందునాసనంబులభ్యాసంబుసేయవల
యు నవ్విధం బెటన్నను॥ సీ॥ పద్మాక్షివినుమెను బదినాల్గులక్షలై నట్టి యా
సనములందతిశయములు। నలువొప్ప నెనుబదినాల్గాసనంబులం దధికంబు
లష్టాదశాసనంబు। లటువంటియష్టా దశాసనంబులలోన నతిశయించినవి
సిద్ధాసనంబు। భద్రాసనంబును బద్మాసనంబును సింహాసనంబునా జె
ప్పదగిన। నాలుగాసనములయందు జాలమేటి। యనగనొప్పుచునుండుసి
ద్ధాంపనంబు। పొలతియష్టాదశాసనంబులవిధములు। వినుము వేఱ్వేఱ జె
ప్పెదవిశదముగను॥ వ॥ స్వస్తికాసన గోముఖాసన వీరాసన కూర్మాసన
కుక్కుటాసనోత్తాన కూర్మాసన ధనురాసన మత్స్యేంద్రాసన పశ్చిమ
స్థాణ్వాసన. మయూరాసన సిద్ధాసన భద్రాసన పద్మాసన మతాంతరప
ద్మాసన సింహాసన శవాసనంబులను నీయష్టాదశాసనంబులందుస్వస్తికాస
నంబెట్లన్నను॥ తే॥ తరుణివిను జానుజంఘకాంతరములందు। బదములొ
దికిలగానుంచి పదిలపఱిచి। యున్నదిస్వస్తికాసనంబానరుగోము। ఖాస
నంబెటులన్నబద్మాక్షివినుము॥ వ॥ ఎడమకాలిమడమ కుడివీపుప్రక్కగుడి
కాలిమడమ యెడమవీపుప్రక్కగా మోకాటిమీద మోకాలుకదియనుంచి
కూర్చున్న నిదిగోముఖాసనంబగు నొకపాదముతొడ క్రింద నొకపాద
ముతొడమీదనునిచి కూర్చున్ననిది వీరాసనంబగు నాధారమునకుభ
యపార్శ్వముల రెండుకాళ్ళమడి మెలుకదియహత్తించిచక్కగా గూర్చు
న్ననదికూర్మాసనంబగు బద్మాసనంబుగాను మోకాళ్ళ మడమల సందుల
జేతులనుదూర్చి హస్తములనేలనూని పద్మాసనంబు పై కెగసినట్లుండుట
కుక్కుటాసనంబగు నిట్లు కుక్కుటాసనస్థుడైయుండి రెండుచేతులను మె
డనుబట్టుకొనికూర్మమువలె వెలికలబడియున్నను దానకూర్మాసనంబగు
బాదాంగుష్ఠములరెంటిని రెండుచేతులధనురాకృతిగా వీపువెనుకగాజెవుల
కుసదిగాబెట్టి యుండుట ధనురాసనంబగు నెడమతొడమొదట గుడిపాద

ము పెట్టికొని పెడమరలబడియున్న దీనివల్లనుజఠరాగ్ని ప్రకాశించికుక్షి
రోగమునశించును అభ్యాసమువల్ల గుండలినిమేలుకొల్పును బురుషున
కు దండస్థిరత్వంబుకలుగునిది మత్స్యేంద్రాసనంబగు - భూమినానున
ట్టుగా రెండుకాళ్లు చక్కగాసాచి నడుమువంచి మోకాళ్ళమీద లలా
టంబుంచి రెండుచేతులు సాచిరెండుకాళ్ళ వ్రేళ్లురెండుచేతుల బట్టి
యున్న దీనివల్ల వాయువు పశ్చిమ మార్గముగానడుచును జఠరాగ్నిపుట్టి
కడుపు పల్చనైరోగములు నశించును ఇదే పశ్చిమతాణువాసనంబగు
హస్తములురెండు నేలనూని మోచేతులురెండు నాభి యిరుప్రక్కల
నుంచి ముఖముమీదికెత్తి రెండుకాళ్లుసాచి నెమలిత్రోక పైకెత్తికొ
నియున్న దీనివల్ల నుదరగుల్మాదిరోగములు నశించి జఠరాగ్నిప్రకాశించి
విషమునైన జీర్ణముచేయు నిదిమయూరాసనంబగు - నెడమకాలిమడమ
మూలాధారమందును గుడికాలిమడమ లింగస్థానమందునుంచి యేకాగ్ర
చిత్తముగా శిరోగ్రీవాభుజంబుల జక్కగానునిచి నడుమునిక్కించి భ్రూమ
ధ్యావలోకనంబు సేయుచున్న దీనివల్లమోక్షద్వార కవాటభేదనంబగు
నిది సిద్ధాసనంబగు లింగస్తానోపరి యెడమమడమనునిచి దానిపైగుడిమడ
మ నునిచిననిదియె మతాంతరసిద్ధాసనంబగు నిదియొవజ్రాసనంబు నిదె
ముక్తాసనంబు నిదెగుప్తాసనంబగు మడమలురెండునండాధఃప్రదేశ లింగ
పార్శ్వములనుంచి రెండుపార్శ్వములురెండుచేతులబట్టి కదలకుండిన దీని
వల్లవిషములు సమస్తవ్యాధులు హరించును నిది భద్రాసనంబిదెగోరక్షా
సనంబగు నెడమతొడమీద గుడిపాదము కుడితొడమీద నెడమపాదము
నునిచి వెన్నుగుండగుడిచేత నెడమతొడమీదనున్న కుడిపాదముబొటన
వ్రేలినిబట్టియటువలెనే వెన్నుగుండ నెడమచేత గుడితొడమీదనున్న యె
డమపాదము బొటనవ్రేలినిబట్టి హృదయమందు జుబుకంబునునిచి నాసి
కాగ్రంబు చూచుచున్న దీనివల్లవ్యాధులు నశించును నిది పద్మాసనంబ
గు నెడమతొడనడుమ గుడిపాదము వెలికలనునిచి కుడితొడనడుమ నె
డమపాదము వెలికలనునిచి హస్తములురెండును రెండుతొడలమీద వె
లికలగానునిచి నాసాగ్రమందులక్ష్యంబునునిచి దంతమూలమున నాలుక
హత్తించి వక్షమందు జిబుకంబునుంచి మెల్లనివాయువును నిలిపియున్న దీ
నివల్లసర్వవ్యాధులు నాశనమౌ నిదిమాతాంతర పద్మాసనం బిదెముక్త
పద్మాసనంబగు హస్తములురెండుహత్తించి చిత్తమందు ధ్యానంబుసేయు
చు నపానవాయువు నూర్ధ్వముగానడుపగా గుండలీశక్తియుక్తమై నిలిపిన
ప్రాణవాయువునువిడువగా నతిశయమైనజ్ఞాన భోధకలుగును దీనివల్లనా
డీ ద్వారములందు వాయువునిల్చును ఈవిధముననే మరణమునొందిన ము

క్తులగుదు రిదిసద్ధపద్మాసనంబగు లింగాండోభయ పార్శ్వములయందు నెడమకాలిమడమ దక్షిణపార్శ్వమునకుడికాలిమడమ యెడమపార్శ్వము ననునిచిచేతులు రెండుమోకాళ్ళ మీదుగాసాచివికసింపబడిన వ్రేళ్ళుగా నునిచియున్న దీనివల్లమూలోడ్యాణ జాలందర బంధత్రయాను సంధా నంబుకలుగు నిదిశ్రేష్ఠమైన సిహ్మాసనంబగు భూమియందు శవమువలెవెలి కలగా కాళ్ళురెండు బొటనవ్రేళ్లుసరిగా గూర్చున్నట్లుగాసాచికొని హస్త ములురెండు పక్షమందుగదియనుంచి పండుకొనియున్నదీనివల్ల సమస్తాస నములు వేసియున్నబడలికతీరు నిదిచిత్తవిశ్రాంతి సాధనమైయుండు నిదిశ వాసనంబగు సక్రమంబుగా నాసనాభ్యాసంబులుజేసిన నాడులువశీకృతం బులై దేహంబునకు జవలఘుత్వంబులుగలిగి సర్వరోగహరంబగు శరీరం వశవర్తియగుంగావున దీనిసాధించిన యనంతరంబున ప్రాణాయామంబును సేయవలయు నదెట్లన్నను ప్రాణవాయువు నుద్దేశించుచంద్రనాడిచేత హా రించి యథాశక్తిగానిలిపి తిరుగా సూర్యనాడిచేత మెల్లగా యుదరమును బూరించి శాస్త్రప్రకారంబుగా గుంభకమునుధరియించి తిరుగా చంద్ర నాడిచేతను విడువవలెను ఏమార్గమునవిడుతునో యామార్గముననే పూ రించిధరింపవలెను మొదటిమార్గమునకంటె రెండవమార్గమున త్వరపడక మెల్లనేవిడువవలెను ఇడయందు బూరించికుంభించి పింగళనాడినివిడిచి తి రుగాపింగళనాడిని బూరించి కుంభించి యిడయందువిడువవలెను ఈక్రమం బుగాసూర్య చంద్రనాడులచేత వాయువును ఎంతయుక్తమో అంతవిడిచి యెంతయుక్తమో అంతనిండించి యెంతయుక్తమో అంతనిలుపవలెను ఈక్రమంబునజేయు రేచకపూరక కుంభత్రయంబులొక్క ప్రాణాయామం బగు నుదయమధ్యాహ్న సాయంకాలార్ధరాత్రముల కాలమున కిరువదిచొ ప్పున కుంభకములు మెల్లమెల్లనే యెనుబదిదనుక దినమునభ్యసింపవలెను ప్రాణనిరోధ మగుచుండగాను జెమటపుట్టినట్లాయెనా గనిష్ఠంబగు వడకు పుట్టినట్లాయెనా మధ్యంబగు మాటిమాటికి పద్మాసనంబెగసినట్లాయెనా యుత్తమంబగు ఇట్టియభ్యాసంబున బుట్టినచెమటమర్దనంబుచేయగా దను వునకు దృఢత్వంబుపుట్టు ఈ ప్రాణాయామముచేతను మూడునెలలు మీదట నాడిశుద్ధిగలుగును ఇది ప్రాణాయామంబగు నింక ప్రత్యాహారం బెట్లన్నను॥ సీ॥ శ్రీగురుబోధ విశేషతగలబుద్ధిచే మానసమును సుస్థిరము జేసి । యామదియందింద్రియావాప్తులడగింప నందొప్పుగానిల్చు ననిలగ తులు । కమఠమంగములను గలదనియ్యాకకుక్షి యందుదాచినరీతి నఖి లవిషయ । కరణానిలములజక్కగబట్టినిల్పగా నదియెప్రత్యాహారమునగ బరగు । డానదేహంబును స్థిరత్వంబునొందు । దీపితంబుగనేకాగ్రదృష్టి

నిలుచు । దీనిసాధించియటమీఁద ధ్యానయోగ । మెలమిసాధింప వలెనది యెట్టులనిన॥ తే॥ రోషదుర్భావవైకల్య దోషములను । గపటవంచనములవీడిగర్వమడచి । సద్గురూక్తులు వినుచును శాంతుఁడగుచు । నెపుడుకరువలినూని సర్వేంద్రియములు॥ చ॥ అపురుపసంహరించి గురుడానతియిచ్చినలత్స్యముద్రలం। దుపముగ మానసంబునిడి యొండొకచింతయులేక చిత్తముఁగ । జపలతబొందనియ్యకను షడ్విదసంజ్ఞలనూనిలోనదా । నెపుడుజలింపకున్న నతిశింపొనరించెడి ధ్యానయోగమై॥ వ॥ ఇదిధ్యానయోగంబగునింక ధారణా యోగంబుల జెప్పెదనెట్లనిన జరణాది జానుపర్యంతంబు పృథ్వీతత్వంబగు దదధిదైవతంబైన బ్రహ్మాసులకారయుక్తంబైన వాయుధారణాభ్యాసంబున ధ్యానింప బృథ్వీజయంబుంగలుగు జాన్వాదినాభిపర్యంతంబు జలతత్త్వంబగు దదధిదైవతంబై విష్ణునివికారయుక్తంబైన వాయుధారణాభ్యాసంబున ధ్యానింపం సలిలజయంబుగలుగు నాభ్యాది కంఠపర్యంతంబగ్ని తత్త్వంబగుదధిదైవతంబైన రుద్రునివర్ణ యుక్తంబైన వాయుధారణాభ్యాసంబున ధ్యానింప నగ్నిజయంబు గలుగు గంఠాదిభ్రూమధ్యపర్యంతంబు వాయుతత్త్వంబగుదదధిదైవతంబైనమహేశ్వరుని యకారయుక్తంబగు వాయుధారణా భ్యాసంబున ధ్యానింప బవనజయంబు గలుగు భ్రూమధ్యాది బ్రహ్మరంధ్రపర్యంతంబాకాశతత్త్వంబగుదదధిదైవతం బయిన బిందుమయగగన శరీరుండైన సదాశివుని ఆకారయుక్తంబయిన ప్రాణపవన ధారణాన్యాసంబున ధ్యానింపదన్మయత్వంబును గగనజయంబును గలుగు నిట్లు ధారుణియువారుణియు నాగ్నియు మారుతియు వ్యోమియునన బంచధారణాధ్యా నాభ్యాసంబున బంచభూతజయంబుగలుగు నివ్విధంబున॥ తే॥ ధ్యానమభ్యాస మొనరింప దలగకపుడు । మానసమునిల్పుమదినూని మతియునిల్పు । బుద్ధినిలచిన నానందపూర్తిగలుగు । నదియెధారణ యండ్రు యోగాఢ్యులవని॥ వ॥ ఇదిధారణా యోగంబగు నింకసమాధి యెట్లన్నను ఆసన జయంబునను గుంభసిద్ధచేతను నిర్మలంబయిన జ్ఞానభాను ప్రకాశంబుచేత మాయాంధకారంబునడంచి ప్రకాశించుమానసంబు నాత్మాకాశంబు నందుగూర్చి తన్మయత్వంబునొంది శాంతవర్తనుండైనసంయోగవియోగ సుఖదుఃఖంబు మఱువబ్రహ్మపద ప్రాప్తివలననిశ్చలానందభరితంబైన స్వానుభవబోధయే సమాధియగు నియ్యష్టాంగయోగాభ్యానంబు జేయువారికి నీసమాధియెఫలితార్థంబగునట్టి వారుబ్రహ్మపదంబునొందిరి సవిస్తారాష్టాంగయోగంబులగు నింకమంత్రలయహఠరాజయోగంబులు గలవనినవరాహస్వామికి మ్రొక్కి భూదేవియిట్లనియె॥ గీ॥ దేవయష్టాంగయోగము తెలియవింటి।రమ్యతరమంత్రలయహఠ

రాజయోగ । ములను నామీఁద దయయుంచి తెలుపుమనిన । శ్వేతకిటి భూమిదేవినీక్షించి పలికె॥ వ॥ ఇంక మంత్రయోగవిధానంబు జెప్పెద నెట్ల

మంత్రయోగము

నిన॥ సీ॥ పూనివిసర్జన స్థానంబునందుండు నాధార కమలంబునందునళమ। సలునాలుగైన రేకులయందు దీపించు విఘ్నేశుఁడచ్చట వెలుగుచుండు । దానికినంగుళ ద్వయముపై నుత్పత్తికైన స్వాధిష్ఠాన మందుబవమ । మ అలకావలనుండు నదియాఱుదళములందజుఁడుండునుత్పత్తి కాథ్యుఁడగుచు। మెఱసియష్టాంగుళములకు మీఁదడాది । ఫాంతమర్ణా వళినిగూడి పదిదళ ముల । నొప్పుమణి పూరకము నాభి నుండువిష్ణు । డచటదాస్థితికర్తయై యమరుచుండు॥ సీ॥ పదియంగుళ ములకుఁబై హృదయస్థానమందనాహత పద్మమమరుగాడి । కాంతవర్ణంబులుండగ బదిరెండైనదళములచే నొప్పు దానియందుసధికుఁడై లయకర్తయైనరుద్రుండు నావలబదియునురెండంగు ళముల । పైవిశుద్ధంబుండు భాసింప గంఠంబు నందున నాల్గు పదాఱుద ళము । లందువెలుగు సదాశివుండచటనుండు । దానిమీఁదట నాజ్ఞాభిధా నచక్ర । మునహాకారక్షకారంబులొనరునచట । నున్నతంబుగ బరమా త్మయొప్పుచుండు॥ సీ॥ అటదానిపైన సహస్రారకమలంబు శీర్షంబునందు భాసిల్లుచుండు । నదియమృతస్థానమగు దేహవృక్షంబునకు మూలమైగు రునకునివాస। మగునిడాపింగళం దేకవింశతి సాహస్రారమూఱు మఱిమట్చ తంబు । లైనశ్వాసములు ప్రాణాపానకలితంబులై హంసయై యజపాఖ్య నొందు । నట్టి శ్వాసలుగణపతి కారునూఱు । జలజసంభవవిష్ణురుద్రుల కుసంఖ్య । దప్పకాఱేసి వేలు సదాశివునకు । నొగిపరాత్మకుగురున కొ క్కొక్కవేయి॥ వ॥ ఈక్రమంబుగాసప్త కమలంబులందు హంసలు చొ క్కుచున్నప్పటి కాలక్రమంబెట్లన్నను॥ సీ॥ ఆధారమునహంస లాఱునూ ఱర్పితం బగువేళ కొకటియరైన గడియ । పదినాడులునగుబరగ స్వాధి

లయయోగము.

ష్ఠానమం దారువేలైన హంసలొనర । నర్పితంబగువేళ కగునుషోడశఘటి కలునర్థఘటికవిగడయలుబది । క్రమముగా మణిపూరకమున కాఱ్వేలై న హంసలర్పిత మగునపుడుపదియు।నాఱునరగడియవిగడియలును బదియు। నగునవాహతమున హంసలాఱు వేలు । నర్పితంబగుతఱి బదియాఱువర లు । గడియలొక పదిమైలవి గడియలగును॥ సీ॥ ప్రకటవిశుద్ధంబు నకు వేయుహంసలు నర్పితంబగువేళ కగునురెండు। గడియలుసగమైన గడియ పదాఱు విగడియలు హంసలక్కడికి నాల్గు । నాజ్ఞయందు సహస్రహం సలర్పితమగునపుడు రెండరగడియలువిగడియ । లునుబదాఱునుహంసలు

నునాలుగగు సహస్రారంబు నందు సహస్రహంస । లర్పణముగాఁగ రెం
డునరైన గడియ । లలవిగడియలు పదియాఱు హంసలొక్క । నాలుగ
గుచుండు నీరీతిననుదినంబు।జరుగునరువదిగడియలై జనులకెల్ల॥ వ ఇవ్విధం
బుననుద యోద్యదయ పర్యంతము నడుచుచున్న నిరువదియొక్క వేయి
న్నూఱు హంసలు నిజమయినందగు నిట్టి యజపాగాయత్రి మహా
మంత్రంబు గురుముఖంబు గా నెఱిఁగి యరుణోదయంబున శుచియై పద్మా
సనాసీనుండై కూర్చుండి నాసాగ్రావలో కనుండైన సప్తకమలాది దేవ
తలకు న్యాసధ్యాన పూర్వకంబుగా నర్పణంబు సేయుచుండుట మంత్ర
యోగంబగు నింకలయయోగం బెట్లన్నను విజనస్థలంబుల భద్రాసనాసీ
నుండై కూర్చుండిదిగువనాసికాగ్రమునుజూచుచుబైననున్నది సాధించుచు
బైనాసికాగ్రంబుజూచుచు దిగువనున్నది సాధించుచు రెండుతర్జనులచేత
రెండుకర్ణద్వారంబులును రెండనామికలంతో రెండునాసికాద్వారములును
బంధించిశిరంబునంచి యేకాగ్రమనస్కుండై వెలివిశో నూర్ధ్వంబుగాజూడఁ
నది రాధాయంత్రంబును ముద్రయగు దన్ముద్రాభ్యాసంబు చేయుచున్న
బ్రహ్మరంధ్రంబునందు ప్రణవనాదంబు దశవిధంబుగా మ్రోయుచుండు నది
యెట్లన్నను మొదటజనిగతియురెండవది తరంగఘోషంబు మూడవదిఘం
టారవంబు నాల్గవది వేణునాదంబు నైదవది వీణాస్వనంబు ఆఱవది భేరీధ్వని
యేడవదితాళధ్వని యెనిమిదవదిశంఖారవంబు తొమ్మిదవది మృదంగశ
బ్దంబు పదివది ప్రణవనాదంబు మేఘనాదంబు కరణివినంబడు నిట్లుక్రమ
క్రమంబుగా నాదానుసంధానంబు సేయునందు నవనాదంబులు లయించి
దశమం బైనమేఘ నాదంబున శ్రవణసహితంబుగా మనంబునునిచి ని
ర్వ్యాపారంబుగానిలిపి బాహ్యంబుమఱచునేని యమ్మానసంబుతోడ
బవనంబుసులీనంబగు నిదినాదలీలానందకరంబైన లయయోగంబగు నిం
క హఠయోగంబెట్టిదనిన రాజపరిపాలితంబైన సుభిక్షరాజ్యమందు హఠ
యోగమంటపంబునిర్మించి యందుండి యభ్యాసంబు సేయవలయు నదె
ట్లన్నను సుగంధపుష్ప ఫలభరితంబైన వనమధ్యంబు గాలిచొరకుండ
సూక్ష్మ ద్వారయుక్తంబైన మంటపంబునిర్మించి దినదినంబును గోమ
యంబున శుద్ధిసేయించుచు నందువసించి యతిశయించిన యుప్పుపులుసు
కారమును జేదువగఱు వస్తువులును నవతలడిలతైలములును నజాదిమాం
సమత్స్య మీనంబులును రేగుపండ్లును మిక్కిలిపసరాకు కూరలను దధిత
క్రకులుద్ధములును శర్కర మొదలయిన స్వాతీకాహారంబులును గ్రహిం
పవలయు దాభుజింపదగిన యన్నంబు నాల్గుపాళ్లుచేసి యొకపాలువిడిచి
మూడుపాళ్ళీశ్వరప్రీతిగా భుజించుచు త్రిఫలంబు లౌషధంబుగా గ్రహిం

చుచు ప్రాతస్స్నానోపవాస వ్రతస్త్రీసాంగత్యాది దేహప్రయాసంబులు విడిచి యనలార్కాదితంబులైన కాకలంబడక శీతవాతంబులందుండక యోగ షట్కర్మంబు లాచరింపవలయు నది యెయ్యవియనిన ధౌతికర్మ వస్తికర్మ నేతికర్మ త్రాటకకర్మ నహుళీకర్మ కపాలభాతి కర్మంబులన నాఱుగలవందు ధౌతి కర్మంబెట్లన్నను॥ తే॥ వినుము మృదు వస్త్రమొక నాలుగ్రేళ్ల వెడుపు। పొసగబదియైదు చేతుల పొడవుగలిగి। నట్టివస్త్రంబు తేటనీళ్లందు దడిపి। మెల్లమెల్లగ లోనికి మ్రింగవలయు॥ సీ॥ అటుమ్రింగి యావలనతి వేగమునదీసి యటుమీదవింశతి హస్తసంఖ్య। గలవస్త్రమును మెల్లగా ద్రిగమింగుచు దీయుచునుండగా దీపనంబు। గలుగవపానమ్ముగంత నాళముగుండ వెడలింపబైత్యంబు వెడలిపోవు। నదియభ్యసింపగా నక్షిరోగములు కాసశ్వాసముఖరోగ చయములడగు। గురుముఖంబు గానిమర్మమరథధౌతి। గజకరణియ నరోప్పునీ కర్మమొనర। నభ్యసింపగ వాయువులన్నితనకు। వశములై నిల్చుచుండునో వారిజాక్షి॥ వ॥ ఇక వస్తికర్మంబెట్లన్నను నాభిపర్యంతముగా నీళ్లయందు జొచ్చి అధోద్వారమందు క్రోవియుంచి కుక్కుటాసనస్థుండై కూర్చుండి యపానవాయువుచేతను జలమును మీదికినెగయజేర్చి తిరుగనధోద్వారము వనాజలమునువిడుచుచున్న దినశూలలు గడ్డలునుమహోదరాలు వాతపిత్తశ్లేష్మముల వల్లబుట్టిన సమస్త వ్యాధులును బోవును సప్తధాతు చక్షురాదింద్రియాంతఃకరణప్రసన్నతయు శాంతియు క్షుత్తునుంగలిగి సర్వదోషభయములను బోగొట్టునిది వస్తికర్మంబగు నింక నేతికర్మంబెట్లన్నను జానిడుపొడుపుసూత్రము మలినములేని నేతిలోదడిపి ముక్కుగోళములచే భీల్చి నోటవెడలదియ్యగా దీనగఫశోధనమై దివ్యదృష్టియుగలుగు నిది నేతికర్మంబగు నింకద్రాటకకర్మంబెట్టిదనిన గదలని చూపుచేత సూక్ష్మమైన గండిని. యేకాగ్రచిత్తముగలవాడై కన్నీరుపొడమిన దనుకజూడగా దీన నేత్ర రోగములుపోవు నిదిబంగారు పెట్టెనలె గోప్యము చేయదగినది యిది త్రాటక కర్మంబగునింక నహుళికర్మం బెట్టిదనిన దీవ్రమైన వేగమున గడుపునుగుడి యెడముగా ద్రిప్పగాదీన కడుపులో మందాగ్ని విడిచి దీపనంబు గలిగి పాచనాదులు గలిగిఆనంద మిడిసమస్తరోగ దోషములనుబోగొట్టును హఠయోగమునకు శ్రేష్ఠమైయుండును దీననహుళికర్మంబగునింక కపాలబాతికర్మంబెట్టిదనినలోహకారకుడుకొలిమితిత్తులూదినట్ల రేచకపూరకంబులు చేయగాదీనగఫదోషమును పోవునిదికపాలబాతికర్మంబగు నీక్రమంబుగాధౌతివస్తినేతిత్రాటకనహుళిక కపాలభాతియనునీషట్కర్మంబులుక్రమంబుగానభ్యసింప రోగరహితంబులై నాడులు వశవృత్తులగుచుండునప్పుడుసి

ద్ధాసనాసీనుండై కూర్చుండి రేచకపూరకకుంభకయుక్తంబైన ప్రాణాయా మపూర్వకంబుగా షణ్ముఖీముద్రాభ్యాసంబు చేయుచుండునది తదనంతరంబు నసుషుమ్నా నాడికిగారణమైనమూలాధార బ్రహ్మరంధ్రంబుగలదు ఆరంధ్ర మేతత్త్వమనియు నిడపింగళానాడులు ముఖమనియు జెప్పుదత్కారణంబు చేనమృతంబు స్రవించు నయ్యమృతంబు స్రవించిపోవుటచే మనుష్యశరీర మునకు మృత్యువుగలుగును దదమృతము నిల్పుటకై మడమచేత యోని స్థానంబును లెస్సగానొత్తిపట్టి గుదము నూర్ధ్వముగా నెగయనొత్తియపా నవాయువును మీదికాకర్షించి బలాత్కారంబున నూర్ధ్వంబుగా నాకుం భనంబు సేయ నదిమూలబంధంబగు దీనిచేత బ్రాణాపాన వాయువులును నాదబిందువులును నైక్యమై యోగసిద్ధి ప్రదంబగు నపానవాయువు మీది కెగసి యగ్నియందు బొందుచుండగా నప్పుడగ్ని జ్వాల వాయువుతోగూడి పొడవుగావృద్ధిబొందు నప్పుడగ్నిపురుషా వాయువులు ప్రాణవాయువును బొందు నివ్విధంబున దేహమందుబుట్టిన యగ్నిమిక్కిలి ప్రజ్వరిల్లనందు నిద్రించిన కుండలీశక్తితపింపబడి మేల్కొనికట్టచేత గొట్టబడిన భుజంగ స్త్రీవలెనిశ్వాసంబుపుచ్చి చక్కగా సుషుమ్నాద్వారముప్రవేశించి శాం తమై బ్రహ్మనాడి నడుమబొందుగనుక దదభ్యాసంబు జేయుచున్నమూ శక్తి మూకుంచితం బగు మధ్యశక్తిమేల్కొను నూర్ధ్వశక్తిపాతంబును నొ వుపవనుండు మధ్యమార్గంబునంజననోపు నదియును గాక మూలంబాకుం చితంబైనాభి కొత్తివది యుడ్యాణబంధంబగు గంఠంబు సంకుచితంబైచ బుకంబు ఱొమ్మునొత్తిన నదిజాలంధరబంధంబగు మూలంబాకుంచితం బైనప్పు డపానవాయు లెగయునంతలో హృదయమందున్న ప్రాణంబుదిగి నాభియందపానునిం గలయునప్పుడు కుంచితంబైన నాభినివెనుకనొత్తిన ప్రాణాపానంబులు కలసివెన్నంటి పోవునంతలో గంకనికుంచనంబడచిన యమ్మారుతనందష్టంబైన కుండలింబడనూకి మధ్యబిలంబునం జారబడిన న్మయుత్వంబునొందు నప్పు డంతరానాళంబు నిశ్శబ్దంబగు గంఠముద్ర నంబుదాగినిల్పగా సర్వపరిపూర్ణ పరిభావనసిద్ధించు నీప్రకారంబుగా న కుంచిత కంఠ నిరోధంబాదవినప్పు డమృతంబగ్నిలో బడక స్వానుభూతి లోకమై ప్రాణిని నిశ్చలానందంబునొందించు నదియుకుంగాక॥ సీ॥ వ

యోగియగువాడు వజ్రాసనమునుండి నయమొప్పగా వామనాడిచేత
నాలోనగుంభించినట్టి మారుతమును మెల్లనె విడిచి యామీదమరల ।
క్షీణనాడిచే తనువెలుపలి వాయువును మెల్లనేంగోసికొనరదీసి । యప
డు కేశ నఖాగ్రపర్యంతంబు నదికట్టి కుంభకంబచట జేసి । వామనాడినివి
వ నవ్వలగపాల॥ శోధనంబగు శ్రమవాతబాధలడగు । గొమ్మయిదిసూ

భేదనకుంభకంబు। శోధివినుమింక నుజ్ఝాయికుంభకంబు॥ సీ॥ తగనోరుబం
ధించి తనముక్కు గోవుల నుంచివాయువునుబూరించి కంఠ। మునధ్వ
నిబుట్టించి మొనసిహృదబ్జంబుదాక లోనికిదీసితనువునందు। ప్రాణునిగుం
భించి పరగ నిడానాడిచేతను విడువగాశ్లేష్మహరము। ననుజఠరాగ్ని మ
హావృద్ధియగు ధాతుగతరోగములునేడు గ్రసుముగాను। నడచుచుండిన
గూర్చుండి యైనదినంబు। గోప్యముగనిట్టియుజ్ఝాయికుంభకంబు। క్రమ
ముగా జేయదగునుసీత్కారమనెడికుంభకంబేను జెప్పెదగొమ్మవినుము॥
తే॥ వసితనాసాపుటములచే వ్యావరింపబడినసీత్కారమనెడు కుంభకము
సుఖము। నందుజేయగనిద్రయ్యు నాకలియును। దెలియకుండును స్వచ్ఛంధ
దేహుడగుచు॥ వ॥ అదియెట్లనిన నాడికచేతను చెక్కిళ్లచేతను వాయువునుస
దాపానముసేయగా నతడాఱునెలలకు సకలరోగరహితుడై యోగినీచక్ర
సమానశక్తిగలవాడై రెండవకామదేవుండన దగియుండు నిదిసీత్కారకుం
భకంబగునింక సీతళియనుకుంభకంబు జెప్పెదనెట్లన్నను॥ తే॥ యోగిరస
నంబుచేత వాయువునుమెల్ల। గానుబూరించిపూర్వప్రకారముగను। గుం
భకముజేసి నాసికాగోళమునను। విడువబహురోగబాధలువీడిపోవు॥ వ॥
ఇదిసీతళికుంభకంబు నింకభస్త్రికాకుంభకంబు జెప్పెదనెట్లనిన పద్మాస
నాసీనుండై యుదరగ్రీవంబుచక్కగానిలిపి నోరుతెఱ్ఱగామూసి ప్రాణవా
యువును ముక్కుచేత వ్యాపింపజేసి వేగవిడిచిబ్రహ్మరంధ్ర పర్యంతంబు
వ్యాపించిన మేఘధ్వనితోగూడగూడి వాయువును హృదయ పద్మపర్యం
తము చికించుక నిండించినిడిచితిరుగా నాప్రకారంబుగానె పూరించివిడిచి
మఱియునాకీతినెపూరించుచు రేచించుచుగ్రమ్మఱ గాలిమితిత్తులూదినట్లు
రేచించిపూరించుచు దేహమందున్న వాయువునుబుద్ధిచేత జలింపచేయు
చుండగా నెప్పుడైన బడలికపుట్టిన గాలిచేతగడుపునిండిన సూర్యనాడిచేత
వాయువును విడువగా బడలికదీసును గడుపునుజులుకనగు నప్పుడంగుష్ఠా
నామికలచే ముక్కుబిగబట్టి వాయువునుగుంభించి యిడానాడిసవిడిచినవా
తపిత్తశ్లేష్మములు నశింపగా జఠరాగ్ని ప్రకాశించుచు సకలనాడిమలవి
మోచనంబగు బ్రహ్మవిష్ణురుద్రగ్రంథులు చేదింపబడునిదిసుఖప్రదంబైనభ
స్త్రికాకుంభకంబింక భ్రమరికాకుంభకంబుజెప్పెద నెట్లంటేని॥ క॥ పురుష
ముళ్లందధ్వనివలె। మఱిమఱిపూరించి భృంగియానందముతో। నరుదుగ జేసి
నాదము। కరణిని రేచింపవలయు గ్రమముగనెపుడున్॥ క॥ ఈరీతినభ్యసిం
చిన। వారలకానందమూర్ఛపరచిత్తమునం। దారూఢిగజనియించును। గా
నవమగునిదియె భ్రమరికాకుంభకమా॥ వ॥ ఇంకమూర్ఛాకుంభకంబుజెప్పె
దనెట్లన్నను॥ తే॥ రహినిభూరించిజాలంధరంబునొనర। బెట్టియునితరసద్భో

ధవృత్తిలోన । నిలిచి జీవుని జొక్కించి నించుచుండు । నదిమనోమూర్ఛయను
కుంభకాఖ్య నొందు॥ వ॥ ఇంక కేవల కుంభకంబు జెప్పెద నెట్లన్నను రేచక
పూరక కుంభకంబులు విడిచి స్వభావంబుగా మారుతి ధారణంబు జేసి
నిజ బోధానంద మగ్నుడై చొక్కి యున్నదే కేవలకుంభకంబగు నిట్టి కుం
భకం బభ్యసించు సిద్ధుడైన వానికి త్రిలోకంబులందు దుర్లభంబైన కా
ర్యంబు లేదు సర్వస్వతంత్రుండై యుండు నిట్టి హఠయోగంబు యమని
యమాసన ప్రాణాయామాద్యష్టాంగయోగ త్రిబంధాష్ట కుంభకము
ద్రాది సాధనంబులచేత నీయోగంబు ద్వాదశాబ్దంబు లభ్యసింప సిద్ధియ
గు నదియెట్లంటేని ప్రథమాబ్దంబునందు రోగరహితుండగు ద్వితీయా
బ్దంబున కవిత్వంబు జెప్పు దృతీయాబ్దంబున విషజయుండగు జతుర్థాబ్దం
బున క్షుత్తృష్ణానిద్రాలస్యంబుల జయించు బంచమాబ్దంబున వాక్సిద్ధి
నొందు షష్ఠాబ్దంబున ఖడ్గాభేద్యుండగు సప్తమాబ్దంబున భూమి నంటకుం
డు నష్టమాబ్దంబున నణిమాద్యష్టయిశ్వర్య సంపన్నుడగు నవమాబ్దంబు
ననభోగమనుండగు దశమాబ్దంబున మనోవేగుండగు నేకాదశాబ్దంబు
న విశ్వవశత్వంబు గలవాడగు ద్వాదశాబ్దంబున సాహాదీశత్వంబు
నొందు నిక హఠయోగంబు జెప్పెద నదిసూక్ష్మాష్టాంగయోగ పూర్వకం
బుగా నభ్యసింప వలయు నెట్లనిన॥ సీ॥ ఆహారనిద్రాదు లాశేంద్రియ
వ్యాప్తులడచి శాంతత నొంద నదియమంబు। నిశ్చల గురుభక్తి నిస్సంశయ
ము సుయోగానురక్తి తృప్తి యేకాంతవాస । పరతయు వైరాగ్య భావం
బు కరుణ నిగ్రహమును నియమంబు సహజ సుఖము । నొసగు నాసన
ము నందుండుట నిస్పృహత్వంబు నొందుటయు నాత్మను మనంబు । నది
మికుదిరించి నిల్పుటే యాసనంబు । ప్రకట రేచక పూరకుంభకసమేత।
మైన శ్వాసలలోన బ్రయత్నముగను । కుదుర జేసిన యది సుద్ధకుంభకమ
గు॥ వ॥ ప్రాణుని స్థిరంబుగా నిలిపి ప్రపంచం బనిత్యంబని తలంచుటే ప్రా
ణాయామంబగు నంతర్ముఖంబైన నిర్మల చిత్తంబున జైతన్యజాలంబుల
నడచుటయు బహుప్రకారంబులై జనియించు మనోవికారంబుల నేర్ప
రించి ద్వికార గ్రాసనంబుచేసి మనంబును నిర్వ్యాపారంబుగా నిలుపుటే
ప్రత్యాహారంబగు స్వస్వరూపాను సంధాను భావంబుచే ద్వితీయతార
హితాత్మాను భవంబున సర్వ ప్రపంచంబు నాత్మగా నెఱింగి సకల భూ
తదయాసమత్వంబున నిత్యతృప్తిం జెంది యుండుట ధ్యానంబగు నంత
ర్బాహ్య ప్రకాశం బేకంబుగా స్వతేజోమయంబుగా బరతత్వంబు నుద్దే
శించి తదీయధారణంబు జేయుచు జిత్తంబును జునిగి పోసిక నిలుపుటే
ధారణంబగు దద్ధారణాధ్యానంబునం జిత్తం బేకాగ్రంబగు నప్పుడు జీవా

త్మ పరమాత్మయందు జలశర్కరన్యాయంబుగా గలసి యఖండబోధనమచే సమాధియగు నిట్టి సూక్ష్మాష్టాంగంబుల బ్రకాశించు నారాజయోగంబునకు లక్షణంబు సంక్షేపంబుగా జెప్పెదనెట్లన్నను హంసాక్షర సిద్ధాసన కేవల కుంభక నాదములను నీనాల్గింటివలన రాజయోగంబు బొప్పునందు సాంఖ్యతారకామనస్కములన త్రివిధములుండు నందు సాంఖ్యంబెట్టిదనిన॥ సీ॥ పంచతన్మాత్రలు పంచభూతంబులు పంచీకృతంబులై ప్రబలుచున్న। సకలేంద్రియంబులు సర్వవిషయ జాలములు గుణత్రయకామముఖవికార। ములుగాను ధనువులు మూడునుగా నవస్థలుగాను దగనన్న దలచి యెఱుగు। నటువంటి యెఱుక నేనని నిశ్చయించి విక్షేపావరణములు జదిమినైచి। తానుదనలోనె తనుదాను దలఛితలచి। యన్నిటికిమీద శేషించి యచలవృత్తి। నుండుటది సాంఖ్య యోగమై యొప్పుచుండు। గురు ముఖంబున నీయోగ మరయవలయు॥ వ॥ ఇవ్విధమున సాంఖ్యం బెఱింగి తారకంబభ్యసింప వలయు నదెట్లన్నను॥ క॥ అరగన్నులతో నైనను। మురువలరగ రెండు కనుల మూసియు నైనన్। బరమాత్మను లోచూపున। గురిగా నీక్షింప వచ్చు గురుభక్తుండై॥ తే॥ చంద్ర సూర్యాంతరములందు సహజముగను। వెలుగు తారకములయందు విమలబిందు। నమర గూర్పగ నదితారకాఖ్యయోగ। మై ప్రకాశించు లక్ష్యత్రయంబు నగుచు॥ వ॥ అది బాహ్య మధ్యాంత ర్లక్ష్యమునలన నొప్పునందు బాహ్య లక్ష్యం బెట్లన్న బహిర్నాసికాగ్రావలోకనంబును నోమారుతంబులం గూడి స్థిరంబుగా నిల్పునందు జతురంగుళ ప్రమాణమున నైల్యమును షడంగుళ ప్రమాణమున ధూమ్రమును నష్టాంగుళ ప్రమాణమున రక్తమును దశాంగుళ ప్రమాణంబున దనరంగ ప్రభయును ద్వాదశాంగుళ ప్రమాణమున పీత ప్రకాశమునగు నీయయిదు పంచభూత వర్ణంబులై యెదుటం దోచునప్పు డపాంగ దృష్టుల వెనుక గూర్చి శీర్షము మీదికి జొనుపుచు నిశ్చలచిత్తుండై చూడనందు జంద్ర ప్రభ గానవచ్చు నదియునుంగాక॥ తే॥ కర్ణ నాసాపుటాక్షి మార్గముల వ్రేళ్ల। నమర బీడించి చిత్తంబు నచటనిల్పు। బ్రణవ నాదంబు వినవచ్చు బ్రకటదీప। కళలు నవరత్న కాంతుల గానవచ్చు॥ వ॥ ఇది యాత్మ ప్రత్యయ ప్రకాశంబైన బహిర్లక్ష్యంబగు నింక మధ్యలక్ష్యవిధం బెట్లన్నను॥ గీ॥ కంటిపాపల రెంటిని గదలనీక। మానసములోన భ్రూయుగ మధ్యమందు। జొనిపి తన్మధ్య మునునుండు సూక్ష్మబిలము। లో బ్రవేశించి చూడనాలోననపుడు॥ క॥ మెఱుపులు నక్షత్రంబులు తరణీశశి ప్రబలుభూత తతివర్ణములు। స్వరుచలి వెనయుచు లోవల। బగిపరి విధములుగ మెఱియు భావము

లోనన్॥ వ॥ మఱియునిరవధికంబగు నాకాశమును గాఢాంధ కారంబైన
మహాకాశమును గాలాగ్ని నిభంబైనపరాకాశంబును నధికప్రకాశంబై
న తత్త్వాకాశమును గోటి భాను సంకాశంబైన సూర్యాకాశంబును
నగు నియ్యాకాశ పంచకంబు నవలోకించు నతండు తన్మయుండై నిర
వకాశ సదృశుండగు నిది మధ్య లక్ష్యంబగు నింక నంతర్లక్ష్యం బెట్ల
న్నను॥ క॥ ఆపావకచంద్రార్క । వ్యాపకమై పంచభూత వర్ణకలితమై ।
యాపోజ్యోతి రసంబిల । రూపాశ్రయ మగుచునుండు రూఢప్రజ్ఞన్॥ క॥
చక్షుర్మధ్యం బునబర । మాక్షరమై రణ్యసచ్చిదమృతాంకురముల్। సా
క్షిగ బాహ్యాంతరముల । నీక్షించుచు నిత్యసుఖము నెనయుచునుండున్॥
క॥ ఆయమృతాంకు రయుగళము । నాయకమై స్ఫటికరుచుల నైల్యంబు
గను । చ్ఛాయల నెనయుచు బవర । స్థాయుని నెలవగుచు జీవతారకమ
య్యెన్॥ వ॥ నీరహస్యంబు సద్గురూప దేశక్రమంబుగా నెఱిగి బాహ్యాంత
రములకు నడిమి శృంగాటకంబున సం దాకారదీపితరగ్రనీవారశూకాణు
వగుస గుణపంచకంబు నీక్షించుట తారకాంతర్లక్ష్యంబగునది యునుం
గాక సరస్వతీ నాడిచంద్ర ప్రభానిభంబై మూలకందంబునందుండి దీ
ర్ఘాస్థి మధ్యంబున బిసతంతుకైవడి విద్యుత్కోటి సంకాశంబగు బ్రహ్మ
రంధ్ర పర్యంతంబు వ్యాపించి యూర్ధ్వగామినియై సర్వసిద్ధిప్రదయగు ద
త్స్వరూపంబు నాత్మయందు భావించుచు పాలోర్ధ్వ కోల్లాటమాడ లం
బున స్వస్వరూపమందు లక్ష్యంబుంచి చూచుటె పరమాంతర్లక్ష్యంబ
గు నివ్విధంబున॥ మ॥ అనిశంబున్ ఘనతారకాఖ్య పరయోగాభ్యాసమున్
చేయగా । మనుమున్ మారుత మంతరంగ సుఖమర్మజ్ఞత్వమున్ బొందు
నందను కూలంబగు నంతరాత్మ పరమాత్మా నందమున్ బొందు నింకొన
రంగానమనస్క యోగ విధము న్నుత్సాహినై చెప్పెదన్॥ సీ॥ ఆయా
శ్రమములగు నలహంస మార్గంబులకు గుడిమెడముల లలితనీల । కాం
తులదగును దగజ్యోతులందు భాస్వరతర దర్పణ చ్ఛాయలమర । వెలు
గగా దన్మధ్యములయందుసూక్ష్మాతి సూక్ష్మంబులై నట్టిసుషిరములను ।
మానసంబున నిల్పినూని యంతర్లక్ష్యముచు బాహ్యదృష్టినిమ్మ లఘు
టించు। నదియె ఘనశాంభవీముద్ర యగుచునుండు రెండుజాముల దను
కకూర్చుండిదీని నభ్య సింపగమౌన సంబవని గతుల । నిలుచు నేకాగ్ర
భావము నిలుచునపుడు॥ సీ॥ వివుకులబలుకులన్ విపిధ చిత్రమునైన తల
పుల దనయందె నిలిపికొనుచు । నటపరమాత్మయం దంతరాత్మనుగూ
ర్చి తానందె లీనమై తగనివాత । దీపంబుకైవడి దేజరిల్లుచు నిస్తరంగాబ్ధి
వలెనంతరంగమందు ! నవఘోకయూపంబు విధుశోక శబ్దంబు గొలుపిగతే

చరీముద్రనంటి। యచలితానంద రసమగ్ను డగుచుఁజొక్కి। వరమునో
న్మనియున్మన్య వస్థనొంది। చలనరహితా మనస్కంబ జాడ్యనిద్ర। యోగ
నిద్రయు నారాజ యోగిపొందు॥ వ॥ ఇట్టిరాజయోగికి జాగ్రత్స్వప్నసు
షుప్తితుర్య తుర్యాతీతంబులను బంచావస్థలుంగల వవియెయ్యవి యనిన
జతుర్వింశతి తత్త్వాత్మకంబైన దేహంబు తాగాదని పంచవింశకుఁడైన దే
హితానని దెలిసినదిజాగ్రత్తగు మనంబు నింద్రియ బృందంబుతోడ నాత్మ
యందు బొందించి ధ్యానింపఁగా నమ్మనంబు సర్వవిషయ వాసనాసంగర
హితమై బాహ్యాంతరంబుల మెలంగు గేవల బహిర్ముఖంబుగాక తన్ను
దాను దరుచుచుండుటె స్వప్నంబగు నిదియభ్యసించుచున్న మనంబు
బాహ్యముందువిస్తరిల్లకసుస్థిరంబై మాయాజాలంబనిత్యబనిసత్యవస్తువందు
బొందుచున్నప్పుడు బహిర్గ్రస్తివచ్చిన నదెప్పు ననంతర్ముఖంబై జగంబని
త్యంబుగా నాత్మ సత్యంబుగా నెఱిఁగి నిత్యభోధనొంది యుండుటే
సుషుప్తియగు జీవేశ్వరభావంబులనొందు నాత్మయందు నిలిచినమనంబు
బాహ్యభావనారహితంబై వరంబును భావించును భావించునిట్లు పురు
షపురుషోత్తము భావంబులన నుభయాత్మకంబగు చైతన్యంబునం
బొందియమ్మనంబు విషయ వాసనావిముఖంబయిన సర్వేంద్రియవ్యాప్త
లతోడ దేహాభిమానంబువిడిచి విరక్తిమార్గంబున సంసారభంధ విము
క్తమై యాత్మానుభవామృత పానంబునంజొక్కి తన్మయంబయి స్వాతం
త్రతబాసి యాత్మ పరతంత్రంబగుచుండు నంతజీవుండు స్వతంత్రుండై
యీశ్వరాధీనుడగుచుండగా నీశ్వరభావంబు సత్యంబగు నప్పుడు సర్వ
మయుండైన పరమేశ్వరునియందు మనంబు పరవశంబగుచుండు నప్పుడా
త్మయెందాక మనోదృశ్యంబగు నందాకమనోన్మని యగునప్పుడు ద్రష్టృ
దృశ్యంబులులేక తానుతానై ధ్యానవిరహితంబయి చిన్మాత్రంబైన యెఱుక
తానే సత్తామాత్రంబగుచుండు నప్పుడు మనంబు కనదు లేదనరాకుండు
నది యున్మన్యవస్థయైన తుర్యంబగునది స్వారాట్టను బరమపదం బగు
చుండునందు సహజంబుగా మానసంబు సకలేంద్రియ ప్రాణానిలంబు
తోడ లీనంబగు నిదియమనస్కంబయిన తుర్యాతీతంబగుచుండు కల
దులేదన రానిదై ఘటాకాశంబు మహాకాశంబునం బొందినట్లేకంబయి దే
శకాల కార్యకర్తృ కారణగురుత్వ లఘుత్వాద్యవస్థలు తోపకుండు న
ది సహజామనస్కంబగు బట్టువిడుపులేనిదై చెప్పఁజూపరాక సహజభా
వంబయి యున్ననది యజాడ్య నిద్రయగు గడగనరానినిస్తరంగసముద్రం
బు తెఱంగున నాద్యంతరహితంబయిన నభంబు కరణి నింతింతనరాక నం
తట నిండి మలయజమందు గంధంబును వృక్షంబునం దనలంబును నిత్యు

దండంబునందుమాధుర్యంబును క్షీరంబునందు ఘృతంబును దిలలందుదై
లంబునెట్లుండునట్లుచరాచరప్రపంచంబునందుబరమాత్మ పరిపూర్ణంబయి
యిదమిదమనరాకుండుటది యోగనిద్రయగునిదియంత సాధకునకనుభ
వంబుగాదది యనుభవించినయోగికినను భవైకవేద్యంబగుంగాని వాక్కున
జెప్పగూడదవియెట్లంటేని॥ శా॥ బ్రహ్మంబద్వయవస్తువౌననెడిశాస్త్రంబెప్పు
డుఁ బల్కుచుఁ। బ్రహ్మోహమ్మనునంతమాత్రముననే బ్రహ్మంబుగానేర్చునే।
బ్రహ్మంబైన గురుస్వరూపముమదిఁ భావించి భావించి తా। బ్రహ్మంబైన
టువంటికాలముననే బ్రహ్మంబనం గూడునే॥ వ॥ ఇట్లువాఙ్మానసగోచ
రంబయిన బ్రహ్మానుభవంబె రాజయోగంబగు మూఁదుచెప్పిన మంత్రల
యాది యోగంబుల యనుభవ క్రమంబెట్లంటేని॥ సీ॥ మంత్రయోగంబుచే
మారుతసంచార దేహమర్మంబుల దెలియవచ్చు। లయముచే దనలోని
లలిత ప్రణవనాద సూత్రంబుమదినూని దొక్కవచ్చు। హఠముచేజరను
రోగాళిని మృత్యువుఁ గేడించి ధీరుడై గెలువవచ్చు। సాంఖ్యయోగంబు
చేసకలేంద్రియ వ్యాప్తుంరయుచు దన్నుదానరయవచ్చు। దారకముచే
తదనువులో దాను వెలుగు। చున్నరీతినిగనవచ్చు నుచితమైన రాజయోగం
బుచే పరబ్రహ్మమందు। బొందియుండగవచ్చు సంపూర్ణుడగుచు॥ సీ॥ వి
నుమంత్రయోగి కన్నను గొప్పలయయోగి లయయోగి కధికుడు లాసి
మైన।హఠయోగి యగుచుండు హఠయోగికన్నను సరసమానసుడైనసాం
ఖ్యయోగి। యధికుడౌ వానికన్నను దారకాయోగియధికుడగుచు నుండు
నతనికన్న। సాంఖ్యతారకమున సంగ్రహించుకొని వైరాగ్యభావన నొప్పు
రాజయోగి। యుత్తమోత్తముడని చెప్పనొప్పునతని।కన్నగొప్పైనయో
గిలేడవనిమీద। నతడు సంసార మందున్న నడవినున్న। సకలనిర్లేపుడగు
చుండు శాంతుడగుచు॥ వ॥ అట్టిరాజయోగి లక్షణంబులు మఱియునెట్లం
టేని॥ సీ॥ తనుకాంతియును బురుత్వంబు వాఙ్మాధుర్య మును మితభాష
ణంబులునుభూత। దయవివేకమును శాంతముమితాహారంబు మానస
స్థైర్యంబు మైత్రిగుణము। గలవాడు రాజయోగను నిష్ఠుడంబరమధ్యస్థకల
శంబుమాడ్కిలోన। వెలినెందునంటక వెలుగునంబుధిమధ్య గతకలశము
రీతిగానులోను। వెలసిబరిపూర్ణుడై నిండివెలుగుచుండు। వాడునొక వేళ
సంసారి వలె నటించు। నొనరనొక వేళ వైరాగ్యమొందుచుండు। వాని
యనుభవమెఱుగ రెవ్వారుధరణి॥

క॥ ధర్మాధర్మములొల్లక।కర్మాసక్తుండుగాక కాదానవకఁ।నిర్మల
భావుండగుచును। మర్మజ్ఞతనతడు మెలగుమనుజులలోనఁ॥ క॥ ప్రాజ్ఞుండై

దేహముతో । నజ్ఞానులయందు మెలగునందున నాయో। గజ్ఞుని మది దెలియ
కనే । యజ్ఞానులునింద జేతురాగతిగనుక॥ తే॥ దూషణము జేయువా
రికి దొల్లియతడు । చేసియుండిన పాపము జెందుచుండు । భూషణము
జేయువారికి బుణ్యఫలము । నెపుడు పొందగ నిర్లేపుడగుచునతడు॥ సీ॥ పె
ద్దవన్నసహంబు బెంచి హెచ్చుచుచిన్న వసనదగ్ధుభాగ్య మతిశయముగ ।
గలిగినను హ్వాంగిగర్వింప డొకవేళ దనకు లేవడియైన దగ్గిపోడు । ప్రారబ్ధ
మనుభవింపక తీరదనియ సహ్యముగ దుఃఖసుఖంబు లనుభవించు। నబ్జప
త్రంబులో నంటని జలబిందువట్లు సంసారమం దంటకుండు । జగతిగల బం
ధమూలంబు తెగిన దాని । వచ్చికొన్నాళ్లు నిలిచినపగిది దేహ। మూలమ
గు కారణావిద్య మొదలు తెగిన । నాయువును వచ్చియున్న నాళ్లుంగముండు॥
చ॥ అటునలె గారణంబు తెగినప్పటికైనను గార్యజాలవి । స్ఫుటతనుయు
గ్మముండు బరిపూర్ణ చిదాత్మవికారిగాక త । ద్ఘటముల నాశ్రయించిగు
ణకర్మములం దెపుడంటి యుండక । నటులని రోసి యెన్నటికి సాక్షి
గనుండు సుఖస్వరూపమై॥ సీ॥ అలబుద్ధియును జిత్త మాయహంకృతి
మానసంబును బుత్విగ్గణంబుగాగ । బ్రణవవర్ణంబు యూపస్తంభమును
గాగ ఘ్రాణదశేంద్రియపంక్తి యచట । బశుసమూహముగాగ భాసురా
నాహతనాదంబు విహితమంత్రంబుగాగ । బాసగదత్పశువుల బోధాగ్ని
లో వేల్చి జ్ఞానామృతము సోమపానముగను । ద్రావిచొక్కుచు మోక్ష
కాంతాసమేతు । డగుచు వేదాంతసూత్రంబు లనెడి కర్ణ । తుండలంబులు
వెలుగ త్రికూటమార్గ । మందు సాంత ప్రముఖమిత్రులలరి కొలువ॥ సీ॥ ప్ర
కటితాచారముల్ బంధకమ్ములుగాగ దశశమాదులు సుచత్రములుగాగ ।
ప్రాణపంచకము సేర్పడిగాడిగాగ ననూనహృద్వచనంబు నొగయుగాగ।
వరకర్ణనేత్రముల్ వాహనంబులుగాగ రహివివేకంబు సారథియుగాగ । ద
గునిష్క్రియత్వమే త్యాగధ్వజముగాగ బ్రబలయోగరథంబుపైన నెక్కి ।
పోయి నడిమి సరస్వతిం బొందిగంగ । యమునయును నిల్చు నాల్గుమార్గము
లనడుమ । నవభృథస్నానమొనరించి యాత్మసోమ। యాజియననొప్పుచుం
డు సీయువనిమీద॥ ఉ॥ ఇంతటయోగపూరుషుడు హెచ్చుడు తగ్గుడు సంతతం
బునే। కాంతమునన్వసించు దనయందు బరాత్మను జూచుచుండుద। ద్భ్రాంతు
లుతన్ను దిట్టినను బక్కున వారిని దాను దిట్టడే । శాంతుడు రాజయోగిఘ
నసద్గురుడంచు వచింపగాదగుక॥ సీ॥ అటువంటి దేశికుండిటువంటి యో
గంబు నెంతింత శిష్యునకియ్య రాదు । శిక్షించి కాంతిపరీక్షించి తనశిక్షకొ
ప్పిన వారికే చెప్పవలయు। దనశిక్ష కొప్పని తామసాత్మునకు దత్వంబు
జెప్పిన వాడు దంబుడగుచు । వేషభాషల చేత విఱ్ఱవీగుటకా వాడు తత్త్వ

ష్టుండుగా నుగనుక । దొలుత నే శిష్యుడగువాని దుర్గుణముల । జూచితిట్టుచు
గొట్టుచు సుగుణములను । జెప్పగా వలె దన శిక్షకొప్పకున్న । నూరకయు
శాంతిబొంది తానుండ వలెను॥ తే॥ అంతియే కాని దుర్గుణుం డైనవాని ।
దాబరీక్షింప శిక్షింపదలచ నేని । వాని దుర్మార్గములు తనమానసమున । నిలిచి
కోపము బుట్టించు నిక్కముగను॥ క॥ కోపంబెవ్వరి కైనను । దాపము బు
ట్టించు గనుక దామస శిష్యుల । జేపట్ట దగదు పట్టిన । దాపత్రయ హేతు
వగును దన శాంతి చెడుగ॥ క॥ దుర్గుణముల విడువకస । ద్వర్గంబును గూడి
నట్టి వాడతిశయదు । ర్మార్గుండగు వైరాగ్యము । భగ్గుమ సెప్పినను వాడు
పట్టుగ విడు నే॥ వ॥ ఇంక సచ్ఛిష్యుడెవ్వడనిన సాదన చతుష్టయ సంప
న్నుడై వంచనలే కమరచోర క్రూరగుణంబులు విడిచి పరమ శాంతి
గలవాడై మోక్షాసక్తుడై గురుసేవ చేసి తద్గుర్వనుగ్రహంబునకు
బాత్రుడైనవాడు దేహాభిమానంబు విడిచి ప్రణవ పూర్వకంబుగా
వేంకటేశాను స్మరణంబు జేయుచు నిజయోగ ఫలంబున సుషు
మ్నా ద్వారంబు భేదించికొని యర్చిరాది మార్గంబున జని పరంబునం
జెందు నట్టి యోగాభ్యాసంబు జేయలేకున్న నత్యంత గురుభక్తి గలవాడై
తత్కటాక్షంబున భక్తిజ్ఞాన వైరాగ్యంబున నభ్యసించియు పశాంతి బొంది
జ్ఞానని యహంకరింపక యుండవలయు నదెట్లన్నను॥ క॥ జ్ఞానాహంకా
రంబే । మానవులను జెఱుచుగాన మతిమంతులు తత్ । జ్ఞానాహంకారం
బులును । మానుచును శాంతులగుట మంచిదిగాదే॥ క॥ ఉపశాంతి లేని
మనుజుల । జపతపములు యోగవిధులు సవనాదులిలన్ । గపటములై చెడు
గావున । నుపశాంతియ పరమధర్మ ముత్పలనేత్రా॥ వ॥ జ్ఞానభక్తి వైరా
గ్య యోగంబులకు ననేక విఘ్నంబులు గలుగుచుండు తద్విఘ్న నివారం
బగుట కొక్క యుపాయంబు గలుగు నెట్లన్నను వేంకటాద్రియందు సన
కసనందన తీర్థం బతిగోప్యంబయియుండు నరులకు దెలియరాకుండు ద
త్సమీపమందు బాపవినాశని తీర్థతీరంబు సిద్ధస్థలంబయియుండు మార్గ
శీర్ష ద్వాదశీదినం బరుణోదయ కాలంబున స్వామి పుష్కరిణీ స్నానంబు
సేయుచు త్రయోదశీదినంబు మొదలుకొని సనకసనందన తీర్థంబున గ్రుం
కుచు బునఃపునర్వేంకటేశ్వర దర్శనంబు జేయుచు శ్రీమదష్టాక్షరీ మంత్ర
జపంబు సేయుచు యోగాభ్యాసంబు జేయుచున్న విఘ్నంబులు నశించు
యోగంబులు సిద్ధించు బాపవినాశన తీర్థ సమీపంబున నతిగుప్తంబైన
కాయరసాయనంబను పుణ్యతీర్థంబు గలదు తత్తీర్థంబు పానంబు జేసిన దే
హంబు దివ్యంబగు బరీక్ష తత్తీర్థపానంబున దేహంబు సిద్ధి వహించు నటు
వలె దృఢకాయుండైనవానికి శ్రీ వేంకటేశ్వరుని కైంకర్యంబు । జేయుటెప్పుడు

పార్థంబగునట్టి కైంకర్యంబు శక్తినించకుండఁ జేయకుండిన స్వామిద్రోహియ నందగుంగావున సదా శ్రీవేంకటేశ్వరకైంకర్యమే సేయుచుండవలయునని వరాహస్వామి భూదేవికుపదేశించిన క్రమంబు వ్యాసమునీంద్రుండు తెలిసి తదుపదేశక్రమంబు నాకొనతిచ్చె నావృత్తాంతంబు మీకుం జెప్పితిననిన సూతుంజూచి శౌనకాదులిట్లనిరి॥ ఉ॥ సూతమహానుభావ పరిశుద్ధములైతగు యోగమర్మముల్। ఖ్యాతిగ భూమిదేవికి నఖండకృపన్ గిటిసెప్పగా మహా। ప్రీతిని బాదరాయణుడు పెంపువహించి గ్రహించినట్టి వా। గ్వ్రాతము నీకు జెప్పుటను వాసిగ జెప్పితి నీవు మాకహో॥ సీ॥ సంతోషమయ్యె వేదాంత వేద్యుండైన వేంకటేశార్చనావిభవములను। మాకు దెల్పుచుటన్న మది

## శ్రీవేంకటేశ్వరాష్టోత్తర ప్రభావము.

సంతసించియా సూతు డిట్లనియె సంప్రీతి మెఱయ। సనకపూత్ములార మీర డిగిన విధముగా ఘనుడైన శేషుని గపిలగురుడు। ముదముతో నడుగని మ్మగ శేషుడనెనిట్లు మునినాథ వినుమది ముఖ్యముగను। గురుతరంబు హరిప్రీతికరము పరము। గోప్యనీయము మది పాపహారము। రమ్యమష్టోత్తర శతంబు రమ్యఫలద। మగుచు దీపించునది యిట్లు సనినవినుడి॥ గీ॥ స్వర్ణ దిని బుట్టినట్టి సువర్ణకముల। జలమును గొని దెచ్చి వెంకటేశ్వరుని బ్రహ్మ। దేవు డష్టోత్తర శతంబునై వెలుంగు। నామముల బూజజేసి సానందుడగుచు॥ తే॥ స్వామిచే సర్వలోకపితామహుండు। సకల కామ్యార్థముల నంది సంతసించె। నట్టియష్టోత్తర శతంబునైన నామ। ములబఠించుట కెవరైన మంచదగాను॥ వ॥ ప్రణవ పూర్వకంబుగా శ్రీవేంకటేశాష్టాక్షరీ మహా మంత్రంబు న్యాసయుక్తంబుగా జపంబుజేసి హరికి సమర్పించి తదనంత రంబున ధ్యానావాహనార్ఘ్య పాద్యాచమన స్నాన వస్త్రయజ్ఞోపవీత గంధాక్షతంబులు సమర్పించి వెంకటేశాష్టాక్షరమంత్రంబు జపించి శ్రీవేంకటేశాయనమ యని యష్టోత్తర శతనామంబుల నుచ్చరించుచు పాదాది శీర్షపర్యంతంబుగా సర్వాంగార్చనంబు జేసి ధూపదీపనైవేద్య తాంబూల సువర్ణ పుష్పకర్పూర నీరాంజనమంత్ర పుష్ప ప్రదక్షిణ నమస్కారంబులు సమర్పించుచు దదేక ధ్యాననిష్ఠుడైన భక్తునకు శ్రీవేంకటేశ్వరుండు ప్రసన్నుండై యైహికాముష్మిక ఫలంబులనిచ్చు నీయష్టోత్తరశతంబతిగోప్యంబగు శ్రద్ధాభక్తులుగలవారై గురువిశ్వాసంబుగలిగి గురుముఖంబుగా దెలిసి పఠించినవాడు కృతార్థుడగునంచు జెప్పెనని సూతుండు శౌనకాదులతో మఱియునిట్లనియె॥ చ॥ కపిలమునీశ్వరుండడుగగా మును శేషుడు సంస్మరించిని। ప్రకటముగాను దత్క్రమము కర్థమపుత్రున కొప్ప జెప్పె నా। ననిమిత ప్రభావమగు నాకపిలుండుపదేశమిచ్చె మీ। కిపుడెఱిగించితిన్

వరమునీశ్వరులార తదీయగోప్యముల్ ॥ క॥ ఈయష్టోత్తర శతమును । బా
యనిసద్భక్తిఁ గొండ బారాయణమ్ముల్ । జేయుమహాసాత్త్వికులకు। నాయహిగిరి

నైమిశారణ్యమునులు వేంకటాద్రికివచ్చుట.

వాసుడిచ్చునవ్య యుపదముల్ ॥ చ॥ అనవిని శౌనకాదులుమహాద్భుతమందు
చు వేంకటేశ్వరుఁ గనుఁగొననిశ్చయించుచునఖర్వతరంబగుభక్తిచేత నేమనుట
కుదోపకున్న విధమిప్పుడుసూతుఁడుసూచియిట్లనెన్ మునివరులార మీకిపుడు
ముచ్చటగానిక న్నమి సెప్పెదన్ ॥ తే॥ తెలుపుడనసూతుజూచి యాదివ్యము
నులు । పలికిరిట్లని వేంకటపర్వతంబు । చూడవలెననిమాకుబల్వెడుకాత్మ ।
లందుజనియించె శ్రీవేంకటాద్రిమహిమ ॥ క॥ వినిమాశ్రవణంబులుబత్రి। ప్రీతినిబొం
దెను నేత్రములకు ద్రేముఘనంబై । జనియించెను వేంకటగిరి । కనుఁగొనివచ్చెద
ముసూతకరుణోపేతా ॥ మ॥ అనియమ్మౌనులు పల్క సూతుఁడుమునీంద్రా
ళిన్ విలోకించియి । ట్లనియెన్ తాపసులార మీరచటికిం కాలస్యముల్ జేయ
కం । జనియావేంకటశైల శృంగమును నాశ్చర్యంబుగాఁజూచి యం। దొస
రన్ శేషగిరీశ్వరుం గనుఁడిపొండుత్సాహముప్పొంగఁగన్ ॥ మ॥ అనియాసూ
తుఁడు వేంకటాద్రివిభవం బాద్రీనివాసోన్నతం । బుచుసామిత్వమునొందు
తీర్థమహిమంబుల్ భూవరాహాఖ్యనొం । దినవారాయణుచిహ్నము ల్మాత్రి
యు దద్దివ్యప్రభావంబులన్ । వినిపింపన్ విని సంయముల్ చెలఁగియువ్వేళం
బ్రయాణంబులై ॥ సీ॥ గౌతమజాబాలిశక్యపాంగీరస శ్రీవత్సకౌత్సమై త్రే
యపులహ। కణ్వగార్గేయ మృకండు భరద్వాజకౌశిక దేవలక్రతుపులస్త్య।
ముఖ్యులైనట్టిసన్మునులంద ఆనైమిశారణ్యమును వీడియప్పుడుగంగ। సా
న్నిధ్యమున జేరిస్నానంబు లొనరించి యుటజనిగౌతమియందు కృష్ణ । వేణి
యందును గ్రుంకియావిమలమార్గ । మందుగలపుణ్యతీర్థంబులందు గ్రుంకు।
లిడుచుసద్భక్తితోవేంకటేశుఁజూచు। వాంఛతోవచ్చియమ్మునివరులునెల్ల ॥
వ॥ శ్రీవెంకటాద్రికి ప్రదక్షిణంబుగా గపిలతీర్థంబునకువచ్చి తత్పరిముఖం
బులయందు గ్రుంకులిడుచు వేంకటాచలారోహణంబు చేసి మేరుగిరిసమా
నంబులై సువర్ణప్రభలనొప్పుచున్న శృంగసమూహంబులను నవరత్నకాం
తిస్థగితంబులైన సానుదేశంబులను ఫలపుష్పభరితంబులైన పుణ్యవృక్షస
మూహంబుల సుగంగాసమానంబులైన యనేకపుణ్యతీర్థంబులను శుకపిక
కలకంఠ మరాళమయూర ప్రముఖవిహంగ సమూహంబులను సింహవ్యా
ఘ్రవరాహప్రముఖ మృగగణంబును గరుడగంధర్వ యక్షకిన్నర సమూ
హంబులను వినోదంబుగాజూచుచు నందుగలపుణ్యతీర్థంబులయందు స్నా
నంబులు సేయుచుసామగానంబులొనరించుచు నచ్చి యప్రాకృతజలపూరితం
బును గనకకమలకల్హారపరివృతంబునైన స్వామి పుష్కరిణినిదర్శనంబు చే

సి సభామంటపంబునంగునిలచి శ్రీవేంకటేశ్వర దర్శనంబుచేసి మ్రొక్కుచు
బులకాంకురితశరీరులై యానందబాష్పధారాపరిపూరితనేత్రులై గద్గద
కంఠులై వేదవేదాంతగుంభితోక్తుల ననేక ప్రకారంబులుగావినుతించి తద
నంతరంబున॥ సీ॥ శ్రీనివాసునిజూచి యానందపరవశులై జడల్జీరాడనా
డియాడి। యిదమిద్ధ మననేరకెవ లేని ముదముతో నిందిరేశ్వరుచెంత నెగిరి
యెగిరి। భగవదావేశసంభరితాత్ములై నిల్చిచక్కగాజిందులు ద్రొక్కిద్రొ
క్కి। ఘనపదక్రమజటాకలిత సర్వంబుల సకలవేదంబులు చదివిచదివి। ని
లిచినిష్ఠాగరిష్ఠులై నిరుపమానుండైన శ్రీస్వామిసౌందర్య మానసచేత। గను
లపండువుగాజూచి మనములచట। మగ్నములుచేసి భక్తినమ్రాత్మనివరులు॥క॥
అష్టోత్తరశతనామము। లిష్టముగానుచ్చరించి హేమాబ్జములన్ । సృష్టిస్థితి
కారణునా। శిష్టులుపూజించిపురుషుడు చిత్తములలరన్॥ సీ॥ అప్రాసుకోటి
సూర్యప్రకాశాంగుండు నాజానుబాహుండునచ్యుతుండు। పరిపూర్ణచంద్ర
బింబసమానవదనుండు మందస్మితాస్యుండు మాధవుండు। సలలిత మకర
కుండలయుక్తకర్ణుండు మణికిరీటోజ్జ్వలమస్తకుండు। శ్రీవత్సలాంఛనాం
చితదివ్యవక్షుండు లలితపీతాంబరాలంకృతుండు। శంఖచక్రధరుండు సద
బ్జపత్ర। లోచనుండు పరాత్పరుండు లోకకర్త। యైననారాయణుండు ద
యాళుడగుచు। మానులనుజూచిపలికె సమ్మతముగాను॥చ॥ మునివరులార
మీరిటకు ముచ్చటగానను జూడవచ్చినం। దునబహుభక్తిపూర్ణులనితో
చెనుమీకువరంబులేమియి। త్తునుదగదెల్పుడందఱును దూరమువచ్చితిరం
చుబల్కగా। ఘనఘనతాప స్తోత్రములు వేంకటనాధునిజూచి మ్రొక్కు
చున్॥ సీ॥ పలికరిట్లసి పరబ్రహ్మస్వరూప వాఙ్మానసాతీతుడవైననీవు।
వైకుంఠముననుండి వచ్చి వేంకటగిరి యందున్ననిన్ను మేమనిశమాత్మ। లం
దుజూచుచునుందు మాదివ్యమంగళ విగ్రహుండవు శ్రీవేంకటాద్రి। యందు
జూచితిమిచర్మాక్షులతో నింతేచాలుమాకు వరంబులేలనింక। కరుణతో
మాకు మోక్షమార్గమునుజూప। వలసినదెకాని మఱివేఱెవరమునొల్ల।
మనిననారాయణుడు దరహసితవదను। డగుచుమానుల జూచియిట్లనియె
మగిడి॥ మ॥ మునులారా బరిపూర్ణకాములు మహాముఖ్యుల్ జగత్పావను
ల్। గనుకన్ మీరువరంబు లొల్లమనినిష్కామత్వమున్ బొందినం। బువసం
తోషముబొందితిన్ బరమశాంతుల్ మీకుగామ్యార్థముల్। పనిలేదా
త్మల మద్గుణానుభవమేపాటింపుడ శ్రాంతమున్॥ క॥ మీమనములునే
దెలియుట। కై మేలు వరంబులడుగు డంటినిమీని। ష్కామత్వము
గంటిసమీ। కీమీదటమత్పదంబు నిచ్చెద బ్రీతిన్॥ క॥ ఘనతరకామ్యార్థ
ములను। మనుజులకొసగుచును విపులమహిమాఢ్యుడనై। యనుపమమగు

బ్రహ్మోత్సవ। మొనరగనంగీకరించుచునుండెద నిచటన్॥ సీ॥ మొనసికన్యామాసమునను హరోత్సవ మిందుమాకజుడొనరించినాడుగనుక। వానిసంకల్పంబువరుసగా సేవృద్ధిబొందింపదలచి యీభూప్రజలను। గొండకురప్పించి కోరువరములిచ్చి యఖిలభోగంబు లిందనుభవింతు। నిట్టిశాలీల బట్టి గాథలవుచు భజనచేయుచునుండు భక్తజనులు। దూరముగనున్న డగ్గఱ జేరియున్న। వారికి ప్రార్థములనిచ్చి వారివాడ। నగుచు రక్షించుచుండు దేహాంతములను। బుణ్యగతిని వారికో పుణ్యులార॥ క॥ అని హరి పలికిన పలుకులు। విని ముదమందుచును మానిభులట వారల్। వినుతించుచు బంచాబ్దము। లోనరగ శేషాద్రిమీదనుండిరి వేడ్కన్॥ క॥ అటుపిమ్మట మానుల వెం। కటగిరి నాయకుడుసూచి కరుణను మీరి। చ్చటనుండ సేలనాశ్రమ। మిటమీదట జేరుడోము నీశ్వరులారా॥ సీ॥ అని యప్పుడానతిచ్చిన వేంకటేశ్వరునకు శ్రీభూసిళలకును మ్రొక్కి। వీడిపోవుటకు గాల్లాడక హరిమోముల చనోత్సవముగాజూచిచూచి। యానందభాష్పంబు లక్షుల వెడలగా నిగమాంతసూక్తుల బొగడిపొగడి॥ తెనియుకాస్వామిసుందర రూపమున జిత్త సిరజాతములందు నిలిపినిలిపి। తన్మయత్వంబు నొందియాతపసులప్పు। డాయనంతునివిశ్వమోహనుని బాయ। జాలకందుండి యందఱు జాలిచాల। నొందగా నిట్టులసియె బద్మోదరుండు॥ తే॥ పరమమునులారనిర్గుణబ్రహ్మనైన। నేనుసగుణవిలాసమున్మానవులకు। జూపి రక్షింప దలచి యిచ్చోట నిలచి। యుండినట్లుండు నంతట నిండియుందు॥ఉ॥ కావునమద్వియోగమిలగల్గదుపూర్వవివేకికింతటన్। నావిమలస్వరూపమును నాటగజూపుచు నుండుగానస। ద్భావనచేత వాడునను గట్టిగనంతట జూచుచుండు మీ। రావిధమున్ గ్రహించిచనుడక్కడనిక్కడ నేనెయుండుదున్॥ తే॥ పుణ్యతమమైన నైమిశారణ్యభూమి। కరుగుడని మాని వర్యుల కానతిచ్చి। మానముదలను ధరియించి శ్రీనివాసు। డప్పు డర్చాకృతినినిల్చెనద్భుతముగ॥ తే॥ అప్పుడందు శిలావిగ్రహంబుకరణి। నమరియుండిన శ్రీవేంకటాద్రివిభుని జూచిముని నాయకులు చాలజోద్యమంది। పూర్ణభావనచే హరిబొగడిరపుడు ॥శ్లోకములు॥ సరోజపత్రేక్షణసంసుసాధుంలోకపాలనం। చరాచరాత్మకప్రపంచసాక్షి భూతమవ్యయం। పురారిపద్మజామరేంద్రపూజితాంఘ్రిపంకజం। స్మరామి వేంకటేశ్వరంచ సాగరాత్మజేశ్వరం॥౧॥ పురాణపూరుషంసమస్తపుణ్యకర్మరక్షణం। మురాసురాదిదానవేంద్రమూర్ఖజాలశిక్షణం। ధరాధరోద్ధరంప్రశాంతతాపసాత్మవీక్షణం।స్మరామి వేంకటేశ్వరంచసాగరాత్మజేశ్వరం॥౨॥శరాసనాదిశస్త్రబృందసాధనంశుభకర 'ఖరాఖ్యరాక్షసేంద్రగర్వ కాననోగ్రపావకం। నరాధ

నాథవందితం నగాత్మ జాత్మ సన్నుతం । స్మరామి వేంకటేశ్వరంచ సాగ
గరాత్మజేశ్వరం॥ 3॥ సురారి శౌర్యనిగ్రహం । ధరామరాఘుశోషణం। సు
ధాతరంగ భాషణం । స్మరామి వేంకటేశ్వరం చసాగరాత్మజేశ్వరం॥ 4-వ॥
అనియిష్విధంబున వినుతించి హరికిబునః పునః ప్రమాణంబులుచేసి వెంక
టాద్రిడిగ్గిగపిలతీర్థమార్గంబున గిరికి ప్రదక్షిణంబుగా నరిగి నైమిశారణ్యం
బుజేరియచ్చట సూతుంజూచి యిట్లనిరి॥ క॥ సూతానీ కరుణసుని । ఖ్యా
తిగ శ్రీవేంకటాద్రి కరిగితి మచటన్ । బ్రీతిని నీవెఱిగించిన । రీతుల సు
మెల్లదగ్గిరిసిగింటిమయా॥ శా॥ ఓహోనీయకలంక వాక్కులకు మాకుత్సా
హమున్ బుట్టెనీ । మాహాత్మ్యం బధికంబు చూడ నిలసామాన్యంబదవే
సూతమా । లోకైంచెపొగినట్టి చిత్రములు సంతోషంబుగా జెప్పిన ।
ట్లాహైరణ్య గిరీంద్ర మందుగల వైసంబెట్లు గన్గొంటిమో॥ సీ॥ ధర్మాద్రి
కరణిన పర్వతంబున్నది చైత్రరథము రీతిసద్వనంబు । గనపించు చున్న

మునులునైమిశారణ్యమునకు జనిసూతునుతించుట.

ది ఖగమృగాదులు జాతివైరము ల్విడిచి యన్యోన్య మునందు । జరియించు
చున్నవి సామిపుష్కరిణి సంపూర్ణమై యున్నది భూవరాహ । దేవుడాప
డమట దీపించుచున్నాడు తద్దక్షిణంబున దప్తహేమ । కుంభములనొప్పు
చుండెడిగోపురములు । మణులచేనొప్పు ప్రకార మంటపములు । నమరః
యున్నవి తన్మధ్యమందుదివ్య । కాంతినొప్పు విమానంబుగంటిమయ్యా॥
శా॥ మేమాదివ్యవిమాన మధ్యమునలక్ష్మీకాంతునిక్షించితి। త్స్వామిం ప్యం
బననిల్చి మ్రొక్కితరినాశ్చర్యంబుగానంతలో । నేమోమేము శరీరముల్మ
రచియుందిమైనలజ్జంపకా । న్వామిజూచుచునాడు చుండితిమిమాసంతో
షముప్పొంగగన్ ॥ క॥ అటువలనాడితిమాపి । న్నుటహరినర్చించితిమి స
మధానమునం । గుటిలత లేకనుశ్రీవేం । కటపతిమాట్లాడె జలదగంభీరము
గాన్ ॥ క॥ ఆమధురోక్తులువినుచును । మేమచ్చటనుండ మాకుః త్రునిరీ
క్షిన్ । నైమిశమునకరుదెండని । యామాధవు డానతిచ్చియర్చాకృతినై॥
గీ॥ మౌనముద్రనుధరియించి మగిడిమాట। లాడకుండిన జక్రిమాహాత్మ్య
మచట । జూచియాగిరిడిగ్గియిచ్చోటకిపుడు । వచ్చితిమిమేముసద్గుణ త్రి
సూత॥ గీ॥ నివెఱిగించినచప్పాము । లా వెంకటగిరిసగంటి మహహోయువిని ।
బావమునకుగన్పిపించెనో।నివేచూచితివోసూతనిఖిలఖ్యాతా॥ సీ॥ అనినతాప
సోత్తములందఱు ప్రీతితోనడుగగాసూతు డిట్లనియెనపుడు।మునులార మా
డవ్య మునికటాక్షము గల్గినది మొదల్గానకలార్థములును । దోచునామదికి
నాదొడ్డతనముగాదు బాదరాయణుని ప్రభావమింత । గావుననను గొప్ప
గాజూడబని లేదుమీరుధన్యాత్ములెమ్మెయినిసన్ను। గరుణమీరగనడిగినకత

…ము। జిత్తమునిటు భావించి చెప్పినాఁడ। సంతియే కాని శ్రీవేంకటాద్రియందు। జూచి చెప్పితినని మీకు దోచవలదు॥ గీ॥ తారశీకరసికతావితానములను। గణుతిసేయగవచ్చు వేంకటగిరీంద్ర। నాయకుని లీలలన్ని నిర్ణయముగాను। శేషుడైనను లెక్కించి చెప్పగలఁడె॥ క॥ శ్రీకర వేంకటనాథుని। ప్రాకటచరితములు కొన్ని భవహరములుగా। నాకు దోచినరీతిని। మీకుఁ జెప్పితి సంయమిప్రభులారా॥ సీ॥ ఈకథ వ్రాయువారిది చదివెడువారు విశ్వాసయుక్తులై వినెడివారు। నాయురారోగ్య భాగ్యములననుభవించి పుణ్యాత్ములగుదురు భూతలమున। గమలాప్తచంద్రనక్షత్రంబులున్నంత కాలమిహపరసుఖకరముగాను। దరిగొండహరియైన యురగాద్రిపతి కృపభూలోకము వృద్ధిబొందియుండు। భూవరాహప్రభువునకు సత్పుణ్యనిధికి। లక్ష్మికి నిమలీభూనీళలకు మహాకి। శేషగిరికి దరిగొండ శ్రీనృహరికి। మంగళము గల్గవలయు నోమహానులార॥ క॥ అని సూతుఁడు సద్భక్తిని। మనములరగ వేంకటాద్రిమాహాత్మ్యంబుల్। వినుటకు గోరిన శౌనక। మునివరులకు జెప్పెనధికమోదము మీఱన్॥ క॥ శ్రీవిభ్రాజితచరితుఁ। డావిభవోన్నతజగత్త్రయ ప్రఖ్యాతా। శ్రీవేంకటగిరినాయక। పావనతరిగొండనృహరి భవదురితహారీ॥ మాలినీ॥ సరసిజదళనేత్రా సన్మునిస్తోత్రపాత్రా। సురవనవరచైత్రా శోకవల్లీలవిత్రా। సురుచిరఘనగాత్రా సూరిచిత్తాబ్జమిత్రా। దరహసితసువక్త్రా ధారుణీశ్రీకళత్రా॥

## గద్య.

ఇది శ్రీతరిగొండ నృసింహ కరుణాకటాక్ష కలిత కవిత్వ విచిత్రకృష్ణయామాత్యతనూభవ వేంగమాంబా ప్రణీతంబైన శ్రీవేంకటాచలమాహాత్మ్యంబను వరాహ పురాణంబునందు జక్రరాజదిగ్విజయంబను శ్రీవైష్ణవ ధర్మప్రశంసయు విహితసత్కర్మ ప్రకారంబును యమనియమాదియోగాభ్యాసక్రమంబును శ్రీవేంకటేశాష్టోత్తర శతనామ ప్రభావంబును నైమిశారణ్యవాసులైన మహామునులును వేంకటాద్రికి వచ్చుటయు శ్రీవేంకటేశ్వరుండా మునులకు బ్రత్యక్షుండై భాషించుటయు నమ్మునులు వేంకటేశ్వరదర్శనంబు జేసి తీర్థాధారులై క్రమ్మఱ నైమిశారణ్యంబు జేరుటయు నందు సూతుం గనుంగొని వినుతించుటయు మునిసహితంబుగా సూతుండు శ్రీవేంకటేశ్వరస్వామి వారికి మంగళ శాసనంబు జేయుటయు నను కథలంగల.

తృతీయాశ్వాసము.

సంపూర్ణము.

శ్రీరస్తు.

# శ్రీవేంకటాచలమాహాత్మ్యము - చతుర్థాశ్వాసము.

## భవిష్యోత్తర పురాణము.

శా॥ శ్రీనారాయణమాత్మమూలమనఘం శ్రీవత్సవక్షస్థలం। నానాస్థావరజంగమాత్మక జగన్నాథం ప్రభానాశ్రయం। ధ్యానధ్యేయమచింత్యమద్వయం పరంధర్మస్వరూపం సుపూర్ణానందం తరిగొండ శేషకుధరాధ్యక్షం భజేహం సదా॥ ఉ॥ శ్రీరమణీ మనోహరుని శేషశయానుని సర్వశత్రుసం। హారునిధీరునిన్ నఖశిఖాహతరాక్షసవక్షునిన్ సహ। స్రారసరోజహాసుని బడబానలదైత్యకుమారపాలకున్। గోరిభజింతు నేను దరిగొండ నృసింహుని శోభితాంహునిన్॥ చ॥ కలశపయోనిధింబొడమి కల్కులపంటలకాటపట్టునై। జలరుహనాభువక్షమున సాంద్రవిలాసమునన్వసించు యు। జ్జ్వలతరశుభ్రశోభయదినివాసతటిల్లత మాడ్కి భాసురిన్। వెలయదలంతు మోక్షపదవీకరణాహమతిన్ మదాత్మలోన్॥ చ॥ విలసితమౌక్తికప్రభల వెల్గుసి గోత్రల దూలికాసము। జ్జ్వలితవహించు నాథువలసత్కనకద్యుతులీను మేనితో। సలలితవృత్తి మైచికచచంపక మాలికభాతినుండుమే। ల్వొందుకనాదిలక్ష్మి నిలవేయుచు గొల్చెద మోక్షసిద్ధికై॥ శా॥ సర్వజ్ఞుండగు మద్గురుంగొలిచి భాస్వద్భక్తిచే నిత్యమున్। నిర్వాణప్రదుడౌ వినాయకుని వాణిన్ సన్నుతిన్ సల్పుచున్। గీర్వాణాంధ్రకవీంద్రులన్ దలచి యత్నీనాత్మ బోధోల్లస। త్పూర్వాచార్యుల పాదపంకజములం బూజింతు వాక్సిద్ధికై॥ క॥ పంకజహిత శశినేత్రక। లంకరహిత మోక్షదక్ష లక్ష్మీరమణా। శంకరవిధి సన్నుతపద। పంకజ తరిగొండనృహరి పాపవిదారీ॥ సీ॥ అనియిష్టదేవత నాత్మాబ్జమందు భావించిసేవించి శ్రీవేంకటాద్రి। మాహాత్మ్యమందావరాహపురాణంబు ముప్పది యధ్యాయములచు దొంటుత। మొనసినూఱాశ్వాసములుచేసి యావరాహస్వామి కర్పించియుంతిమీద। రహిమీఱభవిష్యోత్తరపురాణమున శ్రీనివాసవిలాసముల్వసుధఁబూద। ప్రజకుదెలియుటకై పద్యఫణితిగాను। నేనురచియింతు దరిగొండనృహరికరుణ। నిపుడు మీరాకథాక్రమంబెట్టులనిన। వినుడినాయందుదయయుంచి విబుధులార॥ ఉ॥ శ్రీకరనైమిశాటవినిశిష్టమునుల్పరమాద్భుతంబుగా। ప్రాకటభక్తిమీరగవరాహపురాణమువిన్నమీదసు। శ్లోకునిసూతు నెమ్మరలజూచుచు వేంకటశైలమిద్ధరన్। జోకగనేయుగంబునను శోభితమైపొగడందు జెప్పవే॥ వ॥ అనినవినిసూతుం డిట్లనియె మీరునన్నడిగినప్రకారంబుగాజనకుండుశతానందునడిగిననతనికి

తనుచెప్పిన పూర్వేతిహాసంబు జెప్పెద నని మఱియు నిట్లనియె॥ సీ॥ వినర
య్యా మునులార విశ్వాస మొప్పగా ఘనతర త్రేతాయుగంబునందు। జన
కుఁడు నిర్మల స్వాంతుఁడై శాంతుఁడై యిల మిథిలాపురం బేలుచుండి। తన
తమ్ముఁడగు కుశధ్వజుఁ డనియెడివాని సుతులకు దాగన్న సుతులకొప్ప।
పతులను దనలోనె భావించి వెదకుచు దొరకు నేతగిన బంధుత్వమిలను
నలువురకు కన్యలకు నర నాథసుతులు। నలువు రొకరయింట యున్నను
నతిముదమున। వారికి బాలికల నియ్యవచ్చు ననుచు। జంత జేయుచునుం
డగా నంతలోన॥
క॥ చనుదెంచె శతానందుం। డను సంయమివిభుఁడు మోదమలరఁగ నపుడా।
జనకుండమ్ముని గనుఁగొని। వినయంబున లేచి మ్రొక్కి విశ్వాసముతోన్॥
గీ॥ అచట నమ్ముని కర్ఘ్యపాద్యాది విధుల। బూజగావింప నమ్ముని పుం
గవుండు। నజకు గూర్చుండ నియమించి సంతసించి। చెలఁగి నృపుచింత
భావించి పలికె నిట్లు॥ తే॥ మానవాధీశ సీతకు మాండవికిని। నూర్మిళకు
శ్రుతకీర్తికి నాఁగివివాహ। యత్నములు సేయవలయు నింకతిరయమున।
వెలఁదులకుఁదగు భర్తలన్ వెదకవయ్య॥ సీ॥ అనిముని పల్కగా విని మిథిలే
శ్వరుం డైనట్టి జనకుఁ డిట్లని యెనపుడు। సంయమీశ్వర నేను సవనంబుగా
వింప భూమి ద్రవ్వింప నద్భుతముగాను। ధరలో జనించెగదా సీతయో
కైక మాతయటంచు నామదికిదోఁచి। యున్నదియు పుట్టి యుర్వీతనూజ
మానవునకు దగునె యెన్నాళ్ళకైన। సీత చిహ్నము లన్ని లక్షించిచూడ
శ్రీరమాదేవి యంశ ప్రసిద్ధమిట్టి। సతికి హరి యంశగలవాఁడె పతిరయమున।
గావలయునట్టి పురుషుండు గలడె ధరను॥ క॥ హరిపూర్ణాంశుండై ధర। నర
పతి జనియించియున్న నామందిరమం। దిరవుగ నుండెడి శ్రీశం। కరచాప
ముద్ధ్రుంచు ముజ్జగంబు లెఱుఁగఁగన్॥ చ॥ హరియతఁడంచు నెంచదగు నంచు
బరీక్షకునై ముదంబుతో। సరవిని మీఱలెల్ల వినశంకర। కార్ముకమద్భు
తంబుగా। విఱిచిన శక్తిమంతులకు వేడ్కనుభూమిజ నిత్తునంచు నే। నరు
దుగ బల్కితిన్ ధరను నట్టిమహాత్ముఁడు పుట్టియుండునే॥ సీ॥ అనగా శతా
నందుఁ డా జనకుని జూచి పలికె నిట్లని మహీపాల వినుము। భూమిజకను
వైన పూరుష శ్రేష్ఠుండు పుట్టినాఁడు చింత బొందవలదు। గరమొప్పుచున్న
నలువురు కన్యలకుదగి యొక రాజకొమరులీయుర్వి బూద।, నలువురున్నారు
నిర్ణయముగా వారు నీ బాలి కామణుల జేపట్టుకొంటకు। వేంకటాచల మ
హిమలన్ వినుము కోర్కు। లన్ని నీకు ఫలించు బ్రహ్మనులైన। దిక్పతు
లునెల్ల వేంకటాద్రి ప్రభావ। మములురైవిని కృతకృత్యులైరి భూప॥ వ॥
కావున నచంచల భక్తిపూర్వకంబుగా వేంకటాద్రి ప్రభావకథ వినినవారి

పాపరోగ దారిద్ర్యాది దుఃఖంబులు నశించు సకల శుభంబులు సిద్ధించున
ప్పర్వతంబు కృతయుగంబున వృషభాద్రియన ప్రసిద్ధంబై యుండు త్రేతా
యుగంబున నంజనాచలంబన విఖ్యాతిం బొందు ద్వాపరయుగంబున శేష
శైలంబన నొప్పుచుండు గలియుగంబున వేంకటగిరియనం దగియుండునని
న యాశైలంబునకు నిప్పుడు చెప్పిన నామంబు లెట్లుగలిగెనని నృపాలుండడి
గిన శతానందుం డిట్లనియె॥ సీ॥ వృషభాసురుండను నసురుడాకొండపై జేరి
మౌనుల హింసజేయు చుండె। నట్టిబాధలు వరాహస్వామితో జెప్పవలె
నంచు వాకిళ్లవచ్చి మ్రొక్కి। ప్రార్థించి పలికిరో పరమాత్మయీశైలమున
వృషభాసురుం డనెడువాడు। పాపాత్ముడై మమ్ము బాధించుచున్నాడు
గావున మీరు శీఘ్రముగ వాని। సంహరింపు డటంచు మిము శరణుబొందె। నట్టి
తాపసులనుగాంచి హరియనియె నిట్లు। నిశ్చయంబుగ మీరిందు నిలచియుండు।
డసురునికి బట్టిశిక్షింతు నార్యులార॥ క॥ అని కిటిహరి నుడువ వే। డ్కొన
గాముని లరిగి శైలగుహలందు భయం। బును విడిచి తపంబులు కావించ
నఘు నిహరిదలచుచుండి రచలాత్ములై॥ తే॥ దైత్యుడపుడు దుంబురుతీర్థ
మందు। మూడుకాలములను స్నానములను జేసి। చిత్తమలరగ కరాళ నృసిం
హ మంత్ర। జపము జేసి నృహరి పూజ సల్పుచుండె॥ వ॥ తత్పూజాంతం
బున నిజశీర్షంబు ఖడ్గంబుతో ఖండించికొని హరికర్పించుచుండగా నా
స్వామి కరుణవలన దెగిన దానవశీర్షంబు క్రమ్మఱ గంఠమందదుకుచుం
డు నివ్విధంబున బంచసహస్రాబ్దంబులు చేసిన పూజ మెచ్చి వరాహస్వామి
కరాళ నృసింహ రూపంబున వానికి ప్రసన్నుండైనం జూచి వృషభాసు
రుండు నమస్కరించి కేవలానంద గోవింద శ్రీనివాసాదినామంబుల గీర్తిం
చుచు ననేక విధంబుల వినుతించుచున్న నక్తంచరుం జూచి నారసింహుం
డిట్లనియె॥ క॥ వినుదానవ సంతతమును గని మెచ్చితి వరములెవ్వి కావలెనన
గా। వినివృషభాసురుడపుడా। మనుజమృగేశ్వరునిజూచి మందతననియెన్॥
సీ॥ పరమాత్మనాకంబు బ్రహ్మలోకము మోక్షమైన నేనొల్ల ఘోరాజిభి
క్ష। నడిగెద నిన్ను దశావతారములెత్తినప్పటి బలమును విప్పుడిచట। నొ
క్కడ వేతాల్చి చక్రగదాతోడ సమరంబుసేయు మోస్వామియనిన। వి
నివాని యవివేకమునకు నవ్వుచు విష్ణుడనెనిట్లు కదనభిక్ష మడిగితీవు। గా
గనిచ్చెదనమ్మన్న దానవుండు। నట్టహాసంబు జేయుచు నార్భటించి। సిద్ధముగ
వచ్చియుద్ధసన్నద్ధుడైన। గర్జనము జేసి వానిపై గదిసె నృహరి॥ వ॥ ఇవ్విధంబున
వృషభాసురుండును విష్ణుదేవుండును సింగంబులభంగి పొంగి నింగి కెగురుచు నే
లకు వచ్చుచు గాలాంతకోపమానులై నుద్ఘోరులై డాయుచు బాయుచు
గదాకుంతముసలముద్గర శూల భిండివాలాది వివిధాయుధంబులగొని కరికరి

డని ప్రార్థింపగా నాస్వామిసమ్మతించి వానిమెచ్చియాలింగనం బిచ్చి మో
క్షంబొసంగి యిప్పర్వతంబు కృతయుగంబున వృషభాద్రియను పేర బ్రకా
శించుంగాక యనిపలికె నప్పుడాస్వామి శీర్షంబున దేవతలుపుష్పవర్షంబు
లుగురియించి వినుతించి నాకంబున కరిగిరంత గుహాంతరంబులందున్న ము
నులువచ్చి సన్నుతింపగా మీరు నిర్భయంబుగా నిందుండుడని యానతిచ్చి య
ద్దేవుండు తిరోధానంబునొంది భూదేవీసహితుండై యిచ్ఛావిహారియైయుం
డెనని చెప్పిన శతానందుంజూచి జనకుండిట్లనియె॥ సీ॥ మునినాథ వృషభాద్రి
యనుదాని కంజనాచలమను పేరెట్లుగలిగెననగ । నాశతానందుడి
ట్లనియె కేసరియనువనచరోత్తము భార్యతనకుసుతులు । గలుగకుండగ
మంతగ ఋషీశ్వరుని జేరి మ్రొక్కి యిట్లనియె నో మునివరేణ్య । పుత్రహీను
లకెందు బుణ్యగతులు గల్గవను వేదపూరుషుండౌదువలన । వరకుమారుడు
నాకుగావలయునందు । కెట్టు తపము జేతు మీరానతీయుడనుచు । నంజ
నాదేవి ప్రార్థించి యడుగగాను । వినికరుణనతడప్పుడా వెలదికనియె॥ తే॥
పొలతియిచ్చటి పంపకు బూర్వమునగను । జనగ నేబదియైను యోజనములం
త । మార్గమందు నృసింహాశ్రమస్థలంబు । గలదుదానికి యామ్యదిగ్భాగమం
దు॥ వ॥ ప్రకాశించుచున్న నారాయణాది ప్రదేశంబులందు బరమపావని
యైయొప్పుచున్న స్వామిపుష్కరిణికి నుత్తరంబుగా క్రోశమాత్రదూరం
బునం దాకాశగంగా ప్రవాహంబున్నది నివందు జేరి త్రికాలస్నానంబు లా
చరించుచు ద్వాదశాబ్దంబులు తపంబు జేయుచుండు మంతసుతుండుదయిం
చుననిన మహాప్రసాదంబని మ్రొక్కి యమ్మునియాజ్ఞాధారిణియైనారాయ
ణాద్రిజేరి స్వామిపుష్కరిణిలో స్నానంబుజేసి తత్తీర్థాశ్వత్థవృక్షంబులకు
బ్రదక్షిణంబుచేసి వరాహస్వామికి మ్రొక్కిచని యాకాశగంగకరిగి యందు
న్నమునులకు నమస్కరించి వారియాజ్ఞ వడసి త్రికాల స్నానంబులు సేయు
చు నిరాహారిణియై యొక్కసంవత్సరంబు తపంబు సేయుచుండ నంతవా
యుదేవుండు ప్రసన్నుండై ప్రతిదినంబునొక్కొక్క మధురఫలంబునిచ్చు
చుండ నదిభక్షించుచు నత్తపస్విని ద్వాదశ వర్షంబులుపూర్తిగా దపం బా
చరించె నంతనొక్కనాడు పవనుండు సద్వీర్యగర్భితంబైన ఫలంబునియ్య
దానిభుజించి యత్తరుణీమణిగర్భంబును ధరియించెనంత॥ తే॥ అంజనాదేవి
గర్భమందనిలదేవు । డొక్కనాడు ప్రవేశించు చుండె పటుల । సంయమీంద్రు
లకచ్చోట స్వప్నమయ్యె । నందుచేవారు నిస్సంశయాత్ములైరి॥ తే॥ దశమ
మాసంబువచ్చినత్తరిధరిత్రి । నంజనాదేవిగర్భమందనఘుడైన । పుత్రుడుద
యింపగాజూచి పుష్పవృష్టి । సురలుగురియించి సంతోషభరితులైరి॥ మ॥ ఘనవ

ద్రాంగముదీర్ఘవాలములసత్త్వాంతుల్యబలస్థైర్యముల్। మునువెల్లంగనియాంజ
నేయుడుమహాముఖ్యుండగుఁ ధాత్రిపై।ననిదీవించుచుమారుతాత్మజునియం
దాసక్తిఁగోనందఱుఁ। హనుమంతుడను నామధేయమిడి రత్యాహ్లాద
ము పొంగఁగ॥ వ॥ త్రేతాయుగంబునందుజనాదేవి యివ్విధంబున ద
పంబుజేసి పుత్రవతియైన నిమిత్తంబుచేత నగ్గిరి యాంజనాద్రి యనఁబ్రసి
ద్ధంబయ్యె నదియుఁగాక॥ తే॥ ఉరగపతిశేషుడనిలునకోడిధరను। గన
కగిరిపుత్రుడైన వేంకటునితోడ।ద్వాపరమునందు బడిశైలరూపమొందె।
నందుచేనది శేషాద్రియనఁగ వెలసె॥ తే॥ అనగవిని జనకుండిట్టులనియె శేషు।
డొందు కావవనునికోడె నెఱుఁగఁజెప్పు। డనశతానందు డిట్లనెహరినిజూడ। న
నిలుడొక నాఁడు వైకుంఠ మునకుబోఁగ॥ సీ॥ హరిమందిరద్వార మందుఁగా
వలియున్న శేషుడాపవను నీక్షించిపలికె। వాతూలనీవు పోవలదు లోని
కినిందెనిలువుమంచు వచింపనిట్టిరముగ। ననిలుఁడిట్లనియె నేనజ్ఞాతునీ
క్షింప బోవుచుండఁగనన్ను నీవునిలుప। వచ్చితివిపుడు నీహెచ్చేమి నాత
కక్కువేమి రమాపతినిపుడె చూడ।వలయు నాకడ్డమిపుడు రావలవదనుచు।
మీరిలో జొరబడఁగ నమ్మారుతునిను। గాంచిబుస పెట్టుచును లేచికన్ను
లెఱ్ఱ। జేసిమెడబట్టి త్రోసెను శేషుడతని॥ చ॥ తినుమెడబట్టి నెట్టుటకుదా
రుణరోషము బెంచి మించియుం। దనిలుడునట్ట హాసముననాడి ఫణీంద్రు
నిజూచి యిట్లనెఁ। ననుమెడబట్టి త్రోసితివినాగకులాధమ విన్ము నేను
ద్రో। సిననిలు వంగనోపుదునెఖీ యటుపొమ్మన శేషుడిట్లనెఁ॥ క॥ అని
లుడవినుమంతఃపుర। మునకన్యుడ నైననిన్ను ముందుగబోని। య్యనునీ
రాకడచక్రికి। వినిపించెద నటకునిన్ను విష్ణుదయతోఁ॥ సీ॥ తోడ్కొ
నిరమ్మన్న దోడ్కొని పోయెదనంతియెగానము న్నటకునేను। నినుబో
వనీనన్నవినిపవనుండిట్టులనియె నంతఃపుర మందెయెపుడు। మార్జాలముం
డును మదకరిపీఢిలో దానుండునందు చేదక్కువగునె। పొలుపొందుమం
దిరంబు ననుండుపిల్లి యూ యేనుగకన్న దానెక్కువగునె। యిపుడులోని
కినన్ను రానియ్యవంటి। వటకు నేనింక రాను నీవచటనుండు। మిచటనే
నుండు గొడువగాకేమిలేదు। ఘోరభుజగాధమా నీవుపొంగవలదు॥ మ॥
అనుచుఁ దన్ను దిరస్కరింప వినిరోషావేశ ముప్పొంగని। ట్లనియెఁ శే
షుడుమారుతా యెపుడు నాకాహారమైనట్టినీ। ఫునుగర్వించుచు గానినా
యెదుట నియుత్కర్షముఁ సాగునే। యనగానప్పవనుండునిట్లనియెగో
పాటోపముఁ బెంచుచుఁ॥ క॥ శేషాగర్వముతోడ। న్భాషలుభాషిం
చినప్పు పట్టుగనాకుఁ ! రోషముబుట్టించిలిపక ! శేషత్వవిశేష మహిమ

చెందననిన్నుఁ॥ వ॥ అయినను నీను నాబలంబునకు గజమశకన్యాయం బై
యుండునెట్లున్నను నేను సర్వజీవాంతర్యామినై జగదాధారుండనై యుం
డుగావున నీకన్నను నధికుండనని విని శేషుండిట్లనియె॥ సీ॥ వినుప్రభంజన
నేను విపులాద్రిగణములో మొనయు భూమి నిశిరమున భరింతు। బహు
విధ బ్రహ్మాండ భాండోదరుండైన నీరజాతాక్షు నేనే భరింతు। గాననీ
కన్నను నేనెగొప్పగు చుందుజులుకదనంబుగా జూడవలదు। పొమ్మనిప
ల్కఁగా భూరికోపంబుతో బవనుడిట్లనియె నోపన్నగేంద్ర। నేనునీతోన
నుండగా నీకుబలము। గలిగియున్నది లేకున్నఘనతమీర। నీబల బేడ
నిలుచురా నేనుమూల। తత్వమును నీవునాకన్న దక్కువేర॥ సీ॥ అనియి
ట్లీధంబున ననిలుండువచియింప బన్నగేంద్రుడువిని పలికెనిట్లు। నాతూ
లవినువృథా వాగ్వ్రియంబేటికి నీవు నేనొకదిక్కునిలిచి హెచ్చు। మల్ల
యుద్ధను జేతమల్లవారికి నీబలమునాబలము దెలియునపుడు। రాగమ్మన
గవారిరభసంబువిని చక్రి వారిచెంతకు వేగ వచ్చినిలిచె। నప్పుడు శేషుండు
పవనుండు హరికిమ్రొక్కి। తమవివాదోక్తులిరువు రత్తతినిజచక్ర। ధరుని
తోజెప్పి దేవయుద్ధంబు మేము। సేయువలయును దీవించి సెల వొసంగు॥ మ॥
అనివారలుసు శేషుడాహవము జేయుం బూను వాక్యంబులన్। విని యోచిం
చివికోదములనుటకా వేళ న్రమేశుండువా।రిని వారింపక కారణంబాకతి వేరే
యుండగా వీరలి। ట్లురుచున్నారిది మంచికార్యమని రోషావేశమే పెంచు
చున్॥ సీ॥ కార్యార్థియై రమాకాంతుడు నవ్వుచు బవన శేషులజూచి పలికె
నిట్లు। మీరుమీరిరువురు వీరాగ్రగణ్యులుగావుననొక్క రొక్కని గెలువ[illegible]
యుద్ధంబుమీరూరక చేసినగకవికనొందిలోకములుమసవు। గాననీకొకయుక్తి
నేను జెప్పెద శేష వినుమది యెట్లన్నగకనగము। నందుబుట్టిన వరవేంకటా
ద్రిచుట్టు। ముట్టికొని ఫణముల బిగబట్టియుండుము। చండవాయువా పైడి
కొండనెగర। మీటగాదొడ్డ వాడెసమీరుడనుచు॥ గీ॥ పలికిపవన నివె
పన్నగేంద్రుడుచుట్టి। పట్టియున్న గిరినిబట్టిపైకి। నెగరమీట గానిహె
చ్చుసే వటుమీటలేక యున్నహెచ్చు లేదునీకు॥ వ॥ అనిపిష్ణుండానతిచ్చి
నవిని మహాప్రసాదంబని మ్రొక్కిపవన శేషులిద్దఱుంజని వేంకటాద్రిజేరి
రంతుబన్నగేంద్రు డప్పర్వతంబు చుట్టుచుంజుట్టుకొని సహస్రఫణం బులన
డుమంబిగం బట్టియుండెనంత వాయుదేవుండు నిజశక్తిపెంచి యగ్గిరిపైవి
చుచుండె నివ్విధంబున॥ క॥ తొడిబడక నిలుడు మెఱయుచు। విడివడివగదున్నై
లపితతులపుడుబల్। గడగడవడకుచునంతట బెడబెడబోరలాడజూచిభీతాత్మ
కులై॥ క॥ అప్పుడుబ్రహ్మేంద్రాదులు। దప్పకగుమిగూడిమారుతము చెంగటి
కిం। దప్పుటడుగులిడుచుం జని। తెప్పుననిట్లనిరినాలదిగులుంబడుచున్॥ సీ॥ ఓ

నాయకుదేవ నీవుత్పాతహేతువై విసరుచుంటకిది వేళగాదు। చాలించుగల్పాం
తసమయమందిటు సేయవలయు నిప్పుడుపీవలదు నిలుపు। మునివారు ప్రార్థింప
ననిలుడారోషంబు విడువకమఱిమఱివిసరజూచె । ఘనుని రోషస్వభావం
బు గనిచని శేషాహి చెంగట జేరివినుతి । జేసియిట్లనిపలికె రోభాసురాత్మ । నీబ
ల మెక్కువైన నదిపీర జాతుడు। తెలుగుగారి మనోహర్తుం డెలుగు మేము నెలుగు
గుముకు ప్రభావంబు లెన్నదరమె॥ వ॥ అనిబహువిధంబుల బ్రార్థించిన శేషుండు
పట్టి పట్టు విడువకుండినంజూచి బ్రహ్మేంద్రాదులుమఱియునిట్లనిరి॥ క॥ విను
కూ భుజగకులాధిప । కినిసిమహాశక్తి హేమగిరి వరతనయుఁ । ఘనము
గ బిగబట్టిన నిలుపుగదలింపనోపడయ్యె మహాత్మా॥ క॥ అనిలుడానీ
కోడడు। వనిలున కోడవు జగమ్ముల దగినశివం। బనివచ్చెను కావున
నీ। ఘనరోషము సడలింపరులగా వృగహీంద్రా॥ చ॥ అనుజులు మూర్ఛిలం
చు విడనాడుచు సాత్వికమూర్తియైనవి । ష్ణుసపదమాశ్రయించి పరిశుద్ధ
డవై తివిసి క్రోధమే। లనుజ జశుద్ధ సాత్విక బలంబున నీవు చలంబడంచినీ। ఘ
నఫణమెత్తి క్రూరులనరుగాలికి గెల్పు నొ ంగ మేలగుఁ॥ వ॥ అనియనేక ప్రకా
రంబుల బ్రార్థింపగా శేషుండుకరుణార్ద్రచిత్తుండై లోకరక్షణంబు జేయుటకై
యొక్క ఫణంబెత్తె నప్పుడప్పవనుండుప్పొంగి తెప్పునప్పణంబునందున బ్రవే
శించి సజలంబు కొలదిపీకుచునంగుష్ఠంబ కొండపాతునం గ్రుచ్చియెత్తి
పై కెగరమీటునప్పుడు వేంకటాద్రి గాలపటంబు చందంబున నెగిరి గం
గానదికిదక్షిణంబుగా ద్విశతయోజనదూరంబునను దూర్పుపశాబ్ధికి నై
దుయోజనముల దూరంబునను సువర్ణముఖరీనద్యుత్తర తీరంబునకు సార
క్రోశ దూరంబునన్ పుణ్య ... సనంబునందుదన్ను జుట్టియున్న శేషుని
తోడంబడియె నిట్విధంబున శేషునోడించితినని సంతసించుచు బవనుండుని
జేచ్ఛంజనియె జగంబులు కుదిరియుండె నంత శేషాహి తానోడుటకుజిం
తించుచుండగా బ్రహ్మేంద్రాదులువచ్చి శేషునాదరించిరందు బ్రహ్మయి
ట్లనియె॥ సీ॥ విను శేష మారుతంబున కోడితనటంచు జింతింప వలదు సిచిత్త
ముసప । వేంకటగిరినిసమంకేతంబుగ గూడి యవనిపైనుండు నీయందు జక్ర ।
పాలించిని న్వాలించునని పల్కవిని ఫణీంద్రుండు చాలవిన్ననగుచు। బలి
కెవ్వప నేనుపవనుని తో బంతమూడియోడుటను నాయందు దప్పు । గలిగె
గర్వంబడంగె నాగర్వమింత । నేనెనిక నేలనాయందు శ్రీధరుండు । నిలుచు
నలిపల్కి చాలగన్నీరునింప । జూచిశేషుని తోదబ్జ్మ చూలిపలికె॥ క॥ వి
ను ఫణివరనీపై నా। వనజదళాక్షుండు కృపనువచ్చివసింపం। బనినే వెదకెద
నికని । మనమునజింతింపవలదు మరుదశనేంద్రా॥ మ॥ హరినీయందువసిం
చి యుండడని నీకాచింతనం బేలముఁ । దరచక్రాయుధుడిందు రాదగుప్రవ

యత్నం బేరుగా వించెదరు। గిరిరూపంబున నుండు మోడితిని నాఖేదంబు వర్జిం
పుము। కరుణాక్షుఁ మదిం గోదలంచుచును సౌఖ్యం బొందు నాగాధిపా॥
క॥ హరి సచటికి రప్పించుట। కరయఁగ నే బూటకాఁపునైతి నటంచున్।
సరసిజగర్భుఁడు శేషుని। శిరములపై నివిరి నమ్మఁజెప్పె గరుణతోన్॥ వ॥ అ
ప్పుడా శేషునికి నిర్విఘ్నంబుగా నభయంబిచ్చి వీడ్కొని యింద్రాదుల నిజ
స్థానంబులకు బంపి విరించి సత్యలోకంబు జేరె నంత శేషుండు సాగిలబడి వై
కుంఠపతికి సాష్టాంగ దండప్రణామంబు జేయుచు బర్యంకాకారంబు నొం
దెనప్పర్వత ప్రమాణంబు జెప్పెద నెట్లన్న దశయోజన విస్తీర్ణంబై ముప్ప
ది యోజనంబుల నిడివి గలిగి యుండునట్టి శేషాఖ్యనొందిన మహాగిరిఫణాగ్ర
దేశంబు వేంకటాద్రియు మధ్యప్రదేశంబహోబిలంబు తుచ్ఛప్రదేశంబు
శ్రీశైలంబగుచుండగా సర్వక్షేత్ర సర్వతీర్థమయంబగుచు సకలఫలద్రుమ
పుష్పలతాశోభితంబైన నానావిచిత్రధాతు ప్రకాశంబగుచుండు నయ్యా
ద్రియందు సురబృందంబులు తరుబృందంబులై ఋషిసమూహంబులు మృ
గసమూహంబులై పితృగణంబులు ఖగగణంబులై యక్షకిన్నరులు పాషా
ణంబులై యుండగా శేషునకు వరంబిచ్చి పోయిన పరమేష్ఠి శేషాద్రియందు
వేంచేసి యుండుడని వరాహస్వామిని ప్రార్థింపగా నద్దేవుండు వైకుంఠపుర
మందున్న క్రీడాద్రి గరుడుని చేత దెప్పించి శేషాద్రియందుంచి తానందు వసి
యించియుండగా నాస్వామికి బూర్వభాగమందున్న శ్రీస్వామిపుష్కరిణి
గంగాదిపుణ్య తీర్థంబులకు జన్మస్థానంబై మకరమత్స్యకచ్ఛపాది జలచరా
వాసంబై కమలకుముదాది పుష్పశోభితంబై సరోవరంబని చెప్పనొప్పుచుం
డు నప్పుష్కరిణియందు గ్రుంకులిడి జనులు పాపరహితులయ్యెదరదియునుం
గాక ధనుర్మాసంబున శుద్ధద్వాదశీదినం బరుణోదయంబు మొదలుకొని యారు
గడియలపర్యంతంబు గంగాదినదులా పుణ్యపుష్కరిణియందు గలసియుండు
నట్టి పుణ్యకాలంబునందా తీర్థంబులో శ్రద్ధాపూర్వకంబుగా స్నానంబులు చేసి
నవారు మోక్షార్హులయ్యెదరదియునుం గాక తత్తీర్థతీరంబున శ్రాద్ధంబులు చేసి
న వారి పితృదేవతలమృతపానంబు జేసినంత తృప్తిం బొంది స్వర్గంబున నృత్తం
బులు చేయుచున్న దరదియునుం గాక నారాయణుండను బ్రాహ్మణుండా
తీరంబున గ్రుంకులిడుచుండి హరిదివ్యధామంబున నొప్పొంది నిది శేషాద్రి
ప్రభావ బింక వేంకటాద్రి ప్రభావం బెట్లంటేని॥ సీ॥ చెప్పెద వినవయ్య
శ్రీకాళహస్తింగో జూడ బురందర సోమయాజి। తనయుఁ డైనట్టి మాధవనా
మధేయుండు తనకర్మవశమున నందనకు భార్య। యగు చంద్రరేఖను బగలు
రతికి భీఁవ్వనయిత్తి ప్రీతితో నకట పెద్ద। లింటనుండగ బంలీరతి తగదంచు
బహువిధంబుల జెప్పిపట్టువడక। తెలగిపోవుచునుండగా దాళజాల। కతడు ప్రా

ద్ధింగ నాబలిమిాజ్ఞ మిాఱ। జగతి ధర్మం బెఱింగియు ధపుని మోము। జాలి తోంజూచి పల్కె నాచంద్ర శేఖు॥ వ॥ దేవతార్చనాగ్ని హోత్రాదిసత్క్రియ లాచరించు సమయంబున దివాక్రీడ కూడు నేయని యనేక విధంబుల నదిజెప్పినవినక బలాత్కారంబు జేయుపతిని జూచి సతిమిారు సమిత్కుశ తులకై పుష్పార్థముగా నదీతీరవనంబునం దుండుడు నేనచ్చటి కుదకంబు దెచ్చుటకై కలశంబుగొని వచ్చెదనచ్చట మిాసంకల్ప పూర్తియగుం గాక యని సమ్మతిపఱిచి పంపగా నతండరిగి సువర్ణముఖరినదీ తీరంబునందున్న పుష్పవనంబు జేరె నచ్చటికంతకు మున్నుగా వచ్చి స్వర్ణ భూషణ శ్వేతాంబరాలంకృతయై యొక్క కాలుముడిచికొని యొక్క కాలిబొటనవ్రేలు నేల గ్రుచ్చి యెత్తుచు మోకాలిమిాద జుబుకంబునుంచుకొని దీర్ఘకేశ కుంతలంబులు నేలబడగం గూర్చుండి యున్న పద్మినీజాతి చండాల స్త్రీని జూచి యవ్విప్రుండు మోహించె నట్టి సమయంబున దనభార్య వచ్చినం గాంచి నీగుణ పరీక్షకై రమ్మంటి నంతియే కానిదివా। క్రీడకూడు నే నొప్పను నేయని చెప్పి దాని నంపించి యాచండాలస్త్రీ సమీపమునకు బోవుచుండగా బ్రాహ్మణుం జూచి లేచి ప్రొక్కి యతిదూరంబుగా బోవుచున్నవాఁడును దాని వెంబడించి పోవుచుండగా నాభూసురుం గాంచి యది వెఱచి యిట్లనియె॥ సీ॥ ధరణీసురేంద్ర నే దవ్వగా జనుచున్న నీవంజ కిటు రాను నీతి గాదు। నన్నెవ్వరిని యెంచినావు నేనెఱుగ జండాలి నాదు నచింపజాలి నొందె। యోమహీసురుడిట్లనియె నీపేరేమి చెప్పవె యనగ నా చేడె వాని గని నన్ను గుత్తల యని పిల్తు రిట్లనవడుగుచు నను జేరకవల బొమ్ము। నీవు నా దగ్గరకు రాకు నీచజాతి। దాననని పోవుచుండగా దానుదాని। విడిచి పోలేక వాఱి మఱి వెంటనంటి। భ్రాంతితో నిట్టుల నియె నా బ్రాహ్మణుండు॥ తే॥ భామనీవంటి సుందరి బ్రహ్మదేవు। డంత్యజాతిని బుట్టించియడవి యుంచు। గాచి నటువంటి వెన్నెల కరణి జేసె। నింతకా విధినే మందు నిందువదన॥ క॥ లవణాబ్ధి జరత్నములను। దివిజులు శిరముల ధరించు తెఱగున నేని। న్నవనిని వరియించెద నని। వివరించి భయంబు విడిచి విప్రుండనగన్॥ చ॥ వినియది భీతినొందుచు వివేకముతో ద్విజు మోముజూచి

## చండాలస్త్రీ బ్రాహ్మణ సంవాదము.

యిట్లనియె నుజారకాంతను మహావిష సర్పమునంటి యెవ్వరై। నను గడతేఱినారె నినునమ్మిన భార్యను బీడినన్ను బొం। దిననిహాముష్మిక బరంబు చెడు ధీరతతో జనుఁ బ్రాహ్మణోత్తమా॥ వ॥ మహాత్మా స్త్రీపురుష జాతిద్వయంబును నిర్మాణంబుజేసి నాలుగు జాతులు నిశ్చయించి యేజాతి పురుషుడా జాతి స్త్రీని బాణిగ్రహణంబు జేసి స్వభార్యయందు సంతానంబు వడ

సి పరస్త్రీ సంగము నపేక్షింపక యుండవలయునని ధర్మశాస్త్రంబులుబో ధించుచుండగా నీవట్టి ధర్మంబులు దెలిసియును జండాలస్త్రీ సంగమం బున కొప్పవచ్చునే బ్రాహ్మణుండవై పుట్టి గర్భాదానాదిషోడశ కర్మం బుల నాచరించిన వాఁడవై యుండి నీవు నన్నంటుట దగదని మెల్లన్న నిదే హంబు వేదపూతంబైనది నీ శ్రోత్ర నేత్ర నాసాపుట జిహ్వా పాణి పాదంబు లు పుణ్యకథా శ్రవణ భగవద్దర్శన హరిపాదార్పిత తులసీ పుష్పాఘ్రాణ వేదాధ్యయన దాన తీర్థయాత్రాది సత్క్రియలచేత బవిత్రములైనవి మదీయ శ్రోత్ర పంచేంద్రియంబులు దుష్కథా శ్రవణాది దుష్క్రియల చేత నపవిత్రంబు లయినవి కావున నాదేహ సమాగమంబు నీవు గోరవ లదని కోకిల స్వరంబునఁ ధర్మ శాస్త్రవివేక ప్రకారంబులుగా బలుకుచు న్న కుంతలను జూచి తాళజాలక నవ్విప్రుఁడు దానిం గదియంబోవగా పాప భీతిచే నదిరోదనంబు సేయుచు దిగ్దేవతాదుల నుద్దేశించి యిబ్రా హ్మణుండు పాపజాతినైన నన్నుబొంది కులహీనుండై నరకంబునఁ బడ నుద్యుక్తుండగుచున్నాఁడు నావలన దోషంబులేదు మీరంద ఱిందుకు సాక్షులని తలఁగి పోవుచుండగా వెఱగి దాని సమీపంబున నిలిచి యాద్వి జుం డిట్లనియె॥ తే॥ భామ వెఱువకవినునాతపంబుచాల । నేఁడుఫలియిం చెనటుగాన నిన్నుజూడ । గలిగె నందున మన్నించి కామసుఖము । నియ్య వే యన్ననది భీతి నిట్లనియె॥ చ॥ కటకట బ్రాహ్మణోత్తముఁడ కామ సుఖంబును గోరిలేని సం । కటపడనేల నీగృహము గ్రక్కున జేరిస్వకీయ భార్యనే । నటుముద మొప్పఁ గూడుననునంటిన దోషముగాననిష్ఠుర । న్నటున లె నంటఁగోరితి విదేమి యపభ్రమ పుట్టెనిచ్చటన్॥ క॥ చండాల స్త్రీనైన యుట । పండిత నీకేలతగును బ్రాహ్మణ కులమున్ । బెండువడఁ జేయునే టికి । యుండుము నన్నంట రాకుమోహాంధ విప్రా॥ క॥ అనియది వెనుకకు జనగా । గనివిప్రుఁడు కులముమించి కామాంధత్వం । బొనరఁగ దట్టి బగు చును । గనులను నెగదట్టదాని గదియంబోవన్॥ వ॥ అప్పుడా కుంతలయు తనిజూచి నీజననీ జనక గురుదైవంబులతోడ నన్నంటరాకుమనుచుండ గా వాఁడువినక దాని బట్టికలసె నంత నదియతనిజూచి విప్రా నీవు కుల భ్ర ష్టుండవైతి యింక యజ్ఞోప వీతకటి త్యాగంబు చేసి చండాల జాత్యాహారుం డవై నన్నుగూడి యుండుమనిన వాఁడందుల కొప్పి కృష్ణవేణీ తీరంబునఁ జేరి ద్వాదశాబ్దంబులు కామమోహభోగంబులనుభవించె నంతగుంతలమృతిబొంద గామాధవుండు దుఃఖాక్రాంతుండై యొంటిగాదిరుగుచుండి తనమనంబునని ట్లనివితర్కించె॥ సీ॥ గురుతరంబగు బ్రహ్మకులమునందు జనించికోరిచండాలి నిగూడితిగా ర । పాపంబు జేసితిబతితవానను నైన శ్రీహరినన్ను రక్షింపవల

యు। నను దుబశ్చాత్తాపములబొందుతలఁజిభక్తులయిన రాజులు వేంకటాద్రి యాత్ర। బోవుచుండగ వారితో వాడు సని వారుభక్షించియందందు బాఱవైచి నట్టియెంగిలదినుచు దేహాభిమాన।దంభములవీడికపిలతీర్థమునకరిగి। గగనగం గాయనగ శేషనగమునుండి। క్షితినిదుమికెడిజలమునీక్షించి మ్రొక్కె॥ వ॥ అ ప్పుడాపుణ్యక్షేత్రంబునందా రాజులు క్షౌరంబు సేయించికొనునప్పుడుతా నును క్షౌరంబు జేయించికొని వారుపిండ ప్రధానంబులు సేయుచుండగా జూచి తానును మృత్తికతో బిండ ప్రదానంబుజేసిన వానిపితృదేవతలామృ త్పిండంబులచే దృప్తిబొందిరనినవిని జనకుండిట్లనియె॥ క॥ చండాలాంగన నెనయుచు। నుండిన కులహీనుదూర్తకుండకటావి। పుళిండన బరుగు నెబెట్టి న। పిండంబులుగొనిరె వానిపితృదేవతలుఁ॥ క॥ అనగిశతానందు డి। ట్లనె జనకాక పిలతీర్థమందు మొదటనే। మునిగినపుణ్యముచేగ్గె। కొనిరాపిండ ములవారు కొంకకనచరుఁ॥ సీ॥ ఆపుణ్యమటులుండెనదిగాక మఱియొక్క మహిమజెప్పెద వాడుమఱుదినంబు। వరుసతో వెంకటగిరి యెక్కుచున్న దత్పర్వత స్పర్శచే బ్రాహ్మణుండు। చేసిన పాపంబుశిథిలమై వడకుచు వా నియందుండ కవాంతిమయ్యె। నప్పుడా ఘోర పాపారణ్యమును వేంకటా ద్రిప్రభావసుదుశ్శిఖియగుచు। గాల్చుచుండగ గగనదిగ్భగములను। బాగ లుమంటలు నెగసెనప్పుడుజయుండు। వామదేవాదు లీక్షించివచ్చిదివిజమా ర్గమునందండి యాశ్చర్యమగ్నులగుచు॥ ఉ॥ ఇప్పుడు వేంకటాచలమహామహి మంబు నవాగ్నిరూపమై। తప్పకవిప్రపాపమునుదగ్ధముజేసె నటంచుమా దవుఁ। గొప్పగనెంచి శిర్షమునగొల్లగ బువ్వుల వానసించియం। దొప్పగ జూచుచుండి రజుడుర్వికిదాదిగివచ్చి నవ్వుచుఁ॥ ఉ॥ వానిశిరంబు మూ ర్కొనగవాడు కృతార్థుడనై తినంచునం। దానళినోద్భవుఁ బాగడి యంజ లిజేసి భయంబుమీఱగా। దీనతనొందియిట్లనియె దేవవివేకము లేకపాప ముఁ। నేనలనాడుచేసి యతినిచుడనైతి నికేమిచెప్పవే॥ తే॥ అనుచువా డార్తిబొంది యిట్లడుగనజుడు। పలుకునిట్లని విప్రనీపాపమెల్ల। భస్మమైపో యెసంశయపడకుమింక। వెంకటాద్రికీసివె వేవేగబోయి॥ సీ॥ స్వామిపు ష్కరిణిలో స్నానంబుజేసి యాభూవరాహ స్వామిపూజసల్పి। మ్రొక్కని వీదేహమును విసర్జింపుము తదనంతరమున భూతలమునందు। ధన్యతిబాం డవదౌహిత్రవంశ్యజుండగు వీరుని సుతుడై జనించి। నట్టసుధర్మునకాత్మసం భుడవైవసు ధనారాయణవసపురమున। నిలిచిహరిభక్తినెదనుంచి నిర్మలత ను। దొండమండల దేశమఖండధర్మ। మార్గమునఁనేలుచుందు రమాపభుం డు। పెండ్లియాడును నీసుతఁబ్రేమమెఱయ॥ తే॥ లక్ష్మియంశమ ధరలో నలఘుణాంగి। మైనసులెసకు గల్లుశ్రీహరికిదాని। బ్రీతితోనిచ్చిముదమున బెం

డ్లి జేసి। యవలవైకుంఠ పురిజేరుమనుచునపుడు॥ వ॥ బ్రహ్మయాధ్రువునకి
వ్విధమున వరంబులిచ్చి వానివీడ్కొల్పి యీపర్వతంబునకు వేంకటాఖ్య
సార్థకంబయ్యెనని సంతోషించెనంత నాబ్రహ్మరుద్రాదులు నిజస్థానంబు
లకరిగిరనిచెప్పగావిని వేంకటాఖ్యాక్షర త్రయార్థంబుజెప్పుమనిన జన
కుంజూచి శతానందుండిట్లనియె॥ క॥ వినువేమున్నరు పాపేంధన। మునుగ
టయుగళాక్షరాగ్నిముఖ్యంబై కా। ల్చెనుగావున వెంకటగిరి। యనుపేరా
యద్రికొప్పెనవసుధా॥ సీ॥ మొనసి ప్రాతఃకాలమున లేచి వేంకటాద్రి స్మ
రణము జేయుధీరులవని।గ్రమముగా నూఱుగంగా స్నానములుమఱి సేతు
యాత్రలు వేయుచేసినంత। పుణ్యఫలంబులఁ బొందిసుఖింతురీ కథమును
రుండగు గౌతముండు। నాకుజెప్పినరీతినీకుజెప్పితి వినివినినవారికి శుభపరి
తులొందను। వసుధనిహపరసుఖములు వలసినట్టి। వారలీకథవినవలె నాం
ధచేత। ననిశతానందముని చెప్పెనందువలన। జనకుడావేంకటాద్రికి జనద
లంచి॥ వ॥ హిత మంత్రిప్రముఖులం దోడ్కొని శతానందునితోడ వేంక
టాద్రికి వచ్చిస్వామిపుష్కరిణిలో గ్రుంకులిడుచు భూవరాహ శ్రీనివాస
స్వాముల సాన్నిధ్యంబున గొన్నిదినంబులు వసియించి క్రమ్మఱమిథిలాపు
రంబుజేరె నివ్విధంబున వేంకటాద్రిదర్శనంబు జేసినపుణ్యంబుచే నటరా
మచంద్రుండు శంకరధనుర్భంగంజేసి సీతనుబరిగ్రహించెనంత సౌమిత్రి
యూర్మిళను భరతుండుమాండవిని శత్రుఘ్నుండు శ్రుతకీర్తిని బరిగ్రహిం
చిరప్పుడు వేంకటాద్రిమహాత్మ్యంబు విన్నదానగోర్కె ఫలించెనని జన
కుండు సంతసించుచుండె శతానందుండు తపోవనంబున కరిగెనని చెప్పిన
సూతులంజూచి శౌనకాదులిట్లనిరి॥ క॥ కమలాసనుడురథోత్సవ। మమర
గ శ్రీవెంకటాద్రి యందాహరికిన్। విమలుండై చేసెగదా। కమలాక్షుండుచ
టనెంతకాలంబుండెన్ ॥ క॥ అనవిని యాసూతుం। డిట్లనియెను శ్రీవెంకటా
ద్రియందాద్యుండై। వనజాక్షుడు కలియుగమున। గిసదనుకన్ విపుల శే
షగిరిపై వేడ్కన్ ॥సీ॥ ప్రాకృతజనులలోపల మెలంగుచుభూమియందున్న శ్రీ
వేంకటాద్రివిభుడు। పరగనప్రాకృత ప్రబలచేదిపించు మిహిరాబ్జ కాంతుల
మెచ్చకుండు। బహురత్నగోపుర ప్రాకారసౌధముల్మానయు చతుర్ద్వార
ములునుగలిగి। మహనీయసురకల్ప మణితోరణములచే గొమరొప్పుచున్న
వైకుంఠపురము। దలచియచ్చటినిత్యముక్తులును దాసు। జూడగోరుచు శే
షాద్రిశుభ్రఘోణి। నొప్పగానేలుమని చెప్పియొప్పగించి। మంచియా
నావిగూఢవిమానమెక్కి॥ వ॥ శ్రీభూనీళాసమేతుండై హరివైకుంఠపురం
బుజేరియందున్న నిత్యముక్తులజూచి యాదరించి యప్రాకృతమణిమయాం
తఃపురంబులో శేషతల్పంబునందు వసియించియుండెనంత శేషాద్రియం

దున్న వరాహస్వామి విశ్వకర్మనిర్మితపట్టణం బంతర్థానంబు నొందించియు
చ్ఛావిహారంబుగా వర్తించుచుండె పిమ్మటనృప భాసురునితో యుద్ధంబు జే
యంజనిసుమనిష్క్ర ధంబునకొన్ని యుద్ధంబులుజరిగినవెనుక నొక్కనాడునా
రకుండు వేంకటాద్రికివచ్చి శ్రీనివాసుడు వైకుంఠంబు జేరినవృత్తాంత మె
ఱింగినన్యాలోకంబునకుంబోయి బ్రహ్మదేవునికి నమస్కరించి యిట్లనియె॥
తే॥ తాత్రికివిభు చక్రిశేషభూధరము శుభ్ర। ఘోణి కొప్పించి తానువైకుం
ఠపురమును। జేరెనసగా నజుండతిచింతనొంది। యేమియును దోచకతీస
లోన్నిటులనియె॥ క॥ వినునారద భూలోకంబున శేషాచలమునందుబురు
షోత్తముడు। శ్రీకాలమునవదద్యా। జనులకొఫుణ్యాత్ములైరి సాత్వికులగు
చున్॥ సీ॥ ఆస్వామివైకుంఠమునకు గ్రమ్మఱజేరెనంచుచె శ్రీవెంకటాద్రి
మీద। నేనుసంకల్పించి నెనరుతోగావించి నట్టిరథోత్సవంబావరాహ।
దేవుడొక్కడు సమర్థింప నాయెశ్రీనివాసు డుండండగా వలయుంగనుక। వ
సుదేవద శరథవర తేజ ములది త్రిణేత్రు న్నతుమిగదీర్చి నిజఫుఖ నట। న
రగ దేవకీకళను గౌసల్యకళనుబుట్టిగాదీర్చి యుంతునా పుట్టిన సి। శ్రీనివా
సుడు వేగజేరి యుపాయముగావింపుమెల్లైన దేవమౌని॥ క॥ వనజా
క్షుండాగిరిజే। రినపిమ్మట హరికినాటి రీతినిదిరుగా। నొసరరథోత్సవము
చ్చట। జనహితముగ నేను జేతు శాశ్వతిగతులన్॥ సీ॥ క్షితిమీదనిప్పుడు
శ్రీనివాసుడు లేకతనమానవులు దుష్కర్ములగుచు। కలిమాయ నొంది
సత్కర్మముల్ శ్రద్ధతో జేయ లేరికమీద శేషగిరికి। మరలశ్రీహరి వచ్చి
మానుజుల నెల్లరక్షింపను పాయంబు జేయకున్న। జనులపాపంబుల శ
మనుండుగని నారకములందు దోయించు గానభూతి। దయమనంబున
నుంచి మాధవుడు శేష। పర్వతము జేగు నట్టియుపాయమీవు। సేయుమ
నవిని సురముని శ్రేష్ఠుడలరి। యజునిపాదంబులను మ్రొక్కి యాదరము
న॥ సీ॥ శరదభ్రశుభ్రలసత్కాంతి నిజదేహమందు రప్పింపగా నరుణవ
ర్ణ। కలితజటాజూటకళలుప్ప తిల్లగా లలి బూర్ణచంద్ర కళంకమనగ।
నొనగు కృష్ణాజిన ముదుకటి యుందొప్ప మధ్యభాగమునందు మౌంజివెలు
గ। పెటుపుదిగెను దానుమెచ్చక నురమందు దగినబంగారు జన్నిదము
మెఱయ। నారదుడు లేచియప్పుడా నళినభవుని। యనుమతిని జాహ్న
వీతీరమందు శ్రీక్రతువు లచ్చటనొనరించు కశ్యపాది। సంయములు నెల్ల
సత్కరించి సాగరిమున॥ తే॥ వీణమీటుచు గానధురీణుడైన। వరమునివ్రదం
డుఘనయుజ్ఞ వాటమునకు। రాగకశ్యపముఖులు నారదునిజూచి। విహిత
రీతిని బూజించిరనశాస్త్ర॥ క॥ తనలో వా రిట్లనిరో। యనఘముని నీవు వచ్చి

నందనమాకర్ణ । ఘనతరసంతోషంబాద । వెనుగదయన నారదుండు
వేడుకననియెఁ॥ గీ॥ మానివరులార మీ రెల్లమఖములిచట। లలిని గావించి
యజ్ఞఫలంబు లెవరి। కర్పితంబులు గావింతు రావిధంబు। దెలుపు డన్న నము
లు సందియమునొంది ॥ వ॥ అప్పుడా భృగుమునీంద్రుఁడు నీతోడ డమలోతా
మువిత్కరించుచు యజ్ఞ ఫలభోక్తయైన దేవుని నేర్పరించి చెప్పుటకుఁదో
పక యూరకుండిన నారదుండు వారలంజూచి॥ సీ॥ మానితాష్టా
క్షరీ మంత్రార్థమును వీణెముందఱ బల్కించి సానందుఁడగుచు । పలికె నిట్లని
ప్రజాతులార మీరు సత్క్రతువులు చేసి లోకములయందు । విలసితముగ
బ్రజావృద్ధి జేసితిరి మేలయ్యె మోక్షప్రదుఁడైన దేవు । డజుఁడో హరుండో వి
చారించి ముక్తిప్రదుండైన యట్టియా మూర్తియందు। సవనఫలములనర్పించి
సంతసింపుఁడనుచు హితమొప్ప జెప్పి వీడ్కొనె విభుంచి। తంత్రులను మీటు
చును బరతత్త్వమాత్మ। యందుఁ జూచుచు స్వేచ్ఛావిహారి యగుచు॥ వ॥ అమ్ము
నీంద్రుఁడు త్రిలోకసంచారంబు జేయుచుండెనఁ జూడు శేషాద్రి యందు వల్మీక
తింత్రిణీ వృక్షంబుల నిర్మాణంబు సేసియుంచె దదనంతరంబ॥ మ॥ ఘను
లై నారదుఁడన్న వాక్యములనాకర్ణించి భావించియు । మ్మునులెల్లఁ గుమి
గూడి తాముత్తమ మూర్తిత్రయంబందుమిం । చిన మోక్షప్రదుఁడైన వే
ల్పును బరీక్షించే యుపాయంబులె । ట్లని యోచించి భృగుండు నేర్పుగన
నింకా మూర్తిచయంబులఁ॥ వ॥ అనినిశ్చయించి త్రిమూర్తులయందుము
క్తిప్రదంబైన మూర్తిని విచారించికొని రమ్మని భృగుమునీశ్వరునంపగా
నప్పుడమ్ముని సత్యలోకంబునకుఁ బోయి తపోజనపరివృతుండై కొలువు
న్న బ్రహ్మనీక్షించి మ్రొక్కియా బ్రహ్మ కూర్చుండు మనకమున్న కూ
ర్చుండినఁ జూచి యజుని మనంబున గోపంబు వొడమె నప్పుడా కోపంబున
డంచికొని విధాత మాటలాడకుండినం జూచి యీ బ్రహ్మ రజోగుణస్వరూపం
బిట్టిది యిట్టి రజోగుణప్రధానుండైనవాఁడు మోక్షప్రదుండుగాడు గావున
నితనికి భూలోకంబునం దాలయంబు లేకుండునని నిశ్చయించి యా భృగు
మునీంద్రుండు దిగ్గున లేచి కైలాసంబునకుం బోయి పార్వతీసమేతుండై క్రీ
డించుచున్న శివుని ముందఱ నిలిచినం గని పార్వతి లజ్జించె నప్పుడా శివుండు
గనియాతఁ డిట్టి రహస్యస్థలంబునకీ మ్ముని రావచ్చునాయని క్రోధరక్తాక్షుం
డై చూచుచు మాటలాడకున్న త్ర్యంబకు నీక్షించి యీ రుద్రుని తమోగుణ
స్వరూపం బిట్టిది యిట్టి తమోగుణప్రధానుండైనవాఁడు ముక్తిప్రదుండు
గాఁడతనికి శరీరపూజ లేక లింగపూజ యగుంగాక యనినిశ్చయించి యందుం
డి వైకుంఠంబున కరిగి యమ్మునీంద్రుఁడు శేషతల్పంబునందు రమాసమే
తుండై శయనించియున్న శ్రీనివాసుని వక్షఃస్థలంబునందు నిజపదం బెత్తి తన్నె

నప్పుడాహరి దిగ్గున లేచియమ్మునికి బ్రణామంబు జేసియర్ఘ్యపాద్యాది విధు
లంబూజించికూర్చుండి తాన్నదన్నినయమ్మునిపాదంబు తనతొడపైనిడుకొని
యొత్తుచు మందస్మితవదనుండై యాభృగునిఱీక్షించి యిట్లనియె॥ సీ॥ వరమునీశ్వ
రమీరు వచ్చుట తెలియక యూరకె పవళించియుంటిగనుక। నపచారినైతి నా
యందు మీరలుగక యుదుకృపనాపైదయుంచ వలయు। నాయపచారం
బునకు దగుశిక్షకై మెట్టిగి తన్నితిరి నాకిష్టమయ్యె। గఠినమైనట్టినక్షమునందు
దన్నమీపదమెంత నొచ్చెనో యెదను దాకి। యిందులకు నేమిసేయుదుని ప్ప
దంబు। కోమలంబైన చిగురుటాకు నకుమించి। యధిక మృదువైన కత
న మీరెవనుదన్ని। నప్పుడుగ ముసకింతైన నొప్పి లేదు॥ క॥ వనజముదాకినచం
దం। బునమీపద ఘాతమెదచు భూషణమయ్యెన్। ఘనకఠినోరస్థల।
మనయగ దాకినపదాబ్జ మెట్లుండెనొకో॥ వ॥ అనిపలికి యమ్మునీంద్రు
ని పాదప్రక్షాళనంబు చేసి తత్తీర్థంబు శిరంబున వహించి మఱియు నిట్లని
యె॥ క॥ వరపుణ్యతీర్థరేణువు। లిరవుగ శిరమున ధరించు నీనాటికి మీ। చ
రణంబు రమున సోకగ। ధరణీసురవర్య నేను ధన్యుడనైతిన్॥ చ॥ అనిహరి
పల్కగా భృగుమహాముని సంతసమంది మానసం బునబముదస్థులు బోడ
మభోగిశయానుని మోముజూచి లజ్జనుదలవాంచి యిట్లనియె శాశ్వత
సద్గుణమూర్తి వీవుగా। వెనను బ్రోచితిందు నిఖిలోన్నతి నిన్ను నుతింప శక్య
మే॥ వ॥ అనివినుతించి హరిని వీడ్కొని చని గంగానదీతటంబున గ్రతువు
లొనరించుచున్న శక్యపాదిమునివరుల చెంతజేరి యజరుద్రులరజస్తమో
గుణస్వరూపంబులను హరిశుద్ధసత్వగుణస్వరూపంబును దాను బరీక్షించి
వచ్చినవృత్తాంతంబు లమ్మునులకు వినిపింపగా వారు సంతసించి నారాయ
ణుండొక్కడె మోక్షప్రదుండని నిశ్చయించి సకలక్రతుపుణ్యఫలంబులా
స్వామికి సమర్పించి విష్ణుధ్యానంబు సేయుచుండిరంత। సీ॥ వనజాక్షునా భృగు
మునిదన్న నప్పుడాహరి వక్షమందుండెనట్టిలక్ష్మి। తన్నుపాదమునందుదన్ని
నభృగునిపైనలుకరెట్టింపగా హరికిమ్రొక్కి। పలికె నిట్లని పరబ్రహ్మస్వరూ
పుడవని నమ్మి నీవక్షమందునిలచి। యిరవుగా నుంటి నేడొక పరపురుషుడై
నటువంటి మునిదన్నినద్భుతముగ। నతడుదన్నుట సంతోషమయ్యెనకు।
నాకుగోపము పుట్టియున్నది మునీంద్రుని నేమిసేనసగా మదికింపుగాదు। గా
నదపమాచరించెదకమలనాభ॥ క॥ మానసమున మీపదములు। ధ్యా
నింపుచు నచటనైనదప మొనరింపన్। జ్ఞానము నాకిపుడొసగుము। నేనీప
దమందె నిలుతు నిర్మలమతినై॥ క॥ అనుచును మానతిరోషం। బున శిరమర
వాంచి పల్కె బురుషోత్తముడా। వనజాతనయను గనుంగొని। మనమలరగ ని
ట్టులని మెచ్చికమీరన్॥ క॥ సిరిసీ వాముని దన్నుట। కరమరగా జూడ

నీశాంతితుదకునన్ను । నిన్ను నెడ బాపె నెందైన నిన్ను జిత్తమందుబూజిం
చుచుండె దనంతెగాని । నీయురంబున నే నెట్లు నిల్తునధిప॥ సీ॥ అనిపల్కి కి
లికించితా పాదపద్మనైమె దానమితానసయగుచులక్ష్మి । నిజపదాంగుష్ఠంబు నే
ల వ్రాయుచు జింత నెనయుచుండగ చూచి నెనరు దాచి । కారణమూహించి బ్ర
హ్మ మాటలాడకున్న విష్ణుని జూచి యధథికన్య । హారితనుమన్నింపక అమలు జేసి
నాడీజాలిమాలనా కేలయింక । ననితలంపు మవైరాగ్యమగ్గలింప । గమల
నాభుని హృదయపంకజమునందు । జక్కగానుంచికొని ప్రమొక్కి చనిరయ
మున । రమ్యతరమైనకొల్లాపురంబు జేరె॥ క॥ ఆకొల్లాపురవాసులు । శ్రీకమ
లాదేవినచట జిరతరభక్తిన్ । ప్రాకటముగ బూజింపగ । జోకతోనందుండెల
క్ష్మిసుస్థిరమతియై॥ వ॥ ఈక్రమంబుగాలక్ష్మి నారాయణులకు బొడమిన
ప్రేమకలహంబను వ్యాజంబునలక్ష్మి కొల్లాపురంబు జేరెనని చెప్పిన విని
శౌనకుండు పశ్చాత్తాపంబునొంది సూతుంజూచియిట్లనియె॥ శా॥ శ్రీనా
రాయణుడీ ప్రకారముగ నాక్షీరాబ్ధిజన్ బాసి యా । భూనీళాసతులంగ
మోహానుకు సంపూర్ణంబుగానుంచియుం । దానందించుచునుండెనో సిరిని
నిత్యాగ బాప్పభావించుచున్ । దీనత్వంబునుబొందుచున్ నగచెనో ధీరా
త్మన్డైయుండెనో॥ క॥ అనియాశౌనకుడడుగగ । వినిసూతుండిట్లనియె వి
ష్ణుడు సిరిపై । నెనరుమనంబున బెనగొన । దనలోనిటు దలచె విరహతాపము
మీరన్॥ సీ॥ ఆదేవముని వేంకటాద్రిపై నే లేనితప్పువిరించితో జెప్ప నేల ।
యజుడు నారదునంప నతడు మానుల చెంత జేరి మూల ప్రశ్న చేయ నేల । త
త్పరీక్షకు భృగుతాప సేంద్రుడువచ్చిధైర్యంబుతో నన్నుదన్న నేల । యది
చూచి నాకునిత్యానపాయినియైన భామనన్నిపుడెడబాయ నేల । కటకటా
యేమి సేతు నీకర్మగతికి । గాలమెంతటి వారైనగడవలేరు । పద్మమందిరన
న్నెడబాయుకొఱకు । గలిగెనద్భుతముగ నెన్నికారణములు॥ తే॥ మంచి
దిదియొక కొదువగనెంచ నేల । చంద్రబింబమునందున్న చంద్రికవలె ।
విమలమైలక్ష్మి నాయందె వెలుగుగాని । పగనునను వీడదెందు సౌభాగ్యల
క్ష్మి॥ క॥ సిరిహృదయములో నే నెపు । డిరవుగవసియించియుండి యిందిర
నమరన్ । మరలన్ నాహృదయముపై । దిరముగనుంచికొని ప్రోతుత్రిజ
గములొప్పన్॥ సీ॥ తోయధికన్యకాస్థూలదేహంబిప్పుడెందున్నగాని నాయం
దుసూక్ష్మ । తనువొప్పుచున్నది దానిచేజింత లేదైన లోకవిడంబనార్థము
గను । మొనయుసర్వజ్ఞత్వమును దాచి శ్రీరమావనితను వెదుకగావలయు
నిపుడు । నేనూరకుండిన నిర్దయుండని కొందఱందరు గాన నెయ్యమున జేరి ।
కొలువరని పార్షదులకు వైకుంఠపురము । నొప్పుగారక్షణము సేయుచుం
డుడనుచు । జెప్పి భూనీళలకు వారినొప్పగించి । మరలనిట్లనితలచె సహస్రా

ధవుండు॥ వ॥ ఇవ్విధంబున గొంతకాలము జరిగినపిమ్మట సమ్మహాలక్ష్మిని మద్వక్షంబునందుంచికొందుననినిశ్చయించి భూమీతలం జూచిబుజ్జగించి రమాదేవిని వెదికిచూచిక్రమ్మఱ నిచ్చటికిదోడ్కొనివత్తునని వారితో జెప్పి సమ్మతపఱిచి వైకుంఠంబువిడచి మరలవేంకటాద్రికివచ్చెనని చెప్పినసూతుంజూచు శౌనకాదులిట్లనిరి॥ క॥ శ్రీవనితామణినరయుచు। శ్రీవైకుంఠంబువిడిచి క్షితిపైనుండెన్। శ్రీవేంకటగిరిజేరిన। శ్రీవిష్ణుండంతనేమి సేయుచునుండెన్॥ సీ॥ అని మునులడుగగా నాసూతుడిట్లవిభుడాది విష్ణుండు వేంకటాద్రి। జేరియచ్చటనుండు శ్రీవరాహస్వామికినిబుష్కరిణికి దక్షిణమున। విలసిల్లుతింత్రిణీవృక్షమూలమునందు మేయుచున్న వల్మీకవివరమందుప్రవేశించి యయుతవత్సరములందె వరికిగనిపింపకిరవుగాను। బుట్టలోవెల్గుచుండగా భూతలమున। దప్పకిరువదినొకనిమిదోద్వాపరాంత। ముందుగలియుగ ముదయించెనపుడుచోళ। రాజభువినేలుచుండె ధర్మంబుమెరయ॥ వ॥ అట్టికాలంబులందు బర్జన్యుడు కాలవర్షంబుగురియించుచుండు భూమిసకలసస్యంబుల బండించుచుండు గోవులు బహుక్షీరంబులిచ్చుచుండు బతివ్రతలైనస్త్రీలునుసతీవ్రతులైనపురుషులును మాతాపితృభక్తింగలపుత్రులను గలుగుచుండుదుర్ఘటకలియుగాది కాలంబునందుగొల్లాపురంబు చేరియున్నలక్ష్మిశ్రీహరి వైకుంఠంబువిడిచి శేషాచలంబు మీదదింత్రిణీవృక్షమూలస్థ వల్మీకంబునందు వసియించియుండు చందంబుభావించి తెలిసిజాలినొందుచు దనమనంబున నిట్లనివితర్కించె॥ క॥ నాకొఱకంబుజనాభుడు। వైకుంఠమువిడిచి పోయివల్మీకములో। నేకాకియగుచునందిపు। డాకొనినాడేమిసేతు నకటాయనుచున్॥ క॥ చింతించుచునేనాహరి। చెంతన్ జేరినను నన్ను జేకొనునైనన్। బంతమువిడువందగదని। స్వాంతంబుననిశ్చయించి జాలివిడువకన్॥ తే॥ వేగగొల్లాపురంబును విడిచిగొల్ల। పాలతికైవడినొంటిగాబోయిచోళ। రాజసతియున్న మణిమందిరంబుచెంత। జేరి హరికిక నెటుతృప్తిజేతు ననుచు॥ వ॥ మనంబున దలంచుచున్న సమయంబునమహాలక్ష్మిభావంబజుడు తెలిసి రుద్రుందోడ్కొనివచ్చుచుయచ్చట ధేనురూపంబు దరియించెనది యెట్లనన్న॥ సీ॥ కపిలవర్ణంబుతో గరమొప్పు దేహంబు మంగళకరమైన శృంగయుగము। కాటుకకనులు సింగారింపు చెవులును నల్లనై మెఱసెడి నాసికయును। గురుతరకంఠంబుగోపురంబుదరంబు తగుదీర్ఘవాలంబుతళుకు చూపు। ద్విరదతుండములట్ల దీపించుతొడలును బూర్ణకుంభాభమై పొసగు పొదుగు। బటువులైనట్టి కదళికాఫలములట్ల। నునుపుగానొప్పు నాల్గుచన్నులును గలిగి। క్షీరవారిధిలోబుట్టి చెలగునట్టి। కామధేనువు వలెలక్ష్మికడను నిల్చె॥ తే॥ వామదే

వుడు నటుదానివత్సమగుచు । ధవళ రూపంబు మెఱయ నాతల్లి చెంత ।
పాలుద్రావుచు నెగురుచు బాల్యలీల। లరుదుగాజూపగాజూచియాదిలక్ష్మి॥
చ॥ కమల జశంభు లిక్రమముగా హరికిష్టము జేయుకోర్కెతో । సమ
లిన ధేనువత్సకములైన విధంబుననంబు లోపలన్ । గ్రమముగనందుదా
నెఱిగి గ్రక్కునరెంటిని దోలితెచ్చిపెం । పమరగదూడ నావునటనమ్మెద
నంచువచించుచుండగన్॥ క॥ వినిచోళనృపాలునిసతి । తనబిడ్డకు బాలు
దాను ద్రావించుటకా । వనితకు గోరినవిత్తం । బనుపమమతినిచ్చి కొని
యెనావున్ దూడన్॥ వ॥ ఇట్లుకొని మున్నుతమకుండిన ద్విసహస్రధేను
గణంబులలో డోల చోళునకొప్ప గించెనంత మహాలక్ష్మి యిప్పుడీయజ
హరులు ధేనువత్సరూపంబులం ధరియించి వల్మీకవాసియైన వాసుదేవుని
పోషించెద రింకనాకుజింత లేదీస్వామియెందైన సుఖంచుచుండుటే నాకు
సంతోషంబనితలంచి క్రమ్మఱిగొల్లా పురంబున కరిగెనంత బ్రహ్మస్వరూ
పంబైన ధేనువు దినదినంబును॥ క॥ గోవులలో మేయుచుజని । శ్రీవేంకట
శైల మెక్కిక్షీరంబునుదా । నావాల్మీకముఁలోపలి । శ్రీవిష్ణున కర్పణం
బు చేయుచునుండెన్ ॥క॥ హరియాక్షీరము గ్రోలుచు । బరమానందంబు
నొంది బ్రహ్మనురుద్రున్ । మఱియుచు మెచ్చుచునుండిన । తరిజోళనృపా
లు భార్యతనయులకొఱకై॥ తే॥ మున్నుతాగొన్న దూడతో మొదవునపు
డు।సదనమునకొప్ప జెప్పించి సాధ్వి గోవు।గాంచిమేనెల్ల నివురుచు దాను
దాని । పిండిబోయిన బాలులేకుండగాను॥గీ॥తానుదినమదిలో సిట్లుదలచె
నావు।పొదుగు భావించి చూచిన బూర్ణకలశ । మట్లమెఱయుచు నుండి
యందద్భుతముగ । బాలులేకున్నదిది యేమి పాపమనుచు॥ వ॥ ఇవ్విధం
బున జింతించి యాదివ్యధేను వందులక్ష్యంబునుంచి కొన్నిదినంబులు పరీ
క్షించిపిండబోయిన బాలులేకుండెనంనున దద్గోపాలకుని పిలిపించియిట్లని
యె॥ సీ॥గోపాలయిపుడింత గొప్పావు పొదుగు లోబాలు లేకుండెడి పాప
మేమి । సీవరణ్యములోనె త్రావినావనవిని గొల్లడిట్లనియెసి గోవుపాలు ।
నేద్రావలేదుదూడే త్రావెగాబోలు ననగ మాయింటనున్నట్టి దూడ ।
ద్రావునేసివింత దబ్బరాడికే నంచు నత్యంతికోపింప నదిరిహాడు । పలికె
నయ్యాప్ర పొదుగంది పట్టిత్రావె । నేమొనేనొక్క కర్మంబునెఱుగననగ ।
వేమహీపతిసతి వానివిఱిచికట్టి । వేసికొట్టించి యావేళ వెడల నంపె॥ తే॥
అపుడు వాడేడ్చుచునుజని యావుగములు । వెంట దాబోయియాగోవువెం
టనంటె । పోవగానది ఫణిరాజ భూధరంబు । మీదికెగ బ్రాఁకిపోయి వ
ల్మీకమందు ॥ గీ॥ పొదుగుదిగ జారవిడిచి యాపుట్టధేను । వందుక్షీర
మునిండంప నవ్విధంబు। గోపకుడు చూచితన చేతి గొడ్డలెత్తి। గోవునడిచె

త్రిపైమించికొట్టబోయె॥ ఉ॥ అప్పుడువిష్ణుదేవుడహాహాసుర ధేనువునాకునిత్య
ముఁ । దప్పకదుగ్ధమిచ్చినను దల్లివిధంబున బ్రోచెనట్టిగో । విప్పుడుగొల్లచేమడి
యుచెట్టుసహింపగవచ్చునంచు దా । దెప్పుననైజమస్తకము ధేనువుశీఘ్రము
మీదనిల్పెఁగిఁ॥ సీ॥ గొల్లవాడెత్తినగొడ్డలిహరిమస్తకంబుఁ జొరగరక్తం
బువెడలె । తక్కకప్పుడు సప్తతాళవృక్ష ప్రమాణంబున నూర్ధ్వముఖంబు
గాను । బొంగుచుదిగజాతిభూమిపై బడజూచిగోపకుండదరు చుగూలిమడిసె ।
నదిజూచిగోవు శేషాద్రి చెచ్చెరడిగ్గితనచోళభూపతిసభకుబోయి । నేలబొర
లుచునఱచికన్నీరునింప । ధేనువునుగాంచి యారాజుదిగులునొందె । నప్పు
డా మొదవందుండ కరుగదాని । జాడ నేచారులను బంపె జనవిభుండు॥ వ॥
అప్పుడా చారుల మొదవు వెంటనంటిపోవ నాగోవు వేంకటాద్రికివచ్చి వల్మీ
కంబుడగ్గరనిల్చె నంతలో జారులొదిగిపోయి పుట్టలోనుండి రక్తం బెగురు
టయు గోవందునిల్చుటయు గోపాలకుండు పడియుండుటయుంజూచి భీతిల్లి
చోళరాజును జేరంబోయి తద్వృత్తాంతంబు విన్నవింప గావిని దిగ్గున లేచి
యారాజు పల్లకిలో గూర్చుండి పరివారంబుతోడ వేంకటాద్రిమీదికివచ్చి
యందునడిచినవిపరీతంబునకు వెఱగుపడి తనమంత్రులంజూచి యీవాల్మీ
కంబునం దిట్టిరక్తంబు వెడలుటకు గోపకుండుబడుటకు గోవు కన్నీరునించు
చుండుటకు హేతు వేమని వితర్కించుచున్న సమయంబున॥ సీ॥ వనజదళా
క్షుడావల్మీకమందుండి యపుడతిరక్తసిక్తాంగుడగుచు । గన్నీరువెడలగద్గద
కంఠుడై శంఖచక్రముల్చేపట్టిసరభసముగ । లేచియారాజునుజూచియిట్లనిప
ల్కెనోరిపాపాత్మనేనొదిగిపుట్టలో డాగియుండగా నేడుమీగోపాలుడీడకువ
చ్చినా కెపుడుపాలు । నెనరుతోనిచ్చు సురగవి నెత్తిమీద । గొట్టిచంపెదనని
పొంచిగొడ్డలెత్తి । క్రూరుడై నాశిరంబుపై గొట్టినాడు । ఘోరపాపముచే
వాడుగూలినాడు॥ సీ॥ వినురాజదిక్కెక్కడను లేక తల్లిదండ్రులు లేక నాలు
బిడ్డలును లేక । బంధువులును లేక బలుపేదవాడనై పరదేశినైవచ్చి ఘనశిన
గంబు । పైనుండుపుట్టలోపల జేరియుండగా దల్లిచందమున నీధర్మసురభి ।
క్షీరంబులిచ్చి రక్షించుచునుండగా నీపశుపాలుండు నేడుదీని । బదటమున
జంపవచ్చినపాపఫలము । వాడనుభవించె వాడునీవాడుగనుక । దొడరినను
గొట్టినటువంటిదోషఫలము । నీవనుభవింపుమెట్లన్న నీచదశను॥ తే॥ పొంది
ధరనుబిశాచమై పొమ్మటంచు । శాపమిచ్చినవినిమరిదాప మొంది । తాము
హూర్తంబు మూర్ఛిల్లి ధరణిమీద । ప్రాలియటమూర్ఛదెలిసి భూవరుడు
లేచి॥ వ॥ అందు లీలామానుషవిగ్రహుండై నిలిచియున్న హరికి సాష్టాంగ
దండప్రణామంబులాచరించి ముకుళితకరకమలుండై గద్గదస్వరంబునగన్ని
రునించుచు నాస్వామినిజూచియిట్లనియె॥ చ॥ కటకట దేవ నేనెఱిగి కష్టము

సెకొనరింపలేదు మ । ర్ఘటమగుశాపమిచ్చిననుగష్టములో బడవేసితీవునే ।
నెటువలెనోర్చియుండు జగధీశ్వర నాయెడ ప్రేమనుంచి వి । స్ఫుటతరమైన
శాపమికబోవనుపాయమునీవసేయవే॥ చ॥ అనినృపుడార్తుడై వలుకనబ్జ
నాభుడువానిజూచిబల్ । నెనరు నిట్లనెన్ నృపతి నీయెడనేరములేనిరీతి నే
నొనరనెఱుంగకన్ భ్రమసి యూరకశాపమునీకొసంగితిన్ । దనరగనాడు
వాక్యమిక దప్పదుగావున నేమిసేయుదున్॥ చ॥ భుజగగిరీంద్ర మందొదిగి
పుట్టమఱుంగున డాగియున్న నన్ । గజిబిజిజేసి కాలగతిగష్టమునాకొనరించె
నందుచే ! నిజమునెఱుంగలేకయతి నీచుడనై సుజనుండవైననిన్ । గుజనుని
గాదలంచి యతిఘోరపు శాపము నీకొసంగితిన్॥ సీ॥ వసుధ నీశాపంబు
వారింపగాలేను విపులవాత్సల్యంబు విడువలేను । గాననీపైనుండు కరుణ
మహాదుఃఖ కరమయ్యెబై శాచగతినిబొందు । లేక నావలననే నీకుదుఃఖము
గల్గె నిరువరకును ఖేదమేకమయ్యె । గలియుగమున్నంతకాలమీశాపంబు
ననుభవించుచునుండు మవనిమీద । సరసుడాకాశరాజను జనవిభుండు ।
దనకుసుతయైనపద్మావతినిముదమున । ప్రేమమీఱగనాకిచ్చి పెండ్లిసేయు ।
నపుడుమకుటము నాశీర్షమందునిలుపు॥ వ॥ అట్టికిరీటం బెట్టిదనిన నూరు
బారువులకనకంబుతో దీర్చి తులలేనిజీవమణులుహత్తించియుండు ప్రతిశుక్ర
వారంబునుదప్పింపక మ్మకుటం బాఱుగడియలు శిరంబునన్ ధరింతు నప్పు
డు మదీయాత్ములందానందబాష్పంబులు ధరియించు నయ్యాఱుగడియలు
నీవు సుఖియింపుచుండుదువుగాక యనియానతిచ్చినవిని చోళరాజు శాపగ్ర
స్తుండై చనియె నంత హరిపుట్టలో బ్రవేశించి శిరస్ఫోట నాయాసంబునకు
సహింపంజాలక బృహస్పతిని మనంబున స్మరింపగా నాగురుండు వల్మీకంబు
కడకువచ్చిన జూచు దీనవదనుండై హీనస్వరంబుతో దన కందునడిచిన
వృత్తాంతంబంతయుం జెప్పి హరి మఱియు నిట్లనియె॥ సీ॥ ఓదేవదేశిక సాద
రంబుగవిను కాలకర్మములును గ్రహగతులును । గూడినందున గోపకుడు
నడినెత్తిపై గొడ్డుగొడ్డలినెత్తిగొట్టగనుక । నొప్పిమెండైనది తెప్పుననాప
ధంబిప్పుడే భావించి చెప్పుమనిన । సురగురుండదివిని శోకాకులస్వాంతు డగు
చు నిట్లనియె మహాత్మనీకు । గాలమును గర్మమును గ్రహగతులుగలవె ।
నిముహిమమన్యు లెఱుగరు నీకె తెలియు । నైననుంచిదినన్నుమందడిగితీవు ।
గానజెప్పెద నొకమందు కమలనాభ॥ తే॥ పట్టుగావినుజిల్లేడుపత్తియొత్తి ।
పాలలోనద్దినెత్తిపై పట్టిరాయ । నందిడిన నొప్పి శాంతమౌననుచు జెప్పి ।
హరికిబ్రమిణమిల్లిసురగురుండరిగెనంత॥ సీ॥ హరిగురుడెఱింగించినట్టిమందా
గాయమందుబెట్టుచునుండెననగనవ్వి । శౌనకాదులుచాల జాలినొందుచు
సూతునీక్షించి వెఱగంది యిట్టులనిరి । ఘనరోమహర్షణమునిపుత్రతింత్రిణీ

భూజవృత్తాంతంబు పుట్టవిధము । మొదలైనవృత్తాంతములు చెప్పుమీకథ
వినవేడుకైనదివిశ్వమెల్ల । లలిని బుట్టించు రక్షించు లయమొనర్చు । నట్టి
సర్వజ్ఞులకు లేని యాపదెల్ల । గలిగె నిదివిన్నమది వెన్నకరణిగరగు । చున్న
దదిదేటగాఁ జెప్పుమామహాత్మ్య॥ క॥ అనివారడుగగ సూతుడు । వినియునిట్ల
పల్కె-నాది విష్ణుచరితముల్ । ఘనరస గూఢార్థంబులు। గనుకక్కా వివరించి
చెప్పఁగావశమగునే॥ వ॥ అయిన నాకు దోచినంత జెప్పెద నెట్లన్నను దశ
రథుండును గౌసల్యయు దేహవిముక్తులగు కాలంబునం దారామచంద్రుని
యం దత్యంతమోహంబునుంచికొని చనిన కారణంబున బద్మసంభవుండు
భావించి తదృణాను బంధానుసారంబుగా రామకృష్ణరూపంబులకు గార
ణంబైన హరి కిరవుగానుండుటకై దశరథు తేజంబు తింత్రిణీవృక్షంబుగా
గౌసల్యాదేవి తేజంబును వల్మీకంబుగా వేంకటాద్రియందు నిర్మించె దత్క్రి
మంబుగా వసుదేవదేవకులును దేహముక్తికాలంబుల శ్రీకృష్ణస్వామియందు
బుత్రవ్యామోహంబునుంచికొని చనిన ఋణానుబంధంబుల నెఱిగి దశరథ
స్వరూపంబైన తింత్రిణీతరువందు వసుదేవుని తేజంబును గౌసల్యాస్వరూ
పంబైన వల్మీకంబునందు దేవకీదేవి తేజంబు నిలిపె నందు నారామకృష్ణా
భిధానకలితుండైనవిష్ణుడా కాలంబున మాతృగర్భంబునందున్న శిశువుకరణి
బది వేలవత్సరంబులా పుట్టలో వసియించియుండెగావున దశరథుండె తింత్రిణీ
వృక్షంబు కౌసల్యయే వల్మీకంబు లక్ష్మణుండే శేషపర్వతం బయోధ్యా
పురంబే తద్బాదరపుణ్యకాననంబు సరయూనదియే స్వామి పుష్కరిణి
రామచంద్రుండె వల్మీకవాసియైన శ్రీనివాసుడగుచుండు దదనంతరంబున
వసుదేవుండె తింత్రిణీభూజంబు దేవకీదేవియే వల్మీకంబు బలభద్రుండె పన్న
గాచలంబు మథురాపురంబె వేంకటనగరంబు యమునానదియె శ్రీస్వామి
పుష్కరిణీ యాదవులె మృగంబులు గోపికలె ఖగంబులు కృష్ణుండె వల్మీక
వాసియైన వేంకటేశ్వరుం డగుచుండగా మఱియు శ్రీవైకుంఠంబు నిగమ
మయంబైన శేషాచలంబు విరజానదియు సువర్ణముఖరి నారాయణుండే
లీలామానుషవిగ్రహుండైన శ్రీనివాసుండుగాగ నచ్చట ననేకముక్తబ్రహ్మ
లనేకఖగంబులై యనేకముక్తరుద్రు లనేకమృగంబులై సనకసనందనాదు
లు వనచరోత్తములై వర్తించుచుండగా బరమపురుషుండైన వేంకటేశ్వరుం
డందు విచిత్రలీలావినోదంబుల గ్రీడించుచుండియు దనకు శరీరబాధగలిగినట్ల
మాయగా నటించినాఁ డింతియేకాని యామహానుభావున కాబాధ లేదు
మీరు నెమ్మదిగా వినుం డాస్వామిదర్శనంబు జేయ నిశ్చయించినవారు సకల
సత్కర్మసిద్ధులం బొందుదురని చెప్పి సూతుండు మఱియు నిట్లనియె॥ శా॥
వైకుంఠంబునుఁ బీడి శేషగిరిపై వల్మీకగర్భంబులో । శ్రీకాంతుండు వసించి జేసిన

మహాచిత్రంబులం వింటిరిం । కాకంజాతుఁడు మర్త్యుఁడై నరులతో నాట్లాడిన క్లైపుడుఁ । జోకల్ తాకికుఁడై ఘటించినకథల్ చోద్యంబుగాఁ జెప్పెదర్ ॥ మ॥ వినుఁడా నిర్జరదేశికుండు హరికిన్ వేఁ జెప్పి వారింపఁ జె। ప్పినపాద్యాదియుఁ దెచ్చి గాయముపయిన్ బెట్టెహితుండొక్కఁడై । నను లేకుండఁగ నేమి సేతునని శ్రీనారయణుండాప్తుఁడై । తనమందప్పుడు దానె దెచ్చుటకు బ్రాఃకాలమం దొక్కఁడే॥ సీ॥ అరుగునప్పుడు వరాహస్వామి వృషభాసురునితోడ బోరాడి దునిమినైచి । యవల భూదేవితో నఖిలపర్వత గుహాసానుశృంగములందు సంచరించి । బహువత్సరములకు బన్నగాద్రిదలంచి మరలవచ్చుచున్న మార్గమందు। నరుని చందమున శ్రీహరినిల్చియుండఁగాఁగనిన నరుఁడనియుర క్కసుఁడొకండు । హెచ్చితనతోడ బోరాడవచ్చెననుచు। నటులు ఝళింపించి యట్టహాసంబుచేసి। దిగ్గజంబుల చెవులు భేదించుకరణి। ఘుర్ఘరారావమొ నరించె ఘోరముగను॥ క॥ ఆరభసంబునకలుకుమ। నారాయణ దేవుఁడటి కినటమొక పొదలో। భోరునడాగినగనియా । దారినిగిటిదేవుఁడరిగిదర్పముమీ ఱన్॥ క॥ ఘోరాకారుండగుచును। గోరలుగీటించి కొనుచుఁగొబ్బునబొద లో। దూఱినఘోణింగనియపు। డూరకె యొకమూలవిష్ణు డొదుగుచునుం డెన్ ॥ వ॥ ఇట్లొదుగుచుగన్నీరునించుచుండఁగాన తనిదీనదశఁ జూచి దనుజుండు గాఁడు దనుజాంతకుండని తెలిసి నిష్కారణంబుగాన తనియందు గ్రోధించితి నని మనంబుగరఁగ వరాహస్వామి తానును బాష్పపూరితలోచనుండై యందున్న లీలామానుషవిగ్రహుని చెంతజేరి యోడకుమని యిట్లనియె॥ సీ॥ వైకుంఠమెడబాసి వచ్చినగతియేమి సిరియురంబున లేని చిత్రమే మి । మానవాకృతినిందుబూనియుండెడిదేమి తలమీఁద గాయంబు తగులు టేమి । యుడిచినబలముతో నొదుగుచుండుటదేమి కన్నుల బాష్పముల్ గారుటేమి । నేఁజొప్పినప్పుడు నిల్చిపల్కకనాకు లోఁగినట్టడవిలో డాగుటే మి । వింతగాదోచుచున్నదీ విధమునాకు। దెలుపునిక్కముగానంచుగలక నొందియడుగనట లేక దీనాస్యుఁడగుచునతఁడు। కిటివిభునిజూచి పల్కె లక్ష్మ విభుండు॥ సీ॥ విను ఘోణిరూప నావృత్తాంతమంతయు సిరినురస్థలినుంచి శ్రీవికుంఠ । మందు నేనుండఁగా నద్భుతంబుగవచ్చి భృగుఁడు దానా ఱొమ్ము నెగిరితన్నె।నాయురమందుండినట్టిరమాదేవి పరపూరుషునిపదం బోరయు చోట। నిలిచియుండనటంచు నలుకతో గొల్లాపురంబున కరిగివైరాగ్య మొందె। గానసంసారసౌఖ్యంబు నేనురోసి। నీకడకువచ్చి విపుల వల్మ మందు। గుదిరియుండగనిందొక్క గొల్లవాఁడు। గొడ్డటనునను నెత్తిపైగొ ట్టినాఁడు॥ క॥ ఆగాయము మానెడికొఱకై। కాగీష్పతిమందుసెప్పె నయ్యౌ షధమే ।నీగిరిమీఁదన్ వెదుకుచు। వేగమెనినుగంటినిచట విమలశరీరా

క॥ తలగాయమునొప్పింపగ। బలుహీనుడనైతిగానబలవంతుడవై। చెలగు
చునను రొప్పిననే । నులుకుచు బొందజేరిడాగియుంటిమహాత్మా॥ ఆ॥ కరు
ణమీఱనీవు కలసిమాట్లాడితి । వందువలన డెందమందుబూర్వ । మున్న
చింతదీఱెనన్ను నీవానిగా। జెంతనుంచుకొనుము శ్రీవరాహ॥ ఆవైకుంఠ
మునొల్లక । నీవె నేననుచు జాలనెన రెనయగనే। దాపుననుండితి నెక్కడ।
నీవుంటివిచూడలేదు నేనిందనుచు౯॥ సీ॥ హరియపు డనుగగా వావరా
హస్వామి పలికెనిట్లనుచు నీపర్వతమున।వృష భాసురుడు చేరివిడి వడిశ్యా
మాక ధాన్యమొందుండిన దాగ్రహించి । కొనిపోవు గనుక నా క్రూరాసు
రునింకోడబహుదినంబులు ఘోరబాడనంబు। జేయుచునుంటినమ్మాయరాక్ష
సుం డెందుజిక్కక నేయుండిచిక్కగనుక । వానిశిక్షించియిచటికివచ్చినిన్ను।
నేనజూచితి నన్నునునీవునిపుడు। గాంచితివినీకు నాకుసఖ్యంబు గలిగె। నిం
దుచేమోద మొదవె నోయిందిరేశ॥ ఆ॥ అనివరాహ దేవుడాప్తుకై పల్క
గా ।వినిముదంబునొందివిష్ణుడనియె। నవనిగలియుగాంత మందాకగిటిదేవ।
నేవసింపజోటునీవుచూపు ॥సీ॥ అనిచక్రిపలుకగా వినివరాహస్వామి యిది
యేమి యనిసంశయించి పలికె। హరివిను పేదలకాశ బెట్టగరాదు వలనొ
ప్పగా బలవంతులకును। దావియ్యరాదైన ద్రవ్యమిచ్చితివేని కొలిచి నూ
అడుగులకుతల మిచట । నీకిత్తుననిపల్క నాకంజలోచనుం డిట్లనెలక్ష్మి
నన్నెనసియున్న । ధనమునీకిత్తునిపుడుశ్రీతరుణియలిగి। గొల్లపురమును జేరె
నుగూర్మిలేక।పుడమిఁగొనుటకురూకల వడిగఁ దెత్తు।బ్రజలయాచింతినియిం
దుబ్రతుకవలయు॥ చ॥ అనిహరిపల్కగావిని మహామహుడైన వరాహ దే
వుడి। నిట్లనియెనదేటిమాటలిపుడర్థమొసంగికభూమినియ్యన। న్ననుగిటి జూ
చిమాధవుడు నవ్వుచుని ట్లనియె౯ ధరాతలం । బొనరగనీ యధీనమగుచు
న్నది కొంచెము నాకొసంగవే॥ సీ॥ ఎంతయునిచ్చిననంతలో నేనుండిజీవ
నోపాయంబు జేయుకొంటను । బంచామృతస్నానమంచితంబుగ దినదినము
సేయింతుతీర్థములయందు। మునిగిముందుగనీకుమ్రొక్కకొనకలోసంగిజన
నియమంతునుజనుల కెల్ల । నదియుగాకను దొలుతనీకన్నమిచ్చి । యన
లనేను భుజించెదననినసమ్మ। తించికిటిదేవుడావాసువువేడచట। గుదురనూ
అడుగు లభూమికొలిచి యొసగె ॥వ॥ ఇవ్విధంబున వరాహస్వామి హరి
నాదరించి శేషాద్రియందునిలిపె నప్పుడయ్యిరువురి శీర్షంబులందు దేవతలు
పుష్పవర్షంబులు గురియించి యనేక ప్రకారంబుల వినుతించి రప్పుడు
కిటిదేవుండు తన చెంతబాకరాణిమై యున్న వకుళమాలికె నవ్వాసు
దేవుని చెంతనుంచి యన్నపానౌషధాది సర్వోపచారంబులు సేయుచుండు
నినియమించెనప్పుడావకుళమాలికహరికిశ్యామాకాన్నంబును దేనెయు

భోజనంబుగావించుచుగాయంబున కౌవశంబిడుచునవ్విధంబున బోషింపు
చున్నంతసంతసించిమున్ను ధేనువత్సరూపంబులధరించిపుట్టలోనున్న చక్రికి
బాలిచ్చి తృప్తిబొందింపుచున్న బ్రహ్మరుద్రులంత స్థానంబుగొంది నిజస్థా
నంబులంజేరి రంత శ్రీనివాసుండా గిరియందు సకల వినోదంబులు సేయు
చు భక్తహీనులకు మోహకుండై పరమభక్తులకు సకలసిద్ధిప్రదుండై
రాక్షసులకు భయంకరుండై దేవతలకు వినోదంబు జూపుచు శిరస్ఫోట
నాయాస విముక్తుండై దివ్య సౌందర్యలీలా మానుష విగ్రహుండై తల్లి
చెంత ముద్దులు చూపుబాలకునివిధంబున వకుళమాలిక చెంత నటింపు
చుండెనని చెప్పినవిని శౌనకాదులుసూతుంజూచి యిట్లనిరి॥ సీ॥ వకుళమా
లిక యొక్క వరచరిత్రంబు మాకెఱిగింపు మనసూతు డిట్టులనియె। శ్రీయ
శోదాదేవి చిన్నికృష్ణునియందు బుత్రవాత్సల్యంబు పొసగనుంచి। కాల
గతిని జెందగా దదృణానుబంధమును భావించి విధాతవకుళ।మాలికయ
నెడి నామము నిచ్చి పుట్టించి భూవరాహస్వామి పొంతనిలిపె। నప్పుడా
కిటి దేవుడా యతివనొనర। జక్రధరుచెంత నిలుపగా జననికరణి। నాద
రించుచుదెచ్చి తానౌషధంబు। బెట్టి తలగాయమును మాన్పె బ్రేమమీఱ॥
ఉ॥ శ్రీరమణీ విభుండచల శేషగిరీంద్రము మీదనిల్చి వి। స్తారముగా
వినోదముల సల్పుచు నొప్పుచునుండి పూర్ణశ్రీం। గారవిశేష లీలలసుఖ
స్థితి నొప్పిన రాజకన్యనం। దారసి పెండ్లియాడె సురలందఱు మెచ్చగ
నంచు బల్కగన్॥ సీ। విని మౌనులా సూతునొనరంగ నీక్షించి పలికిరి
ట్లని రమాపతికి దగిన। కన్యకామణి యెందుగలిగె దానికి తల్లిదండ్రులు
నన్నలు దమ్ములెవరు। నీవావిధములన్ని సావధానంబుగా జెప్పుమిప్పుడు
మచ్చి కనటంచు। నడుగగా సూతుడిట్లనె నిర్వహెనిమివో ద్వాపరాంత
మున భూతలమునందు। వెలయు కలియాదియం దొప్పవిక్రమార్క। ము
ఖ్యరాజులు జనియించి ముదముమీఱ। భూమినొనరగ బాలించి పోయి
స్వర్గ। లోకమున జేరి రొనర భూలోక మునులు॥ వ॥ తదనంతరంబునజం
ద్రకుల పాండవ ద్వాహిత వంశంబునందు సువీరుండనురాజు దయించిభూ
మిని బాలించుచుండి సుధర్ముండను పుత్రుంగాంచి కొంత కాలంబున కత
నికి బట్టంబుగట్టి సద్గతింబొందె నంత సుధర్ముండు భూమి పాలించు చుండె
నట్టికాలంబున మున్ను వేంకటాద్రికి వచ్చి పాపవిముక్తుండయి బ్రహ్మచే
త వరంబుల వడిసిన మాధవ నామధేయ బ్రాహ్మణుండు తత్పర్వతారో
హణంబుచేసి స్వామి పుష్కరిణిలో గ్రుంకులిడుచు వరాహస్వామి సాన్ని
ధ్యంబున తపంబుజేసి యచ్చట శరీరంబు విడిచి సుధర్మరాజుకు జ్యేష్ఠపు
త్రుండై పుట్టియాకాశరాజన బ్రసిద్ధుడై యుండె బూర్వంబామాధవా

శ్య విప్రుని భార్యయైన చంద్రరేఖ పతిస్మరణంబు జేయుచు దద్దేహంబు
విడిచి క్రమ్మఱ జనించి ధరణీ దేవియనుపేర నొప్పుచుండగా సుధర్ముడా
కాశిరాజనకా ధరణీ దేవిని వివాహంబు జేసెనని చెప్పి సూతుండు మఱి
యునిట్లనియె॥ సీ॥ తక్కకన వలను ధర్మరా జొక్కనాడడవి లోపల వేట
లాడి బడలి। యచ్చట నొకపంక జాకరంబున కేగి సుకుమార నాగకన్య
కనుజూచి। మోహించి బహువిధములదాని బ్రార్థింప నదియొడం బడక
యిట్లనియెరాజ।నీవుమానవుడవు నేనాగకన్యక నౌదు గానదాంపత్య మేక
రణి నమరు। బొమ్ము నీత్రోవ నని పల్కి పోవదాని। వీడజాలక మఱి
మఱి వెంటనంటి। చాలవేడగనాకన్య జాలినొంది। యవలబోలేక నీవె
వ్వడనగ నృపతి॥ క॥ తనకులమును గోత్రముపే। రునుదా బ్రభువ గుట
యును నిరూఢిగ దెలుపఁగ। వినియానాగకులాంగన। మనుజేశ్వరుమో
ముజూచి మఱియిట్లనియెఁ॥ సీ॥ భూనాధననునీవు పొందిన బుత్రకుండుర
గలోకంబు నందుది తుడగును। దనతండ్రి యెవ్వడన్నను వానికప్పు డే
మనిచెప్ప వలయు నోజనవరేణ్య। యనగ సుధర్ము డిట్లనియె నీకుసుతుం
డు గలిగి నన్నడగిన కాలమందు। నాపేరు చెప్పినిర్ణయముగా బంపింపుమే
నర్ధరాజ్యంబిచ్చియతని బ్రోతు।ననుచు దనముద్దుటుంగర మానవాలు। గా
ముదంబున నానాగకన్యచేతి। కిచ్చి యాసందమున దాని నెనసిచొక్కి।
పొమ్మునీవని యటరాజు పురముజేరె॥ తే॥ పట్టుగా నాగకన్య గర్భము
ధరించి। నాగ లోకంబునకు బోయినను ఫణీంద్రు। డావిధముదాను
దెలిసి యేమనకకార। ణంబుభావించి మదిసంతసంబు నొందె॥క॥ ఆకన్య
క కందరుదగ। శ్రీకరుడగు చక్రవర్తి చిహ్నంబులతో। బ్రాకట శుభల
గ్నంబున। జోకగ భుజగంబులలర సుతుడుదయించెఁ॥ తే॥ పూటపూ
టకు దగువృద్ధి బొందిబాలు। డమ్మనాతండ్రి యెవ్వ డటంచు నడుగ।
నాగకన్యక వినిలోన నగుచు దనయు। నెత్తిముద్దాడి లాలించి యిట్టులని
యె॥ తే॥ తనయనీజనకుండుసు ధర్మరాజు। ధారుణీతలమును బ్రసిద్ధంబు
గాను। బాలనము సేయునటకు నిర్భయుడవగుచు। బోవలసి యున్నసు
ఖముగా బొమ్ముపుత్ర॥ ఉ॥ అచ్చట నర్ధరాజ్యము మహా ముద మొప్ప
గ నాఘనుండుని। కిచ్చును ధర్మపద్ధతిగ నేలుమునన్ను దలంపు చుండు
మిం। కిచ్చట గార్యమేమియట కేగిసుఖంబున నుండుమంచుబ। ల్మచ్చిక
మీఱ జెప్పి చనుమార్గము తేటగ జూపె సమ్మతిఁ॥ వ॥ అప్పుడబ్బాల
కుండు మాతామహుండైన నాగరాజు మొదలుగాగల భుజంగంబులకు
మ్రొక్కి దీవనలంది తనతల్లికి దండప్రణామంబుజేసి వీడ్కొని పాతాళబి
లమార్గంబున వచ్చుచుండగానతనిజననిపుత్రవాత్సల్యంబుచేతనబ్బాలకుం

దోడ్కొనివచ్చి భూమిపై జేర్చి మున్నుసుధర్మరాజుతన చేతికిచ్చియున్నము
ద్దుటుంగరంబక్కుమారుని చేతికిచ్చిననతండు వ్రేలందొడగితల్లికి బునఃపున
ప్రణామంబులుచేసిన నదిదీర్ఘా యుష్మంతుడవై హరిభక్తుడవై చక్రవర్తివై
వృద్ధిబొందమని దీవించి శిరంబునివిరి చెక్కిలి ముద్దుగొని వీడ్కొల్పి తా
నుజాలి నొందుచు బాతాళలోకంబున కరిగె బాలకుండు నారాయణావన
పురంబుజేరి సుధర్మరాజ సమీపంబునకుబోయి మ్రొక్కగా నయ్యర్భ
కుంజూచి నృపాలుండిట్లనియె॥ సీ॥ ముద్దుబాలక నాకు మ్రొక్కి నిల్చి
తివిసి వెవడవుతలి దండ్రు లెవ్వరనుచు। నడుగగా డింభకుండళుకింత లేక
యోనరనాధనాతల్లి నాగకన్య।తండ్రిసుధర్మభూ వరుడనినిష్కర్షగా జెప్పి
ముద్దుటుంగరము జూపె। నాముద్రికనుజూచి యతడు మంత్రిపురోహి
తాత్మజ బంధుమిత్రాదులకును। నందనుని జూపిమునుదాను నాగకన్య।
నెనసియుంగరమిచ్చి వచ్చినవిధంబు। లన్నియును దెల్పితనపుత్రు నాదరిం
చి। ప్రేమతోదొండమానుడన్ పేరుబెట్టె॥ వ॥ తదనంతరం బాతొండ
మానునకు నుపనయన వివాహంబులుచేసి యప్పుత్రుల నిరువురంజూచి
సంతసించుచుండికొంత కాలంబున నాకాశరాజునకు బట్టణంబుగట్టి తొండ
మానుని యువరాజుజేసి సుధర్మ భూపాలుండు ముక్తిబొందె నంత గగన
నృపాలుండును దొండమానుండును భిన్నోదరులై యుండియు నేకోదరుల
చందంబుననత్యంతమైత్రిగలవారై నారాయణపరాయణులైసుజ్ఞాన యుక్తు
లయి యుండిరందు జ్యేష్ఠుండగు నాకాశరాజు తనకు సంతతి లేకచింతించి
యొక్కనాడు బృహస్పతికి నమస్కరించి యిట్లనియె॥ సీ॥ సద్గురు వరనా
కు సంతానలాభంబు గలుగకుండుట కేమి కర్మములను। జేసితి నారీతి
జెప్పుడన్నను మహీపతికిట్టు లనియె గీష్పతి ముదమున। నీవుపాపము లె
న్ని గావించియుండిన బరిహారమగుట కుపాయమొకటి। జెప్పెద నెట్లన్నస్థి
ర భక్తితో బుత్రకామేష్టిగావింపు క్రమముగాను। సుతులు పుట్టెదరని
చాలహితము మీఱ। బలుకగావిని మ్రొక్కి భూపాలు డచట। జెలగి
యజ్ఞప్రయత్నముల్చేసి కనక। హలముతోభూమిదున్నించెనాఢ్యుడగుచు॥
చ॥ అటువలె భూమిదున్నగ సహస్రదళంబులు గల్గియొప్పువి। స్ఫుటతత
ర పద్మమందు బొడసూపిన జూచి నృపాలకుండునే। డిటువలె నబ్జమీధ
రణి నెట్లుజనించెన టంచుజూడద।త్పటుతరకంజ మధ్యమున బాలికగన్పడె
నద్భుతంబుగన్॥ ఉ॥ అప్పుడుదానిజూచి నృపుడార్యుల నెల్లను బిల్చిభక్తి
తో। నొప్పుగ బద్మమధ్యముననుండెడి కన్యను వారికేర్పడన్। దప్పక
చూపుచుండగ ముదంబన నందశరీరి యిట్లనెన్। మెప్పుగదీని బెంపుమి
క మేలు ఘటించును నీకుభూవరా॥ చ॥ అనియశరీరివల్కగ మహాద్భుత

మందిన్నృపాలకుండుమె । ల్లనకమల స్థకన్యకను లాలన జేయుచుగారవిం చుచున్ । జనితనమంది రంబునకు సంతసమొప్పగ జేరి భార్యకం । దొనరగ బిడ్డనిచ్చి బహుళోత్సవ ముల్న డిపించి యిట్లనెన్॥ గీ॥ వినుమయోనిజ యైనట్టి తనయనిపుడు। నీకు దేవుడు దయనిచ్చె నెనరుగాను। సంతసించుచు బోషింపు చంద్రవదన । యనిన ముదమొంది బెంచెనయ్యతివసుతను॥ క॥ తద్ధయునా తలిదండ్రులు । ముద్దుగదగ బెంచుచున్న ముదిపములారగ్ । ముద్దులు సూపుచు జలిబిలి । సుద్దులు చెప్పుచును వేడ్కజూపుచునుండెన్॥ సీ॥ ఆకన్యతన యింటికరుదుగావచ్చిన ఘనలక్షణముననాకాశరాజు । భార్యగర్భముదాల్చె నార్యులెల్లనుమెచ్చ నైదవనెల శుభావహముగ । సీమంతమారాజు సేయించెనట మీాదబాలు పొందినవ మాసపూర్తిగలిగె । దశమమాసంబున దరిణిగన్యారాశి యందుప్రవేశించి నపుడు శుక్ల । పక్ష దశమియురోహిణి ప్రకటశుక్ర । వారమును గూడి నటువంటి వరదినంబు । నాటిసంధ్యనుగగన భూనాయకునకు । నందనుడుపుట్టెలోకులానంద మొంద॥ వ॥ అప్పుడారాజేంద్రుండుసంతోషమగ్నుడై స్నానంబుజేసి యనేకబ్రాహ్మణులకునవధాన్యంబులనుధనంబును సహస్రధేనువులునుబదివేలతురంగంబులనుఛత్రచామరాదిసకలవస్తువులనుశాస్త్రప్రకారంబుగాదానంబుజేసినిజగురుపూజగావించితదనంతరంబునసుతునకు వసుధానుండను నామంబిడిసుతకు బద్మావతియను పేరుబెట్టి యనేకసహస్రబ్రాహ్మణ భోజనంబు జేయించి పుత్రుని పుత్రికనుగారవించి పోషించుచుండగాదినదిన ప్రవర్ధమానులై క్షీరసాగర రాజమందిర మధ్యంబున లక్ష్మీయుజంద్రుండును ప్రకాశించు చందంబుననాకాశరాజగృహమధ్యంబున బద్మావతియును వసుధానుండును వెలుంగు చుండి రంతనానృపాలకుండు కొన్నియబ్దంబు లయ్యెరువురకు సకల విద్యాభ్యాసంబు జేయించుచు గుమారున కుపనయనంబుజేసి పద్మావతికి దగిన విభుండు కల్గునేయని చింతించుచు గురునకు నమస్కరించి యిట్లనియె॥ సీ॥ పుణ్యాత్మగురుచంద్రపుత్రికామేష్టి మీాయను మతిశోజేతుననుచు నేను । వసుధనున్నింపనవ్వసుమతిలో బద్మమురుదుగాబుట్టె నయ్యబ్జమందు । బాలికదొరకగా బద్మావతీ నామధేయంబు నిడితినిదీపితముగ । నటువంటి భామినికనురూపుడైనట్టి పురుషుండు దొరకునే భూతలమున। ననుచు నారాజుచింతింప నపుడుగురుడు । పలికెట్లనినృపతిసీ పట్టికిలను। దగిన పురుషుండెకల్గు సిద్ధంబుగాను । సంతసంచుచునుండు మోజనవరేణ్య॥ వ॥ అనియాదేశకుడానతిచ్చినదెయందారాజు పద్మావతిన్ గని సంతోషనిమగ్నుడైమురియుచున్ గారాముగా బెంచుచున్ । ఘనదివ్యాంబర భూషణా వళులున్నొం

గారించి ముద్దిచ్చియ । త్తనయున్ సూనుని జూచిచూచి మదిలోఁ దానెప్పు
డుప్పొంగుచున్ ॥ క॥ తనుబుణ్యాత్ము కుడనుచును । మనుజులు గాని యూ
డనతడు మహిధర్మముగా। మనమలరగనేలుచు నిజ।వనితామణితోడ సౌఖ్య
వనధిన్ దేలెన్ ॥సీ॥ అపుడుపద్మావతి నానందముగబెండ్లియాడెదనని వెం
కటాద్రివిభుడు । భావించుచుండగా బద్మావతికి నవయౌవన కాలంబు నవ
తరించె।నంతలోపలనువసంతకాలమువచ్చె శృంగారవనములు చిగురులెత్తె।
గోరకంబులతోడ గుసుము ల్వికసించె దగినశిలాట బృందములువాడ
మె। నంతలో నెఫలింప గానచటనచట। గుములుగాగూడి కోవెలల్ గూయ
సాగె। నతిశయించుచు నళులు ఝుంకృతులొనర్చె। గలికిచిలుకలు నుప్పొం
గిపలుకసాగె॥సీ॥చిగురుటాకులు మెక్కి చెలరేగుపికములు మేలుపూదేనియ
గ్రోలినళులు। పరిపక్వఫలముల గొఱికి శుకములజ్జనాశము ల్మెక్కు మరా
ళములును। సందడింపగను నానందకరంబులైవలనొప్పు శృంగారవనము ల
న్ని। మెఱయబద్మావతి మేడపైనుండియాసుమవనంబుల నెల్ల జూచిచూచి।
వనవిహారము తా జేయవలయుననుచు। జెలులతో ముచ్చటాడి మచ్చికలు చే
సి। మేడదిగివచ్చి తల్లిసమీప మందు। జేరియిట్లని పలికెనా చిగురుబోడి॥
తే॥ జననిశృంగార వనములాశ్చర్య ముగను। గనక సౌధంబుమీదికి గాను
పించె।గాన జెలులును నేనునక్కడికి బోయి। దెచ్చెదమునీకు బుష్పము ల్మె
చ్చుగాను॥ చ॥ అనవిని తల్లియిట్లనియె నమ్మసుమంబులకీవుపోయినన్। గ
నిజను లెల్లనవ్వెదరుగాన వనంబులకేనునిన్నుబం । పను జెలికత్తెలన్బను
పభాసుర పుష్పములింటికిప్పుడే । ఘనముగ దెచ్చియిచ్చెదరు కానియట
న్నజలంబు సేయుచున్ ॥ క॥ రంతులు సేయుచుబాలిక। గంతులువేయుచు
భుజింపకయుపానుపుపై। జింతించుచు బవళింపగ। నంతటదనసుతను బిలిచి
యాదరమొప్పన్ ॥వ॥ అక్కుందరదనమందస్మిత వదనారవిందమై యా
సుందరిని బుజ్జగించి యిట్లనియె॥

సీ॥ వనమునకీవుపోవలదన్నలిగితివైనమంచిది లెమ్మయనుచు లేపి।
చెలులను బ్రాహ్మణస్త్రీలనుబిలిపించి తోలగసీయక సుతతోడు గూర్చి ।
చక్కనిపల్లెముల్ సకలవస్తువులును జెలులకందిచ్చి యందలములోన।దనసు
తనుంచిమోదంబుతో నంపగ నయ్యింతివనమునకరిగి యచట।రమ్యతర
మైన కమలాకరంబు చెంత। నందలముడిగ్గితానునందందు దిరిగి। విరులుగో
సెదనని చాలవేడ్కనొంది । వనవిహారము జేసెనవ్వారిగాను॥ వ॥ అవ్విధం
బెట్లన్నను॥ సీ॥ చెలగిపువ్వులు గోసిచెలులపై బడ నేసికిలకిల నవ్వునాకీర
వాణి। మాటి మాటికిగోసి మధురఫలంబులు చెలులకందిచ్చు నాచిగురు
బోడి। లాలించి పాలించి సిలకంఠములతో మేలంబులాడునాసిలవేణి। రా

యంచగమివలె నామెడ నటియించి సారెకు సోలునాజలజపాణి। కోరికో
వెలలట్లుదాగూజితంబు। జేసిజొక్కుచు బలుమాఱు చిలుకగములు। సరణి
బల్కు చుభృంగినీచయ మురీతి। గానమొనరించు నందందుమీననయన॥
క॥ మొల్లలు పొన్నలుపొగడలు। మల్లెలుసంపంగివిరులు మందారములున్।
నొల్లలుగా గోయుచునం। దుల్లాసము మీఱరాసులు ద్విన్నించున్ ॥క॥ ఒ
య్యారంబున నడచుచు। గయ్యాళించుచును పుష్ప ఘనతరలతలన్। జ
య్యననొప్పుచు మురియుచు। నుయ్యాలలు చెలులతోడనూగుచు నుం
డున్॥క॥ వింతగ మోదుగు పూల। వసంతము జేయించి చెలుల జతగూ
ర్చుచుఁబ। ద్దంతపుచిమ్మన గ్రోవుల। బంతంబున జిమ్మిచిమ్మి పకపకనవ్వున్॥
క॥ మెప్పుగధరపై రాలిన। పుప్పొడిదెప్పించి మించిపొలతుల మీదన్। గు
ప్పుచురొప్పుచుసుద్దులు। సెప్పుచుకమలాకరంబు జేరుచువేడ్కన్॥ తే॥ చె
లగుచును విప్రసతులతో జెలులతోడ। వేడుకలు మీఱగాజల క్రీడలాడి।
తీరముల జేరి యందఱిచేరబిలిచి। చేరలూడ్పించెనట మీద జెలియలెల్ల॥సీ॥
తరుణికిమృదుల వస్త్రంబుతో దడియొత్తిపట్టుపావడ మొలకట్టెనొకతె।
చలువైనవలి పెంపుసరిగె పువ్వులచీరె పట్టుపావడమీద జుట్టెనొకతె। మొ
లపూలువడ్డాణమునుదనుమధ్య మందంచితంబుగను బంధించెనొకతె। బర్మ
సమ్మోళమై పరగుపట్టంచుచందురు కావిరవికెదా దొడిగెనొకతె। భా
సురములైననూతనాభరణములను। మొనసిసర్వాంగముల నుంచి మురి
సెనొకతె। కుప్పరేకియు మొగలిరేకులునుగూర్చి। పూసరులు చుట్టుచును
జెడవేసెనొకతె ॥సీ॥ తిలకంబునుదుటిపై దిద్దివాల్గన్నులదీను గాగాటుక దీ
ర్చెనొకతె। పరిమళ గన్ధమూబాలి కామణి మేననానంద కరముగా నలదె
నొకతె। దిక్కులవాస నల్బిక్కటిల్లగముల్లెవిరుల వీవనలతో విసరెనొకతె।
గద్దెపైనపుడున్న కన్యముందరదేట నిలువుటద్దముదెచ్చి నిలిపెనొకతె।
సఖియకిటువలెసర్వోపచారములను। జెలులు జేయుగ బ్రాహ్మణస్త్రీలకెల్ల।
బసపుకుంకుమవిరి సరుల్ఫలములొసగి। మొనయుభక్తిని నర్పించి మ్రొక్కె
కన్య॥వ॥ అప్పుడాసువాసినులాపద్మావతిని దీవించిన పంచభక్ష్యపరమా
న్నంబులందఱికి భుజయింపబెట్టించి తానును భుజించి లేపకరంబులు గడి
గికొనివచ్చి యావిలాసవతి శృంగారవనమధ్యంబున జెలులునిర్మించియున్న
విరులపానుపుమీదగూర్చుండియందఱికివిడియంబులిప్పించితానునువిడియం

పద్మావతితో నారదుండు భాషించుట.

బుజేయుచున్న సమయంబున॥క॥ ఆవనమునకద్భుతముగ। దేవమునీంద్రుండు
రాగదిగులొందిచెలులే। నీవెవ్వడనగమునివరు। డావెలదులకిట్టులనియెనాదర
మొప్పన్॥క॥ పరుడనుగానీనృపతికి। గురుడను నేననగ లేచిగురుతరభక్తిన్। సర

గునబద్మావతియా। స్తరణమునికిచ్చి ్రమొక్కెదాపసుడంతట॥ తే।వనజలో
చననీకు వివాహసిద్ధి। వేగగల్గునటంచుదీవింపరాజ।కన్యకామణిసంతోషకలి
తయగుచు।నోదిగిసిగ్గునమాట్లాడకున్న జూచి॥ సీ॥అమ్మనిపల్కెనోయమ్మనా
మీదనీకఆమఅవలదురమ్మనుచుబిలిచి।కూర్చుండనియమించికు స్తరించుచు
హ స్తమందిమ్మనంగనయబ్జవదన।పలికెనిట్లనిముని ప్రవరమాతం ్రడిపైనైచూ
డుమనుచు నాహస్తమనుచు। జేసాచిచూపగా జిఱునవ్వునగుచు నత్తపసి
యాకొమ్మహస్తంబుబట్టి। తరుణికిట్లనిపలికెనీకరమునందు। ఘనసులక్ష
ణవిమల రేఖలుజనించి। యున్న విధి తేటగావినుగన్నతల్లి। చెప్పబూనెదన
నిముని శ్రేష్ఠుడనియె॥ తే॥ స్వస్తికముపద్మమునుఛత్రచామరములు। యవ
కులిశరేఖలాదిగానఖిలశుభద। రేఖలున్నవిచూడుమీరీతులనుచు। జెప్పి
వేఱ్వేఱసతికిమచ్చికనుజూపి॥ తే॥ మరలనిట్లనెగిసలయమార్దవంబు। గలి
గియుండెడి నీవామకరమునందు। గాంతి నొప్పుచు ఘనసుమాంగల్య రేఖ।
మెఱయుచున్నది చూడుమో మీన నయన॥ క॥ ఈరేఖాబలమున శ్రీ।నా
రాయణ దేవుడింక నాయకు డగు నీ। కోరిక ఫలియించును నీ। వారమవ
లెనంతసమున నలరముపుత్రీ॥ సీ॥ అనుచు బద్మావతి కమ్మునిసర్వాంగ
సౌందర్యకలితలక్షణములన్ని। గురుతుగాజెప్పి వీడ్కొని చనెనాదినంబంబు
జాక్షుడు వేంకటాద్రిమీద। నుదయకాలంబునం దొనరగా భుజియించిక
డువేడ్కబసిడిచల్లడముదొడిగి। కొనలందు ముత్యాలకుచ్చు లొప్పిన దట్టి
ముద్దుగుల్కగనడుమున బిగించి। కురులు సవరించి విరులతో గొండెగట్టి।
మేలుచందురు గావిరుమాలజుట్టి। సరిగెకమ్ముల శుభ్రవస్త్రంబు వల్లె।
వాటుగావేసిభూషణా వళులుదాల్చి॥ క॥ తిరుమణి తిరుచూర్ణము తగ।
మెరయలలాటమున దీర్చి మెచ్చగు గందం। బురమున నలది యొప్పుబం।
గరుజన్నిదమఱుతవెలుగ గాముద మొప్పన్॥ గీ॥ కనక మయ మైన సు
న్నపుకాయవక్క। లాకులునుబట్టువస్త్రమందమ రగట్టి। కక్షమందుంచి
కోదండ కాండములను। జూచిచేపట్టె నంతలో జోద్యము గను॥ సీ॥ దై

## శ్రీనివాసుడు మృగవేటలాడుట.

వయోగంబున దనసమీపంబున కురుతర జవనాశ్వమొకటి వచ్చి। నిలి
చినదానిపై నీరజాక్షుం డెక్కిచని వనగిరులందు సంచరించి। సారంగ భ
ల్లూక చమరీశరభసింహ శార్దూల ఖగమృగ సంఘములను। వేటాడు
చుండెనావేళ నందొక మదకరిశౌరి నెదురించె గహన మందు।హరి య
పుడుదాని సమయింప నరుగ గజము। పర్వతము డిగ్గినుఱుక వెంబడి నిజ
క్రి। తఱుమగానది యో జనార్ధంబు వోయి। చెలగి పద్మావతీ దేవి మె
లగువనము॥ గీ॥ చెంగటను చేరి ఘీంకృతి చేయ జూచి। చెలగి పద్మావతీ

దేవి చెంతనున్న। చెలులుభీతిల్లి చెట్లచాటులనుడాగి। పరగ నొండొరులను బిల్చిపలికిరిట్లు॥ సీ॥ అతివలారాచూడు డద్భుతంబుగ నేడి యేనుగువచ్చెనిం కేట్టులమ్మ। కన్నులు దెఱచి చక్కగదాని జూడకతలలునేల కువంచితల గరమ్మ। నడుమపద్మావతి నిడికొంచుజుట్టును నెరసితలంగక నిలువరమ్మ। మన కెట్టులైన సన్నుతమె పద్మావతి మెలవుగారక్షింప వలయునమ్మ।య నుచుజూచుచు నుండగానంత లోన। ఘనతరంబైన గుఱ్ఱంబుగానవచ్చె। దురగమును జూడ దానిపై బురుషుడొకడు। నెదుట నిల్చెనుసతులెల్ల బెదరిజూడ॥

వ॥ అంత నద్దంతి తనుదఱుమవచ్చిన హరినిజూచి మఱియెఱుక వెరవు దోపక తిరిగి కరంబుపై కెత్తిదండ ప్రణామంబుగా వించినం జూచి కరుణించి యాచక్రితఱుమక నిలచెనంత॥ క॥ హరితను మన్నింపగనా। క రివరుడటుపోయి విపుల గహనంబులలో। జొరబడె నంతట నిచ్చట। సర సిజ నాభుండుపొదల చాటునడాగెన్॥ వ॥ అంత నవ్వనంబు నందుండి చూచుచున్న కాంతలా దంతిని హయంబును దత్తురగా రూఢుండైన పు రుషునిం గానక వెఱుగుపడి తమలోదా మిట్లనిరి॥ సీ॥ అక్కలారా చూడ నిక్కడగజతురం గములు పూరుషుడుండె గానమిపుడు। మాయగానున్న దిమహిమ యేమను వారమది వట్టికల్లపొమ్మనెడువారు। భ్రాంతిబొందితి మంచుపకపక నగువారుకలగంటి మోయని పలుకువారు। సొలసినిద్దురలే క కలదాకలనువారు సహహా యీచిత్రమే యనెడువారు। నందఱన్నివి ధంబుల ననగనవ్వి। చెలగి పద్మావతీ దేవి చెలులబిలిచి। యొకట నెప్పటి వలెనె గూర్చుండిజోడు। చేడెలను గూడి చదరంగ మాడుచుండె॥సీ॥ శృం గారవనినిట్లుచెలులతోచదరంగ మాడుపద్మావతి నద్భుదముగ। గాంచిత భ్రూపరేఖా విలాసములన్ని పొదల మాటునజూచి పొసగజక్రి। తినమది లోదానె తలచె నిట్లనుచు నీతరళ లోచన చక్కదనముచూడ। రతికన్న వి మల భారతికన్న మఱియు బార్వతికన్న శ్రీరమావనితకన్న। నతిశయించి న యందంపు సతిగదాయి। దెట్టునను జూచి మోహించు నిపుడటంచు। ద లచి యాయింతి యవయవములను జాల। బొందుగా జూచి మదిలోన బొగడెనిట్లు॥ సీ॥ పాదజంఘోరు వుల్పల్లవ కాహళపత కరంబుల భంగపర చిమించు। కటిమధ్యకుచ యుగ్మగౌరవంబులు చక్రమృగ కంతుకంబు లనొగి హరించు। హస్తకంఠమనోహరా ననంబులుకంజకంబుసోములనుద క్కగజయించు। భాసురాధరదంతనాసికంబులుబింబఫలకుందతిలపుష్పముల హసించు।నింత చక్కనిలలితాంగి నెచటమున్ను। చూడ లేదీవనంబులోజూచి నాడ।నిట్టిసుందరినజుడుతా నెట్లుదీర్చె। ననుచు మెచ్చుచుమఱియునిట్లనితలం

చె॥ సీ॥ కర్ణనేత్ర భ్రూయుగములు శ్రీకారాబ్జ పత్ర కందర్ప చాపముల
గెల్చు। గాంతిసౌరభసీలకుంతలంబును హేమపాటలబంభరప్రభల నడచు
గమనభాషణ నిరీక్షణములు కలహంస కలకంఠ మదనాస్త్రముల నదల్చు।
శాంతిసుస్మితగాన సరణిలీలా కౌముదీవీణలను జాల దిక్కరించు। నహ
హాయీ కాంత రూపంబు నవనిమీద। హాటకము మెత్తగాదంచి యమృత
రసము। బోసిమెదిచి మహాద్భుతంబుగ నజుండు। నేను మెచ్చుటకై దీర్చిని
లిపెనేమొ॥ క॥ అటుగాకుండిన నిజముగ। నిటువంటి శరీరకాంతు లింతుల
కిలలో। నెటుకల్గును గల్గవువి। స్ఫుటతపమిది చేసియున్న పుణ్యముచేతన్॥
సీ॥ కమలాసనుడు సర్వకాంతి పుంజంబుతో నతులిత సౌందర్య వతిని
దీర్చి। కమలమందిడగనా కాశరాజునకిది నాకొఱకై చిక్కినది నిజముగ।
గావునదీని శీఘ్రంబుగానే బెండ్లి యాడెదనని మోహముగ్గలింప। నంతబ
ద్మావతి చెంతకుమెల్లగా బోవుచునందందు బూలుగోసి। పొలతి నీకేటుతల
భ్రాలుపోతునవెడి। సైగగా బువ్వములు వెదచల్లికొనుచు। సంతసించు
చునా చానచెంతజేర। నపుడు భీతిల్లియా లేమహామరినిజూచి॥ తే॥ వసిడి
చెరగుల రవసెల్లపైనవేగ। బొదువుగా గప్పికొని పూలపొదమఱుగున। ని
లిచి యళుకుచు బెళుకుచు జెలులజూచి। చిలుకవలె ముద్దుగుల్కుచు బలి
కెనిట్లు॥ చ॥ అమఱలేక రాజసుతులాడుచు నుండెడి చోటికీగతిన్।బర
పురుషుండు రాదగదు భామినులార భయంబు నొందితిం। దరపడ నేల
రావలదు దవ్వుగ బొమ్మనుడంచు మించియు। త్తరుణి వచింపగా నపుడు
ధైర్యముతో హరిగాంచి రొప్పుచున్॥ క॥ అపద్మావతికడ్డం। బాపొలతు
లు నిలిచి హరికివగ పడకుండన్।వ్యాపింపుచు జలముననా।శ్రీపతి నీక్షించి
చాల చిడిముడి పడుచున్॥ సీ॥ పలికి రిట్లని రాచపట్టి యిందుండగా బరు
డనీ కింతైన భయములేక। వచ్చితి విప్పుడావల బొమ్మపొమ్మని తఱుము
వచ్చిన జక్రధరుడు నవ్వి। మీనలోచనలార మీరాజ కన్యను వలచినే
మాటాడ వచ్చినాడ। మీకేల సీమాట లాడక బొండన్న నళికి పద్మావ
తిచెలులనెల్ల। బిలిచి చుట్టమునవలె మీకు బెదరు చూపి। పలుకుచున్నా
డు శబరుడీ పాపమేమి। వీనిబంధువు లెవ్వరో వీడెవండొ। వీనికులగో
త్రములు మీరు విశదముగను॥ గీ॥ నడుగుడని రాజసుత వల్కనపుడు చె
లులు। చక్రధరు దిక్కు దిరిగి యోశబరనీకు। దల్లిదండ్రులు నెవరు
గోత్రంబు కులము। జెప్పుమని వారలడుగగా శ్రీధరుండు॥ ఉ॥ వారినిజూ
చి యిట్లనియె వారిజలోచనలార యిచ్చటన్। గూరిమి మీఱ నాకుల
ము గోత్రము చాలుగనింక జెప్పెదన్। సారెకురొప్పకన్ నృపునిచక్క
ని బిడ్డకునాకు సఖ్యమున్। మీరు ఘటింప జేయుడిక మీకుప్రియంబు

లు నేనుజేసెదర॥ సీ॥ అనిచక్రిమరల నిట్లనె మాకులం బిలశీతాంశుకుల ము వసిష్ఠగోత్ర। మగుతండ్రి వసుదేవుడా దేవకియెతల్లియగు హాలపాణి మాయన్నగారు। లలితురాలైన చెల్లెలు సుభద్రాదేవి పావనుండైనగాండీవి మఱది। ధర్మరాజాదులు తగు బంధుజనులన్న తెలుపలునగుచు నీదే హామెల్ల। నలుపి దేనున్న విష్ణుండు నవ్వఁపలికె । గృష్ణపక్షము నడి రేయిఁగినిసి కూడి। నపుడు పుట్టితి గనుక దేహంబునీల। మయ్యెనందున నను గృష్ణుడనిరి బుధులు॥ క॥ నాకుల గోత్రములిప్పుడు। మీ కెఱిగించితినిగ నుక మోడ్డకక మీ॥రీకన్యకులము గోత్రము। నాకొనరగ చెప్పుడన గ నగి చెలులెల్లర॥ తే॥ అనిరి చంద్రకులస్థుండు నత్రిగోత్ర। జనితు డాకాశరాజను జనవిభునకు। బుత్రికామణమై పుట్టి భూతలమున। బెరిగి పద్మావతీ సంజ్ఞ బరగెనసిరి॥ తే॥ సీటుమీరగదన చిన్ననాటనుండి। యొనరమాతోడ నాటాడుచుండుమాకు। సకలవస్తువు లిప్పించుసఖ్య మెసగ। నెవుడు నీసతికృపను మమ్మేలుచుండు॥ చ॥ అనవిని విష్ణుడిట్లనియె నంబుజలోచన లార మిమ్మునె। ల్లను గృపనేలుచున్నను విలాసిని సఖ్యముగోరివచ్చితిన్। ఘనముగ నన్ను గూడుమని గట్టిగ మీదారపట్టి కిప్పుడే మనమలరంగ జెప్పు డనుమానము సేయకుడంచు బల్కగన్॥ క॥ వినిపద్మావతి రోషంబున। జెలుల న్బిలిచి కోపమున దిట్టుచునా। వనజాక్షుని గనుగొనియి। ట్లని యెనిషాదేంద్ర దూరమరుగుము వేగన్॥ సీ॥ అనిన విష్ణుం డిట్టులనియెనో లలితాంగి నిష్ఠురంబేలనే నీకునాకు। మార్ధవంబుగ మంచి మాటలాడుము నేనుజెలగి కన్యాపేక్ష గలిగియిటకు। వచ్చితి నను నీవు వరియించుటకు దగుపాత్రుడనేగాని బరుడగాను। బాత్రదానము సేయ ప్రభువున కిహాపర సౌఖ్యముల్గలుగు నీజనకుడొనర। నేనుని నుగాంచి నప్పుడే నిన్నునాకు। సమ్మతిగదాన మీదగు చంద్రవంశ సంభవుడ నన్యుడని యెడి సంశయంబు। వీడినను గూడుమునగ నవ్వేలదిపలికె॥ క॥ నీవునిషాదుడ వయ్యును! వావిరి ఘనచంద్రకులము వాడననుచున్న। గావలసి పలికినావివు। డావల బొమ్మెదుట నుండకతి మూర్ఖాత్మా॥ సీ॥ తగ వెఱుంగకతప్పు దారిసుద్దులు సెప్పకగుగు మాతండ్రి నీ వనినమాట। విన్నను సంకిళ్లు వేయించు గొట్టించు నంతకుమున్నె నీవరుగుమనిన। హరియిట్టులనియె నాయందధర్మంబేమి నేబ్రహ్మచారిని నీవు కన్య। వటుగాన నినువివాహము జేసికొనన ధర్మమేకాని యిదియ ధర్మంబుగాదు। నీవునాయందు దయనుంచి నిష్ఠురముగ। బలుకకిప్పుడె నన్ను జేపట్టు మనిన। గనుబొమల్ముడి బెట్టుచు గన్నులెఱ్ఱ। జేసియాభామచక్రి నీక్షించిపలికె॥ క॥ ఓరిసిసాధుడసీవీ। క్రూరపు మాటంి నైన

గొట్టింపకపో। నూరకని క్రోవఁ జను। మారడి బడసేలయన్న హరియి
ట్లనియెఁ॥ క॥ చుట్టపు దాసవటంచును। గుట్టుగ నేనిన్ను వేడికొని నం
దుననఁ। గొట్టింపకు మన్యులచే। గొట్టిన ననునీవె పట్టికొట్టుము తరుణీ
సీ॥ అని చక్రి పలుకగా నతివ యిట్లనియె నీవీలీల మోదుగు పూలువే
సి। పలుమాఱు నాకుఁగోపంబు బుట్టించెద వింక జీవితేచ్ఛ లేదేమొ నీకు।
ఛీపొమ్మనగ హరి చిఱునవ్వునగుచు నిట్లనె జనించినవారు చనుటనిజము
గనుకజంతేమినిఁ గలసినపిమ్మటజగతినుండినకేమే లేచనినమేలె। రమణినా
కందుకై విచారంబుగలదె। వినుముతలచినపనియైన వెనుకనీవు। పట్టికొట్టినదిట్టి
నభయములేదు। నీవిపుడు వేగదయ జూడునీరజాక్షి॥ వ॥ అనినవిని పద్మా
వతియిట్లనియె॥ క॥ నాకడనిటు ప్రేలుటనా। కాశనృపాలుండెఱుగనంతటని
న్ని లోకములోమననీడిపు। డాకష్టంబేల దూరమరుగుర కుమతీ॥ వ॥ అనినవిని
హరియిట్లనియె॥ సీ॥ పుట్టినవారెల్ల బోవుటనిజమైన దెఱుగుదు నేనునిన్నె
ట్టులైన। విడువనుమీతండ్రివిమలధర్మాత్ముండుగాననఁ బాధింపడైనగా
ని। భయములేదైనను బాధించు నేనియునెట్లయిననతఁడునిన్నిచ్చినాఁడు। బెండ్లి
సేయునటంచు ప్రీతిఁగొబలుకనవ్వనిత యిట్లనెకంచి వరదరాజు। వెలయుకా
వేటిరంగడు వేంకటాద్రి। నాయకుఁడుండగానీకు నన్నుదాన। మీఁడుమాతం
డ్రినీకేలయిట్టి భ్రాంతి। పోనిపొదుడ నీబాల్య బుద్ధివిడిచి॥ వ॥ అనినవినిచక్రి
యిట్లనియె ॥క॥ పోపొమ్మని మొగమాటం। బీపట్లనునీకు లేక హెచ్చుగ
నాపై। గోపము జేసితివింక నిను। జేపట్టకవిడిచి పోనుశీతాంశుముఖీ॥ క॥ అన
గాపద్మావతియి। ట్లనెదలిదండ్రులను విశిచియకటానీవి। ట్లనురాగ భాజ
నుడవై। చననేలనిషాదపోరజాలింబడకఁ॥ వ॥ అనినవిని శౌరియిట్లనియె॥
చ॥ వినుసతి నీవువాకిటు వివేకముజెప్పితి వెంతసెప్పినఁ। వనజ భవుండు
నానుదుట వ్రాసినవ్రాతఫలంబు దప్పునే। నినువరియించిపిమ్మటను నేనెటుపో
యినగాని క్షేమమే। గనుకనిజంబుగాను నినుగౌగిటఁ జేర్చకపోను మానిని
సీ॥ వ॥ అనిపల్కి యంచునకు వచ్చినంజూచిపద్మావతియూ గ్రహించికన్ను

## పద్మావతిహరిమీద రాళ్లురువ్వించుట.

లెఱ్ఱజేసిధిక్కరించియటుముఖంబైచని చెలులంబిలచి దుర్మార్గుండైనయీ
నిషాదునిమీద రాళ్లువిసరివేయుండని సెలవిచ్చె నప్పుడప్పొలతులుపొంగి తె
ప్పు తెప్పున రాళ్లందికొని సూటితప్పనీకతురగారూఢుండైన హరిమీద గు
ప్పులుకుప్పలుగాశిలావృష్టి గురియించి రొప్పుచున్న నప్పద్మాక్షుండు త
ప్పుపనివచ్చెననియుఱుకు చున్న నబ్బోటులు వేయు రాళ్లపోటులు నాట
ఘోటకంబు దాటిపోనేరక నేలంబడియె నంత శ్రీకాంతుండు హయంబువి
డిచి విభ్రాంతుండై చింతించుచు రివ్వురివ్వున వచ్చు రాళ్ల వేటులు తప్పించు

కొనుచు దలవిరియబోసికొనిదిశలంజూచుచు నిలువనేరకపరుగెత్తుచు ను
త్తరాభిముఖుండై వేంకటాచలంబున కెగ బ్రాకిపోయి తనకు నివాసంబై
నవల్మీకంబులో ప్రవేశించి వకుళమాలికనిర్మించిన విరులపానుపు మీఁద
ప్రళయకాలంబున మహాజలంబుపై వటపత్రంబుమీఁదబవ్వళించిన పరమ
పురుషుని చందంబున శయనించియుండె నంతనిక్కడ వనమధ్యంబునందు
న్న చెలులం జూచిపద్మావతియిట్లనియె॥ సీ॥ చెలులార మాతల్లి చెప్పినమా
టనేవినక నేఁడివనంబునకువచ్చి । యనుభవించితిగష్టమమ్మమ్మ నేజెల్లనీ పు
ష్పవనములకింక రాను। జాలునిచ్చోటను శబరుఁడాడిన మాటలిప్పుడమ్మకు
మీరు సెప్పవలదు । చెప్పినమన కెల్లసిగ్గుపాల్గునంచు బలికి యందలమె
క్కిచెలులతోడ । గుసుమఫలముల బట్టించికొని రయమున । బోయిమణి
మందిరము జేరిపువ్వులపాన్పు । తల్లికందిచ్చి యంతతామల్లెపూల। పాన్పు
పై జాలనలయుచు బవ్వళించె॥ వ॥ అని చెప్పినహరి చర్యలువినినవ్వి తదనం
తరంబున హరియేమి ప్రయత్నంబు జేసెనని శౌనకాదుల డిగినసూతుండి
ట్లనియె॥ చ॥ మునివరులారమీకిపుడుముచ్చట మీరగనేను జెప్పెదన్ ।వి
నుడుపరాత్పరుండు హరివిష్ణుడుమర్త్యనిరీతిగాముకుం। డనదగి మోహతా
పము ననారట మొందుచుబవ్వళించియే । మనకముసుంగువెట్టికొని యా
ర్తునినిక్కె వడిజింతజేయుచున్॥ తే॥ వేడినిట్టూర్పువిడుచుచు విమలపాన్పు।
పైనబొరలుచువిరహునిపగిదినున్న । వకుళమాలికయ చటికివచ్చి హరిని।
గాంచియిట్లనిపల్కె సత్కరుణమెఱయ॥ శా॥ అన్నా వేంకటలెమ్ములెమ్మిపు
డునీవాకొంటి వాలస్యమే । మన్నంబున్ బరమాన్నభక్ష్యమును నర్పింప
నేదెచ్చితిన్ । జెన్నొందన్ భుజియించు నీవనగవా । శ్రీస్వామి మాట్లాడ
కన్। గన్నీరూరక నించుచుం డగరమాకాంతున్ విలోకించుచున్॥ సీ॥ విక
లత్వమును బొందివకుళ మాలికెయిట్టులనియెనాతండ్రినీవార్తిబొంది।కను
లనీరిటునింపగా కారణంబేమియీరోదనమునకును హేతువేమి। పగలునిద్ర
రహోవదగదనియునుసికు తెలిసియునిపుడునిద్రించుటేమి।విపులధైర్యస్థైర్య
వితరణంబుల నిండుబోవీడిదీనతబొందుటేమి। లేచికూర్చుండినాదిక్కు లెస్స
జూచి । నీమనంబున గలచింత నిశ్చయముగ। జెప్పుమనిబుజ్జగింపగా శ్రీధ
రుండు । మాఱునల్కకబుస బెట్టుచూరకుండె॥వ॥ఇవ్విధంబునమారుమా
టాడకయున్న హరినిజూచివకుళమాలిక భీతిల్లిమఱియునిట్లనియె ॥ చ ॥ అ
డవికివేటబోయి విపులాద్భుత ఘోరమృగాళినచ్చటన్ । బొడగనిభీతినొంది
తివొభూతము సోకెనో లేక ఱాళ్లపై।వడిచెడజాఱిమ్రొగ్గితివొ వాగులలోఁబడి
లేచివచ్చితో । కొడుకనిజంబు జెప్పుమిక గొబ్బున నొక్కచికిత్స చేసెదన్॥

సీ॥ పడిలేచినదియేనిబద్ధియైనను మేనబూసగద్దైలము వేసి పిసుకవలయు। జ
ట్రాతిమీద గ్రచ్చఅజాజిమ్రొగ్గినబొందుగా వేసిల్లపోయవలయు। నదిగా
కభూత మొందైనసోకిన భూతి తెప్పున బట్టిమంత్రింప వలయు। మృగభీతి
హృదయమందాగిసోకి నట్టైన నెట్టననడిపీపుదట్ట వలయు। నిట్టినాల్గుచికి
త్సలందేచికిత్స। జేతునది నీవునిజముగా జెప్పుకొన్న। దెలియగానది
మనములో దిగులుదీరు। నున్న దున్నట్లు చెప్పుమన్ గన్న తండ్రి॥ తే॥ అ
నుచు నాపాదశీర్ష పర్యంతమప్పు। డొనరనిపురుచు జెమటతో నుష్ణమై
న। దేహమందున్న బలుతాళ్ల దెబ్బ కదుము। లంటిచూచి మహా భీతి
నతివపలికె॥ సీ॥ ఓతండ్రి నీమేన నుష్ణపుస్వేదంబు పొంగుచు నీరీతిబు
ట్టుటేమి। మృదుశరీరమునందు మొందుగాతాళ్ళ దెబ్బలు నాటియున్న దీ
పాపమేమి। ధీరుండ వయ్యును దీనదశను బొంది నీవిట్లుకన్నీరు నించు
టేమి। కలిగినరీతి నిక్కముగ దెల్పుమటన్న మాటాడవిపుడింత మౌనమే
మి। యనుచుగప్పిన వస్త్రంబున వలదీసి। యొప్పుగాలేవ నెత్తికూర్చుం
డబెట్టి। వేగగదుములదాదోమి వేఱువస్త్ర। మొకటిపైగప్పిచందనంబొ
డలనలది॥ క॥ చల్లనిజలముల గన్నులు। మెల్లగ దానిమిరి నిమిరి మేకొల్పుచు
మే। లొన్నల్లలు గ్రుచ్చిన మృదుతర। పల్లవముల విసరి విసరి బడలికదీ
ర్చెన్॥ క॥ హరికిటు బడలిక దీరిన। తఱివకుళా దేవిచాల దయదళు కొ
త్తన్। బరమాన్నము భుజియింపుము। వరసుతయనిపిలువశిరము వాం
చి పలుకకన్॥ క॥ పంకజలోచనుడుండగ। సంకటపడివకుళ చాలజాలి
ని బల్కెన్। మంకుదనము జేసెదవిటు। వెంకటనీ మదినిదేమొ వింతజ
నించెన్॥ మ॥ అనియా భామిని వెండియున్ బలికెనీ వాకాన యందే
డనై। ననుసౌందర్యవిలాస విభ్రమకళానై పుణ్యముల్గల్గుకాం। తనుమో
హంబునజూచి వచ్చితివొ చిత్తంబందుద ద్రూపమే। ఘనమైనిల్చెనో నీ
యురస్థలమునన్ గామాస్త్రము ల్నాటెనో॥ సీ॥ నాంతండ్రి నీవుగన్నది
కిన్న రాంగనో గీర్వాణ కాంతయో గిరులయందు। గమనించు చెంచితో
గంధర్వకాంత యోవన దేవతయొ లేకవగలగుల్కు। నూర్వశియో మే
నకో సర్వగుణములం దగినరంభో తిలోత్తమయొ ఘృతాచొ। పూనియీప
ది మందిలో నెవ్వరిని జూచి నీవువచ్చితివయ్య నిక్కముగను। జెప్పుమని ప
ల్కదలవంచి శ్రీధరుండు। పలుకకూరకకనుల బాష్పంబులొల్క। జేటు
వడుచున్న చక్రినీక్షించి వకుళ। మాలికాదేవిభీతిల్లి మరలననియె॥ తే॥ మో
హినీ భూతమేమైన ముందునిలిచి। కనుల బాడకట్టిపోయెనో గహన మం
దు। గామినీభూతమొందైన గదసినిన్ను। బట్టెనో తెల్పు కొడుకనిబద్ధిగా

ను॥ క॥ అటుగా కుండినసాథో । నిటు వలెమాట్లాడకుండనీ విధమునసం। కటపడ వెన్నడు దీనికి। గటకటనీ కేచికిత్స గావింతునయా॥ క ॥ ఒకమాట నాకు జెప్పక। వికలాత్ముండ వగుచుఘనవి వేకముగాబ। ల్కకనీవుండగ నా మది। గకవిక బొందినది నాకుగతి యేమింకన్ ॥సీ॥ మౌనివై నీవిటుమాట లాడక యున్న నిక్కడ మనకుదిక్కెవ్వ రింక ! నావరాహస్వామికైననీవృ త్తాంత మెఱుగజెప్పక దీరదింకమీద। నంతరక్షైల నాకార్తంబుగా నిమది నిగలిగినచింత దెలుపుమపుడు । నానావిధంబుల నేనువిచారించి నీచింత తీర్చెద నిశ్చయముగ । నన్నునఱమఱగా జూడకన్న నీవు । బ్రతికి యుండిన నేనిందు బ్రతుక గలను । లేకయుండిన దేహంబు నాకువలను । నేను నీవున్న చోట నేనిలిచియుందు ॥సీ॥ కన్యకాదీక్ష నిమ్మక్ష్నగా బూనినేగురు నిష్ఠనుండగం బరమగురుడు । పుణ్యాత్మనీ వంటి పుత్రరత్నంబునుగనక పెంచగ నిచ్చెనను చునిన్ను । నెఱనమ్మియుండగా నేడునీ విచ్చోట శోకించు విధమేనుజూడలేను । నామీదదయయుంచి నీమదిగల గోర్కెజెప్పు తీర్తు మాటదప్ప ననుచు। జేతిలో జెయ్యివెట్టినుచ్చికను శిరము। నిమిరి యాచ క్రధరుని కన్నీరువుడిచి । తానుకన్నీరు నింపనత్తరుణి మేను । మదినిభావించ కరుణించి మాధవుండు॥ చ॥ కనుగవ మెల్లగా దెఱచి కామవికారము మానసంబులో। బెనగొననిట్లనెన్ జననిప్రేమను నీవడుగంగ జెప్పెదన్ । వినుమొక వారణేంద్రమటవిన్ బొడసూపగ దానివెంబడిన్ । జనగిరిదూరగా నెదుటజల్లనిపుష్పవనంబుగన్పడెన్ ॥క॥ ఆవనమందొక సుందరి । లావణ్య విలాసకలితలక్షణ వతియై । భావజు బాణముకైవడి । గావి ద్యుల్లతికరీతిగన్పడె నెదురన్॥ సీ॥ ఆకాంత పాదంబులమ లపల్లవములు జంఘికల్వాలుఖులల్ సఖియతొడలు । కదలికా స్తంభము ల్కటిసైకతంబు మధ్యముగగనంబుహ స్తములు శోణకమలము ల్మెఱుగునూగారుచీమల బారుకలికికుచములు బంగారుగిన్నెలు । గళముశంఖుంబు చక్కని చెక్కులద్దముల్తేటైనకెమ్మోవి తేనెబావి। దంతములు మొల్లమొగ్గలు తళుకు చెవులు। శ్రీలునాసి కతిలపుష్ప మాలతాంగి।కనులు బలుగండు మీనముల్కన్ను బొమలు । కళలచేసొగసైన సింగాణివిండ్లు॥ తే॥ చంద్రబింబస మానంబుసతి ముఖంబు । మెఱపుతుమ్మెద తెక్కలమ్మెలతకురులు । జననియా కామినీ మణిచక్కదనము । జెప్పలేడజుడైననేజెప్పగలనె॥చ॥ తలపునిజంబుగాను వినుదానికి నాకుబ్రియాను బంధమిం । కెలమినిగల్గెనేని సతినేలుచునుండెద లేకపోయినన్ । నిలువసహింపదిందు జననీతలగా యముమాన్పి నట్టిని । న్నిలనెడబాసి పోవుటకు హేతువుగల్గు వటంచు నాత్మలో ॥శా॥ నేచింతించెదసంతసంబొద వనానీరేజ పత్రేక్షణన్ । వే

చేపట్టకతాళ లేనిపుడు నీవేదాని శీఘ్రంబుగా। నాచెంతంగృపమీఱఁజేర్చు
మెపుడానందించుచుఁ దానింగో। నీచోటఁ దగనిల్చి యుండె దమఱిం
కేచోటికిఁ బోవకఁ॥ చ॥ అనిహరి పల్కఁగా వకుళ హాటకచేలుని
మోముజూచియి।ట్లనియెగు మారనీవుగనినట్టిలతాంగికులమ్ముగోత్రముఁ।
వినవలెదల్లిదండ్రుల వివేకము దానివివేకమొప్పుగా।గనవలెబెండ్లి యాడ
దగుకన్యకయైన వరింపగాదగుఁ ॥ గీ॥ దానిపేరేమి యున్నసుస్థానమేది।
చెప్పుమేర్పడ నేబెండ్లిసేతుననుచు। వకుళమాలిక బల్కనవ్వాసుదేవు।
డిట్టులనియెమహా మోహమునుమడింప ॥ సీ॥ జనని తత్కులము నిశ్చయ
ముగావినుసుధాకరునిమలస్తుడా కాశరాజు। తనకుసంతతిలేక ఘనపుత్రకా
మేష్టిదనరగావింపనిద్ధరణినొనర।దున్నింపసవనిలోదోయజంబుదయించెనా
తోజయంబునఁగామృగాక్షి।గనిపింపగాదెచ్చిగగనాధిపుడు పెంచెధరనుబ
ద్మావతిదానిపేరు।పరగదానికినాకుదాంపత్యమజుడు।నిశ్చయముచేసియుండె
నానేనుబ్రతుక।గలను లేకున్ననిచ్చోటపెనువగలనె।వనితనై కుంభపురిజేర
వలయుగాక॥ వ॥ అంబా వినుమకన్యకామణి లక్ష్మిసమాన య
గుంగావున జన్మాంతరపుణ్యపరిపాకియయినపురుషునికే లభించు గాని త
క్కినవారికిలభింపదు అదియేమోమత్పుణ్యపరిపాక కాలంబుననక్కన్య
క నీక్షించి సంభాషింపగలిగె నట్టిసుందరినిజూచి విడిచివచ్చితిని నింకనా
కన్నోదకంబు లాశింపందగదిది సత్యంబప్పద్మావతినాయందు విరోధించి
నామీదజెలుల బురిగొల్పి శిలావృష్టి గురియించె నట్టిరాళ్ళ దెబ్బలకు
నిర్వహింపక తురంగంబు కైవడి యప్పుడు నేను తెప్పున పరువెత్తివచ్చి
యీపర్వతంబు జేరిపునర్జీవితుండనైతి నజుండిట్టి సౌందర్యవతిని బుట్టించి
కట్టడిబుద్ధిచ్చి నాకింతకష్టంబుబెట్టె మత్పాపంబింతకులోఁ జేసెదదనుసారం
బుగాబ్రహ్మమున్నకాంతకునునాకప్పుడ ఘటనంబుచేసెగావుననిప్పుడునీ
వునాకుసహాయంబుజేసియకన్యకనాకులభ్యయగునుపాయంబు జేసితివే
నిమజ్జనసిజనక సహోదరాదిధవులును మద్భక్తులైనప్రహ్లాదనారదాది ప
రమ భాగవతోత్తములును నీవయని నిశ్చయించెదననేక గోభూహిరణ్యా
దిసప్తదానంబులు చేసిన వారి కెంత పుణ్యంబు గలుగు నంతపుణ్యంబు
మాంగల్యధారణంబుజేయించినవారికిసిద్ధించుంగావున నీవునాచేతబద్మావ
తికిమాంగల్య ధారణంబు జేయింపు మని మఱియు నిట్లనియె॥ గీ॥ తగి
నశుభలగ్నమునునాకుదానికీవు।పెండ్లిసేయించిన ప్పటిప్రీతినాకు। గలుగదే
లోకమందైనగనుక వేగ। నావివాహము జేయింపు నీవటంచు॥ మ॥ హరివే
డ్కఁ వచియింపనవ్వకుళ నెయ్యంబొప్పగాబుత్రకా।పరమాశ్చర్యముగాధ
రాతలములోబద్మంబునందట్టిసుం।దరిపుట్టందగుహేతువేమి పుడు మోదం

బొప్పగానాకునీ। వరలేకఁ దగజెప్పుమన్నవిని పద్మాక్షుండుతానిట్లనెఁ
సీ॥ పొలుపొంది వినుతల్లిపూర్వకాలంబున ఘనతర త్రేతాయుగంబునం
దు। దశరథేశ్వరునకు దనయుండనై పుట్టిగాధేయుసవనంబుగాచిశివుని। చా

రామకథహరివకుళకు జెప్పుట.

పంబు ఖండించి జనకాత్మజను బెండ్లియాడిసాకేతాఖ్యమగుపురమును। జే
రిమజ్జనకాజ్ఞశిరసావహించి సీతను లక్ష్మణుని దోడుకొని వనముల। కరి
గియుండుంగ నొక్క మాయామృగంబు। నరుగ జానకిజూచి నెయ్యము
నదాని। దెమ్మనుచు నన్ను లక్ష్మణ దేఖనంపె। నపుడురావణుడనుదై
త్యుడటకువచ్చి॥ సీ॥ ధరణిజనెత్తిరథంబుపైనిడికొని జనగ రామాయనిజ
నకపుత్రి। విడిపింపనెవరందువిడిపింపలేకున్ననపుడుహావిర్భూతుడగ్నికడను।
జేరి దశగ్రీవసీత గాదీకాంత మఱి యెవ్వరనిన సమ్మతినివినుము। చెప్పెద
రాముడాసీతనునాచెంతజేర్చివిప్రాంగనఁ సీతవలెనె। చేసియందుంచి చని
యెనీస్నేహమేను। గోరిచెప్పితినిటు వంట్రి గుట్టటంచు। శాంతముగ జెప్పి
సీతవేషంబు వేద। వతికిగల్పించితెచ్చి రావణునకిచ్చె ॥క॥ అమూఢుండ
గు రావణుడామైథిలి నచట విడిచి యావేదవతిఁ। గామించి తోడుకొని
చని। యేమఱక నశోకవనిని హితముగ నుంచెఁ॥ క॥ రామాయనిబే
ర్కొనుచును। దామైథిలిరీతి నచట దల్లడపడుచుఁ। నేమును విడువక
యుంచుక।యామాలని చెఱను సల్పియ డలుచునుండెఁ॥ క॥ అనలుడుత
నపతి చెంగట। నొనరగజనకజను దాచియుండగనేనా।యనిమిషవైరినిదు
నుముట। కనిమిషపతి సుతుని ద్రుంచి యద్దాపుసుతుఁ॥ సీ॥ చేపట్టిక్షీ
రాబ్ధిజెచ్చెర బంధించికదసి రావణకుంభకర్ణముఖ్యు। లగురాక్షసులద్రుం
చియందరు మెచ్చుటకై యందు జెరనుండినట్టిసతిని। గాంచిసీవగ్నిలోగా
ప్రవేశించివచ్చినగానినిన్ను జేకొననటంచు। బల్కితినయ్యంతి పావకము
ఖమందుసురచిర భక్తితో జొచ్చి యుండె। నప్పుడిద్దరు సీతలైయగ్నియం
దు। నిలిచియుండగ జనకజనేనుబిలిచి। చేడెనీవలెనిచెంత జేరియున్న। క
మలలోచనయెవతె నిక్కముగదెల్పు॥ సీ॥ అనవినిసీతయిట్లనె దశాస్యుడు
నన్ను దెచ్చునప్పుడు నేనుదిగులునొంది। పరగనిఁ బేర్కొని మొఱవెట్ట
గావిని యనలుండు తనచెంతనప్పుడున్న। వేదవతినిదెచ్చి విబుధాహితున
కిచ్చినను దనలో దాచికొనియె వేద।వతిలంకజేరిరావణునిచే హింసలబడి
యెనాకొఱకు నీభాగ్యవతియు।నిన్నుగోరితపము నెరియొనర్చినకన్నె। గనుక
నీభావమందు సత్కరుణనుంచి। ప్రేమమీరగనిద్దాని బెండ్లియాడు। మ
నగనేనందు కొప్పకిట్లింటినపుడు॥గీ॥ పడతివినుమే కపత్నీ వ్రతుడనుగనుక।
నిపుడు నేబెండ్లి యాడనీయిందు ముఖిని। రమణనొప్ప గదేహాంతరమున

దీని। వేడుకలరగనే బెండ్లి యాడవలెను॥ వ॥ అదెట్లనఁగ నిరువదె
నిమిదవ ద్వాపరాంతకలియుగమందనేకభక్తసంరక్షణార్థంబుగా వేంకటా
ద్రియం దవతరింతు నప్పుడీకన్యకను బెండ్లియాడెద నంతపర్యంతంబు బ్ర
హ్మలోకంబునం దీకాంత వసియించి యుండవలయు నిమ్మట నేను వెంక
టాద్రియం దుదయించి నప్పుడీభామ భూమియందుద్భవించు నప్పుడేనుబ
రిగ్రహించెద॥ క॥ అనిపలికితినీగోప్యం। బనిమిషులకు నీకు దెలియునదియు
ను గాక। జనకజకును వేదవతికిని। ననువొందగ దెలియు నీరహస్యము
జననీ॥ సీ॥ పరులెందు వినని యీపరమ రహస్యంబు నీకు జెప్పితి నేను నె
నరుమీఱి। మదియించుమమ్ము మీఁద మహిమము మీఱఁగ నేను వహ్నియందా
వేదవతినినిలిపి। చిరతరకరుణ నాసీతను మెచ్చి చేపట్టి విభీషణు పట్టము పట। గ
ట్టిసౌమిత్రితో గపులతో సాకేతపట్టణంబును జేరి ప్రజల నెల్ల। బాలనము
జేయుచుండ నక్కాల మట్ల। జరిగెనట మీఁద నేనె ద్వాపరము నందు।
మొనసి వసుదేవునకు గృష్ణుడన జనించి। యుంటి వల్మీకమందీడ నుద
యమైతి॥ గీ॥ అనుచు వకుళకు బూర్వ వృత్తాంత మెల్లు। శౌరి వినిపింప
నయ్యింతి సంతసించి। వేదవతిపూర్వవృత్తాంత మాదరముగ। జెప్పు
మనవిని పల్కెనా శ్రీధరుండు॥ సీ॥ వినువకుళాదేవి తనపూర్వకథ నీకు వి
నుపింతు నెట్లన్న విప్రకన్య। యగువేదవతి నను మగనిగా గామించి తపము జే
యగ జూచి దనుజవిభుడు। తా దానిగామింపగా దేహమందాశ విడిచి యా
లలితాంగి విశ్రవసుని। తనయుని గాంచి సిద్ధంబుగా హరిచేత నిను నేనె చంపిం
తునని ప్రతిజ్ఞ। బలికి యనలంబులో జొరబడగ దాని। బావకుఁడు దాచికొని
యుండి పంక్తిముఖుడు। సీతగొనిపోవు నప్పుడా చెలిని వేగ। సీతకన్నను
సుందరస్త్రీని జేసి॥ సీ॥ తా వేగగొనివచ్చి దనుజాధిపతికిచ్చి పొమ్మని మా
యగా భూమిసుతను। నాదరంబెసగ స్వాహా దేవికడనుంచె నా వేదవతి లంక
కరిగి పంక్తి। వదనుని నాచేత నైపుగా జంపించి తనపంతమీఁదేర్చి కొంచర
యమున। వహ్నియందుండిన వసుమతీసుతను నాకడ జేర్చి బ్రహ్మలోకము
నకరిగి। ఘనతపము జేయుచును గొంతకాలముండి। యవల బద్మముతో జొ
చ్చియవనిలోనె। చేరి యాకాశనృపతికి జిక్కి నాకు। మరలు పుట్టించి నను దా
నుమఱచెనబల॥ మ॥ అనియమ్మాధవుడాప్తతన్ తనదు వృత్తాంతంబు పద్మా
వతీ। జననంబున్ వినిపింప నావకుళ శ్రీస్వామిన్ విలోకించి యి। ట్లనె నో దేవ
మహానుభావమును నేనజ్ఞానినై మానవుం। డని బాలుండని యుంటి నెమ్మి నిను బ్ర
హ్మాండంబుం సేవింపకన్॥ శా॥ నీవే బ్రహ్మను గన్న తండ్రివి సుహా। నిర్వాణ
సంధాతవీ। నీవే విష్ణుండవు రామచంద్రుడవు నీవే కృష్ణదేవుండవీ। నీవే వేదా
ద్యసుపర్వలో ముఖుడవీ వే కర్తవున్ భోక్తవీ। నీవే విశ్వంబు వరాహ దేవుడ

వుసివే శేషశైలాధిపా॥ క॥ తోయజలోచనమదిసీ। మాయనుగనలేక నాకు
మారుడనుచుఁ । నీయందు ప్రేమనుంచితి। నాయీశుడవనుచు దెలియనై
తిమాహాత్మా॥ సీ॥ అనవిని విష్ణుడిట్లని యెనిచ్చటనీవె తలగాయమును మా
న్పితల్లివవలెను । బోషింపనీ ఋణంబును దీర్చుకెట్లకోయని నేనుజింతింతు
ననుచు వకుళ। మాలికపై విష్ణుమాయ తెప్పున గప్పి పుత్రవాత్సల్యసద్బుద్ధిని
చ్చి। మరలనిట్లనియె నమ్మా వివాహము నాకు జేయుమీవనుచు మచ్చికలు
జేసి। తక్కకిప్పుడె పెండ్లిపెత్తనము జేయ। బోయిరమ్మని పలుకనా పొలతిహ
రిని । గాంచి పుత్రకయిప్పుడా కన్యయున్న । దివ్యపురమెట్టిదారీతి దెలుపవ
య్య॥ తే॥ అనగహరి యిట్టులని యెసియద్రిదిగువ। బోసగనమరావతీ పురం
బోయనంగ । నున్నతంబై ప్రకాశించు నొక్కనగర । మట్టిపురివిభవము
వినుమెట్టిదనిన॥ సీ॥ వేద వేదాంగ ప్రవీణులై వేదాంత వేత్తలై వెలసిన విప్రవరు
లు । ప్రబల బాహాశౌర్య పటిమాహతారాతిపంక్తులై మెలగు భూపాల
మణులు । మణికాంచనోజ్జ్వల మందిరాంగణ నట ద్ధ్వజమందిరులైన వై
శ్యఘనులు । ఘనధరాసుర పాద కంజాత సేవైక శుభధురంధరులైన శూ
ద్రజనులు । గలిగి విలసిల్లు గోపురకలిత లలిత । రత్నకాంతి పరిభ్రాంతి రాజ
హంస। పథనిరోదక సాలవిభ్రాజమాన । మై ప్రకాశించు నారాయణాఖ్య
పురము॥ ఉ॥ అప్పుర మేలు మేలుగ మహాఘనుడై గగనక్షితీశ్వరుం। డెప్పుడు
ధార్మికుండిలనభీష్టసుఖప్రదుడంచు సజ్జనుల్ । మెప్పుగ నెన్నుచుండగను
మీరిన భక్తిని భుక్తిముక్తులం। దొప్పిన వాడటంచు బుధులున్నతి సన్నుతి జే
యుచుండగన్॥ స॥ సప్తాంగములవెలిసవరించి యాత్మ యందష్టాంగసరణి
పై నాసబెంచి। బైటి శాత్రవకోటిపటిమంబు నిర్జించి యంతర్విరోధులనణగ
నొంచి । బాహ్య పుణ్యనదీ ప్రభావంబు నీక్షించి యాంతర నదులపై నాత్మ
నుంచి । వెలుపలి చక్రముల్ వేడ్కతో బాలించి సారిదిలోచక్రముల్ చూ
డనెంచి । దీనజనఘనమానసాధీనవిష్ణు । చరణకంజాత సంజాత సారమధు
క। రాయమానమనస్కుడై రహినిభువిని। నెమ్మదిగనేలు నాకాశనృపవరుం
డు॥ తే॥ తొండమానుండు పరమభక్తుండు ముద్దు । తమ్ముడగు పుత్రికుడు
వసుధానుడనెడు । బాలకుడుధరణీ దేవి భార్య పుత్రి । సరసమానసపద్మ
సంజాతయనుచు॥ చ॥ అనిగగనక్షితీశ్వరుమహా విభవోన్నతి చక్రి దెల్పగా।
విసివకుళాఖ్య భామ సరవిన్ గిరిడిగ్గుట కెద్ది మార్గమో । వనజదళాక్ష దె
ల్పుమని వైపు గనందడుగంగ మాధవుం డానరగనిట్లనెన్ జననియొప్పుగ జె
ప్పెదనాలకింపవే॥ వ॥ మాతా యిమ్మార్గంబున బర్వంతంబు డిగ్గి యచ్చట
పావనపదంబై ప్రవహించుచున్న పుణ్యతీర్థంబునందు గ్రుంకులిడి తత్సమీ
పంబున గపిలముని చేత బూజలందుచున్న శివలింగంబు నీక్షించి మ్రొక్క

శ్రీనివాసునకు శీఘ్రంబుగావివాహంబు చేయుమనియాశివుని బ్రార్థించియవ్వలంబోయి శుకాశ్రమంబుజేరి యిందున్న శుకయోగీంద్రునకు నమస్కరించి యగస్త్యాశ్రమంబుజేరి యమ్మునికి వందనంబు జేసి యగస్త్యనిర్మితంబైన శివాలయంబునకుబోయి శివునకు దండంబు సమర్పించి యందున్న స్త్రీజనంబు ననుసరించితన్మార్గంబున నారాయణపురంబుజేరి తద్రాజపత్ని సమీపంబునకరిగి నాకుబద్మావతి యనుకూలయగునట్లు మాట్లాడుమనిన వినివకుళమాలికయిట్లనియె॥ సీ॥ వినుదేవవారునీవృత్తాంతమడిగిన బాసగ నేనేమిసెప్పుదునటంచు। వకుళమాలికబల్కవాసుదేవుండిట్టులనియె నోయమ్మవారడిగిరేని। వరచంద్రకులులైన వసుదేవదేవకుల్ ధరణిపై నాతల్లిదండ్రులనుము। బలభద్రుడన్న సుభద్రసోదరియను గోత్రమెన్న వసిష్ఠగోత్రమనము। సరసనక్షత్రమేమన్న శ్రవణమనుము। లలితయౌవన సౌందర్య కలితుడనుము। మానఘనుడను భవవిహీనుడనుము। భువినిబద్మావతికి దగుపురుషుడనుము॥ వ॥ అనిచెప్పి పోయి

వకుళనారాయణ పురంబునకరుగుట.

రమ్మనెనప్పుడు దేవమాయానిర్మితతురంగం బాహరిసన్నిధంజేరెనంతివకుళమాలిక సంతసించి హరియాజ్ఞాధారిణియైయత్తురంగారోహణంబుజేసి గిరిడిగ్గి శ్రీనివాసుడాజ్ఞాపించినప్రకారంబుగానందున్న పుణ్యతీర్థంబున గ్రుంకి కపిలేశ్వరు బ్రార్థించిమ్రొక్కిపోయి శుకునకు నగస్త్యునకుమ్రొక్కియగస్త్యనిర్మిత శివాలయంబుచేరి శివునకు మ్రొక్కికూర్చుండియుండి తద్దేవాలయంబులో నిలిచియున్న కన్యాజనంబులందొక్కకన్యకం బిలిచియిట్లనియె॥ క॥ చెలినీ వెవ్వరిదానవు। చెలువొప్పగ జెప్పుమనినజింతించుచునా। మెలతుకదాపకయపుడా। కిలకంఠినిజూచి మెల్లగానిట్లనియె॥ సీ॥ ఆకాశరాజుగన్నట్టిపద్మావతి చెలికత్తెననగమచ్చికనువకుళ। మాలికదాని గ్రమ్మఱజూచి నిమోమువచిన్నబోయిన దేమి సెప్పుమనగ। నాభామవలికెనిట్లనమ్మ నీతోనెట్లు సెప్పుదుననగనా చెలినిజూచివకుళయిట్లనియె దాపకనీమదినిగల్గుచింతమెల్లగ నాకుజెప్పుమనగ। నదియు మెల్లనవల్కెనోయమ్మనిన్న।వనవిహారంబుగా వింపవాంఛనొంది। మనుజపతిసుతయమ్మ దోడ్కొనివనమున। కరుదుగావచ్చె నందుమేముండటమును॥ సీ॥ అట్లాడుచుండగా నంతలోనటకొక్క శబరుండువచ్చె నాశ్చర్యముగను। వాడెట్టివాడన్న వనదాభవర్ణుండు లలితసద్భూషణాలంకృతుండు। నాజానుబాహుండు నబ్జపత్రాక్షుండు పక్వేందువదనుండు భాసురుండు। గంభీరవక్షుండు ఘనకంబుకంఠుండుమహాసియమన్మథమన్మథుండు। ఘనతరంబైనవర ఘోటకంబుమీద। నెక్కిశరచాపధరుడై యమీనశౌర్య। కలితుడైవచ్చి మారాజకన్య

చెంత। జేరియే మొహమాటలు చెప్పుచుండె। వ॥ అప్పుడాశబరుని మీఁదన
కన్యకామణికోపించి శిలలఁబుర్వింప నతండెక్కిన తురంగంబు నేలంబడి
యె నతండుత్తరాభిముఖుండై చనియె నంతఁబద్మావతి నిజమందిరంబు జేరె
నక్కిరాతవిభు నిదృష్టిదాకెంగాబోలు నక్కన్యకామణికి మహాతాపజ్వ
రంబువచ్చెనందున బద్మావతిమాఁటాడక తపించుచున్నం జూచి తండ్రియై
నగగనాదిపుండును దల్లియైన ధరణీదేవియును సుతనుదొడలపై నిడుకొని
బహుప్రకారంబుల ఖేదపడుచు దజ్జ్వరతాపని వారణంబు జేయుటకై బృ
హస్పతినిగావింపగా నమ్మహాత్ముఁడు వచ్చినంజూచి లేచి యర్ఘ్యపాద్యాది
విధులంబూజించి కనకాసనాసీనుం జేసి యాబృహస్పతి కాపద్మావతిం
జూపికన్నీరునించుచు నానృపాలుండిట్లనియె॥ సీ॥ దేశికపద్మావతికి మహి
తాపజ్వరంబు రాఁగాబిడ్డరాత్రినిదుర। శోకతాపంబుచేబొరలుచునుండెమీఁరి
దిమాన్ప నౌషధంబీయవలయు।ననవినిగురుఁడిట్టులనె నోనృపాలయీబాలా
మణికిఁ బ్రాణభయము లేదు। చింతింపవలదు చెచ్చెరరుద్రునికి నభిషేకంబువి
ప్రులచేతనిపుడె। నీవుచేయింపుమని పల్కభూవిభుండు।బ్రాహ్మణులనిచ్చటికి
బంపిఫలసుమములు। మొదలుగాగల వస్తువుల్విదితముగను। మొనసిమాచేత
నంపించెముదితనీవు॥ క॥ ఎక్కడనుండీప్రొద్దున। నిక్కడికేపనిమిత్తమే తెం
చితివా। నిక్కమునుజెప్పుమనవిని। మక్కువతోనిట్లు వకుళమాలికవ
ల్కెన్॥ సీ॥ వినుమోలతాంగినే వెంకటేశ్వరుదాసి నొకపనిగల్గగానుద
యమందె। పైనమైవచ్చితి బట్టణంబిక జేరి యంతఃపురంబున కరిగియచట।
నాధరణీదేవికాప్తవాక్యము జెప్పవచ్చితిననగ నవ్వనితపలికె। నభవునకభి
షేకముగునంతకిచ్చోట నిలిచియుండుదువేని నేనునిన్ను।దోడుకొనిపోదునన
నానిశోడుకొంటకు। వకుళయచ్చటనుండె నవ్వాలఫణీంద్ర। శైలపతియప్ప
డతిమీఁదిభాళిచేత। దీనుడయ్యును మదినిజింతించుచుండె॥ వ॥ అని చెప్పినసూ
తుంజూచి శౌనకాదులుమఱియు నిట్లనిరి॥ క॥ సోమదివాకరలోచన। దా
మోదరశంఖచక్ర ధరభవహరను। త్రామోద్ధరసద్గుణవర। శ్రీమద్వేంకట
గిరీంద్రజితదనుజేంద్రా॥ మాలిని॥ సురచిరగుణధామా శుభ్రసత్కీర్తికా
మా। మురదనుజవిరామా మోక్షకల్యాణసీమా। గురుతరశుభనామా
ఘోరదేవారిభీమా। ద్విరదకుముదసోమా దేవతా సార్వభౌమ॥

గద్య॥ ఇది శ్రీతరిగొండలక్ష్మీనృసింహ కరుణాకటాక్షకలిత కవితా
విలాసవసిష్ఠ గోత్రపవిత్ర కృష్ణయామాత్య తనూభవ వేంగమాంబా ప్ర
ణీతంబైన శ్రీ వేంకటాచల మహాత్మ్యంబను భవిష్యోత్తరపురాణంబునంది
ష్టదేవతా ప్రార్థనంబును. శౌనకాదుల ప్రశ్నయు, జనకశతానంద సంభా
షణంబును, శేషమారుత సంవాదంబును, శేషాద్రిప్రమాణ భావంబు

లును, మాధవాఖ్య విప్రుని కథయును, వేంకటేశ్వరుండు క్రమ్మఱ వైకుంఠంబు జేరుటయు, జేరిన చందంబు నారదుండజునకు జెప్పుటయు. నారదుండు త్రిమూర్తి పరీక్ష జేయించుటయు, భృగుండు త్రిమూర్తి పరీక్ష జేయుచుండుటయు, హరితో లక్ష్మి ప్రేమకలహంబు జేసి కొల్లాపురంబు చేరుటయు హరి వైకుంఠంబు విడచి క్రమ్మఱ శేషాద్రియందు వల్మీకంబులో జేరియుండుటయు, బ్రహ్మరుద్రులు ధేనువత్సకంబులై వచ్చి వల్మీకగర్భమందున్న హరిని దృప్తిబొందింపు చుండుటయు, చోళరాజాంగన గోపకుని దండించుటయు హరిశిరంబున గోపకుండు గొడ్డంట నేయుటయు, చోళరాజునకు జక్రి శాపంబిచ్చి పంపించుటయు, గీష్పతి హరికౌషధంబు జెప్పుటయు, శౌనకాదుల పశ్చాత్తాపంబును, వల్మీకతింత్రిణీవృక్ష పర్వత ప్రభావంబులును, వరాహ శ్రీనివాస సంవాదంబును, గిటిహరికి స్థళంబిచ్చుటయు వకుళ మాలికా వృత్తాంతంబును నాకాశరాజు వృత్తాంతంబును బద్మావతి భూమియందుదయించుటయు వసంత ఋతు వర్ణనంబును బద్మావతి వనవిహారంబును, పద్మావతితో నారదుండు భాషించిపోవుటయు, శ్రీనివాసుండు వేటలాడుటయు గిరిడిగి హరి కరినీక్షించుటయు, వన మధ్యంబున బద్మావతిని జూచి హరి వర్ణించుటయు బద్మావతి చెలులతో హరి తన వృత్తాంతంబు జెప్పుటయు హరి పద్మావతితో శృంగారోక్తులుగా సంభాషించుటయు, పద్మావతి కలహించి చెలులచేత హరిమీద ఱాళ్ళు రువ్వించుటయు జక్రిపరువు వాఱి శేషాద్రి జేరి వల్మీకంబులో జొచ్చుటయు బద్మావతి నిజగృహంబునకరుగుటయు హరి విరహతాపంబు నొందుటయు వకుళతో హరి విచారంబు సెప్పుటయు రామకథ హరి వకుళకు జెప్పుటయు, వేదవతీవృత్తాంతంబు వకుళకు స్వామి వినిపించుటయు, నారాయణపుర వర్ణనంబును వకుళ నారాయణపురంబునకు బోవుటయు. వకుళ పద్మావతి చెలితో సంభాషించుటయునను, కథలంగల

చతుర్థాశ్వాసము-సంపూర్ణము.

## శ్రీ వేంకటాచలమాహాత్మ్యము-పంచమాశ్వాసము.

విశ్వాతీతగుణాకర। విశ్వోద్ధరవిష్ణు దేవ వేద విహారా। విశ్వేశ్వరసురపూజిత। శాశ్వత తరిగొండ నృహరి జనహితకారీ॥ ఆ॥ సూతవకుళదండ శూకాద్రిదిగిపోయి। నపుడు విష్ణుదేవుడద్రిమీద। నుండియే ప్రయత్న మొనరజేయుచునుండె। చెప్పుమనగ సూతుడప్పుడనియె॥ తే॥ వినుడు మునులార హరిచేయువింతలన్ని। చెప్పెదను మీకు దెల్లన్న శ్రీధరుండు। వేంకటాచలమందుడి వేడ్కగాను। దానుతనమదిలోనిట్లు దలచె నపుడు॥ సీ॥ వకుళను నేనావివాహప్రయత్నంబు జేయనంపితి హరి జేరియ చట। నెళవుగా మాట్లాడ నేర్చునో నేరదో పురుషులపను కౌను బాలతి చేత। బనుచు

గల్గినవారు పట్టుగానాముూల మెఱుగరుగనుక నాకయ్యమనుచు। బొంపు
న్ననటుమీఁద బోఁగూడ దచటికి మొదటి సంధానమే కుదురవలయు। ననుచు
యోచించి సర్వజ్ఞుడయ్యు నరుని। కరణి చింతించి యవల శీఘ్రముగ లేచి। యప్పు
డతి జూడగోరి మోహంబుచేత। దాళజాలక యొకవిచిత్రంబు జేసె॥ ఉ॥
అవ్విధమెట్టులన్న వినుడబ్జదళాక్షుడు జీర్ణవస్త్రముఁ। నివ్వటిలంగ గట్టికొ
ని నెరుపుగా నొకప్రాతకుప్పసం। బవ్వల నొప్పగా దొడిగి యవ్వవిధంబు
న నొంగి లేచుచుఁ। నవ్వుచు గొండ డిగ్గి తన నాణెములో కులకెల్ల చూ
పుచుఁ॥ సీ॥ దంతంపుసొమ్ములు తగుబండిగురిగింజ దండలొప్పుగ మెడ
నిండ మెఱయ। నీరజోద్భవు నేడు నెలల బాలుని జేసి యాదరించుచు బ్రక్క
నంటిగట్టి। సంకుటుంగరములు పొంకంబుగా బెట్టి దగ చేత నొక్క బెత్తం
బట్టి। ముసికొనిన నవధాన్యములు నించి యొకబుట్ట శిరమునందిడికొని శీఘ్ర
ముగను। బోయి నారాయణాఖ్య సత్పురము జేరి। చెలగి యాయూరియ
మ్మలక్కలనుజూచి। యెఱుక యెఱుకోయనుచు నెలుగెత్తి పలుక। విని
పురస్త్రీలు దాని బల్వింతగాను॥ తే॥ ముంపమున జూచి పలికిరో ముసలి
దాన। గద్దె జెప్పుమమాకు నిక్కముగననుచు। బలుకగానంతలో రాచ
చెలులు వచ్చి। యెఱుకతను జూచి వేడ్కగానిట్టులనిరి॥ క॥ దిట్టముగా నో
యెఱుకత। నెట్టన మాకోర్కె జెప్ప నేర్చితివైనన్। బట్టుపటావళులిచ్చెద।
మెట్టిదినీ యెఱుక జెప్పు మెఱిగెద మనగన్॥ క॥ ఎఱుకత యిట్లని యెనునా।
యెఱుకయ జీవనము జనుల కెల్ల నెపుడు నా। యెఱుకయ శుభదము శాశ్వత। మె
ఱుకయ సకలప్రపంచ మెఱుకే నేనున్॥ సీ॥ వినుడు నా యెఱుకెట్టిదని యంటి
రేని యీ పంచభూతములఁ బుట్టించు నెఱుక। సరసజాగ్రత్తను స్వప్నంబునకు
దుద మొదలు తానైమూట గుదురు నెఱుక। దండిగా బ్రహ్మాండ భాండతండ
ములందు నిండికుండలి నంటియుండు నెఱుక। మొనసి యా పోజ్యోతి నెనసి
తాదనలో నెనిలిచి యానందించి వెలుగు నెఱుక। యిట్టి యెఱుకెవ్వరెఱుగ
రా యెఱుక నిజము। యెఱుక నేర్చిన వారికా యెఱుక నేను। జెప్పెదను కా
నమీకు నే జెప్పెననిన। జెలులు విని ధరణీదేవి చెంతకరిగి॥ తే॥ పలికిరిట్ల
ని తల్లి యీ పట్టణమున కొనర నెఱుకల సాని వచ్చి నదిదాని। నిటకు రప్పిం
చి సుతకష్టమే విధమున। దీరునో తద్రహస్యంబు తెలియనడుగు॥ వ॥ అని
యా కాంతలు వల్క రాజసతి నెయ్యంబొప్పగా దానిదో। డ్కొనిరా బొం
డని పల్కగా నరిగి యా కొమ్మన్ విలోకించిర। మ్మనుచున్ గొప్పగ నెం
చివారు పరమాహ్లాదంబుతో నంపబి। ల్చిన వేరాకయ బిడ్డడేడ్చెననుచున్
జేదట్టి లాలించుచున్॥ ఉ॥ ఆకురవంజి యిట్లనియె నాడకురమ్మని పిల్వవచ్చి
నా। రాకొని నాడు బిడ్డడిపు డమ్మలనక్కల నేడనైననే। జోకగ జేరినార

లకు సోదెని జంబుగ జెప్పకుండిరర్। నాకడుపెట్లనిండుననిన వ్వుచుబల్కు-
చుమూగ్గి యిట్లనిర్॥ సీ॥ భాగ్యవంతులు వారుబలు పేదరాల నేనటుగా
న నెటువత్తునటకు నిపుడు। నాబొక్కి- నోరును నరసిన వెండ్రుకల్ గొప్ప
కడుపుపెద్దదొప్ప చెవులు। గూనివీపునుబండి గురిగింజదండలు దంతంపు
సొమ్ములువింతగాను। గనుగొనిమణుల బంగారు సొమ్ములు వెట్టియున్నవా
రందు నవ్వుదురుగనుక। నాకుసిగ్గగునా రాచనగరి కేను। వచ్చుటకుగార్య
మేమిరావలెనెపేద। తెఱవలై నట్టివారికే నెఱుకజెప్పి। పొట్టసాకుచు
నుండెదభూమిమీద॥ తే॥ అనిన వారిట్టులనిరి మాయమ్మ కెఱుకి। నిజము
గానీవుచెప్పిననీకురత్న। భూషణములిచ్చిబంగారు పుట్టమిచ్చి। పొమ్మనును
నీకవిప్పింపబూటమేము॥ మ॥ అనివారాసతికాప్తలై పలికి నెయ్యంబొప్ప
గాదానిదో। డ్కొనియంతఃపురమందుజేర్చిరచటర్ గూర్మిర్ ధరాకాంత
దా। నినిబంగారపుపీటపైనునిచి మన్నింపఁగనీక్షించియి। ట్లనెనాసోదెల
సానినవ్వుచు మహాహ్లాదంబుదీపింగర్॥ తే॥ వనితనీవుభాగ్య వతివినేబలు
పేద। దానగాననాకు దనయునకును। బాలుబువ్వ బెట్టి మేలైనవిడెము చే।
కిచ్చియుడుగుమెఱుక మెచ్చగాను॥ క॥ అప్పుడుమృష్టాన్నంబును। తెప్పునబిడ్డ
కును దానుదినిలేచిముదం। బొప్పగధరణీదేవిని। గప్పురవిడెమిమ్మంటంచు
గ్రక్కుననడిగెర్॥ సీ॥ ఆమెఱుకలసానికాధరణీ దేవివిడెమిచ్చిపలికెనో వెల
దిమీది। యేదేశమిలను మీయిండ్లేడనుండు మీ యూరుపేరేమి మా
యూరికేల। వచ్చితివనగ నవ్వవితనుజూచి సోదెలసానినవ్వుచు బలికెనిట్లు।
తరళాక్షిమానంటి యెఱుకవారలకిండ్లు వాకిళ్లుగల వెయీ వసుధమీద।
గుడిసెలాడాడగావించి కొన్నిదినము। లుండిపోయెడివారల కూరుదేశ। మే
లమీయూరిదయితల కెఱుకచెప్ప। వలసివచ్చితినిచటికో వారిజాక్షి॥ సీ॥
ఎఱుకవారలకెల్ల గుఱికట్టుగానిల్వ నొక్కచోటున్నది నిక్కముగను। నది
యేడనన్న నాల్గారును బదియుబండ్రెండు పదారును రెండునైన। శృంగపఙ్క్తుల
చేతనింగి కెగురుచునుండు నాఱుకొండలకుమీదైనకొండ। వేయుశృంగము
లొప్పు వీక్షింపదగుకొండ మూడేరులనుగూడి మొనయుకొండ। నాల్గు
త్రోవలకునునట్టి నడిమికొండ। పాముతనలోననుండగా బ్రబఱుకొండ।
కరువలినిదనలోనిల్పి మెఱయుకొండ। తొంటిమాపెద్దలున్నట్టి దొడ్డకొండ॥
క॥ ఆకొండమీదనిక్కము। మాకాపురమెపుడు సెలగమఱిజీవికకై। లో
కుల కెఱుకలుసెప్పుచు। జోకగబ్రతుకుదుమునీవు సోదెలడుగుమీ॥ క॥ చె
ప్పెదము తెండుముత్తెము। లిప్పుడుదెప్పించుమనుచు నెఱుకతతనతో। నొ
ప్పగబల్కగనాసతి। యప్పుడుముత్యములదెచ్చి యచ్చటనుంచెర్॥ తే॥ ప
సిడిచేటలోని పంట్లనాక్తికవురా। గద్దెపొలతిసూచికరముసాచి। ముత్యా

ములనుబిసికి మూడురాసులుచేసి। మధ్యరాశియందుమదినినిల్పి॥ వ॥ అప్పు
డుముమ్మారుచెయ్యెత్తి మ్రొక్కి మనంబున గంగాది పుణ్యతీర్థంబులను
గాశీగయాప్రయాగ ప్రముఖపుణ్యక్షేత్రంబులను హరిహర బ్రహ్మాదిదేవ
తలను బరాశక్తి ప్రముఖాద్యనేకశక్తులనుదలంచి నిలిచి మ్రొక్కి మఱియు
నిట్లనియె॥ క॥ వినుధరణీసతియిచటికి। నెనువుగదేవళ్ళువచ్చి నిలచిరినీవిం।
కనుదక్షిణతాంబూలం। బునొసంగుము మొక్కుగద్దె బుట్టకుతరుణీ॥ వ॥ అ
నినవిని దక్షిణ తాంబూలంబుబెట్టి గద్దెబుట్టకు మ్రొక్కి యెఱుకలసానితో
ధరణీ దేవియిట్లనియె॥ తే॥ కొమ్మనామదిలోనేనుగోరినట్టి। కోర్కి నిజము
గజెప్పు నీకొడుకునకిట। నందెలిచ్చెదనీకు దివ్యాంబరంబు। లిచ్చెదనుదబ్బ
రాడకో యెరుకలమ్మ॥ క॥ అనిపలికినధరణినిగను। గొనియెఱుకతయిట్టుల
నియె గొడుకామదిలో। సనుమానింపకుమిప్పుడు। ఘనముగనీకోర్కె జెప్ప
గలనేసుమిమ్మా॥ వ॥ అనిపలికి తన కెదురుగా ధరణీదేవిని బడసిడిగద్దెమీద
గూర్చుండుమ నితనచేతిబెత్తంబుకొని నయ్యొంతిచేతికిచ్చి విఘ్నేశ్వరా వీర
భద్రా మళయాళ భగవతీ మదిరమీనాక్షీ యామ్నాయాక్షీ కామాక్షీ
కనకదుర్గాంబ చౌడాంబజ్ఞానాంబ కొల్లాపురిలక్ష్మి మీరందరువచ్చి వాకి
య్యరే వాకియ్యరేయని ప్రార్థించి మఱియు నిట్లనియె॥ క॥ దిక్కులుచూ
డకసతినా। దిక్కేనీవిపుడుచూడు దేవరతోడే। నిక్కము జెప్పెదనీకని।
మక్కువ నాయెఱుకలమ్మమఱియిట్లనియెన్॥ వ॥ అవ్వోయవ్వ నీతలంచిన
తలంపు మేలౌతుండట దేవుళ్లుబలుకు తుండారుతలంచిన తలంపేమంటవా
చెప్పుతావింటావంటమ్మబిడ్డంటేకడుపుసూపుదుతోడబుట్టంటెభుజంబుసూ
పుదుఅట్లంతోడబుట్టుకడుగలేదుఇట్లాబిడ్డకడుగు తుండావెదుండి ఆబిడ్డ ఆడ
బిడ్డో మొగబిడ్డో అంటడుగుతుండావె కొడకాయిది ఆడబిడ్డంటె చెవి
సూపుదు మొగబిడ్డంటె గడ్డంబుసూపుదు ఇదిగో అట్లమొగబిడ్డ కడుగ
లేదుయిట్లా ఆడబిడ్డ కడుగుతుండావె దుండమ్మా అవ్వో యవ్వ యిప్పుడు
నీ ఆడబిడ్డకొక్క చింతపుట్టివుండాది ఆచింత యేమంటెచెప్పే వినవేదుండి
నిన్నటిదినం నీబిడ్డ పుష్పవనంబులో నొక్క తురగారూఢుండైన నల్లన
య్యనుజూచి మోహించి యుండాదేదుండి ఆనల్లనయ్య యెక్కడవుండాడు
యెవ్వార వుండాడంటడగ వేకొడకా యిదిగో యీ మూలవుండాడంటె
తెలియలేదంటెకొడకా తెలియలేదంటేదుండి యిదిగో యిక్కడికి వాయ
వ్యభాగమందు పడగలతో మెఱయుచున్న బంగారుకొండమీదనే వుండా
డేయవ్వ వాడెవడంటె బొల్లినామంబులు పెట్టుకొని బొల్లిపిట్టమీదనెక్కి
కొల్లకాడై యెల్లదిక్కులు దిరిగేనల్లనయ్యే తల్లి వాడు నిబద్ధిగాను శ్రీమ
న్నారాయణుండె వాడునరుండుకాడెవోయమ్మ వాడునీబిడ్డను పెండ్లియా

డవలెనంటవుండాడు నీబిడ్డయును వానిపెండ్లియాడవలె నంటవుండాదికా
గావానికిదీనినిచ్చి పెండ్లిచేసితే నీబిడ్డ సుఖముగా వుంటుండాది లేకుంటె
దానికి బలుకష్టము వస్తుండాదని చెప్పినవిని ధరణీదేవి యెఱుకతను జూచి
యిట్లనియె॥ క॥ ఓయెఱుకతనీమాటలు ! మాయగదోచిన దిమనుజమాని
నులనునా।రాయణుడుపెండ్లియాడిన।దీయిలలోగలదెచూడనెచ్చటనైనన్॥
సీ॥అనివింతగానవ్వి యాసతిబల్కగా విని యెఱుకలసాని వేడ్కననియె। నా
స్వామిమదకరి నదలించితరుముచువచ్చి నీసుతయున్నవనము జేరి। తనకుల
గోత్రముల్దన కోర్కెనీముద్దు చిన్నారిబుడతకు జెప్పినాడు । నీకూతురది
విని నిష్ఠురోక్తులు వల్కియతడెక్కివచ్చిన హయముమీద। తాళ్లురువ్వింపనే
లగుట్టంబువడియె। నతడుమన్నించియా వెంకటాద్రిజేరె । ముగ్ధకటుమీద
ఘనకామ మూర్ఛదాకె । విరహతాప జ్వరంబుచే వేగసాగె॥ తే॥ ఆజ్వ
రము మాన్ప వేఱలే దౌషథంబు । కమల నయనుని మోము మీకన్య
కిచట। జూపుడటు చూపినపుడె మీసుతకు వచ్చి । నట్టితాప జ్వరంబు చ
ల్లాఱిపోవు॥ తే॥ అనుచు బల్కిన కొఱవంజి నతివజూచి । కమలలోచనుడే
డ మాకన్యయేడ । నతనిచూచుటేడమోహ జ్వరంబు । పోవుటేడ నిదే
మొనీ బూటకములు॥ వ॥ అనవిని దప్పదు నామాట దప్పద వ్వోయవ్వ.

సీ॥ ఇకగొంతదడవున కిచటికిపెండ్లి పెత్తనము జేయిటకు మోదంబు
మీఱ। నావేంకటేశ్వరు డంపగానొక్క కన్యకవచ్చునప్పుడు నానిజంబు।
తెలియునీకిపుడెంత తెలియజెప్పినగాని తెలియ లేదోధరాదేవినీకు। దెలిసి
నప్పటికినన్ బిలిపించిబహుమాన మిప్పించుమిప్పుడే మియ్యవలదు । నాకి
పుడు నీవు సెలవిమ్ము నీకొమార్తె। పెండ్లికిచటికి వత్తునాబిడ్డతోడ। మగువ
నే నీకుజెప్పిన మాట నిజమొ। దబ్బరానేమొ నీముద్దు తనయనడుగు॥వ॥
అవ్వోయవ్వ కడుపు కూటికొఱకు దబ్బరాడితినని సంశయించినా విదికల్ల
గాదు తరకటబరకటముగాదు తబ్బిబ్బుగాదు తసుకుగాదు బుసుకుగాదు
తాటోటుగాదు ఆడంబరముగాదు నామాట నాగద్దె బుట్టతోడె నాబు
డుతనితోడె నిజమానిదియనినమ్మజెప్పి దిగ్గున లేచిపోయి పరమపురు
షుండైన శ్రీనివాసుండు నిజరూపంబున వేంకటాద్రి జేరెనంత ధరణీదేవి
యాశ్చర్యంబు నొందుచు బద్మావతి చెంతజేరి యిట్లనియె। ఉ॥ అమ్మ
యిదేమి పద్మయిపుడారట మొందుచు బవ్వళించి బల్ । సొమ్మసి లిం
త ప్రొద్దునకు జోకగలేవవు నిన్నుజూచినే । నెమ్మదినెట్టులుందునిక నీ
మదిలోపల గల్గుచింత ని । క్కముగదెల్పు నీకలికి కన్నుల నీరిటు నించనే
టికిన్॥క॥ నేవలదన్నను నిలువక । నావనమున కరిగనిన్న యాట్లాడగనిన్
విభ్రాంచుచు గనిరెవ్వరు । నీవెవరిని గంటివచట నీరజనేత్రా॥ తే॥ నేను

దల్లినిబిడ్డవు నీవు నాకు। గాన నఱిమఱి వలదందు గలిగినట్టి। వింత దాపకనిక జెప్పు వెఱువనేల। ననిన గన్యక మాటాడ కడలుచుండె॥ క॥ ఆకన్యక యివ్విధమున। శోకింపగ జూచి ధరణి చోద్యపడుచునీ। కీకరణిగ నతి దుఃఖము। రాకకు గతమేమి దెల్పురా కేందుముఖీ॥ తే॥ అమ్మ నిజముగ ధరమీద నాప్తులింక। నాకెవరు లేరు నాకన్న నీకు లేరు। నన్నునఱిమఱఁ జూడకయున్న మాట। దాపకను జెప్పు నాకు మీతండ్రితోడె॥ చ॥ అనియిటులాన బెట్టి సుతనప్పుడు మెల్లగ లేవనెత్తి తా। ననుపమమైన ప్రేమను నిజాంకతలంబున నుంచి శీర్షముఁ। నెసరున చేత దువ్వుచును నేర్పుగలాలన మెంత జేసినన్। దనతల వంచి పల్కనిసుతన్ ధరణీసతిజూచి క్రమ్మఱన్॥ ఆ॥ పట్టినీవు సేయు పాపంబుగాదిది। పరగనేను జేయు పాపమింత। జేయుచున్న దేమి సేయుదుననుచుగ। న్నీరు తానునింపు చూరకుండె॥ సీ॥ ఆరీతిదనకొఱ కార్తిబొందినతల్లి నాపడుతుక చూచి తాపమొంది। కనుల బాష్పము లొల్క గానిట్టులనియెనో యమ్మ పువ్వవనంబు నందు నేను। సఖులతో నాట్లాడు సమయమందచటికి దివ్యపూరుషుడొక్క తేజిమీద। దగనెక్కి వచ్చిన న్నాగదిగ చూడగా నేనుగోపించి మన్నింపకతని। ఱాళ్లరువ్వింప నేల గుఱ్ఱంబువడియె। నలడెచట జేరినాడో నేనది యెఱుంగ। నతనిసుందర మైన దేహంబు కనుల। గట్టినట్లిప్పుడున్న దే కన్నతల్లి॥ క॥ అని పద్మావతి వలుకగ। విని ధరణీదేవి సుతను వీక్షించిమనం। బున మోదము ఖేదము బెన। గొన లజ్జించి ముద్దు కూతురి కనియెన్। సీ॥ నాతల్లి యించిన్ననాడు నీకిటువంటి బుద్ధియేల జనించె బువ్వబోడి। వనమున కేగియా వనపురుషుని జూచి వలచెనందురు నిన్ను వనజపాణి। పుట్టిపుట్టకతొల్లి పురుషస్వరూపంబు నీకెట్లదెలిసెనే నీలవేణి। వానికులం బేమొ వానిపై నీ కింతమరులేల గలిగెనే మధురవాణి। కటకటా మానధనుడు నిన్ గన్నతండ్రి। నీమనోవ్యథ నిజముగా నేడువినిన। జింత చేదల యెత్తలేకెంత మదిని। గుందునో దీనికెటు సేతు గుందరదన॥ క॥ వనమున సుందర పురుషుని। గనుగొని మదిలో వరించె గగనాధిపుబి। డ్డని లోకులు నిందించిన। వినవలసితి మేమిసేతు విధియిటు సేసెన్॥ క॥ లోకంబంతయు మాయను। మూకుడు లేదతని నేల మోహించితివే। మాకును నీకును ధరపై। నేకరణిని గీర్తివచ్చు నిటువలెనైనన్॥ సీ॥ అనియిట్లుపలుకగా నపుడు పద్మావతి హరిపూర్వ వృత్తాంత మాత్మయందు। దలచి యిట్లనియె నో తల్లి మీకపకీర్తి వచ్చునెడు చింతవలదతండు। మనుజ మాత్రుడటంచుమది నెంచి నావేమొ మనుజుండుగాడు రమావిభుండు। పురుషోత్తముండు సం

పూర్ణ ప్రకాశుండు సర్వజ్ఞుఁడాద్యుండు శాశ్వతుండు। గాననాస్వామియం
దునా మానసంబు। కుదిరి నిలిచినదిదినాకు గోదువగాదు। నాకొఱకు
భూమి నపకీర్తిమీకు లేదు। కావలసినట్టి పనియింకఁగాక పోదు॥ వ॥ జ
ననీవిను మేమహామహుని దివ్యచక్రంబు కౌరవ బలంబులఁద్రుంచి కరి నగ
రంబున ధర్మరాజును బట్టభద్రుంజేసి తత్పుర సంరక్షణంబు సేయుచుం
డు నేమహాత్ముని శంఖారావంబు దైత్యబృందంబునకు భయాస్పదంబై దే
వతలకానందంబు నిచ్చుచుండునట్టిశంఖచక్రధరుండైనపరమపురుషుండులీ
లామానుషవిగ్రహుండై నిన్ననవ్వనంబుననాకు బ్రత్యక్షంబయ్యెనప్పుడు నే
నిమ్మర్త్యలోకానుసారంబుగానద్దేవునిధిక్కరించిఱాళ్లనువ్వించితఱిమించితి
నయ్యపచారంబేనుజేసినందుకమ్మహావిష్ణుండునన్నురక్షించునోరక్షింపఁడో
యనుసంశయంబునభయంబునొందికన్నీరునించుచుండుటే కానికామ వికా
రవ్యాపారంబెఱుంగనాశ్రీనివాసస్వామిదివ్యమంగళవిగ్రహంబునాకుఁగ్రమ్మ
ఱబ్రత్యక్షంబైన జీవించుచుండెదగాక లేకపోయిననిమ్మహియందునిర్వహిం
పఁజాల ననిపల్కి బాష్ప ధారాపరిపూరి తాక్షియైపూబాన్పుమీఁదమర
లఁ వ్రాలినంజూచి ధరణీదేవియిట్లనియె॥ సీ॥ అమ్మపద్మావతి హరిభక్తిసీ
చిత్త మందింతగానిలిచి నందువలన। నీకోర్కిసిద్ధించు శోకింప వలదింక
నాచక్రినిను బెండ్లియాడుననుచు। దేటగానొకధర్మ దేవతనాకడ నెఱుగఁజె
ప్పినమాటలేలతప్పు। దప్పదిప్పుడునీవు ధైర్యంబుతో నుండుమనిచెప్పు
చుండగా నంతనటకు। గ్రమముగా విప్రముఖ్యుల గస్త్యలింగ। మునకు
రుద్రాభిషేక మింపుగనొనర్చి। పరగ నాతీర్థమునుబూలు పత్రిపండ్లు। కో
రిగైకొని రాఁజూచివారిఁగోడ॥ తే॥ చెలులతో ముచ్చటాడుచు స్నేహ
మొప్ప। వకుళమాలిక వేడ్కగా వచ్చెనపుడు। ద్విజులురు ద్రాభిషేక
సత్తీర్థ మమర। బరగబద్మావతీదేవి పైనజల్లి॥ తే॥ పొసగుమంత్రాక్ష
తంబులు పూలుపండ్లు। వెలయనారాజ సుతకుదీవించి యొసగి। పీఁట
గొనిచనిరటుమీఁద వేగవకుళ। మాలికనుజూచి సంతోషమగ్న యగు
చు॥ క॥ ధరణీదేవి రయంబున। బెరి మెనువకుళను సురత్నపీఠముమీఁదన్।
గరమర్థినునిచి పదములు। మురియుచు దాఁగడిగిపూజ ముందుగ జేసెన్॥
సీ॥ అటుమీఁద భక్తినిట్లనియె మహాదేవియొం దుండివచ్చితి విచటికిపుడు।
వచియింపుమనగ నవ్వకుళమాలికయిట్టు లనియెనోయమ్మ శేషాద్రినుం
డి। వచ్చితిననగ నెవ్వరి దానవని ధరణీదేవియడుగగాని గతమేను। ధర
వెంకటేశ్వరుదా సినైయుండు నాస్వామి పంపించగావచ్చి యిచట। జేరి
నానని వకుళమచ్చి కనుబలుక। వినిమహీపతి సతియేమిపనికినీవు। వ
చ్చినావని యడుగగా వకుళపెండ్లి। పెత్తనముసేయ వచ్చితిఁ బ్రేమమీ

ఆ॥ క॥ అనిపలికిన వకుళనుగను। గొనిధరణీ దేవియెవరికొఱకిప్పుడు పె।
త్తనమిచట జేయవచ్చితి। వనియడుగగవకుళ యిట్టులనియెను వేడ్కన్॥ సీ॥
వినుధరణీదేవి వేంకటేంద్రునకు మీ వరకన్యనడుగ నేవచ్చితినిటు। తక్కక
మీరిప్పుతగు నన్నగుల గోత్రములుదెల్పు తల్లిదండ్రులనుదెల్పు। మనిధ
రణీదేవి యడుగగా వకుళయిట్లనియెగులంబు శీతాంశుకులము। గోత్ర
మొప్పవసిష్ఠగోత్రంబుదేవకిజననిశౌరసుతుండు జనకుడనుచు। జెప్పిననున
వ్వివకుళ నీక్షించిధరణి। పలికెనిట్లని సౌందర్య భాగ్యసుగుణ। శీలముల
దేటగా నీవుచెప్పుమనగ। వినిముదంబునవకుళయిట్లనియెమరల॥ శీ॥ సతి
నీప్రమాస్వామి సౌందర్యమడిగినమహినొప్పు మన్మథమన్మథుండె। పట్టు
గానమిత సౌభాగ్యంబు నడిగినజెప్పశక్యం బెలక్ష్మివిభుండె। సుస్థిరంబై
నట్టి సుగుణంబులడిగిన గురుతరానంత సద్గుణగణుండె। శీలంబునిపుడు
మచ్చికను నీవడిగిన వేదోక్తసద్ధర్మ విహారుణుండె। గనుకసౌందర్య ము
నుసుభగత్వగుణము। లమలశీలము నామ్నాయసమితిదెలిసి। చెప్పలే
వండు రేనేమిసెప్పనేర్తు। నమ్మమీకన్యకామణి కబ్బెనతడు॥ మ॥ అని
యాభామినిపల్కగాధరణి నెయ్యంబొప్పగా శ్రీరమా। వనితారత్నము
చెంతనుండగను మావామాక్షినిం బెండ్లియా। డనువిష్ణుండు దలంచెనం
టవిదియెట్లా నిశ్చయంబంచునా। కనుమానంబునుదోచెవిన్న మమజల్
హాస్యంబుగా నెన్నరే॥ సీ॥ అనిధరణీదేవి యనుమానముగబల్క వకుళ
యిట్లనియె నవ్వార్ధితనయ। కొల్లాపురము జేరియెల్లభక్తులనుసం రక్షించు
చున్నది వక్షమందు। కమలయిప్పుడు లేదుగావున మీకన్యనీక్షించి చక్రి
మోహించినాడు। మీరుమీకన్యను నారాయణునకిచ్చి చెలగివివాహంబు
జేయుడనుచు। జెప్పికొల్లాపురము సిరిచేరినట్టి। పూర్వవృత్తాంత మతివ
కుబొసగజెప్పి। వేదవతి పూర్వవృత్తాంత మాదరముగ। బట్టుగాజెప్పి
సమ్మతి పఱచిమరల॥ తే॥ పలికెనిట్లని వకుళమీపట్టియైన। పద్మ పద్మా
లయాంశ సంభవ యటంచు। నబ్జదళలోచనుడు పెండ్లియాడదలచి।
నాడుమదిసంశయింపక నేడుమీరు॥ గీ॥ పెండ్లిముచ్చటగాజేసి వేడ్కజూ
డు। డింతభాగ్యంబు గలుగునేయె వరికైన। మీరుబహు పుణ్యములు
చేసినారుగనుక। నల్లుడయ్యెను మాధవుండ హహాయనుచు॥ తే॥ తాను
సంతోషమునుబొంది ధరణిమదికి। సంతసంబునుబుట్టించి సతిరయమున।
నేనువచ్చిన పనినీపున్న పతికిపుడె। మనవిసేయుము లెమ్మపొమ్మనగ న
పుడు॥ మ॥ ధరణీదేవిముదంబుతోనరిగి చింతంబొందు చున్నట్టిభూ।వరునా
నందముమీఱజూచిశుభ సద్వార్తల్ క్రమంబొప్పగా।మురిపంబుప్పతిలం
గజెప్పివకుళన్ ముఖ్యంబుగాజూపె నం।దఱలేకావకుళన్ నృపాలకుడుతా

ముందాదరించెఁ గృపఁ॥ సీ॥ అప్పుడువకుళదానాకాశనృపవరు నీక్షించి
రాజసేఁబుంటికేఁగు। వచ్చిచెప్పి నశుభవార్త లన్నియు ధరణీదేవివిని వచ్చి
మోదమెసఁగ। జెప్పగాదగవింటి రిప్పుడె పెండ్లి లగ్నంబు గ్రక్కునని
శ్చయంబుజేయు। డనిపల్క శుభవార్తలాకాశనృపతిదా విని పరమా
నంద వనధిదేలి। పలికెనిట్లనివకుళ నాపట్టికొఱకు । బుట్టినటువంటినా
చింత పోయెనిన్ను। బోలినటు వంటియాప్తులీ భూతలమున। మాకెవరు
లేరుసమేలమఱువవశమె॥ వ॥ అనియివ్విధంబునవకుళమాలిక ననేకవిధం
బులవినుతించి పద్మావతి చెంతకరిగి లేవనెత్తి తొడపైనిడికొని శిరంబునివిరి
చెక్కిలిముద్దువెట్టికొని చుబుకంబుపుణుకుచులాలించియిట్లనియె॥ క॥ వినుప
ద్మావతినీమనసు। మునునిక జింతింపవలదుముజ్జగములపా। వనమొనరించుచునుం
డెడి। వనజాక్షునకిచ్చినినువివాహము సేతుఁ॥ వ॥ అనిపద్మావతికిసంతోషం
బుగాజెప్పితదనంతరంబుననిజగురుండైనబృహస్పతిని ధ్యానింపగానతండువ
చ్చినంజూచి లేచి యతనినిమణిపీఠంబునందుంచి యర్ఘ్యపాద్యాది విధులం
బూజించి నమస్కరించి కూర్చుండి వకుళమాలిక వేంకటాద్రినుండివచ్చి
చెప్పిన వివాహశుభ వాక్యంబులు సవిస్తరంబుగా జెప్పినవిని గురుండు
సంతసించి యానృపతి నీక్షించి యిట్లనియె॥ సీ॥ అరయనీపురికి నుత్తరభా
గమందుబంచ క్రోశదూరాన జనహితముగ। బ్రహ్మానుసంధాన పరుడై
నశుక యోగియున్నాడతని నిటకుచితుడైన। వారిచేబిలిపింప వలెనన్న
విని రాజుతమ్మునిఁబంపించితడయకపుడె। శుకునిబిల్పింపగా నకలంకచిత్తుడై
యామహాత్ముడు రాగనపుడు నృపతి। లేచిరత్నాసనంబిచ్చి లెస్సపూ
జ। జేసిమ్రొక్కగ నృపునినీక్షించికరుణ। నతని గూర్చుండనియమించియ
మరగురుని। జూచిముదమంది వేడ్క నాశుకుడు వలికె॥ క॥ సురగురువర
నన్నిచటికి। గరుణనుబిలిపించినట్టి కార్యము నాతో। ద్వరగాజెప్పుండన
విని। గురుడు ముదంబొదవనాశుకున కిట్లనియెఁ॥ సీ॥ వినుశుకయోగీం
ద్ర ఘనుడైన వెంకటేశ్వరుడు పద్మావతి వలచితాను। బెండ్లియాడెదన
నుప్రేమ రెట్టింపగా వకుళ మాలికయను వనజముఖిని। దక్కక్క పెండ్లి
పెత్తనము జేయుటకు నేడంపించి నాడునన్నెందుకొఱకొ। నృపతిపిల్పింప
గా నేనువచ్చితినీవు వచ్చితివిపుడు భూవరునకేమి। సెప్పవలెనన్నగు
రుని వీక్షించిశుకుడు। పలికెనీరాజు పుణ్యప్రభావముననె। పద్మగల్గినది
ట్టిసౌభాగ్యవతికి। దగడు మనుజుండు శ్రీరమాధవుడెతగును॥ తే॥ అనినృ
పాలకనీవుమహాతపంబు। జేసియీకన్య నిలనుగాంచితివిపుణ్య। ఫలము
సిద్ధించెనిపుడయీ పద్మగంధి। ప్రేమమీఱగ హరికిచ్చి పెండ్లిసేయు॥ చ॥
అనిశుకయోగి పల్కగ మహాముదమొంది నృపాలపుంగవుం। డనియెగు

రుండునీవు శుభదంబగులగ్న మునేర్పరించిపొం। తనములు చూడుడన్న వినితక్కక నాశుకుడుంగురుండు పెం। పొనరగ బొంతనంబులు మహోన్నతలగ్నమునందు జూచుచుర్॥ వ॥ అప్పుడునక్షత్రాను గుణంబుగాయోనికూటంబునాడీకూటంబును సూత్రయోగంబును మొదలయిన దశవిధంబులగు పొంతనంబులు చూచిరాజునకు సమ్మతంబుగా జెప్పిరంత నాన్నృపాలకుండుసభామధ్యంబునభుజగభర్తయగు శ్రీనివాసస్వామివారికిపద్మావతినిచ్చి పెండ్లి జేసెదనని నిశ్చయించి పలకిబృహస్పతినిజూచి మఱియునిట్లనియె॥ సీ॥ హరికినమస్కారమనుచువ్రాయించెద ననవినిధిషణు డిట్లనియె నృపతి। యాసామ్వివమానవుం డైనీసుతను బెండ్లి యాడదలంచి నాడందువలన। మొనసినమస్కార మనివ్రాయగూడదు మేలుకాశీర్వాదమేయుటంచు। నమరబత్రికవ్రాసియంపించుమనిసమ్మతంబుగబల్కనా ధరణివిభుడు। ననుజపుత్రకళత్రాదులైనబాధు। జనులుహర్షింపగా సభాస్థానమందు। ప్రాకటంబైన బంగారుఱేకుమీద। మంచిలగ్నంబు నందువ్రాయించెనిట్లు॥ సీ॥ శ్రీమదఖండ లక్ష్మీప్రసన్నేక్షణా లంకృతులై సకు ల్లాసులైన। యఖిలాండకోటిబ్రహ్మాండ నాయకులైన సర్వజ్ఞులైన శ్రీస్వామివారి। కాకాశనృపుడాయురారోగ్య పుత్రపౌత్రాభి వృద్ధులుగల్గునట్లుగాను। నేనుదీవించితి నేటిదినంబున గుశలంబు మాకుమీకుశలమరయ। వ్రాసిపంపింపవలయునావ్యాససుతుడు। గురుడు జెప్పగ నీకునాకూతురైన। పద్మవతినిచ్చిచేసెదబరిణయంబు। చిత్తగించుచిదుల్లాసశ్రీనివాస॥ వ॥ అనిశుభపత్రిక వ్రాయించి హరిద్రాలేపనంబుజేయించి బృహస్పతిచేతికిచ్చె నాలిఖితంబు చూచి గురుండుశుకయోగీంద్రునిచేతికిచ్చిన నతండు చిఱునవ్వునవ్వి యానందింపగని యాలిఖితంబు శ్రీనివాసస్వామివారికిసమర్పించి ప్రత్యుత్తరంబుదెచ్చుటకుమీరేయోగ్యులనిపలికినశుకయోగీంద్రుండు పరమానందంబునొంది యాలిఖితంబుచేకొని వేంకటాచలరోహణంబుచేసె నప్పుడమ్మునిరాక కెదురుచూచుచున్న శ్రీనానివాసుండెదురుగాబోయి శుకుందోడ్కొని వచ్చితింత్రిణీవృక్షమూలంబున దానురచియించియున్న పుష్పపీఠంబునందుంచియిట్లనియె॥ క॥ ఓయోగీశ్వరసత్కృప। నీయెడకిటుమీరువచ్చుటిది మేలయ్యెర్। మాయావిరహితనాపసి। కాయో పండో నిజంబుగాదెల్పుమయా॥ క॥ అనగా మందస్మితుడై। వినిశుకయోగీంద్రుడని యెవిశ్వాత్మకమీ। ఘనచిత్తమందు దలచిన। పనికాయగనిలుపనేలపండై యొప్పెర్॥ చ॥ అనిశుకయోగిపల్క నపుడబ్జదళాక్షుడు సంతసించియ। మ్మునికినమస్కరించితన ముచ్చటలొప్పగకొన్ని చెప్పిగా। వినిముద మొందితాపసుడు వేడ్కనుదాగొని వచ్చినట్టియా। ఘనశుభ లేఖమచ్చికను గంజదళా

క్షుని చేతికిచ్చినఁ॥ క॥ అప్పుడు హరియాపత్రిక । తప్పక తాఁజదివి దెలిసితడయకయపుడే । గొప్ప మొగలిరేకులపై । నొప్పుగ గొనగోటలిఖిత మొనరగవ్రాసెఁ॥ సీ॥ బాదరా యణసుతుఁడ బట్టుగా వినుమని సరసీరుహాక్షుండు చదివెనిట్లు । శ్రీపూర్ణ రాజపూ జితులైన ధర్మతత్పరసుధర్మసుధర్మవరసుతులగు।సామ్రాజ్యకలితరాజశ్రీగగనరాజు వారికి శేషాద్రి వల్లభుండు। వందనంబులు నేటివఱకు మాకుశుభంబు వసుధ మీకుశలంబు వ్రాసిపంపఁదగునువై శాఖమున శుక్లదశమినాటి । శుక్రవారంబురాతిరి శుభముహూర్త।మునకుమాబంధు మిత్రుల మొనసికూడి।వత్తుమచటికిపదివేల వందనములు॥ సీ॥ అని తానువ్రాసి యున్నటువంటిలిఖితంబు పాలుపొందఁజదివి సత్పుష్పహార । మును శుభరేఖను ముని చేతికొసంగి నవ్వుచునాలింగ నంబొనర్చి । వినుతించి హరిశుకు వీడ్కొల్పగిరిడిగ్గి సరగనారాయణ పురముజేరి । యాకాశరాజున కాలిఖితంబిచ్చి యతని చేసత్కృతు డైగురునకు । హరివచించిన శుభవార్త లపుడుసెప్పి। మహిమచేనొప్పునైజాశ్రమంబువేగ । జేరెనంతట నాకంబుజేరెగురుడు। పురముగై సేయదలచి యాభూవరుండు॥ వ॥ పరిచారకుల నియమించె నందుధరణిదేవి వకుళమాలికకు దివ్యాంబరాభరణంబులిచ్చి వీడ్కొల్పిన శేషాద్రికివచ్చి శ్రీనివాసునీక్షించి యాయింతి యిట్లనియె॥ సీ॥ నాతండ్రి వేంకట నారాయణపురంబు నకుబోయివచ్చితి సకలశుభము । లొదవెవివాహ మహోత్సవంబునకునే నేమిపనులుసేతు నిచటననిన। వినిహరిపల్కెనోజనని యీపెండ్లి పెత్తనము జేసితివింకద్రవ్యమేడ। దెచ్చెదవేనే డదెత్తు దీనికుపాయమేమి నాకెఱిగింపుమిప్పుడనిన। వకుళమాలికపల్కె నవ్వనధితనయ । నిచ్చటికిబిల్వనంపిన హెచ్చుగాను । ధనమునీకిచ్చునని నమాధవుడువకుళ। మాలికనుజూచి పలికెనోమాతవినుము॥ సీ॥ వనజాలయనుబాసివచ్చి యిచ్చటబెండ్లి యాడెదననిన నాకాప్తముగను । ధనమిచ్చునేసిరి యనిపల్కితలవాంచిచింతింప వకుళశ్రీశ్రీనివాసు।నీక్షించి వారితోనెంతో భరంముగాజెప్పివచ్చితిని నీవిప్పుడిట్లు। చింతనొందిన నేమిసేయుదు నీమాటలావరాహ స్వామికైనజెప్పి। తక్కకేమైన నొక ప్రయత్నంబు జేయు। వలయునిపుడూరకుండి వివాహమునకు। వారుపిలుపించినపుడు ద్రవ్యంబులేక । పెండ్లికేరితి బోదమోంబిసరుహాక్ష॥ క॥ అనియావకుళమహాభయ । మునబలుకగనవ్విచక్రిముచ్చటగాని। ట్లనియెవరాహస్వామిని। ధనమిపుడీవడిగిరమ్ము తల్లిరయముననఁ॥ వ॥ అనిహరివినోదంబుగా జెప్పినంజని వకుళమాలికవరాహస్వామిచెంతజేరి నమస్కరించియిట్లనియె॥ సీ॥ శ్రీవరాహస్వామి శ్రీనివాసుడుపెండ్లియాడదలంచినా డర్థమిచట । లేదువివా

హామే లీలగానగునిందు కేయుపాయముజేత మింకమీఁద। బహుమునిచ్చె
డువారుభాగ్యవంతులు వారితోసరిగాఁదుల దూఁగవలయు। నదిమాని వేం
కటుడా మహీపతిగన్న కన్యకుమెడబొట్టుగట్టదలచి। నాడితండ్రిట్లుచేసిన న
రులునవ్వి। పోదురటుగాన నీవైనభూరిధనము। పొసగనోడ బూర్వ మనగ
నాభూవరాహ। దేవుడాసతి నీక్షించిధీరుడగుచు॥ సీ॥ పలకెనోవకుళ ని
ర్భయముగానీవుందు మాశ్రీనివాసున కర్థమిచట। దక్కవగాదుఘోరదంబు
తో నూరకచూచుచునుండు ముచోద్యములను। నీవుచెప్పకమున్నె నేనా
మహాస్వామి యలఘుచరిత్రముల్ దెలిసినాడ। మొనసి నేనానందముగజూ
చుచున్నాడనీకేల నీచింత నెమ్మదిగను। హరికడను నిల్చియుండు బ్రహ్మాదు
లిటకు। వచ్చిచేతురు చక్రివివాహమనుచు। జెప్పివీడ్కొల్పగా బోయిశ్రీని
వాసు। జేరికిటియన్నమాటలుసెప్పెవకుళ॥ వ॥ అంతరమాకాంతుండు సం
తసించి స్వాంతంబునం దనంతగరుడులస్మరించె నప్పుడుప్పొంగి యుప్పన్న
గేంద్రుండును బక్షినాయకుండును వేంకటాద్రికివచ్చి చక్రికిదండ ప్రణా
మంబులాచరించినంజూచి రెండుశుభలిఖితంబులు వ్రాసివారలకిచ్చియిట్ల
నియె॥ ఉ॥ గరుడనీవు వోయికంజసంభవునకీ। లిఖితమిచ్చినైజ నిఖిలబంధు
సహితముగ గుటుంబసంఘంబుతోవచ్చి। చెలగినాకుబెండ్లి సేయుమను
ము॥ క॥ పొమ్మనియావిహగేంద్రుని। సమ్మతిగాబనిచి శేషశర్వునిబిలువన్
బొమ్మకుటుంబయుతమ్ముగ। రమ్మనునాపెండ్లి జూడరయమునశివునిన్॥
మ॥ అనినారాయణుడంపగానప్పుడు శేషాఖ్యుండుశ్రీకంఠుబి। ల్వనుబో
యెన్ ఖగనాయకుండరిగసి యావాణీశ్వరుంజేరికా। మ్మనియాపత్రిక చేతి
కిచ్చిననజుం డచ్చోటనుండేనుహా। మునువెల్లన్ వినదావచించెనిటు స
మ్మోదంబుదీపింగన్॥ సీ॥ శ్రీరస్తు బ్రహ్మకాశీర్వాదముహీఁగిరి మీఁదమా
కుశుభంబుమీకుశలము। వ్రాయించిపంపింపవలయును దర్వాతసురుచిర
వైశాఖశుక్లదశమి। శుక్రవారమునాటి శుభముహూర్తంబున గగనాధిప
తిసుశ్రగమముగాను। గలియుగంబున గరగ్రహణంబు చేసెద మెఱయుగు
టుంబసమేతముగను। రాదగునీ వారిదోడ్కొనిరయముగాను। వచ్చిసా
గింపలె నావివాహమనుచు। వ్రాసి యుండిన లేఖయావనజభవుడు। చది
విశిరసావహించి యాశ్చర్యముగను॥

వ॥ అప్పుడక్కమలాసనుండు శ్రీనివాసస్వామివారివివాహమహోత్సవం
బునకుసహకుటుంబులై రావలెననిదిక్పాలకప్రముఖులకుశుభలేఖలు వ్రా
యించిపంపించి తాను సకలదివ్యాభరణాలంకృతుండై సావిత్రీగాయత్రీస
రస్వతీసమేతుండై హంసవాహనంబెక్కి చతుర్వేదపారాయణులైన మ
హర్షులందోడ్కొని మంగళవాద్యంబులు ఘోషింప ఖగేంద్రునితోడ వేం

కటాద్రికివచ్చినప్పుడు శ్రీనివాసుండా వాద్యరవంబువినిలేచి బ్రహ్మకెదు
రుగాబోయెనప్పుడు హంసవాహనంబుడిగ్గి విరించి చక్రికి నమస్కరించినం
జూచివిష్ణుండజునిమీద బుత్రస్నేహంబగ్గలింప ముహూర్తద్వయంబు గద్గ
దకంఠుండై మాట్లాడక నజునాలింగనంబుజేసి తోడ్కొనివచ్చి తింత్రిణీ
వృక్షమూల ప్రదేశంబునందుంచి సింహాసనంబు మీదగూర్చుండి భృగు
మునీంద్రుడుతన్నుదన్ని నవ్యాజంబునలక్ష్మి కొల్లాపురంబుచేరినది మొద
లుకొని తాననుభవించిన కష్టములును బద్మావతినిపరిణయంబాటకు బు
ట్టినహేతువులును గ్రమంబుగావిరించితో జెప్పుచున్న సమయంబున॥ సీ॥
శేషుండుకైలాసశిఖరికి జనిచంద్రశేఖరునకుశుభలేఖయిచ్చె।నజునకువ్రాసి
యున్నటువలె వ్రాసినపత్రికగిరిజయుఁ బ్రమథగణము। లరుదుగావినశి
వుండాజాబుజదివి గ్రక్కునలేచి పార్వతిగూడిదివ్య। భూషణాంబరములుపొ
లుపుమీరధరించివృషభవాహనమెక్కి వివిధవాద్యరవములుప్పొంగగాఫణి
రాజుతోడ। బ్రమథగణములుగొల్వశ్రీపన్నగాద్రి। జేరవచ్చుచునుండగాశివు
నిరాక। తెలిసి సమ్మోదమున వాసుదేవుడపుడు॥ వ॥ అందున్న బ్రహ్మ
తోడ లేచిశివుని కెదురుగాబోయినంజూచి నందివాహనంబుడిగ్గి రుద్రుం
డాచక్రికి నమస్కరించె నారాయణుండా రుద్రునాలింగనంబు చేసి యతని
దోడ్కొనివచ్చి మణిపీఠంబునందుంచి తనపూర్వవృత్తాంతంబు శంకరు
నకు జెప్పుచుండె నంతలో సకుటుంబులై తనుతమపరి వారంబుల తోడ
నిజవాహనారూఢులై యింద్రాదులువచ్చి శేషాద్రిజేరి హరి బ్రహ్మలకు
బ్రణామంబులు చేసిన వారువారి నాశీర్వదించిరంత శ్రీనివాసుండు శేష
గరుడులబిలిచి వారిచేత నింద్రాదులకు విహితాసనము లిప్పించి కుశలము
లడిగి తెలిసి తదనంతరంబున నందఱిం జూచి యిట్లనియె॥ సీ॥ ఇంద్రాదు
లార నేనీకలియుగమందు గగనాధి పతికన్యకను ముదమున। నఱిలేకపా
ణిగ్రహణము జేసెదనిది మీకెల్ల సమ్మతమేయటంచు। నడుగగా వారం
తటజ్ఞాతు నీక్షించి పరమసంతోష సంభరితు లగుచు। శ్రీకాంత యీ
పని మాకెల్ల సంతోషమని రటుమీద దేవాధి పతిని। గాంచి హరియిం
ద్ర యీవిశ్వకర్మతోడ। రమ్యనారాయణాఖ్య పురంబుజేరి। భూరిభవ
నము నిర్మింపు పొమ్మటన్న। విని యతడు పణిగిరిడిగ్గి వేగబోయి॥ వ॥ త
త్పట్టణ సమీపంబున విశ్వకర్మచేత మరకతమణి తోరణాలంకృతంబు
గాగ నొకమందిరంబు నిర్మాణంబు జేయించి యతనిందోడ్కొని క్రమ్మఱ
వేంకటాద్రికి వచ్చెనప్పుడు శ్రీనివాసుండు పిలువదగువారిని బిలుచుటకుష
ణ్ముఖునకు భృత్యుత్థానాదికృత్యంబు లాచరించుటకు మన్మథునకు స్వ
యంపాకంబుజేయుటకు పావకునకు జలాకర్షణంబు జేయుటకువరుణునకు

గంధకస్తూరీ ప్రముఖపరిమళంబుల దెచ్చుటకు గంధవాహునకు ధనదానం
బు జేయుటకు కుబేరునకు దీప ప్రకాశంబు నెఱపుటకు నిశాకరునకు గావలె
యు పాత్ర లొసంగుటకు వస్తువులకు బనులజాగ రూకతతో దండించి చే
యించుటకు దండధరునకును నియమించెనంత వసిష్ఠుండు వరాహస్వామి
సాన్నిధ్యంబున యజుశ్శాఖోక్త క్రమంబుగా గృహయజ్ఞప్రయత్నంబు
జేయించెనంత బద్మసంభవుండు వివాహ పీఠంబు నిర్మించి పార్వతీప్ర
ముఖసువాసినులచే సంపెంగ తైలంబును బసుపు మొదలయిన మంగళ
ద్రవ్యంబులును బంగారు పళ్లెరంబులతో దెప్పించి యందుంచి హరినిజూ
చి యభ్యంగనస్నానానంతరంబున బుణ్యాహవాచనంబును నిష్టదేవ
తాప్రార్థనంబులు మిగులదేవ ప్రతిష్టయు సాంగంబుగా జేయవలయుంగా
వున శీఘ్రంబుగా నభ్యంగనోత్సవంబునకు రావలయునని ప్రార్థించిన హ
రిచింతాక్రాంతుడై బ్రహ్మతో నిట్లనియె॥ క॥ వినుపద్మజ కొల్లాపుర।
మున శ్రీసతియున్న దిపుడు ముచ్చటగాన। వ్వన జాలయ రాకనునే।నొ
నరగ నభ్యంగనమున కొప్పందగునే॥ తే॥ కారణం బిట్టులుండగా గార్య
మెట్టుల। బుట్టనేటికి సిరియల్గి పోయెనిపుడు। ప్రీతితోనట్టి సఖిరాక షెం
డ్లియాడ। దగదుతనకంచు లక్ష్మినే తలచి తలచి॥ సీ॥ హరిరోదనము సే
యనబ్జ జాదులు భీతిచేతనుత్తరమును సెప్పలేక। చూచుచు నుండ
గా జోద్యమందుచు రుద్రు డిట్లని పలికెనో యిందిరేశ। శుభకాలమున
నింత శోకింపదగదిది లౌకికహాని యాలక్ష్మినిటకు। ప్రేమతో దోడ్తెనే పిలి
పింపవలెనది మాని సన్మంగ స్నానవేళ। దాత మీరీవిధమున రోదనము
జేయు। చున్న వారింప శక్తులిం దొరలుగలరె। మదిని ఖేదము విడిచియా
మంచి లగ్న। మందె గూర్చుండు పీఠమందంబుజాక్షు॥ క॥ అనిరుద్రుం
డాలగ్నం। బునహరి నభ్యంగనంబు ముఖ్యముగా జే। యను హెచ్చరికగ
లెమ్మన। విని శంభుని జూచి యాదివిష్ణుం డనియెన్॥ సీ॥ శంకర బాలభాష
లు పల్కకిక వారి వారి దుఃఖంబులు వారికెఱుక। పరులకు దెలియవా
బ్రహ్మ ప్రళయవేళ బరదేశినై వట పత్రమందు। నేనుండినపుడను నిత్యో
న పాయసి యగుచు నాహృదయ మందంటియున్న। కమలాలయనుగా
ల గతిచేత నెడబాసియే కాకినైయుంటి నిన్నినాళ్ళు। నాకపుడు మదినొ
క చింతలేక యుండె। నిపుడు నేను వివాహేచ్ఛనెనయుకతన। గలిగి రం
దఱు నిచట శ్రీకాంతయొకతె। తక్కు వైనందుచేత ఖేదంబువచ్చె॥ సీ॥
వనధిజ రాకవివాహంబు కాగూడదని యెవ్వరైననా కాప్తముగను। జె
ప్పుదురని యుంటి జెప్పరైరెవరిందుగావున మదికి దుఃఖంబుపుట్టె। నని
హరి పల్క బ్రహ్మాదులు భీతిల్లి ముకుళితపాణులై ముందు నిలిచి। పలికిరి

ట్లని రమా భామరాకయ పెండ్లియిప్పుడు సాగింప నొప్పుదనుచు। సిరిని బిలిపింపు డని మీకు జెప్పవెలచి। యుంటినుపచార మయ్యెనయ్యుదధి కన్య। రాకయుండిన బెండ్లిగారా దటంచు। మీకుదోచినదే మాకు మే లుతండి॥ చ॥ సిరినిపుడైన నిచ్చటికి శీఘ్రముగా దగబిల్వనంపుడం। దటికి ది సమ్మతంబనగ దామర సాతుకుసంతసిచి యిం। దిరనహి పర్వతంబు నకు దెప్పన నోట్కొనిరమ్ము పొమ్మెహా। సరసిజమి త్రయన్న విని చక్కగ మ్రొక్కిది వాకరుండనెన్॥ సీ॥ హరినేను గరవీర పురమునం దుండెడి శ్రీరమా సతికేమి సెప్పవలయు। నానీతు లెఱుగింపుడనవిని స ప్తసైంధవుని వీక్షించి మాధవుడు నవ్వి। జలజాప్తవినుముమాజలధికన్య కు మ్రొక్కి యబ్జనాభుడు వేంకటాద్రిమీద। నొదిగియశక్తుడై యున్నా డు నినుజూడ వాంఛింపు చున్నాడు వచ్చి మోముజూడుమని మీకు జె ప్పు చున్నాడటంచు। నిజముగా దెల్పుమిది విన్న నెనరుమీఱ। వచ్చు నిచ్చటి కారమావనిత యనుచు। జెప్పి హరియంపగా భానుడప్పు డరిగి॥ తే॥ శ్రీసతికిమ్రొక్కి పల్కె నోసింధుపుత్రి। చక్రియిప్పుడశక్తుడై జాలిబడు చు। శేషగిరిమీదనున్నాడుశీఘ్రముననను। నేడునినుజూడవలయునన్నాడు తల్లి॥ క॥ అనియాసూర్యుడువలుకగ। వినిభీతినిబొంది లక్ష్మివేగరథముపై। నొనరగ నెక్కిగగనపథ। మునజని శేషాద్రికరిగె మోహముమీఱన్॥ క॥ అ ప్పుడుబ్రహ్మేంద్రాదులు। తప్పకసిరివచ్చునెఱిగి తమవాద్యతతుల్। తె ప్పునమొరయించుచుజని। రొప్పుగసంతోష మెదలనురునైయుండన్॥సీ॥ శ్రీలక్ష్మిసీక్షించి చిరతరభక్తితో మ్రొక్కితోడ్కొనివచ్చిరక్కరగను। బా ర్వతీ భారతీప్రముఖాంగ నామణులాదిలక్ష్మికి మ్రొక్కియాదరించి। రపు డాదివిష్ణుండుకపటనాటక సూత్రకారుడులక్ష్మినిగారవించి। యటముహూ ర్తద్వయమాశ చేలక్ష్మి కంఠాలింగనముజేసి లాలనముగ। రత్నపీఠంబు మీదశ్రీరమణినుంచి। తానుగూర్చుండి సిరికిమోదంబుగలుగు। నట్టిమాట లుకొన్ని రహస్యముగను। జెప్పిమన్నించి పలికెమచ్చికనుమరల॥ క॥శ్రీవ నితామణినాపై। నీవలుగుట మొదలు గాను నేటిదనుకనిం। దే వేళనిన్నెతల చుచు। నీవల్మీకంబులోననిరవుగనుంటిన్॥ ఆ॥ గొల్లడిటకువచ్చి గొడ్డంట నడినెత్తి। పగలగొట్టినపుడు బాధపడుచు। నుంటినన్ను జాలనూరడించు చునిందు। వకుళకన్నతల్లి వలెనె బ్రోచె॥ సీ॥ పటుకుఠారము తలపైనా టునావేళ బాధకునేనోర్చిబ్రతికినట్టి। మహిమయేమనిన నీమంగళసూత్ర సన్మహిమయేకాని నామహిమగాదు। వనజాక్షి నీపతివ్రతనిష్ఠచేనేను జీవించితిన్నియు జెప్పనేల। నది యటులుండ నిమ్మాకాశనృపతి కన్యక నన్నుమోహించె నందువలన। బ్రేమమీఱగ నేదాని బెండ్లియాడ। మది

దలంచితి నీవుసమ్మతముగాను । బెండ్లియాడుమటన్న నే బెండ్లియాడు
వాడవలదన్న నే నావివాహ మొల్ల॥ మ॥ అని పద్మాక్షుఁడు పల్కఁగా మ
నములో నాశ్చర్యముం బొందుచుం । వనజాతాలయపల్కె నిట్లు హరి
యా వామాక్షి మోహంబుచే। నినుగామించెనొ దానినీవిపుడు మన్నింపం
బ్రయత్నంబులిం।దొనరం జేయుటఁజూచితిం మదిని నేనుప్పొంగితిం గేశవా॥
సీ॥ కమలాక్షమంగళకరముగా బసపు జాబింపుగా దొలుత బంపింపకీవు। మ్రొ
గినసక్తుఁడనని మోముజూచుటకు రమ్మని నన్ను బిలిపించి నందువలన । భీతి
ల్లి వచ్చితిఖ్యాతిగా నేవచ్చు రీతి రానైతి సంప్రీతి మెఱయ । నేఁదొల్తవచ్చినవి
పెండ్లికిపుడొప్పన నిసంశయించితివందుచేత । నింతపని చేసితివిమంచి దీవి
వాహ । కారణముచేతనైన నిక్కడికినన్ను । నేఁడుపిలిపించి నందున నీము
ఖంబు। గంటినాకింతయే చాలుగమలనాభ॥ గీ॥ వసుధపై నీవుపెండ్లికా
వలయుననిన। నేనువిఘ్నము సేతునే నీకు నేను । గలిగియును లేకయుండెడి
కారణంబు। చేవివాహేచ్ఛపుట్టె నీచిత్తమందు॥ క॥ నాకిదిసమ్మతమైనది । నీ
కీసంశయమువలదు నెమ్మదిగానిం । దాకన్యను జేపట్టుము। జోకగనీసుఖమె
నాకుసుఖము మహాత్మా॥ క॥ నీవు మనుష్యునికైవడి । గా వెంకటశైలమె
క్కి గాయపడి నని । న్నివకుళవచ్చిప్రోవగ । జీవించితి వింతెచాలుజిన్మ
యరూపా॥ ఉ॥ నాకిపుడేమిగావలయు నాడుభృగుండెడబాపె నిన్నున
న్నోకమలాక్షనే నచటనుండిన నీమహనీయరూపమే । జోకగభావమందుని
చి చూచిసుఖించెదగాని వేడ్కఁగా । నాకలికిం న్వరించి ముఖులందఱుమె
చ్చగ బెండ్లియాడవే॥ క॥ అనికన్నీరొల్కఁగసిరి । తనశిరమఱవాంచియున్న
దామరసాక్షుం।డను మానించుచులక్ష్మి।కనుఁగొనియిట్లనియె జాలగనికర
మొప్పన్॥ సీ॥ సిరనీవుమదిలోన జింతింపవలదు నీకన్న నాకాప్తులెందైన లే
రు।నీవె నాదైవంబు నీవె నా ప్రాణంబు నీవె నాభాగ్యంబు నిశ్చయముగ। గా
వునా పెండ్లినీవిప్పుడొప్పి చేసినమేలె చేయకుండినను మేలె । నాకేమిగా
వలె లోకవిడంబ నార్థంబుగా నీప్రయత్నంబు నేడు । కాలకర్మానుగుణముగా
గల్గెననుచు।దానుగన్నీరునించిన ధవునిజూచి । పల్కెనిటుసిరి దేవయీప్ర
మరంబు। నీకుదగదని చాలమన్నించి నగుచు॥ సీ॥ హరినాదరించి బ్రహ్మా
దులనీక్షించి యిదియేమి యాలస్య మెల్లవారు । లేచి మీమీపనుల్ సూ
చి చేయుచు చక్రికభ్యంగనము జేయుఁడనుచులక్ష్మి । యానతియ్యగనందఱు
న్నిపను ల్చేసి రపుడబ్జభవుండు ఖగాదివిభుని।బన్నగేంద్రా నిలప్రముఖుల బం
పించి పుణ్యతీర్థములనాభుజగగిరికి । గలశములనిండ దెప్పించిక్రమముగా
ను। గుంకుమముగల్పినాల్గుదిక్కులను బెట్టి । సూత్రములువాని చుట్టునుజు
ట్టుడనుచు । నతడుసెప్పగ గిరిజాముఖాంగనలును॥ తే॥ మంగళస్నానము

లుచేసిరంగుమీఱ । వస్త్రభూషణములుదాల్చి వచ్చిదీప । కలశముల్మంగ
ళారతుల్కర్పూరములందు । బట్టికల్యాణములు వేడ్కబాడిరందు॥ ఉ॥ పాడు
చుదొల్తబద్మజుడుపల్కిన రీతిగనాల్గుదిక్కులన్ । బోడిమికుంకుమం బిడిన
పుణ్యశుభోదక కుంభముల్తగన్ । వేడుకమీరనుంచి సరవిన్ వరసూత్ర
ముజుట్టిమైదువల్ । జోడుగదానిమధ్యమున శోభితసన్మణిపీఠముంచగన్॥
ఆ॥ అజుడు పెండ్లిపీఠమందు గూర్చుండుడో । స్వామియనగ జక్రిజలధికన్య
దిక్కు చూడవాసు దేవునిమోమెత్తి । చూడకాదిలక్ష్మి చోద్యముగను॥
సీ॥ చెక్కిటజెయిచేర్చి శిరమటువాంచి పదాంగుష్ఠమున సున్నలవనిమీద।
వ్రాయుచు మదిజింతజేయుచు నెమ్మోముచిన్న జేసికొనియందున్న వేడ్క
లైనజూడక యుండినట్టి రమాసతి దాజూచిహరియిట్లుదలచె మదిని । నే
బెండ్లియాడుటకీ పద్మముఖిచింత జేయుచున్నది యేమి సేతు నింక। నను
చుయోచించి వేసటనను సరించి । వారకన్నుల నారమావనిత మో
ము । సారెసారెకు జూచుచు జాలినొంది । పద్మసంభవునీక్షించి ప
లికెజక్రి॥ సీ॥ ధాతయీపెండ్లి యత్నమునకు నేనొప్పినందుచే దప్పునా
యందుగలిగె । గానసాకీపెండ్లి గావలసినదేని నేనొల్లమీరెల్ల నేడుకద
లి । పోయిమీమీ పురంబులు చేరుడెప్పటి పగిదివల్మీక గర్భంబునందె।
నిలిచెదదల్లిదండ్రులు లేనిపరదేశివానికి బెండ్లిగావలెనెయిపుడు। దిక్కులకు
నేనుదిక్కైదిక్కులేక । నొంటిగానిల్చి తేఱకామింటనుండి । మంటిపై
వ్రాలిపొట్టకై మానవులను । జేరియాచించి బ్రతుకుటే సిద్ధమయ్యె॥ తే॥ ఇ
ట్టినాకువివాహేచ్ఛపుట్టదగదు । గనుకనభ్యంజనము నొల్లననినబ్రహ్మ ।
దేవుడందరు శ్రీస్వామిదిక్కుజూచి । పాదపద్మములకు మ్రొక్కిపలికిరి
ట్లు॥ వ॥ దేవామహాలక్ష్మి మీకు నిత్యానందదాయినియైన పత్నియైయుం
డి నేనుమన్మథుండును బుత్రులమై తక్కినరుద్రపవనేంద్రాదులు మనుమ
లైమునిమనుమలై వృద్ధిబొందుచుండగా నందఱికి నాధార భూతమైకూ
టస్థబ్రహ్మంబైన మీకువిచారంబేలయని సాభిప్రాయంబుగాబల్కిన విని
హరియిట్లనియె॥ సీ॥ దయునునాచేతను దాంబూలమిపుడిచ్చి నన్నుదీవించు
మానందమెసగ । నాకిప్పుడభ్యంజనంబు జేసెడివార లెవరంచు జింతతో
నెనసికనుల। నీరునింపగహరి నెమ్మోముసిరిసన్న జూచుండగదనుమ్మిచూ
లి సంజ్ఞ । జేసిరమ్మనగ నాశ్రీలక్ష్మి హరిచెంత జేరినవ్వుచు రెండుచేతు
లపుడు । పట్టిలేపగదనమది బుట్టియున్న। చింతవిడిచి మునమున వసిష్ఠము
ఖ్య। మును లకప్పుడు మ్రొక్కిదీవనలనంది। యునరపీఠంబుమీదగూర్చుం
డెశౌరి॥ వ॥ అప్పు డరుంధతీ ప్రముఖసువాసినులు శోభనంబులు పాడు
చుండగా మంగళవాద్యంబులు మ్రోయుచుండగా నమ్మహాలక్ష్మింతోడ

పార్వతియుసావిత్రియుసరస్వతియు కుంకుమోదకంబులుపైఁడిపళ్లెరంబుల నించి పాటలుపాడుచు నారతులిచ్చిరంతరమాదేవి మంగళాక్షతంబులుల లాటశీర్షంబులందుంచి కర్పూరతాంబూలంబా స్వామిచేతికందిచ్చిదీర్ఘనీల కుంతలంబులచిక్కు విడిపించి పైఁడిగిన్నలోనిసంపెంగతైలంబు జేరనిండఁబట్టి కొసిదీర్ఘాయుష్మంతుడవై యష్టపుత్రవంతుడవై చతుర్దశ భువనంబులకు నేక ఛత్రాధీశ్వరుండవై వృద్ధిఁబొందు మోమహాస్వామియని యాశీర్వదించియ భ్యంగనంబు జేసికర్పూరకస్తూరిహరిద్రాచూర్ణంబుపునుగుతైలంబులోఁగలిపి నలుగుపెట్టిపరిశుద్ధోదకంబులన భిషేకంబు జేసికృతార్థురాలనైతినని సిరిమ నంబున సంతసించెనంత పార్వతీ సావిత్రి గాయిత్రిసరస్వతి యానలుగురు నాలుగు కలశంబులకుంకుమోద కాభిషేకంబు జేసి లక్ష్మితోడ దత్తీర్థం బుపుడిసిళ్లఁబట్టి శ్రీరామ రక్షయనిదీర్ఘాయుష్మంతుడవుగమ్మనిశిరంబునకు చుట్టిచల్లిరంత॥ సీ॥ సావిత్రిదెచ్చివస్త్రములియ్యగాసిరితడియొత్తిమస్తకస్థల మునివిరి । చక్కఁ గాజిగికురుల్ చిక్కుమెల్లగఁబట్టివిడిపించిజాలుగాముడియొ నర్చె । హరిదళముల దాల్చెనటగౌరియొసగగనంబుధికన్యధూపంబునిచ్చె శ్రీసరస్వతి దెచ్చిచేతికియ్యఁగ లక్ష్మివరరత్నభూషణావళుల దొడిగె । ము కురముటు మీఁదగా యత్రి మొనసిచూపె । రతియుశచియును వరచా మరలువీవ । బవనుసతి ఛత్రమొప్పఁగా బట్టినిలచె । గంగపాదుకలొసఁగ శ్రీకాంతుడపుడు ॥ తే॥ పాదుకలు మెట్టికొనుచు నాబ్రహ్మసభకు । నడ చుచునువచ్చి సింహాసనంబుమీఁద।నమరఁగూర్చుండిమునిముఖ్యులలరిచూడ సొగసుగావిడెముధరించుచుండిచక్రి॥ వ॥ బ్రహ్మనుజూచిలక్ష్మికభ్యంగనమం గళస్నానంబును జేయింపుమనిన బద్మజుండుపోయి పార్వతీభారతీప్రముఖ సువాసినుల బిలచి మజ్జనని కభ్యంగనంబు జేయుండని నియమించి సిరినిపీ ఠంబుపైఁగూర్చుండు మనిన శిరంబు వంచివిరించితోరమాదేవియిట్లనియె॥ క॥ వనరుహభవనేనభ్యం। గనమొల్లను స్నానమిపుడు గ్రక్కున జేతుఁ । అనిసిరిపల్కిన వాక్యము।వినిసంశయ మొంది యాదివిష్ణుండనియె॥ సీ॥ అబ్ధి జనీవిప్పు డభ్యంగనస్నాన మొప్పకుండిన వివాహోత్సవంబు। నేనొల్లన ని పల్కఁగానవ్వికొని రమాసతి యూరకుండగా శైలకన్య। మొదలుగా నం దున్నముత్తైదువలు సిరకభ్యంగనము జేసియపుడు పసుపు। నలుగొప్ప బె ట్టిస్నానము వేగచేయించి తడియొత్తినవ వస్త్రతతులనొసగి।కురులుకీల్ గం టుగా వేసివిరిసరములు। చుట్టికుంకుమతిలకంబు బెట్టినుదుట । గనులగా టుకదీర్చి శ్రీగంధమలది । వరుసగారత్న భూషణావళులు దొడిగి ॥ తే॥ పెండ్లిపాటలు పాడిసంప్రీతిసిరిని । దోడుకొని వచ్చియాచక్రిజోడుగాను । వారుగూర్చుండ బెట్టిరవ్వల ఫణీంద్ర । శైలపతియాసతినిజూచిసంధ్యావా

ర్చె॥ వ॥ ఆసమయంబున వసిష్ఠాది మహామునులును సనకాదియోగివరు
లును నింద్రాది దేవతలును గరుడగంధర్వాదు లానందంబున లక్ష్మీనారా
యణులనీక్షించుచుండగా నిదిశుభలగ్నంబంచునందున్న జ్యోతిర్విదులు సె
ప్పగావిని వకుళమాలిక పసుపుకుంకుమ మొదలైన మంగళద్రవ్యంబులు
పైడి పళ్లెరంబుతోదెచ్చి స్వామిసన్నిధియందుంచి హరికలంకారంబు జే
యుమని సిరికిజెప్పినవిని లేచి నిజేశ్వరునకు శృంగారంబుజేసె నంత కుబే
రుండు దివ్యరత్న భూషణాంబర ములుదెచ్చి లక్ష్మికందిచ్చె నప్పుడా భూ
షణాబరంబులా స్వామికలంకరించి రమాదేవి సంతసించెనంత వసిష్ఠకస్య
పాత్రి ప్రముఖమహామునులకు జక్రిలోక విడంబనార్థముగా నమస్కరించె
నా సమయంబున వసిష్ఠుండు॥ తే॥ ముత్యములజతురశ్రముగ వివాహ। వేది
కను వేగరచియించి వేంకటాద్రి। పతినిసతినుంచితత్పురోభాగమందు। హో
మకుండమునిర్మించినేమముగను॥ వ॥ యజుశ్శాఖానుక్రమంబుగా వైఖానస
సూత్రోక్తంబుగా బుణ్యాహవాచనాది శుభకృత్యంబు లాచరించి సభా
తాంబూలంబులిప్పించి తదనంతరంబా హరినిజూచి కులదేవతయెవ్వరనియ
డిగిన బాండవులకు మాకుశమీవృక్షంబేకుల దేవతయని చక్రివచింపగా
వినివసిష్ఠుండు శమీవృక్షంబెందుండు ననియడిగిన గుమారధారాతీర్థ స
మీపంబునందున్నదియని కుంభ సంభవుండుచెప్పె నంతమంగళ వాద్యం
బులు మొరయబ్రాహ్మణులతోడ నరిగి హరిశమీవృక్షంబునకు బ్రదక్షి
ణనమస్కారంబులు చేసిపూజించి నిర్విఘ్నంబుగా వివాహము నెఱవేర్పు
మని ప్రార్థించి తద్వృక్ష శాఖనుగ్రహించి శిరసావహించికొని వచ్చి
యీకులదేవత నెచ్చటనుంచవలయు నని యోజింపగా వినినారదుండు వ
రాహస్వామి సాన్నిధ్యంబు నందుంచవచ్చుననినసమ్మతించివచ్చి కిటిదేవా
ను మతంబున దత్సాన్నిధ్యమందు ముక్తాతండులంబులమీద గులదేవత
ననిల్పి తదుపరినూతన వస్త్రయుగ్మంబునుంచి పూజించి యందఖండ దీ
పంబు బెట్టించిమ్రొక్కి క్రోధస్వామి నీక్షించియిట్లనియె॥ సీ॥ శ్రీవరాహ
స్వామినీవు భూదేవిరావలయు నిప్పుడునా వివాహమునకు। బైనమైరమ్మ
న్న బలికెనిట్లనిపోత్రి క్షేత్రమంతయు ఫలించినదిగనుక । రాదీరదిపుడు
నిర్ణయముగ నామాట వకుళయ బెండ్లికి వచ్చుబొమ్మ।మనవుడు నటులైన
నానతియ్యుడు పోయివచ్చెదమని పల్కిమచ్చికలర । నవలబ్రహ్మనుజూచి
ప్రయాణభేరి। నీవువేయింపుమని పల్కగావిరించి । నేడుసంతర్పణం
బికనిలిచిచేసి। పోవుదము తాపిపుడుచాల ప్రొద్దుపోయె॥ వ॥ అనిపలికిన
యజుంజూచి హరియిట్లనియె॥ ఆ॥ దేశకాలములను దెలియకీయత్నంబు।
నీవుసేయబూని నావుతలచి। నపుడుదొరకునే పదార్థంబులద్రిపై। ననిన

జక్రికిట్టులనియె శివుడు॥ క॥ చేసినయత్నము పూర్తిగ। చేసిగదామేలు
నిపుడు చెందపలయునే। డీసంతర్పణమును జేయక। గాసిలియిపుడటకు
పోవగారాదుహరీ॥ చ॥ అని యభవుండునుందనకు నప్పుడుసెప్పగ నవ్వి
కొంచున। వ్వనజదళాక్షు డర్థమును వాగ్ధిజనందడుగంగ బూని సి। గ్గున
మగవాడనై సతినిగోరి వరాలిపుడిమ్ము నాకటం। చును బతిమాలనే
నని శూలిని బ్రహ్మనుగూడి గ్రక్కునన్॥ వ॥ వల్మీక సమీపంబున
బార్వతీ భారతీ ప్రముఖ సువాసినుల మధ్యంబున గూర్చుండియున్నల
క్ష్మితో జెప్పకపోయి పుష్కరిణీ తీరవరాశ్వత్థవృక్ష ఛాయయందు గూ
ర్చుండి కుబేరుని దగ్గఱికిబిలిచి యేకాంతంబుగా హరియిట్లనియె॥ సీ॥
ధనదావివాహ యత్నము నేను జేసితి విత్తంబు లేదిప్పు డబ్ధిసుతను।
నా పెండ్లికిపుడు ధనంబిమ్మనుటకు నాకు సంకోశమైనది రయమున।
నీవు ద్రవ్యమునిమ్ము నేవడిపత్రంబు వ్రాసియిచ్చెదను సంవత్సరమున।
కొకమాటువడ్డినీ కొప్పించుచుండుదు గలిగియుగాంతమున నిష్కర్షగా
ను। మొదలుదీర్చెద నీమాటమోసమనుచు। దలచి వేదనపలదు విధా
తనొకని।శంభు నొకనిలిఖిత మందుసాక్షి జేసి। వ్రాసియిచ్చెదనన ధననాథు
డపుడు॥ సీ॥ పలికెనిట్లనుచునో పద్మాక్షమీకృప నిపుడుగల్గిన ద్రవ్య
మెంతయైన। నిచ్చెదగాక వడ్డియ్యనేటికివివాహంబైనజాలు మాకందటి
కిని। యిదిమహాసంతోష మింతకన్నను లాభమెక్కు వేమసిన లక్ష్మీశ్వరుం
డు। నవ్వియిట్లనియెదానము నేనుగొనుటకుదగదని వడ్డిపత్రంబు వ్రాసి।
ప్రేమతో నిందొసంగెద రామకొంకి। నిష్కములు శీఘ్రముగనిమ్ము నిర్మ
లాత్మ। యనిపొసగజెప్పి శ్రీవేంకటాద్రి విభుడు। పద్మజునిశంభునిక్షించి
పలికెనిట్లు॥ చ॥ అజహరులారయీ కలియుగాంతము వచ్చెడుదాకధన్య
మా। భుజగగిరీంద్ర మందుబరిపూర్ణ విలాసము లద్భుతంబుగా। సుజ
నులకెల్ల మెచ్చుగనుజూపి వరంబులనిచ్చి విత్తమున్। నిజముగసంగ్రహిం
చియుటనేను గుభేరునకప్పుదీర్చెదన్॥ తే॥ మీరు సాకిరులనిపల్కి భూరిక
నక। పత్రికప్పుడుదెప్పించి పట్టులమర। దడయకప్పుడెవ్రాసెవిధాతచేతి।
కిచ్చివచియింపు మననజుం డిట్లనదివె॥ సీ॥ శ్రీకరలీల స్వస్తిశ్రీజ యా
భ్యుదయాష్టావళ ద్వాపరాంతమందు। గల కలినాది వేంకటనాయకు
డు ధనపతికొసంగిన వడ్డిపత్రమెట్లు। యనినను నావి వాహమునకు నీచేత
నప్పుగాగైకొని నట్టిరామ। టెంకిలన్క్రములు కోటియు జతుర్ధశలక్ష
లందుకు వడ్డిసహస్రనిష్క। ములనుబ్రతి వత్సరముదీర్చి మొనయుకలి
యు। గాంతమున నేనుగై కొనినంతవిత్త। మియ్యగల వారమజరు ద్రు
లిందుకిపుడు। సాక్షులశ్వత్థుడిచ్చుటసాక్షినిజము॥ తే॥ ఇట్లని మాసమ్మ

తిని వ్రాసియిచ్చినట్టి॥ స్వకరలిఖితంబుననుముచ్చటగ వ్రాసి। నట్టిపత్రంబు పద్మజుండమరజదివి। శంకరుని చేతికియ్యగా సమ్మతించి॥ వ॥ అప్పుడాలిఖితంబాశివుండుగైకొని కుబేరునికిచ్చెనప్పుడా ధనేశ్వరుండు పత్రంబుచేకొనిహరికానిష్కంబులెంచియిచ్చినగ్రహించియాహరిక్రమ్మఱగుబేరునివశంబుగానాధనంబునుంచి కావలయుపదార్థంబుల దెప్పింపుమనియానతిచ్చి నధనదుండాహరియాజ్ఞధారియైమంగళసూత్రాదిభూషణాంబరంబునుదండులాదిపదార్థంబులను దెప్పించెనంత స్వామివారుపావకునితోద్వరగాబాకప్రయత్నంబు జేయుమని చెప్పుటకు షణ్ముఖునంపింపగానరిగి పాకంబు జేయుమని హరిసీతో జెప్పుమనెననవిని పాత్రలు లేకనెట్లుసేతునని హుతాశనుండుపల్కగా మరలంజనిసేనాని శ్రీనివాసునకా వార్తవిన్నవింపగానాలకించి బ్రహ్మాదులు వినుచుండగా నవ్వి నారాయణుం డిట్లనియె॥ సీ॥ పరదేశిపెండ్లికి బాత్రలెందుండు నిందమరు పుష్కరిణి దివ్యాన్నపాత్ర। పరిశోభితంబైన పాపవినాశమే శుద్ధోదకమునకు శుద్ధపాత్ర। యాకాశగంగయ యన్నపు పాత్రగా గర్భంబ పరమాన్నగుప్తపాత్ర। గురుతరంబైన తుంబురుకోన చిత్రాన్నపాత్ర శాకములనేర్పరచిసేయ। బాత్రఘనదేవతీర్థంబుభక్ష్యములను।గోరికావింప బాత్రకుమారధార।పచ్చడులుసేయునగు పాత్రపాండుతీర్థ। మనుచు జెప్పుము హవ్యవాహనునకనఘ॥ వ॥ అనిహరివినోదంబుగాబలికినవిని యాసామికి నమస్కరించి యష్టవసువు లక్షయపాత్రల దెప్పించి యొసంగి రందగ్నిదేవుండు శీఘ్రంబుగా బాకంబుజేసి భోజనప్రయత్నంబు జేయింపుడనినవిని హరికార్తికేయునిబిలిచి బ్రాహ్మణభోజనంబునకు బాండవతీర్థంబు మొదలుకొని శ్రీశైలపర్యంతంబు జదరంబుజేయించి సభవారితో స్నానంబులుచేయుండని చెప్పుమనగ నతడాపనుబుజేసె నప్పుడమ్మునిముఖ్యులు స్నాన సంధ్యాది సత్కృత్యంబులాచరించిపఙ్క్తులుసాగి కూర్చుండగా పద్మాక్షుండజుంబిల్చి యనర్పితాన్నంబుబ్రాహ్మణ యోగ్యంబుగాదు కావుననహోబిలనారసింహులకు దేవతార్పణంజేయు మనగావినిపద్మజుండు శుచీభూతుడై నృసింహాకుల దేవునర్చించి ధూపదీపనైవేద్యంబులిచ్చి వైశ్వదేవ బలిహరణాదినిత్యకర్మంబు లాచరించె నప్పుడు శ్రీనివాసుడాజ్ఞాపింపగా బవనుండుకదలి పర్ణంబులుంచి పాత్రాభిఘారంబు జేసివచ్చె నాసమయంబునందు గమలజుండేకోవిష్ణుర్మ మద్భూతమ్మనుమంత్రంబునంజేసె దేవతలు కొందరు ధూపారాత్రికలుచేకొని పఙ్క్తిప్రదక్షిణంబు జేసివచ్చి రాసమయంబునందు గమలజుండేకోవిష్ణుర్మమద్భూతమ్మను మంత్రంబు సాంగంబుగాజెప్పి శుభాక్షతోదకంబు విడిచి ర్వంబును శ్రీకృష్ణార్పణమస్తని యందఱికాపోశనంబు లి

య్యగాబుచ్చికొని గోవిందనామభజనంబు జేయుచువరాహ భూదేవలతోడనందరుభుజించుచున్న వరుణ దేవుండందఱికి నుదకంబొసంగె నున్మథుండు నాంజనేయుండుపఙ్క్తుల వెంబడిదిరుగుచు బ్రొద్దుపోయినది సావకాశముగాభోజనంబులుచేయుండని యుపచారంబులు చెప్పుచుండగా సభవారుభక్ష్యభోజ్యలేహ్య చోష్యపానీయంబులచే బరితృప్తిం బొందియజునిచేనుత్తరాపోశనంబులు దీసికొనిలేచి వదనపాణిపాద ప్రక్షాళనాచమనంబులుచేసివచ్చి తమస్థలంబునందుగూర్చుండి నారు వేదఘోషణంబుచేయ శ్రీనివాసుండు సభా తాంబూలంబు లిప్పించి ద్విజులకు రెండేసి నిష్కంబులును ఋషుల కొక్కొక్క నిష్కంబు చొప్పున దక్షిణలిప్పించి సభానమస్కారంబులుచేసి యాశీర్వాద మంత్రాక్షతంబులుగైకొని పుత్రకళత్రాది భ్రాతృలతోడ శిరసావహించెనంత హరిహరబ్రహ్మేంద్రాదులు నిజభార్యాసమేతులై భుజించినపిమ్మటదక్కిన హవ్యవాహన వనచరప్రముఖులారగించి లేచిరి బర్జన్యుండు పాకపాత్రలు పరిశుద్ధంబును చేసెనంత॥ తే॥ హరివివాహంబునకు వచ్చినట్టిబ్రహ్మ। ముఖ్యులందరు భోజనములనుజేసి । రింకనిచ్చట నాకుండనేమిమేరు । భూధరంబున నాదిక్కుపోయివత్తు॥ తే॥ చంద్రసీవింక వేంకటాచలముమీద సకలసురముని ముఖ్యులుసంతసించు। కొఱకువెన్నెల నంతటనెఱపుమనుచు । జెప్పిచనినట్ల నపరాద్రి జేరెనినుడు॥ సీ॥ అబ్జబాంధవు డిట్లుపరాబ్ధి గ్రుంకగా నపుడహిగిరినుండు నట్టిలక్ష్మి । మొదలైనసతులను ముచ్చటగాజూడ హేమాంబరము ధరియించిపద్మ । రాగభూషణములు రక్తచందనమును బసపుకుంకుముదాల్చి భక్తిమెఱయ। బశ్చిమాశాకాంత పైనమైవచ్చెనో యనగసంధ్యారాగమతిశయిల్లె। నందుచేబార్వతీ ప్రముఖాబ్జముఖుల । మణులభూషణముల శక్తిమాములుమించె। బక్షులారత్నములుసూచి ఫలములనుచు । మెక్కుటకుబొంచుగతిజెట్లమీదవ్రాలె॥ తే॥ విపులనీలాంబరము నిండవిమలమౌక్తికములగుమిగూర్చి శేషనగంబుపైన। గట్టినటువంటి చందురాకరణిదారకలనుగూడినభంబు ప్రకాశమొసగె॥ సీ॥ జలధినుప్పొంగించి జలరుహాపంక్తులసీక్షించి నోళ్లమూయించిమించి। కుముదసంతతులను బ్రమదంబునొందించితొలగక శుభ్రకాంతులను బెంచి। విరహులనలయించి విరసముల్గలిగించి చక్రవాకుర వేడ్క లాక్రమించి। చీకటిగబళించి చిగురుటాకులదీపములమాడ్కివెలిగించి మొనసిమించి। చలువచీరలు సానుదేశములనిండ । బఱచినటువలెవెన్నెల బ్రబలజేసి । పూర్వదిక్సతి సీక్షింపమొనయుకరణి। సరగవచ్చుచునుండెనా చంద్రుడంత॥ చ॥ వనగిరిసాను శృంగముల వారిజసంభవుడాదిగామహా । మునులుశివుండు దిక్పతులు మోహములుప్పతి

లంగ గామినీ! జనముల గూడియుండగను శౌరిమహానియమంబుతో సిరిఁ।
నెనరునవక్షమందిడక నేలరచించు జిగుళ్ళపాన్పులఁ॥ ఆ॥ వకుళవద్దలక్ష్మి
వల్మీకవివరంబు। చెంతశౌరియునువసియించియొక్క। రొకరినంటకుండుటుం
టరాజుగనికలం। కమునుబొంది రోషకలితుడగుచు॥ క॥ నాతోడబుట్టి వెలసి
న। శ్రీతరుణీ మణిని వేఱుజేసినదనుజా। రాతికినేనుపకారము। జేతునె
నేననుచు జాలసిడిముడిపడుచుఁ॥ తే॥ చెలువమలరగ హరియురస్థలినిభోగ।
లీలవెలయగమును పవ్వళించులక్ష్మి। రాగవిరహాతయై కొండరాతిమీద।
నిపుడుశయనించియున్నదే నెట్లసూతు॥ సీ॥ చెనటియై భృగుడు చేసినపనిక
లిగికొల్లాపురమందున్న లక్ష్మినిటకు। మొదలబిల్వంపక మోసంబుజే
సిమాయలువన్నితనకు దలంటువేళ। బిలిపించెనికనైన ప్రేమమీరగను
రమదుంచుకొని యుండు నంచునమ్మి। వచ్చితిశ్రీరమావనితనాహరి తేఱం
జేసిన విధముజూచితిని గనులు। చల్లనాయెను నేను నాచలముదీఱ।
నేమిజేయుదునని క్రోధ మినుమడింప। శ్రీశునేత్రాబ్జముల నిండ శీతకిర
ణ। తతినిపుడు సొన్పి వఃకుళితములను జేసి॥ తే॥ రెండుజాములదనుకనీరీతి
నేను। మఱచియెయనింపు మోహభావమఱదియనుచు। హెచ్చిహిమకిరణు
డు శాపమిచ్చెనేమొ। యనగహరినిద్ర జెందుదేహంబుమఱచి॥ తే॥ తలిరు
బోనువుపై విశ్వతైజసులను। గడచిప్రాజ్ఞునిదాటి యఖండతుర్య।మందమ
ర బొందితదతీత మైన సుఖము। ననుభవించుచునుండె బద్మాక్షుడచట॥
క॥ అంతటనరులపై శ్రీ। కాంతామణినిదుర జెందగా జూచిమహా। వింతఁ
వెలవెలబోవుచు। సంతోషము లేక చిక్కసగమగు పగిదిఁ॥ సీ॥ శుక్లపక్ష
మినాటి సోము డాలోచించితల చెనిట్లనిర మాతరుణికిచట। నలుకదీరిచి
వక్షమందుంచి కొనియుండకఱజేసి గగనరాజేంద్రసుతను। దా బెండ్లియాడ
నుదయలేక విష్ణుండు దలచెగదా యీవిధాతముఖులు। నిపుడైననురము
నందిందిరనిడికొని యేలుచుండు వివాహమేలయనక। పెద్దలై శౌరికికమీ
ద బెండ్లిచేయ। వచ్చినందున వీరిని వనములందు। జీకటినిద్రోసి పోయె
దగాక యనిన। చందమునబశ్చిమాబ్ధికి చనుచునుండె॥ చ॥ తమవిటుడ
ల్లిపోవగను దారలువిన్న దనంబు నొందుచుఁ। క్రమముగ జంద్రుతోడు
తనుగ్రక్కున బోవుచునుండెనప్పుడే। కుముదము లాప్తుడేగుటకుగ్రూరుడు
వచ్చుట కాత్రిబొందుచుఁ। భ్రమయుచు నప్పులందోదుగు భావముగా
ముకుళించె ఖిన్నతఁ॥ ఉ॥ అప్పుడు చంద్రుడే గేనికనంబుజ మిత్రుడుజాము
రేయికే। తెప్పునవచ్చువాడు చనుదేరకమున్న విరించి ముఖ్యులఁ। ద
ప్పక చూడవచ్చునని దామసి నల్లని చీరగట్టితా। నొప్పుచుబోయెనోయ
నగనుబ్బుచు జీజటికిగ్రమ్మె కొండపై॥ సీ॥ ఆచీకటిని జూచియద్రినూపము

దాల్చు పన్నగేంద్రుడు నిజఫణము లెత్తి । హరిహర బ్రహ్మాదులంగనలను
గూడి యుండగా జీకటిందుండదగునె । యనిఫణామణుల మహాప్రకాశము
జేసి నాడో కో యను రీతినగముమీద । జ్యోతిర్లతావళుల్ చూపట్టెహే
మాద్రికీ వలదట్టమై హెచ్చియున్న । చీకటిని పట్టికొట్టెదగాక యనుచు ।
నలుకదీపింపనరు దెంచెనని నరీతి । మిహిరుడు దయగిరీంద్ర సమీపమున
కు । వచ్చుచుండగ దిమిరంబు లెచ్చు వెలిచె॥ చ॥ జలరుహసంభ వాదు
లను సంతసముప్ప తిలంగ వేంకటా । చలమున జూచుచుంటి నిదె సప్త
తురంగుడు వచ్చు నిచ్చటన్ । నిలిచిన గొట్టునో యనుచు నీచతమంబపరా
ద్రి దారి నే। కలగుచు బోయెనన్నటుల గాంచనశైలముగాటు కొందరన్॥
గీ॥ హరని లేపి పెండ్లికంపించుటకు శుభ్ర। వస్త్రమును ధరించి వసుధపైకి ।
ప్రజ్ఞకాబ్జనేత్ర భక్తితో వచ్చెనో । యనగ దూర్పు వెల్ల నాయెనంత॥ గీ॥
పసపుసున్నము బంగారు పళ్ళెమందు । జలముతో గల్పి వేంకటేశ్వరున
కార । తిచ్చుటకు ఛాయయను భామ దెచ్చెననగ । నమరతూర్పున నరు
ణోదయంబునయ్యె॥ క॥ మక్కువతో హరి పెండ్లికి । గ్రక్కున బోవలయు
ననెడి కైవడినపుడే । చక్కని యుదయాచలమం । దెక్కె దివాకరుడు వేం
కటేశ్వరు మోమున్॥ తే॥ జూడగా జంద్రకిరణ విస్ఫూర్తిచేత । నచట నా
రేయి ముకుళించి నట్టి నేత్ర । జలజములు సూర్యకిరణ సంస్పర్శవలన । వి
కసితములయ్యె ననినట్లు విష్ణుడపుడు॥ తే॥ కనులు దెఱచి వినోదియైక మల
ముఖము । జూచి సంతోషచిత్తుడై లేచి యచట । నలినజాభవముఖుల
పైనములు చేయ । మనగ వినిచని విహగేంద్రుడట్లజేసె॥ గీ॥ హెచ్చిమిత్రు
డు తముప్రోవవచ్చినపుడు । శత్రుడగు చంద్రుడలుకతో జనుటవలన। న
వ్వెనో యను విధముగా నళినసమితి । సరసమొప్ప గవికసింప సాగెనంత॥
క॥ సరసిజములలో రాత్రిరి । చెఱలుండి నయళులు లేచి జిరజిరమనియ ।
త్తఱిగమలంబుల బాదలెడి । కరణి సఝంకృతుల నర్చికదియుచునుండెన్॥
తే॥ కలకలధ్వను లెసగ ఖగంబులెల్ల । శౌరి పెండ్లికి రమ్మంచు సరభసము
గ । బొసగ దిగ్దేవతల బిల్వబోయినటుల । జెలగి కూయుచు సకలదిక్కు
లకు చనియె॥ ఉ॥ పీతనిజ ప్రకాశమును బెంచుచు వృక్షలతాద్రిదిక్పర ।
ప్రాతము లందుగప్పుచును వచ్చు దివాకరు జూచి లేచియా । ధాతృముఖా
మ రార్యులను దాపసులున్ హరియున్ శివుండు విఖ్యాతిగనుండు పుష్క
రిణి గట్టున జేరి యథాక్రమంబుగన్॥ శా॥ స్నానార్ఘ్యాదిక నిత్యనిర్మల
విధుల్ జాగ్రత్తగా దీర్చిరం । దానారయణుడొండమించు నికలెండాచు
న్ప్రియాణంబులై । యానందంబున భార్యలన్ సుతుల నెయ్యంబొప్ప శో
డ్కొంచురా । గానాగేంద్ర గిరీశు బేర్కొనుచు సత్కల్యాణమున్ పా

డుచుర్॥ శా॥ ముత్తైదుల్సనుచుండగా ద్విజులు తామ్రుర్ నాల్గువేదంబు
లె। త్రైశ్రాంతో రభసంబుగా జదువ నంద్రాణిదేవాంగనల్।ముత్తెంబుల్వి
రులుర్ శుభాక్షతములుర్ ముఖ్యంబుబూనుచుర్।జిత్తంబుల్ముదమొంద
సేసలిడిరా శ్రీస్వామిశీర్షంబునన్॥ ఆ॥ హేమరథముమీాదనిందిర పుష్పరథం
బుమీాదవకుళతార్క్ష్యవాహ।నంబుమీాదజక్రినంది పైరుద్రుండు।హంసవా
హనంబునంద్రబ్రహ్మ॥సీ॥ ఎక్కిరిపురుహూతుడి భమందుదగరుపై ననలుం
డుమహిషంబునందు యముడు।నరుని పైనైరృతుండిరవొందు మకరంబుపై
జలేశుడు జింకపై బవనుడు। హయముపైధనదుండునవలతక్కినవారు వారి
వారికిదగు వాహనముల।యందుబత్నీయుక్తులగుచు గూర్చుండిర త్తరి హరి
ముందటధాతచనగ। గుడినిరుద్రుండు శ్రీసతియెడ మదిక్కు। వెనుక శ
రజన్మ డరుదుగాపివిధ వాద్య। రవములతి శయముగ నంబరంబునిండ।తి
గుబిరుసులెత్తి మాగధుల్బొగడు చుండ॥ తే॥ గొడుగు శేషుడుబట్టగా
గుడియెడమల।నమరిపవనుడు ఘనచామరములవీవ।భక్తిమెఱయగ సేనాధి
పతినుదమున। నాలవట్టముపట్టశేషాద్రిడిగ్గి॥ వ॥ నేలయానినచందంబున నె
రసి కపిలతీర్థ మార్గంబునంజనిచని శుకాశ్రమంబునకు బోవుచుండగా
వ్యాసాత్మజుండా స్వామి కెదురుగా వచ్చి తోడ్కొనిబోయి సుస్థలం
బు నందుంచి నిజయోగ ప్రభావంబున సకల పదార్థాకర్షంబు జేసిహరి
హర బ్రహ్మాదులకు విందు సేయించి నయ్యష్టమి నాటిరాత్రి హరిగంధర్వ
యక్షకిన్నర గానంబు లాలకించుచు రంభాద్యప్సరస స్త్రీలనృత్యంబు లీ
క్షించుచు సామ గానంబులు విని విని పొక్కికుసుమ శయ్యలయందు వి
శ్రమించి లేచి యమ్మరునాడునారాయణ వనపురసమీాపంబున కేగ నాకా
శ రాజు హితమంత్రి పురోహిత సహితంబుగా జతురంగ బలములతోడ
నాచక్రి కెదురుగా వచ్చి పూజాలింగనాది సత్కృత్యంబు లాచరించివీధి
ప్రదక్షిణంబుగా దోడ్కొని వచ్చి విడిది యందుంచి హరితమంబున నిజ
మందిరంబు జేరి తొండ మానునిశౌరి సాన్నిద్యంబునకు బంపింపగానతం
డరిగి యచ్చట హరిహర బ్రహ్మాదులకు భోజనంబు చేయించి తాంబూ
లంబు లిప్పించి నిజగృహంబున కరిగె నచ్చటగురు వాక్యాను సరణంబు
గా నాకాశ నృపతి మంగళ స్నానంబు జేసి నాదిన వగ్రహయజ్ఞము మొ
దలయిన వివాహ కృత్యంబు లాచరించె నంత॥ సీ॥ అస్తమయము గాగ
హరితోడ విడిదిలో బ్రహ్మ రుద్రాదులు పవ్వళించి। నిదురించిరావల ను
దయ పర్వతముపై నరుణోదయం బయ్యె నపుడె లేచి। యందఱు స్నాన
సంధ్యాది కృత్యంబులు నెఱవేర్చి రటుమీాద హరియు స్నాన। సంధ్యా
దు లొనరించి సంతోష మొసగ వసిష్ట సంయమిని వీక్షించి పలికె। నే

ను లక్ష్మియు నజుడును నీవువకుళ। మాలికయు భుక్తి గొనక నేమమున నుండవలెగదా కన్యనొసగెడివారియింట।గగన్నృపుడు ధరాదేవికన్యకయును॥ తే॥ తొండ మానుండును బురోహితుండు నైన। సురగరుండు భుజింప కచ్చోటదగిన। నియమమున నుండవలె గానినిలిచినట్టి।వారలందఱు భుజయింపవచ్చు గనుక॥ వ॥ త్వరగా బ్రాహ్మణ బోజనంబు జేయింపందగు ననిన విని వసిష్ఠుండు కుబేరున కావృత్తాంతం బంతయుం జెప్పివంపగానతండరిగి యుపవాస నియమ సంతర్పణ ప్రకారం బాకాశరాజునకు జెప్ప నాన్నృపాలుండు సమ్మతించి మధ్యాహ్నంబునకు బ్రాహ్మణ సంతర్పణంబు జేయించి యొక్కొక్క నిష్కంబు చొప్పున దక్షిణయు దాంబూలంబు లిప్పించి ప్రొద్దుగ్రుంకిన పదుమూడు గడియలకు ముహూర్తంబు గావలయు గనుక దగుమంగళ ద్రవ్యంబులు వివాహ మంటపమందుంచుండని పరిచారకులకు నియమించి పురోహిత బంధు మిత్రాను జులతోడ ధరణీదేవి సువాసినులతో దోడ్కొని సాయంకాలంబున హరియున్న విడిదికి బోయినక్షత్ర సమూహ పరి వృతుండైన సుధాకరుని చందంబున బ్రహ్మ రుద్రాదుల మధ్యంబున రత్నపీఠంబు నందు గూర్చుండి యున్న హరిని జూచి యానందించి వసిష్ఠాది మునులం జూచి స్వామి వారిం దోడ్కొని మీరందఱును రావలయునని ప్రార్థించె నప్పుడా వసిష్ఠుండు శ్రీ స్వామివారిని బూజింపుమని చెప్పిన విని ధరణీ దేవిసంకోచంబుతోనరుంధతినిముందిడి కొని భయభక్తు లెసగ స్వామికిదివ్య వస్త్రాభరణ చందన తాంబూలంబులర్పించిపుష్పహారంబుకంఠమందునుంచికృతార్థురాలనైతిన ని సంతోషించె దొండమానుండు సభా తాంబూలంబు లిప్పించెద దనంతరంబున॥ సీ॥ ఐరావతము మీద హరిని శ్రీసతినుంచి కొని రాజపథులంగొరిరాగ। వివిధంబులగు చతుర్వేద ఘోషణములు ఘనయక్షగంధర్వ గానములును। మిన్నంది ఘోషింప మెఱయుచు రంభాది సతులునృత్తంబులు సల్పగాను। ఘనతర కరదీప గగనబాణంబులు పెక్కు దిక్కులను దీపంగాను। సకల దిక్పతులును బద్మ సంభవుడును। గొలువగా జక్రిసంతోష కలితుడగుచు। నిర్మలుండగు నాకాశ నృపతినగరు। సేరుటకువచ్చి మందిర ద్వారమందు॥ తే॥ నిలువ మంగళవాద్య ముల్నెరసి మెఱయ। దొండమానుని భాగ్యసంతోష మొసగ। నైదువలతోడ జేపట్టి హరికి సిరికి। నిష్టముగమంగళారతు లిచ్చెనపుడు॥ క॥ తినకు నుసిరి కారతులి। చ్చినవారికి పీడెములను జీవాంబరముల్। ఘనమతి వరనిష్కములును। బెనుపుగ నిప్పించె నాకుబేరుని చేతన్॥ వ॥ అంతనా శ్రీనివాసుండైరావతంబు డిగ్గి లక్ష్మికరంబుబట్టికొని బ్రహ్మరుద్రాదులతోడ నం

తఃపురంబులోఁ బ్రవేశించి కల్యాణ మంటపంబులోఁ జతురస్రరత్న వేదిక
లయందున్న హేమ సింహాసనంబు మీఁదలక్ష్మీ సమేతంబుగా గూర్చుండ
గా శాస్త్రోక్తంబుగా నాకాశ రాజు నిశ్చితార్థంబు జేయించెనంత॥ సీ॥
అమర పద్మావతి కనసూయ మొదలైన నైదువలెల్ల సమోద మెసఁగ।
భాసుర నూతనా భరణంబులును నవ్యచేల చందన పుష్ప మాలికలును।
గాటుగ కుంకుమ క్రమ మొప్పగా నలంకారంబు జేసి శ్రీగౌరిచెంత।
నుంచి పూజలను జేయించిరి ఋషులు కన్యా వరణము జేసి రచటనవల।
సుతను దీవించి మంగళ సూత్రమఱుత। గట్టనా ధరణీదేవికన్యతోడ నూ
డనైదువలను దోడుకొని వివాహ। మంటపము జేరవచ్చి సమ్మోదముగాను
తే॥ తూర్పుముఖముగసుతనుంచెదోయజాక్షు। డచటబశ్చిమముఖముగానల
రుచుండె।నలఘుమంగళవాద్యంబులన్ని దిశల।నురుతరంబుగ ఘోషించుచుం
డెనంత॥క॥ గడియారముచూచుచున।ప్పుడిదె శుభలగ్నమనుచు బురుహూ
తాదుల్। తడయక చెప్పగనృపుడ।క్కడహరిసాన్నిధ్యమునకు గ్రక్కునవ
చ్చె॥ సీ॥ అచ్చటదగువివాహక్రియలువసిష్ఠమౌనిచేయింపగ్రమముగ జేసి
యపుడునూతనధర్మయజ్ఞోపవీతముల్ ధరియించికంకణధారణంబు। జేయిం
చికొనియున్న శ్రీహరిపాదపద్మములబంగరుపళ్లెరముననుంచి। తపసులుపు
రుషసూక్తము వచింపగపుణ్య తీర్థమానృపుభార్య దెచ్చియొసగ। భూవ
రుండుశుభసంకల్ప పూర్వకముగ। హరిపదంబులు గడిగియా యమలతీ
ర్థ। మపుడుశిర సావహించి భార్యాత్మజాది। బంధుమిత్రుల శిరంబులపై
నజల్లె॥ సీ॥ ఆచక్రికాచ మనార్ఘ్యము ల్మధుపర్కమిచ్చి పద్మావతినల్ల
బిలిచి। జగధీశుడ వలనుండగ నిర్వరకు మధ్యమున దెరగట్టించి మొదట
నిల్చి। యనుమతంబు నన్నృపుడత్రి గోత్రజనువీరతకు మానాథపుత్రి కసు
ధర్మ! రాజాత్మజుడన భోరాజాఖ్యుడనునేను నాకన్యనిచ్చెద నీకుగరు
ణ। నగ్నిసాక్షిగ జేపట్టుమంబుజాక్ష। యనగవిని చక్రిసంతోష మతిశ
యింప। సకలసురముని ముఖ్యులుసాక్షిగాగ। నావసిష్ఠానుమతి నిట్టుల
నియెనపుడు॥ వ॥ వసిష్ఠగోత్రోద్భవ సూరసేనాత్మజ వసుదేవ పుత్రుండనై
వాసు దేవాభిదానంబు నొంది శ్రీవేంకటేశ్వరుండనైననీయత్రి గోత్రసం
జాతయైన పద్మావతినగ్ని సాక్షిగా బాణిగ్రహణంబు జేసెదనని పల్కినవి
నినృపాలుండు హరికినివరదక్షిణ కోటినిష్కంబులు సమర్పించి తదనంత
రంబునదివ్య నవ్యశుభ్ర వస్త్రంబులుజీవ రత్నకలిత శతభార కిరీటంబును
నూఱుబారువులదియు నేబదిబారువులదియు నిరువదయిదు బారంబుల
దియు నీప్రకారంబుగా మూడుబంగారు కంఠెలను ననర్ఘ్యరత్న ఖచిత
పతక హారంబులారు న్నొకటియు మఱియునొక్కదివ్య మౌక్తికహారంబు

ను నింబఫల ప్రమాణంబులైన ముత్యాలపోగులు రెండుజోళ్లును వెలతే నిభుజకీర్తులును నాగాభరణంబులును నలువైనాలు గపరంజి సందిటి తాయెతులును వజ్రపద్మరాగ కాంతుల నొప్పిన ద్వాత్రింశద్భారకంకణంబులును వీరముద్రాద్యంగుళ్యాభరణంబును బంచాశద్భారకనకకటిసూత్రంబును గంఠాదిపాద పర్యంతం బావరించినయే కాదశశతభార వజ్రకవచంబును సప్తాదశ భారకనకమయ పాదుకాయుగ్మంబును పరిమళ గంధపారిజాతపుష్ప హారంబులును శ్రీనివాసున కలంకారంబు జేసి ఋషులుమంగళాష్టకంబులుచదువగా గుశపుష్ప హిరణ్యాక్షతోదకంబులు చేపట్టికనకరత్నాభరణ భూషితయైన కన్యకను హరికిధారా దత్తంబుజేసియానంద బాష్ప పూరిత లోచనుండై ధర్మార్థ కామమోక్ష సంకల్పంబులయందీ కన్యకనను వర్తించి రక్షింపవయ్య యోస్వామీయనిప్రార్థింపగావిని హరిమహాప్రసాదంబుగాతద్వాక్యంబు నంగీకరించె నంతమాంగల్యకంకణ ధారణంబులును నక్షత్రారోహణంబును బ్రధానహోమంబును సప్తపదాతి క్రమంబును లాజ హోమంబును నరుంధత్యాది పతివ్రతావలోకంబును స్థాలీకసంబును నివిమొదలైన వివాహ కృత్యంబులను సురగురువసిష్ఠాత్రిప్రముఖులు నెరవేర్చిరప్పుడు రాజేంద్రుండుషోడశమహాదానంబులు చేసిగంధాక్షత పుష్పంబులొసగిపూజచేసి ఫలదక్షిణతాంబూలంబులు సకలజనులకిప్పించెనంత॥

సీ॥ బ్రహ్మరుద్రాదుల పఙ్క్తులనడుమ గాబేరైననవ రత్నపీఠముంచి। పటువజ్రకలితదీప స్తంభముల మీదబహుళ మాణిక్య దీపములబెట్టి। పైడిపళ్లెరమందు భక్ష్యభోజ్యాదిప దార్థముల్వడ్డించి రపుడుశౌరి। వనధిజబద్మాపతిని దానుభయ పార్శ్వ ములనుంచికొని ముచ్చటలుమీర। నందువిందులుముదముతో నారగించె। నందరును తృప్తులై లేపహస్తపాత్ర। శుద్ధిగావించుకొని మహాసుఖముమీఱ। వీడెములు చేసివవళించి వేడ్కమెరయ॥ గీ॥ నిదురజెంది సూర్యుడుదయింపగాలేచి। వారి వారిపనులువారువారు। చేసిరాజసుతకు సిరికిజక్రికినల్గు। లొనరబెట్టి రట్లుదినదినము ను॥ సీ॥ నలుగులునా మెతనంబులు బువ్వముల్ సంతర్పణంబులు సాంగముగను। నడుపుచున్ మూడవనాడుపాకనజేసి నలరుచు నాల్గవనాటి రాత్రి। యందరితో శౌరిహరి బువ్వము భుజించిశయనించినిదురించి జామురాత్రి। కలదనగాలేచి క్రమముదప్పక శేషహోమంబు గావించి హుతవహునకు। మ్రొక్కిలిడితన చేతికిజిక్కినట్టి। కనకకల శముగొని దొంగతనముగాను। బొరుగువారిల్లు సేరెనప్పుడు రయమున। నగజమొదలైనయైదువుల్నగుచులేచి॥ గీ॥ అందఱునుగుమిగూడియాయబ్జవతిని।

హరికడకు । నోడుకొనిపోయి మోహము దొడరఁ జంద । నంబున నలదించి పుష్ప
హారంబు గంఠ । మందు నిడఁ జేసి తాంబూల మమరఁ జేసె॥ వ॥ ప్పుకొనుమని
లజ్జమాని నా తోడ రమ్ము కోపం బేలయని యడిగించి యిప్పించి రంత॥
చ॥ అనవిని పెండ్లికూతురు మహా భయభక్తులు మానసంబునన్ । బెనఁ
గొన హాసచంద్రికలు బింబని భాధరమందుఁ గ్రమ్మగాఁ । గనుఁగవ బెళ్కు
ముద్దుఁ గులుకంగ నిజేశుని మోముజూచి ల । జ్జను దలవాంచి చిల్కవలె
జాణతనంబున నవ్వుచిట్లనెన్॥ సీ॥ ఆత్మేశ చోరుఁడవై నీవు మా చెంబు దెచ్చి
నావది యేమి చెప్పవోయి । మఱియజ శివుల ముందఱఁ జిన్నపని నీవు చేసి
నదే చాలు చెప్పవోయి । అలలక్ష్మికిని నాకుఁ దలవంపు పని నీవు చేసిన
కతమేమి చెప్పవోయి । ఘన నాకబలి కాలమునఁ దేఱి కీయల్కఁ జేసి నచ్చిన
దేల చెప్పవోయి॥ తే॥ దేవ పెండ్లికి నీ వప్పు దీసినట్టి । ద్రవ్యమున కీడు గా
దొంగతనము జేసి । తెచ్చితివి చెంబు దీనిచేఁ దీఱ దప్పు । రమ్ము మేమీయ
గలము వరాలు సామి॥ ఆ॥ గొల్లలిండ్ల నీవు గొల్లబెట్టుచుఁ బాలు వెన్న
దొంగలించుచున్న బుద్ధి । విడువక మారి వారి వేశ్మమునందిట్లు । చెంబు దొంగ
లింపఁ జెల్లదోయి॥ వ॥ అని యనేక విధంబుల ప్రియ వచనంబులు వల్కి
ప్రార్థించిన హరి చిఱునగవుఁ బద్మావతి కరంబుఁ బట్టికొని తన తొడ
యందు గూర్చుండ బెట్టికొనిన నందలి జనులందఱు మందహాసంబు
లొనర్చి రంత హరి పద్మావతి కరంబు పట్టికొనఁగ నందరు విభవంబున
వివాహమందిరంబునకుం గొనివచ్చిన నతండు మంగళస్నాన పూర్వకంబుగా
వస్త్రభూషణాలంకృతుండై రత్నపీఠంబుమీఁద లక్ష్మీపద్మావతి సమేతుండై
కూర్చుండియుండె॥ సీ॥ అట నాకబలి దేవతార్చనంబులు నీలమణి ధావణంబు
ను మధురఫలము । లార్యుల కొసగుటలై దువలకు శూర్పదానముల్ సే
యుటత్తెఱని వేడ్క । లమఱవ సంతోత్సవము వధూవరులు మేల్పాన్పు
పైనుండి దంపతుల పేరు । లడిగి చెప్పగ వినివిడెము లిచ్చుటయు నచ్చ
టనొప్పు నాందీ విసర్జనంబు । మొదలుగాగల శుభకృత్యములను దేవ ।
దేశికాత్రివ సిష్ఠులు ధీరమణులు । వరుసగా నడిపించి రావల నృపాలు । డందు
బ్రహ్మమలకు ముదంబతి శయింప॥ వ॥ దంపతులకు నభ్యంగనస్నానంబుల
ను చేయించి వస్త్రభూషణ చందన పుష్పంబులచే దంపతిపూజలు సేయిం
చి షడ్రసోపేతంబుగా నందఱికి భోజనంబు పెట్టించి తాంబూలంబు లిప్పిం
చె నంత సాయంకాలంబు గాఁగ నలంకారయుక్తంబగు నైరావితంబుమీఁద
హరిని సిరిని బద్మావతిని నునిచి సకలోత్సవంబులతో వీథి ప్రదక్షిణంబు చే
యించికొని వచ్చి నిజమందిరంబున జేర్చి కృతార్థుండనైతినని సంతోషించె

నమ్రముఖునాడరుణో దయంబున హరిప్రయాణోన్ముఖుండై పద్మావతినిబా
పుడనినవిని పత్నీసహితుండై గగనభూపాలుండిట్లనియె॥
సీ॥ శ్రీశేషగిరి వాస శ్రీసతీశ్వర మీరొక్క మాసంబైననుండుడిచట। నను
చు బ్రార్థింపగా హరియిట్లులనియె నిందుండ గూడదు పనులుండు నచట।
ననగ బద్మావతి నంపించువిధ మెట్లు పసిబిడ్డ యగుగాని ప్రౌఢగాదు। గా
న నేనిపుడంప లేనన్నవి నిచక్రి సిరిఁజూచి కనుసన్న జేసెనపుడు। చక్రభావం
బుదెలిసి యాజలధికన్య। తానుగగన నాథపతిజూచి తండ్రియబ్జ। వతినిహ
రి వెంటబంపింప వచ్చునదియె। మాకు సంతోషమగు జింతమీకువలదు॥
సీ॥ వకుళ మాలికతల్లి వలె బ్రోచు నచ్చోటనన్యులెవ్వారు లేరనియనే
క। రీతులుగాసిరి ప్రీతితో జెప్ప నమ్మను జేశ్వరుండు సమ్మతమునొంది।
సిరికినిదనయకున్ మెఱయు దివ్యాంబరాభరణంబు లిప్పించి భార్యచేత।
గనువేడ్క ముత్యాల నొడిబ్రాలుగట్టించి హేమాంబరము హరికిచ్చి వకు
ళ। మాలికకు భూషణంబులు చేలలిచ్చి। యొప్పుగాసిరి కాబిడ్డనొప్పగించె।
హరియువసుధానుడను భావమఱికచట। దాను గప్పినదివ్య వస్త్రంబు
నొసగ॥ క॥ గగనాధీశ్వరుడంతట। జగదీశ్వరుచెంత నిలిచి సద్భక్తుండై। ని
గమాంతగుంభితోక్తుల। బొగడుచు మఱియిట్లులనియె బుణ్యాత్ముండై॥ సీ॥
పెద్దకాలమునుండి బిడ్డలు లేకుండి కాంచితి తొలుత నీకమలనయన। మొన
సియాకన్యగల్గిన విశేషము చేత వసుధానుడుదయించె వానిమీరు। పాలింప
వలయు మాపద్మావతీదేవి నిచ్చితిగనుక మీ రింక మీద। జిరకృపనీళ్ళ ముం
చిన బాలముంచిన భారంబు మీదని బాష్పములను। గన్నులను నించి
మఱిపల్కకున్న జక్రి। గగనన్నృ పతినిజూచి సత్కరుణమీఱ। పలికెనిల్లని
మామమీపట్టి కొఱకు। జింతసేయకు డేను రక్షింపగలను॥ గీ॥ పెద్దలై
తిరి మీరు సంప్రీతి నెపుడు। జాలనామీద నుంచి నిశ్చలత నొందు। డ
ఖిలసౌఖ్యము గలుగు మీకనుచు కృపను। బలికి బద్మదళాక్షుండు పైన
మయ్యె॥ వ॥ అప్పుడా కాశరాజు శాలితండులంబు లిన్నూఱు భారంబులు
ను ముద్గఖండంబులు ముప్పది భారంబులును ఇక్షుతింత్రిణీ ఫలంబులు న
లువది భారంబులును సహస్రక్షీర భాండంబులును సహస్రాజ్యామృత భాం
డంబులును దివ్యనతశర్కరాఘటంబును ఆనజేక్కర మెంతి యింగువ మి
రియాలు లవణంబును వార్తాకకదళీ కూష్మాండకందమూలాది శాకంబు
లును జూతామలక ప్రముఖ ఫలంబులును దశమధు ఘటంబులును నినే
కకదళీపర్ణంబులును హయగజవృషభంబుల పైనిడి శ్రీనివాసార్పితంబు
గాదత్తంబుజేసె దాసీజనశతంబును ద్విశత దాసజనంబును దశసహస్ర ధే
నువులును దివ్యాంబరాభరణ పర్యంక ద్రవ్యోపకరణంబు లనేకంబులు

త్రికరణాబుగా నిచ్చిహరి సాన్నిధ్యంబు నకు గ్రమ్మఱవచ్చి నంజూచి లేచి శ్రీనివాసుఁడిట్లనియె॥ సీ॥ అవనీశ మీసుత కరణంబు తగుమాత్ర మీవలెనింత మాకేలనన గ। నాకాశనృపు డిట్టులనియె లక్ష్మీశ మీకేమి తక్కువ గాదు హెచ్చుగాను। బూనిమీకియ్యను నేనెంతవాడను గలుముల చెలి మాకుగరుణ మెఱయ। నిచ్చినదిచ్చితి నింతమాత్రంబైన గైకొనుడని పల్కి-కరము మోడ్చె। నపుడగస్త్యాశ్రమంబున కరుగవలయు। నబ్జవతినం పుడనుచు బద్మాక్షుడనగ। విని నృపాలుడు తనసుతఁ వేగబిలిచి। యమ్మ నీ పతితోడ నీవరుగు మిపుడు॥ చ॥ అనితనతండ్రి బల్కనపుడంబను దెప్పున గౌగలింపగా। నెనరున బిడ్డనెత్తి ధరణీ సతికన్నుల నీరునింపు చున్। మన ముగరంగమున్దుగొని మచ్చికమీరగ గారవించి యి। ట్లనియె విచారమేల నివుడబ్జవతీసిరి చెంతనుండు మీ॥ సీ॥ నాకన్న నెక్కువగా కమలాదేవి నిను గారవించి మన్నించుచుండు। నదిగాక వకుళ నిన్నాదరించుచుభక్తి చేగృపనచట బోషింపుచుండు। హరిసిరినిను నొక్క-సరణి గానీక్షించి యింపు సొంపెసగ బాలించుచుండు। బతిభక్తి నెదనుంచి పద్మమందిరతోడ వేంకటగిరి మీద వెలయుచుండు। మేమువచ్చెదమచటికి బ్రేమమీఱ। నీవు వచ్చెదవిచటికి నేడుచలము। చేయవలదని శ్రీలక్ష్మి చేతికిచ్చి। మఱియు నిట్లని పల్కె-నిందిరను జూచి॥ క॥ అమ్మాసిరి పద్మావతి। నిమ్మధుసూధనునికిచట నిచ్చితి గనకన్। సమ్మతముగ నాసుత మీ। సొమ్మైనది చాల గరుణ జూడుము తల్లీ ॥ సీ ॥ ఆటలాడుచునుండు నబల యేపనిపాటలెఱుగదు తప్పొప్పు లెఱుగది పుడు। కావున మీరు చక్కని బుద్ధులిక జెప్పి వరుసగా దిద్ది కోవలయు దయను। నామఱుంగున నిన్ని నాళ్లుండెనిపుడు నీమరుగున జేరెనే మఱకద్రోవ। బిడ్డలు లేక[illegible] బెద్దగాలంబుండి కాంచితినీకన్యకనుధరిత్రి। బెంచినీ చేతికిచ్చితిబిన్నపడుచు। నెట్లబ్రోచినను నీ భారమింక నేను। జెప్పవలసినదేమి నిచిత్తమనుచు। నపుడుకన్నీరుగుసంపనిట్లనియెలక్ష్మి॥ మ॥ ధరణీదేవిముదంబునొందు మిపుడీతాపంబునికేలనే। మఱికన్నన్నునునీసుతన్ గరుణతోమన్నించు భారంబుయీ। హరియందున్న దిచింతసేయకిపుడీ యబ్జాక్షినంపించుచ। న్నరగాజూడకుమేనునీకుసుతనే యంచున్ దలంపదగున్॥ వ॥ అని మఱియు ననేకవిధంబుల నాదరించిన సంతసించి ధరణీదేవి పద్మావతితో నిట్లనియె॥ గీ॥ వినవె నాముద్దుపట్టివి వేక[illegible]కి। [illegible]కి[illegible]కిని శ్రీవేంకటాద్రిమీద। గెంటకను సేవజేసి సత్కీర్తి [illegible] [illegible]పెరి వెంటననిచాల బుజ్జగింప॥ క॥ అప్పద్మావతితల్లిని। [illegible] [illegible]ధారల[illegible]పడలన్। తొప్పలద్దు[illegible] సేయు[illegible] నప్పుడు [illegible]యన్॥ [illegible]తి శ్రీనివాసుడు నలెసబద్మావ

తినిదోడ్కొని గరుడవాహనారూఢుండై బ్రహ్మాదులతోడ నగస్త్యాశ్రమం
బునకుబోయి బ్రహ్మరుద్రాదుల కాదినంబాదు విందుసేయించె నమ్మఱు
నాడు విధిశివప్రముఖులు శ్రీనివాసాజ్ఞాధారులై మ్రొక్కి తమతమ నివా
సంబుల కరిగిరంత కొల్లాపురంబునకు సిరి బ్రయాణంబై హరికి ట్లనియె॥
తే॥ దేవకరవీరపురి జేరబోవలయు । గరుణతో సెలవిమ్ము శీఘ్రముగననిన ।
వినిశిరమువంచివిన్ననై విష్ణుడపుడు । పద్మమందిరకరముచే వట్టిపలికె॥ సీ॥
ఇందిరనన్ను నీవెడవాసిపోనుగాళ్ళాదు నేనిన్ను బొమ్మ ననునాబోకు।నోరాడు
నేనీవునూతనబంధులవలెసెలవిమ్మంచువలుకదగునె। పద్మావతినినీవెపాలిం
పవలయునీచిఱుతనునేనుపోషింపగలనె । యకటనీవిందుండకరిగినధనదుచే
దీసినరుణమేనుదీర్చగలనె । నన్నునరమఱగాజూడకెన్నటికిని। గర్తవైయుం
డుమనిపల్కెగాసుదాబ్ధి । కన్యదరహసితాస్యయై కమలనాభు । నింపుమీఱ
అగనీక్షించి యిట్లనియె॥ మ॥ సకలజ్ఞత్వముదాచిదివ్యమహిమల్ చాలిం
చిపద్మావతిన్ । బ్రకటాసక్తిని బెండ్లియాడితివి సౌభాగ్యంబు నీకిచ్చెనే ।
నికనెందుండినజింత లేదునను నీ విందుండు మంచున్ వచిం । పకపంపింపుము
వచ్చెదన్మరలనో ప్రాణేశశీఘ్రంబుగన్॥ చ॥ అనవినివిష్ణు డిట్లనియె నంబుధి
కన్యక నేనురాముడై । జననమునొందియున్నతఱిజానకివై ఘనలంకలోనము।
న్నోనరుచున్న వేదవతి నొప్పివివాహము జేసికొమ్ము నీ । వనినరహస్య
సూక్తిహృదయంబుననున్నదొ లేదొ మానినీ॥ మ॥ అనలంబందుజలింపకన్
నిలిచి నీకాప్తంబుగా మేలుచే । సినయా వేదవతీవధూమణియు రాజీవంబు
లో నుండగా । గనియాకాశనృపాలుడీసతిని బల్గారాముగా బెంచె నీ । వని
యున్నట్టివిధంబుదప్పకవివాహంబైతిపద్మావతిన్॥ శా॥ నేనీవాక్యముమీఱ
రాదనుచు నీనిరేజపత్రేక్షునే । యానందంబుగ బెండ్లియాడితిని నింకన్యోన్య
భావంబుగా। దీనిన్ బాలన మెప్ప జేయుటకు నీదేభారమైయుండగా। బైనం
బైతివి తేరకత్తైవలె నాపై మోహమున్ నిల్పకన్॥ ఉ॥ పావనమూర్తియైన ము
నిపాదమునాయురమందుసోకగా । నీవపుడల్గిపోయితివి నిన్నెడవాసిన జాలి
చేతనే । నావలనన్నియున్ విడిచియార్తినిబొందుచువచ్చిపుట్టలో। నివఱదా
కనుంటి నిపుడిందుముఖీనినుగంటి గమ్మఱన్॥ చ॥ ననువిడనాడిదూరముగ
నాటివిధంబుననుండనేలపెం । పునపురమందుభూషణము పోలికనుండుము
శేషపర్వతం । బున విహరించుచుండుటకు ముచ్చటయైనదిగాన బోవ ని ।
య్యనునిలుమిచ్చుటల్ మరలనావలనోవగనేల భామినీ॥ మ॥ అనినారాయణు
డానతిచ్చినమహాయానంబుతో లక్ష్మియు । ట్లనెనో స్వామిభృగుండునీయుర
మునం దజ్ఞానియైతన్నినం । దున నచ్చోటవసింపకన్ దొలగి బల్దూరంబుగా
నిల్చినే । ననిశంబున్ మదిగుందుచుండానికనేమందున్ ద్రిలోకేశ్వరా॥ శా॥

కాలంబీగతి జేసెనాభృగుని నంగాగారణం బేమికా। జాలా నాయెడ సత్కృ
పన్ నిలుపుమో స్వామి నాముదంబొప్పనిం। దీలావణ్యవిలాసినిన్ గిరుణతో
నింపొందగా ముందున। న్నేలేరీతిగ నేలు నామదికిదే యిష్టంబు ప్రాణేశ్వరా॥
క॥ శ్రీరాముడవీవైనపు। డారయగా నేను సీతనై వేదవతిన్। గూరిమితో జే
కొనుమని। గౌరవమున జెప్పియుంటి గావున వేడ్కన్॥ ఆ॥ వసుధయందు వేద
వతియబ్జవతిగాగ। నీవు పెండ్లియాడినావు గనుక। గొదువవ లేదు మదిని గోరి
యీ లలితాంగి। యందె సకలసుఖములనుభవించు॥ వ॥ మని సమ్మతంబుగా
బల్కి పద్మావతిని గారవించి హరికి సంతోషకరంబుగా సేవ జేయుచుండు
మని యనేకప్రకారంబులుగా బుజ్జగించి చెప్పి వకుళమాలికనీక్షించి బాలి
కామణి నాదరణంబుతో బోషింపుచుండుమని నియమించి హరికి మ్రొక్కి
రమాదేవి కొల్లాపురంబు జేరి చక్రిని హృదయకమలమందిడికొని సుఖస్థితి
నుండెనంత వేంకటేశ్వరుం డగస్త్యు నీక్షించి యిట్లనియె॥ తే॥ సంయమీ
శ్వర వేంకటాచలము జేర। మేము పోమెడిమని బల్కగా మునీంద్రు। డనియె
షణ్మాసపర్యంతమహీగిరీంద్ర। మెక్కుదురె పెండ్లికొమరులో యిందిరేశ॥
క॥ అనఘా షణ్మాసంబులు। జనునంతకు నిచట నుండు సంతోషము గా।
ననవిని వేంకటగిరిపతి। దనసతితో నచట నుండె దద్దయు వేడ్కన్॥ వ॥ అంత
గొన్ని మాసంబులకు గగననృపాలుండు వైకుంఠంబున కరిగిన వసుధా
నుండు వైదికకృత్యంబులు సాంగంబుగా నాచరించె నటుపిమ్మటం దూత
ముఖంబున నవ్వార్తవిని నారాయణపురంబునకుం జని యచ్చటం జింతనున్న
వసుధామునితొండమానుని విచారించి దుఃఖోపశమనంబు జేసి యగస్త్యా
శ్రమంబునకు వచ్చి తండ్రికొఱకు దుఃఖించుచున్న పద్మావతి నాదరిం
చుచుండెనని న సూతుం జూచి శౌనకాదులిట్లనిరి॥ సీ॥ ఆకాశరాజు శ్రీహరి
పదంబును జేర విమలుడై పోయిన వెనుక నతని। తమ్ముడు దన యుడిద్దఱు
నుండి రందు బట్టార్హు డెవ్వాం డయ్యె నావిధంబు। జెప్పుమన్నను సూతుడ
ప్పుడిట్లనియె నోమునులార నృపతి తమ్ముడు ధరిత్రి। తనదైన దననృప తన
యుండు దమ తండ్రి యేలిన రాజ్యమే నేలవలయు। ననగ విని తొండమానుం
డునాగ్రహించి। పలికె నిరువుర మును నిందు భండనంబు। జేయుదము నీవు
మించి గెల్చిన నుర్విధ్వ। సిది నే హెచ్చి గెల్చిన నాది ధాత్రి॥ క॥ అని యిరు
వురు పౌరుషముల। మొనయుచు గదనమున కొప్పి ముఖ్యబలములన్। బ
నిబూనికూర్చిరవ్వల। వనజాక్షుని జేరి తొండమానుండనియెన్॥ సీ॥ వ
సుదేవసుత నేను వసుధాను డీక్షితి కొఱకింక ఘోరసంగరము జేయు। వతె
నాకు దోడు రావలె నీవనగ నవ్వి తనమదినిటు దానుడల చెశౌరి। తొండ
మానున కేను తోడుగా బోయితినైన పద్మావతికలుకపుట్టు। తనతమ్ము

డగు వసుధానుని తట్టునేయుండినసతి చాలనుత్సహించు । దొండమానుం
డు పరమభక్తుండునాకు । బరగవసు ధానుడన్యుడే బావమఱది । కనుక
నిరుపురితోడ సంఖ్యంబుపొసగ । జేయవలె దీనికికనేమి సేతునకట॥ వ॥
అనియోజింపుచు దొండమానునపుడయ్య బ్రాహ్మణుడీక్షించియిట్లనెనో మహా
మహారాజ యుందివ్యడుతోడై నేనుసదిక్కుగావ । చ్చినబద్మావతితోడ బు
ట్టకొల్లైకె చింతింపుచుండుర మదిర । నిరుపీడందగ దెట్టులైనజయ మే
నిలిట్టు గానుంచెదర॥సీ॥ అనిరహస్యంబుగా నతనికాప్తత జెప్పిసమ్మతంబు
గ తనచక్రమిచ్చి । పంపించెనటు మీదబావ మఱదివచ్చి తనకుదోడడు
గగా వినిరయమున । లేచియావకుళ మాలికకుబద్మావతి నందొప్పగిం
చి నెయ్యంబుమెఱయు । బావమఱదితోడ బైనమైనారాయ ణాఖ్యపు
రంబున కరగియుంటచ । భండనము జేయుజతురంగ బలములందు । గొలు
వగా బావమఱదిని గూడిసమర । భేరివేయించెనప్పుడా భూరిరవము
తొండమానుండువిని మహోద్దండుడగుచు॥ క॥ శరచాపంబులుగైకొని
విరివిగరణ భేరితాను వేయించుచునా। హరికినివసు ధానునకును । సరగు
ననెను రేగినిలిచెసర భసమతితోర॥ వ॥ అప్పుడు హరియును వసుధా
నుండును గనకరథంబులెక్కి వీరులై నిల్చియున్నంజూచి తొండమానుండు
తన రథంబుపై నుండినిజ చతురంగ బలంబులంబ రబలంబులపై బురికొల్పె
నప్పుడు భయబలంబులు పొంగి రథంబులమీద రథంబులును గజంబు
లమీద గజంబులును ఘోటకంబులమీద ఘోటకంబులునుగాల్బలంబు
లమీద గాల్బలంబులును బడి నొండొరుల కరవాలంబులంఝుళిపించి
నఱకుచు ధనుష్టంకా రంబులు సేయుచుజండ కాండంబులేయు
చుర డాయుచుర గుదియలనడచుచు గుంతంబుల గ్రుచ్చుచుం ము
ద్గరంబుల నొత్తుచు జక్రంబుల దఱుగుచు ముసలంబులెత్తి కొట్టుచు
శూలమ్ములగుమ్ముచు నివ్విధంబున విడువక పూర్వ పశ్చిమసము ద్రంబుల
భంగిబొంగి పోరుచుండి రందుదొండమానునిబలంబులు మొనకువిల్వక యు
ఱుకుచున్నంజూచి యతండువిజృంభించినిలునిలుండనినిలిపితానువసుధాను
నిరథంబుపై ఘోరబాణంబులనువేసె నవ్వసుధానుం డతండేయు చండ
కాండంబుల ఖండించె తొండ మానుండు చండప్రచండుడై యనేకశిలీము
ఖంబులేసి వసుధానుని నొప్పించె నప్పుడా వసుధానుండనేక ఘోరాంబ
వృష్టితొండ మానునిపై గురియించుచుండగానతండురోషభీషణాకారుండై
హరి యొసంగిన చక్రంబవ్వసుధానునిపై నేసెనప్పుడా చక్రంబుప్రళయా
ర్కబింబంబుచందంబున నతనిమీదికివచ్చుచున్నంజూచి హరియతని కడ్డం
బుగానిలిచె నప్పుడాచక్రంబు శ్రీశ్రీనివాసు నిపైబడిన మూర్ఛాక్రాం

తుండై యరదంబుపై నొరిగినజూచి భీతిల్లి తొండమానుండు శస్త్రాస్త్రం
బులువిడిచి నిజరథంబు డిగ్గిహరిరథంబు మీఁదికిఁజని పన్నిటఁగన్నులం ద
డుపుచు దాలవృంతంబు బూనివిసరుచుండె నప్పుడావసుధానుండును బా
ష్పపూరితాక్షుండై యరదంబుడిగ్గి హరిరథంబుపైకరిగి కప్పురంబు
పలుకులు నమలి చెవులలో నూఁదుచుండఁగా శ్రీనివాసుండు పెద్దప్రొద్దు
నకు మాయామూర్ఛ దెలిసి లేచి కూర్చుండినం జూచికరంబులు మొగిచి
తొండమానుండిట్లనియె॥ క॥ హరినేవసుధానునిపై । నరిభీకరచక్రమేసి నపు
డపుణ్యముగా । సరగుననిలిచితివందున । బొరిచక్రము దాకమూర్ఛబొందితివ
కటా॥ క॥ నీకపకారము జేసిన । ప్రాకటపాపంబు నన్ను బాయుటకొఱకై ।
లోకంగాశికి బోవలె । నాకిప్పుడు సెలవొసంగు నలినదళాక్షా॥ క॥ వసు
ధానునికొఁగిపట్టను । పసమీఱఁగ గట్టుజనుల బాలించుటకై । వసుమతినే
నికనొల్లను । వసుదేవాత్మజ యొసంగువైరాగ్యంబున్॥ క॥ అనవిని హరివ
సుధానుని । గనుగొని యిట్లనియెనిన్ను గాంచినజనకుం । డనఘుండై పర
లోకం । బునకేగెను బిన్నతండ్రి పుణ్యము కొఱకై॥ క॥ ఘనగంగా నదిక
రిగెద । ననుచున్నాఁడిందు కిప్పుడా లోచనయుం । పొనరగ జెప్పుమునీ
వన । వినివసుధానుండు పల్కె వినయము మీఱన్॥ సీ॥ హరినీవ్రునను బ్రో
వనడ్డంబుగాఁ రాఁగ నిరుపముచక్రంబు నిన్నుదాకె । నపుడుమూర్ఛిల్లితివ
టు వంటిపాపంబు నికనీగ నేను రామేశ్వరమున । కరిగెదనగ్రజుఁడైనట్టి
మాతండ్రిపట్టంబుపినతండ్రికట్టుకొనుట। లోకసమ్మతమిదినాకునుసంతోష
మటువలెనేచేయుడనినశౌరి। విసయగస్త్యుని శుకుని వేవేగనటకు। బిలువనం
పించివీరు చెప్పినవిధములు । హరికెఱిగించియెటుసేయవలయుననిన । నవ్వి
వారిట్లులనిరహోనలిననాభ ॥సీ॥ కాశిరామేశ్వర గతులువీరలకు చేల యు
న్నదమ్ములపాల్లనరసిమీరు । గగనాధిపునిపాలుతగబంచియీవసుధానునకి
చ్చియుధర్మముగను । దొండమానునిపాలుతొండమానునకిచ్చిసమ్మతపరుపుడి
చ్చటనటంచు । నమ్మునుల్ పల్కఁగాఁ హరిసుధర్మునిసొమ్ము రెండుపాళ్ళుగ సిజే
తొండమాను । నకుసగంబిచ్చిసగమునిర్ణయముగాను । గగనపతిసుతునకొ
సంగి తగవుదీర్చి । వారివీడ్కొనియటవజ్ఞపతిని జేరి । హరిసుఖస్థితినుండఁగా
నంతనచట॥ గీ॥ అర్ధరాజ్యమును వసుధాను డమరనేలు । చుండఁగానర్ధరా
జ్యంబు తొండమాను । డేలగా బుణ్యపరిపాక కాలమొదవె । నప్పుడానృ
పుడాత్మనిట్లనితలంచె॥ ఉ॥ వేంకటనాయకుండు ప్రభవిష్ణుఁడుగానినరుండుగా
డునే । మంకుగుణంబుచే మనుజమాత్రుఁడటంచు దలంచుచుంటినా । పంక
జనేత్రుదివ్యపదపద్మములన్ నెఱనమ్మిభక్తితో । నింకనిజంబుగానతని హేమ
సుమంబులబూజ జేసెదన్॥ క॥ ఆపరమాత్ముఁడు మనుజుం । డై పద్మావతి

నిగాడియల్లునివలెనే। కాపట్యములో మెలగుట। లీపట్లఁ దెలిసెనింది రే శ్వరుడనడే ॥సీ॥ అనియగస్త్యాశ్రమంబునకు వేగమెచ్చి శేషాద్రిపతి చెంత జేరిభక్తి। తాత్పర్యమొప్పగా దండప్రణామంబు జేయగానృపుని నీక్షించిచక్రి। నవ్వియిట్లనియెనో నరనాథ నీకు నేనల్లుడనైయుండినపుడు నాకు। మ్రొక్కఁదు రేయన్న ముకుళితహస్తుడై యానందమున దొండవానుడని యె। మాధవాసీవునాయందుమాయగప్పి। పలుకవలదింకమీపాదభక్తి నిచ్చి। ననుగృతార్థుని గా జేయుమనగ నగుచు। ఫణి గిరీంద్రుడువిశ్వరూపంబుజూపె ॥వ॥ అట్టి విశ్వరూపంబుజూచి తొండవానుండిట్లని నుతించె॥దండకము॥ శ్రీమద్రమాధీశ జీమూతసంకాశ కాల త్రయాతీత కంజాత సంజాతతాతాజగత్త్రాత వేదార్థనిర్ణీతభూతాత్మ సీతాధిపా సద్గుణవ్రాత పూతావనీజాతనాథా శచీనాథదాతా మహాఘోరదైత్యాద్రిదంభోళిధారాసహస్రారసంచారభర్మాద్రిధీరా సుధాసింధుగంభీర మందాచలోద్ధార నారాయణానంత నీపాదముల్భూడ బాతాళమై శీర్షభాగంబు నీక్షింప గాసత్యలోకంబునై మధ్యదేహాంగ ముల్మధ్యలోకంబులై నేత్రములుభాన్వ శీతాంశులై శ్రోత్రముల్దిక్కులై నాసికాగ్రంబు నాసత్యయుగ్మంబునై జిహ్వానీరప్రభుండై మహాకుక్షియంభోధి బృదంబు నైనాడులెల్లఁ బ్రవాహంబులై రోమముల్ వృక్ష జాలంబులై శల్యముల్సర్వశైలంబులై కేశపాశంబులుర్ మేఘజాలంబులై ప్రాణముల్గంధవాహుండునై బాహులింద్రాదులై దివ్యగుహ్యాంద్రి యంబుం బ్రజానాథుడై వృష్ణిసద్వీర్యమై సుస్తనంబెన్నగాధర్మమార్గంబునై వెన్నుధర్మంబునై సారవాగింద్రి యంబగ్నియై దంష్ట్రిలుందండహస్తుండునై మించె నిత్యాదిచిత్రంబులీ వేళ నీయందుగన్పింప గామిక్కిలిన్ వేయుశీర్షంబులుర్ వేయునేత్రంబులుర్ వేయు ఫాలంబులుర్ గోటికోట్యర్క సంకాశపూర్ణ ప్రకాశంబుచేనొప్పు నీవిశ్వరూపంబు నేజూడశక్తుండనే దేవపూర్వస్థితిస్స్ మహాసౌమ్యరూపంబు నేచూపి రక్షింపుమీశా చిదాకాశ శేషాచలేశా తగిగొండ సత్పట్టణాధీశ్వరా నారసింహ ప్రభూశ్రీనివాసానమస్తే నమస్తే నమస్తేనమః॥వ॥అనియ నేకప్రకారంబులవినుతించినసంతసించి పరమపురుషుండైన శ్రీనివాసుండు విశ్వరూపంబునుదిరో దానంబు నొందించి క్రమ్మఱ సౌమ్యమనుష్యశరీరధరుడై తొండవానునిజూచినవ్వియిట్లనియె॥ క॥ మామా నేనువినోదము। గామనుజుడనగుచు వేడ్కఁగామీకన్యక। బ్రేమమున బెండ్లియాడితి। నీమీదగృహస్థధర్మమేనునహించితిఁ ॥క॥ అమరగ వేంకటశైలా। గ్రమునందునయమున దివ్యకనక మయముగా। విమలంబగుమఃశిభవనము। క్రమముగగావింపువిశ్వకర్మకుశలతఁ ॥సీ॥ దేవాలయముగాన తీర్పింపు మెట్లన్నగుదురుగా నొకరెం

డుగోపురములు । ద్వారసప్తకమునుదగు వాస్తుశాస్త్ర ప్రకారంబుగా ను
వేంకటగిరీంద్ర। మందుగట్టించినన్నం దుంచినీవుప్రకాశుని జేయు మీకలియు
గమున। మును పానగంబుమీదనునీవుద్రవ్వినబావికట్టడమును బాగుమీఱ।
బొసగగట్టించుమనగనద్భుతముఁ బొంది। బావినేనెన్న డాస్వర్ణ పర్వతమున॥
ద్రవ్వ లేదని నృపుడన్న నవ్వియతని । గాంచియిట్లనిపలికె శ్రీకాంతుడ
పుడు॥క॥ మనుజేశ్వరజన్మాంతర । ముననీవొనరించుధర్మములమఱచితివే ।
యనుమానించెదవదినే । వినుపించెదని చటనీవు వేడుకమీఱన్ ॥ క॥ విను
వైఖానసవంశం। బుననుద్భవమైన విప్రముఖ్యుడువిమలుం। డును శాంతుడు
సద్గుణగణు। డనఘాత్ముడుగోపినాథుడనుఘనుడిలపై॥ తే॥ కృష్ణలీలలవినిచో
క్కి-గెంటకతని । కలియుగాదినిబూజింపదలచిచోళ । దేశమున కేగియచ్చో
టధీరుడగుచు ।దపము జేయుటకై కుశస్థలినినిలిచి॥ సీ॥ శ్రీకృష్ణరూపంబుచిత్త
మందుంచితపంబు జేయగనుగోపాలవేష । ములనేనుబ్రత్యక్షముగనిల్చివర
మేమికావలెనని పల్కగానతండు। పరమాత్మకృష్ణరూపంబుతోమీరుండవ
లెనేనుబూజింపవలయునట్టి॥ సద్వరంబియ్యుమో స్వామియంచువంచింపనత
నికిట్లంటి శేషాద్రియందు। శ్రీనివాసుడననగా బ్రసిద్ధిబొంది । యుందునన్నందు
బూజింపుచుండుకృష్ణ। వేషమునబూజకొననిది వేళగాదు। గాననికలేచి వేంక
టగ్రామమునకు॥ చ॥ జనుమనిరంగదాసుడనుసజ్జనుడొక్కడు దారిలోపలన్ ।
గనబడువానిదోడుకొని కాననభూములదాటిపోవగా।గనకమయాద్రిముందరప్ర
కాశముగాగనిపించుచుండు సి। వునునతడేగనేనచటనుండిప్రసన్నుడనయ్యె
దన్ గృపన్॥ గీ॥ శూద్రుడైనట్టి రంగదాసుండు పుష్ప । తులసి కాదళ
ములను సంతోషమొసగ । దెచ్చి నీచేతికిచ్చు సందేహ మాత్మ । నుంచ
కవిగొని పూజించు చుండు నన్ను॥ ఉ॥ అచ్చట గృష్ణలీలల మహాముద
మొప్పగ నీకు నిత్యమున్ । మెచ్చుగ జూపుచుందునటు మీదట నైనను
నీకులస్థుతే। యచ్చట జేరినన్నెపుడు నర్చన సేయుచునుండ సద్వరం । బి
చ్చితినమ్మ మంచు వచియించి యదృశ్యుడ నైతి భూవరా॥ సీ॥ వరవి
ప్రుడ దూనీ వచ్చుచుండగ రంగదాసాబిధానుడు దారియందు । జత
గూడగా శేషశైల మాయిరువురు జేరి నన్నచట సేవించి। మ్రొక్కి । గా
రంగ దాసుడే యచ్చట నొకబావి త్రవ్వి గట్టున బూలతోట వేసి । తా
నె శ్రీతులసి కాదళ సుమంబు లొసంగు భూసురుండవి గొని పూజసేయు
నావిధంబుగ గొన్ని యేండ్లరిగె ననల । సకలజన మోహనంబావ సంత
ఋతువు । వచ్చెనాదాసుడ డవిలో వరసుమముల । బుట్టలోనుంచి కొని
వచ్చి పుష్కరిణిని॥ తే॥ జలక మాడెడి గంధర్వ సుతుల జూచె । నపుడు
చిత్తంబు గలగ వీర్యంబుజాఱె । నందుక పవిత్రగాత్రుడ నైతి ననుచు ।

బుష్కరిణిలోన గ్రుంకి తెప్పునను బోయి॥ సీ॥ కుసుమముల్ క్రమ్మఱ
గోసి తెచ్చిన నందు గోపినాథుడు చూచి కోపమెసగ। స్వామిని బూజిం
చు సమయంబునకు బూలు తులసిదే నైతివి దుష్టచిత్త। గర్వించి చెడితివి
గావున నిందుండకరిగి యధోలోకమందు బుట్టు। మనిశపింపగను వాడ
డరి శోకింపగానే జాలి నొంది మన్నించి పిలిచి। దోష భోగ్యుడవే నీవు
దుఃఖపడకు। రంగ దాసరి నీమనోరాగ మింత। జేసె బ్రాహ్మణ శాపం
బు సిద్ధముగను। నేని వారింప లేనట్లుగాన నిపుడు॥ గీ॥ పుష్కరిణిలోన
మునిగి యీబొంది విడువు(మటను ధర్మమహీపతి యందు జేరి। నాగకన్య
క గర్భంబునం జనించి। ధారుణిని దొండమానుడన్ పేరుగలిగి॥ సీ॥ వ
సుధ నేలుచును నావాడవయ్యెదవు సిద్ధముగ నాసేవ వ్యర్థంబు గాదు।
చింతింప కిపుడు నేజెప్పిన పనిజేయు మనరంగ దాసుడం దట్లచేసె। న
తడు నీవై పుట్టి హితము రెట్టింప నా భక్తుడైవైతివి పార్థివేంద్ర। పూర్వ
జన్మమున నేర్పుగ నీవు ద్రవ్విన బావి యిందున్నది భద్రముగను। జక్క
జేయింపు మికనది శాశ్వతముగ। నుండునే దాచ్చి విడుచుచు నుండు పు
ష్పములు ధరించుట కదిధర ముఖ్యముగను। జారు శుభమూర్తి తొండ
మాన్ చక్రవర్తి॥ చ॥ అని హరియాన తిచ్చిన మహాద్భుత మొందిన రాధి
నాథుడి। ట్లనియె మహానుభావ సకలాత్ముల యాత్మవు నీవ గానవా। జ
ననము పూర్వజన్మ గతి చాలుగ జెప్పితి వాది దేవనే। మనుజుడగా ననీ
త్రిగుణ మాయ నెఱుంగుదునే పరాత్పరా॥ క॥ అని బహు విధములుగా
నిటు। వినుతులు గావించి హరిని వీడ్కొని యపుడా। జనపతి సంతో
షించుచు। ఘనభక్తి చెలంగ విశ్వకర్మను గొనుచున్॥ వ॥ వెంకటాద్రి
జేరితాముమున్న ద్రవ్విన భావికి కట్టడము గట్టించి స్వామివారికి దేవాల
యంబు నిర్మింపు మనిన విని యావిశ్వకర్మ శిల్ప శాస్త్రప్రకారంబుగా ప్రా
కార త్రయంబును గోపుర ద్వయంబును సప్త ద్వారంబులును నాస్థాన
మంటపంబును ముఖ మంటపంబును గోశాలయును ధ్యాన శాలయును
మహానస గృహంబును వస్త్ర భూషణ పరిమళ ద్రవ్య గృహంబులును
వైవాహిక మంటపంబును దైలఘృత కూపంబులును భక్ష్యశాలయును
నైవేద్య శాలయును నన్న శాలాగ్రంబున భూతీర్థ కూపంబును నిర్మిం
చి యన్నిటికి మధ్య ప్రదేశంబున దాళ వృక్ష ప్రమాణోన్నతవిమానం
బు రచియించి తదు పరి శాత కుంభంబునుంచి విశాల వీధిత్రయంబుగా
వించి వెంకటాద్రికి వరుస వచ్చుటకు యోజన మార్గ సోపానంబులుం
నడుమ నడుమ మంటపంబులును సెరాగారంబులును నిర్మించి సకల ప
దార్థాకర్షణంబు జేయించి యాయా గృహంబు లందుంచి గిరిడిగ్గి హరి

చెంతజేరి మ్రొక్కి యిట్లనియె॥ మ॥ హరి మీసత్కృపచేత వేంకట గిరీం
ద్రాగ్రంబునన్ మీకు మం। దిరమై యున్నది మీరు మీసతియునం దే
ల్చి యుండుండుము। మ్మతి లేకిప్పుడు కొల్చి కింకరుడనై యందుండె
దన్ నిత్యమో। పరమాత్మా యని తొండమాను డిటులన్ బ్రార్థింపగా వే
మరన్॥ క॥ ఘనవైఖానస వంశం। బున నుద్భవుడైన విప్రముఖ్యునితో
డన్। వనజాక్షుడు శుకకుంభజ। లనుదోడ్కొని వేంకటాచలము మా
ర్గమునన్॥ క॥ వచ్చుట కుద్యుక్తుండగు। టచ్చట వసుధానుడెఱిగి యజ్ఞా
క్షునకున్। హెచ్చుగ బద్మావతికిం। దిచ్చెదనని భూషణములు హే
మాంబరముల్॥ తే॥ తెచ్చి వారలకర్పించి దీనవదను। డగుచు నుండగ
జూచియిట్లనియె జక్రి। చింత నీకేవల సుధాన శేషగిరిని। నిలిచి యుండె
దమని పల్కెనెనరు మీఱ॥ తే॥ మరల నిట్టులనియె మచ్చిక నార్యుల।
నాదరింపు చుండు మబ్జపతిని। జూచు కొఱకు దండ శేషాద్రికెప్పుడైన।
వచ్చి పోవుచుండు వసుధనేలు॥ వ॥ మని సమ్మతంబుగా జెప్పివానినీడ్కొ-
ని పద్మావతీ సమేతంబుగా దొండ మానుం దోడ్కొని మంగళ వాద్య
ములతోడవికృతినామసంవత్సరంబున భాశ్వమిదినంబునునశ్వినీనక్షత్రంబు
గురువాసరంబునుగూడినశుభదినంబునాడుసాయంకాలంబున వేంకటాద్రి
ని వైఖానసబ్రాహ్మణునిచేత వైఖానసాగమోక్తంబుగాబుణ్యాహవాచనా
నన్యంబులాచరింపించిస్థిరలగ్నంబునస్థిరోభవయని బ్రహ్మఋషులు పల్క-
చుండగా శ్రీనివాసుండానందనిలయంబుం బ్రవేశించెనప్పుడు బ్రహ్మేంద్రా
దులుసుమవృష్టిగురియించి శ్రీనివాసునిచెంతజేరినుతించిరంత వైఖాన సద్వి
జులుసుమవృష్టిగురియించి శ్రీనివాసునిచెంతజేరినుతించిరంత వైఖానససద్వి
జుండుద్వారపాలకులనిల్పి యథాక్రమంబుగాహరినిపూజించెనప్పుడు హరి
పద్మపీఠంబుమీద బాదంబును నిలిపి కటిప్రదేశంబున వామకరంబునుంచి
దక్షిణపాదప్రదేశంబును దక్షిణకరంబుతో జూపుచు బ్రహ్మాదులజూచియి
దిపరమపదంబని పలికె నంత బద్మజుండాహరి సాన్నిధ్యంబున రెండఖం
డదీపంబులుంచి యింద్రాదులతో నిట్లనియె॥ సీ॥ ఎందాకగలిధర్మ మిద్ధా
త్రియందుండునందాక దీపద్వయంబునుండు। నెందాకదీపంబు లిరవందునం
దాకమహనీయ దివ్యవిమానముండు। గలియుగంబడగిన మలుగుదీపంబు
లునపుడు విమానమీయవనిద్రెళ్ళు। నవ్విమానమువడినప్పుడీ వేంకటే
శ్వరుడు నావైకుంఠపురముజేరు। నంతకృతయుగ ముదయించున వనిమీ
ద। ధర్మదేవత నాల్గు పాదములనడచు। మూడుయుగములు వైకుంఠమున వ
సించి। కలిని శేషాద్రి జేరు వేంకటవిభుండు॥ క॥ అని బ్రహ్మపల్కుపల్కులు
వినిముదమును బొందియాదివిష్ణుండిచటన్। వనజజనాకురథోత్సవ। మను

వందగజేయు మరలనన నజుడంతట॥వ॥అందాద్యుంచై యున్న తొండవాట చక్రవర్తిచేత వైఖాన సాగమోక్తంబుగా నుత్సవప్రయత్నంబులు సేయించి పూర్వప్రకారంబుగా గన్యామాసంబు నందంకురార్పణ ధ్వజారోహణ వివిధవాహన రథోత్సవతీర్థ వాదిప్రముఖ కృత్యంబు లాచరింపంజేసిబహు భక్ష్యబహువిధాన్న నైవేద్యంబులరప్పింప నిర్ణయించి సర్వంబును శ్రీనివాసార్పితంబని మ్రొక్కి హరియాజ్ఞాధారియై యింద్రాదులని జస్థానంబులకంపితానును సత్యలోకంబు జేరెనంత తొండవానుండు హరికిసకలోత్సవంబులుసాగింపుచునిజరాజ్య పాలనంబు జేయుచుండె నందొక్కనాడు॥ సీ॥ శ్రీకరమతినివసిష్ఠగోత్రుడు కూర్ముడను బ్రాహ్మణోత్తము డటకువచ్చి। తొండవానునిజేరి తొలుతగారాజ్యార్థియై యాశీర్వదించి యిట్లనియెరాజ। వినుభార్యతో జాహ్నవీయాత్రబోవగా భార్యకుగర్భంబు ప్రాప్తమయ్యె। బంచాబ్దములవాడు బాలుండుతల్లిసి వీడినా వెంట రాలేడుగనుక। ధర్మసంకటమైనది త్రతిని సతిని। సుతునినిందుంచిపోయెద సుస్థిరముగ। నిరవురకు నన్నమిప్పించియియాస్థలమున। నీవుపాలించుచుండుమో భూవరేణ్య॥ మ॥అనియావిప్రుడుపల్కగానృపుడు నీవారిటనిందుంచిపొ। మ్మనగాగూర్ముడు నమ్మియాత్రజనెనందావిప్రభార్యల్ సుతుల్। మును జేంబ్రుండొకమూలగేహమున నేమంబొప్పగానుంచితే। మ్మనినార్నెల్లకు జీవనంబచట సంపూర్ణంబుగానుంపగ॥ ఆ॥ బహువిశాలమైన భవనంబులోనంత। విప్రభార్యయుండెవిధివశమున। వీధితలుపుచిలుకు వేసియుండెవ్వడో। యటికేనంతవిప్రతరుణిలేచి॥ ఉ॥వాకిలితీయుడంచవలి వారినిబిల్చినవారిపీనుల। సోకకయుండెనప్పలుకు జోద్యమునొందుచు విప్రభామనే। నేకణిందరింతు హృదయేశ్వరు డిచ్చటనుంచె నంచుబల్। శోకమునొందుచుల్ దిశలుచూచుచునచ్చటనుండెనయ్యెడల్॥ ఆ॥ ఆఱునెలలపత్యమై పోయెనటుమీద। కూడులేకచాలగుందియుండి। బెంపువడికృశించి బిడ్డలిద్దరుతాను। బ్రాణములను విడిచిపడిరిధరను॥ చ॥ ఘనుడగుతొండ వానుడిటుకర్మ వశంబునవిప్రకాంతనం। దొనరగనుంచుటల్ మఱచియుండగ గాశికిబోయి బ్రాహ్మణుండునుదనుజేరి పుత్రిసుతులున్ సతియేడనటంచు బల్కగా। వినిమదిభీతినొందినృప వీరుడుచారులనంపెన త్తఱిన్॥ ఉ॥ చారులపోయివి ప్రసతిసంతతితోడనశించుచందముల్। బోరునజూచివచ్చి నృపపుంగవు వీనులలోనజెప్పగా। నారట మొందిదుఃఖమపుడంతర మందొకమూలదాచియా। భూరమణుండునొచ్చుచుదపోధనవిప్రునిజూచియిట్లనెన్॥సీ॥ వినుబ్రాహ్మణోత్తమ వేంకటేశ్వరుదర్శ నార్థమైమాయింటి యాడువారు। చనగాబతివ్రతయనొప్పువీభార్యవారితో శ్రీశ్రీనివాసుజూడ। బోయినదికవచ్చు భోజనకృ

త్యంబుసాగింపుచుండు మిచ్చటనటంచు । సమ్మతిగా జెప్పి సామగ్రినిప్పించి
పంపించి యచ్చటబగలుగడపి రాత్రి కాగానె బిలము మార్గమునబోయి। వేం
కటేశ్వరుచరణారవిందయుగళి । చెంతబాష్పములొల్కగా నిల్చెనృపతి।
నిందిరాధీశ్వరుడుచూచి యిట్లులనియె॥ సీ॥ రాజేంద్రనివింత రాత్రికాల
మునీనక్కడ విందువచ్చినకార్యమేమి । సెప్పుమేర్పడనన్న శ్రీనివాసున కి
ట్టులనియెనృపాలకుండంబుజాక్ష । పాపాత్ముడైనేను బ్రాహ్మణస్త్రీవధ జే
సితినన్ను రక్షింపవలయు । ననుచుదత్క్రియము దుఃఖాక్రాంతుడై చెప్ప
గా హరిపల్కె భూనాథవినుము । మించిపోయిన పనికింక మిడుకనేల।
యెండిపడియున్నదట్టంబు లిచటికిపుడె । నీవుదెప్పింపుమనగ నానృపుడు
భటుల। బట్టితెప్పించెతత్కళేబరములటకు॥ వ॥ అంతశ్రీనివాసుండుతొండ
మానునితోడనక్కళేబరంబుల బట్టించికొనిస్వామి పుష్కరిణికి బూర్వది
గ్భాగంబునందున్న దివ్యసరోవరంబునకుబోయి తత్తీర్థంబునందా కళేబరం
బుల ముంచియెత్తెనప్పుడమ్మువ్వురు పునర్జీవితులై లేచిరంత దేవతలుపుష్ప
వృష్టిగురియించి యప్పుణ్యతీర్థంబున కస్థితీర్థంబను నామంబిడిరందు తొం
డమానుండు సంతసించిహరినినుతించెనంత శ్రీనివాసుండు నిజస్థానంబు జేరి
కలియుగంబున జనులతో బ్రత్యక్షంబుగా మాట్లాడిన నిట్టిధర్మసంకటం
బులు పుట్టుంగావున నింకమాట్లాడ దగదు చెప్పదగుమాటలు స్వ
ప్నంబులందు జెప్పెదగాకయని మౌనము ధరించె దొండమానుండు
మృతులై బ్రతికిన యమ్ముఫ్వురుని గూర్పుని కొప్పగించెనప్పు డవ్వి
ప్రుడు భార్యాపుత్రపుత్రికలంజూచి యెందుబోయితిరని యడుగగాన
బ్భార్యయిట్లనియె॥ సీ॥ స్వామినేనేమనిచర్చించి చెప్పుదు మహనీయమగు
విష్ణుమాయ చేత । బుణ్యమార్గంబున బోయి బ్రహ్మాదులున్నట్టి లోకంబు
లనన్నిచూచి । వచ్చితిననియెనవ్వల గుమారుండిట్టులనయెనో తండ్రినేన
ద్భుతముగ। బోయిసప్తద్వీపములను దోయధులను గైలాసగిరిని శంకరుని
జూచి । యలరివచ్చితి ననియె నయ్యాడు శిశువు । పలికెనిట్లనిదాతనే బ
ర్వతముల । సకలవనముల దేవరాక్షసగణముల । వరసగాజూచి వేడ్క
తోవచ్చి నాను॥ క॥ అనియామువ్గురు తమతమ । యనుభవముల జెప్పి
రప్పుడా వాక్యములన్ । వినివెఱగున విప్రుండి। ట్లనియెన్ మీపుణ్యమతి
శయంబై యొప్పెన్॥ అ॥ అనుచువారితోడ నరుగ నుద్యుక్తుడై । యుండు
రీతిదెలిసి తొండమాను । డపుడు భూషణంబు లంబరంబులువారి। కిచ్చెద్వి
జుడు నృపుని మెచ్చిలేచి ॥ తే॥ రాజునాశీర్వదించి భూరమణమేము । పో
యివచ్చెదమని పల్కిపొగడిసతిని । బాలకులదోడుకొని పోయిచాలమది
ని । సంతసించుచు నిజని వాసంబుజేరె॥ క॥ తోషించిసతిని బిడ్డల। పోషిం

చుచు దానుముక్తి బొందెడికొఱకై । శేషాచలపతి మహిమవి। శేషము
గా బ్రజకు దెలియ జెప్పుచునుండెఁ॥సీ॥ అనవినిమునులెల్ల నాశ్చర్యమును
బొందియిట్లని పలికిరి దేనివింత। యీకళేబరములనిలమీఁదబడవైచిపోయి
లోకాంతరంబుల బరించి। గ్రమ్మరవచ్చి తద్ఘటములలోఁ జొచ్చియాకూర్మ
నకు వారలచటగనిన । వింతలుసెప్పిన విధము తేటగ జెప్పుమనవినిసూతు
డిట్లనియెవారు । స్థూలములను విసర్జించి సూక్ష్మతనువు ।లందువెలుగుచు
నుండిలోకాంతరముల । స్వప్నముల గన్నవింతల చందముగను। కూర్మున
కు వారుసెప్పి రాగుఱుతులెఱిగి॥ ఆ॥ బ్రహ్మమందు జీవపఙ్క్తులు కర్మసం।
స్కారలింగదేహ కలితులగుచు। నంబరమున దిరుగునట్టి పక్షులలీల । స
కలలోకములను సంచరించి॥వ॥ ఆవలదమ ఋణాను సంధానురాగంబుగా
గర్మసంస్కారంబుల తోడఁ గూడి యరుణరూపులై గగనాంతర్గతవాయు
పథంబునబడి సూర్యకిరణోదిత మేఘబృందంబులఁ బొందివృష్టి మా
ర్గంబున సకలౌషధీజాలంబులం జొచ్చియున్న రూపంబునొందిపురుష వీర్య
స్వరూపంబై స్త్రీగర్భంబులందు బ్రవేశించిస్థూలదేహంబులంధరించినవమా
సంబులందుండి వెడలిబాల్యకౌమార యౌవనవార్ధకాంతరంబు లందనుభ
వించిన కష్టసుఖంబుల మరలఁ జెప్పమరచి పోదుర రటుగాకనీమువ్వురు
కాలపరిపాకంబు గాక నేయన్నంబు లేకయ నశించిన స్థూల దేహంబులం
దుండక సూక్ష్మదేహంబుల నవలంబించికొని లోకాంతరంబులఁ జరించి
హరి కటాక్షంబువలన నప్పుణ్యతీర్థంబునందు బ్రవేశించి పరిపూర్తినొంది
న పూర్వస్థూల దేహంబు లందేమరలం జేరి నందునవారికాలోకాంతవ్యా
పారంబులు హృదయంబు లందుండి నిద్రజెంది కలలఁగని మేల్కాంచిప
రులకాకలలుచెప్పిన చందంబున వారాక్రూరునకు దమవిహారంబుచెప్పి రి
దియంతయు విష్ణుమాయావిలాసంబులని తెలయందగు నీయితిహాసంబువి
న్నవారి పాపంబులు నశించి పుణ్యాత్ములగుదురని చెప్పిన విని శౌ
నకాదులు సూక్ష్మజ్ఞాన దృష్టిచేత జీవతత్వాను భవప్రకారంబు తెలిసిసూ
తునిజూచి మరలనిట్లనిరి॥ సీ॥ నీవుసెప్పిన సూక్ష్మనిర్మల భావంబు తెలిసె
నో సూతసందియముదీరె । నదియటులుండ నిమ్మాకూర్మ డరిగినవెను
కనృపాలుండు వేంకటాద్రి । పతినెవ్విధంబున భక్తుఁడై పూజించె నారీతిసె
ప్పుమింకనినమునుల । గనిసూతుడిట్లనె జననాయకుండు భూమి నేలుచుశ్రీ
వేంకటేశ్వరునకు । దాసుడై ప్రతిదినంబునుదప్తహేమ । కమలములు
గొని బిలము మార్గమునబోయి । తులసికాదళ హారపంక్తులసువర్ణ । పు
ష్పముల వేంకటేశ్వరు పూజచేసె॥ఆ॥ అవలమరలి పోవునపుడు కుమ్మర
వాడు । మంటిపూలుతులసి యింటదీర్చి । దారుమూర్తియందు దాసను

ర్పింపగా । నట్టిమంటి పూలుహరిని జేరు॥క॥ వనజాక్షుండాసుమముల। తనయందేదాచుచుండుధరణీంద్రునకుఁ । గనబడనీకకులాలుని । తనమదిలో మెచ్చుచుండుదద్దయు వేడ్కఁ॥ సీ॥ రాజుజేసిన పూజరాజసంబని మెచ్చకుండి మృత్కుసుమంబు లొక్కనాడు । భూనాయకుండుతనుబూజజేసెడి వేళజూపెనాడామృత్ప్రసూనములను।గాంచినేనితవిబంగరుపూలబూజింతు నీమంటి పువ్వులిందెవ్వ డుంచె । ననిసంశ యించుచున జ్ఞాతునకు మ్రొక్కి పలికెనిట్లనుచు నోపరమపురుష । నేసమర్పించుసుమములనెల్ల ద్రోసి। మంటిపూలిందు బెట్టిన మనుజుడెవడు । దెలుపుమ నిస్పృహుడవగు నద్దేవదేవ । డమ్మహీపతికి పుడిట్టులని యెనగుచు॥ తే॥ అనఘ యిచటికి గ్రోశద్వయార్ధదూర । మందొకడు కుర్వకగ్రామమందుకలడు । ధరకులాలుడు భీమాభిధానుడధిక । భక్తుడిల వేదవాడందు బ్రతిదినంబు॥ ఉ॥ కుండలుచేసిచేసియొకకూటను బెట్టుచునప్పుడప్పుడుఁ । రెండుకరంబులంబులిమిరేగిన మృత్తికచేతబుష్పముల్ । దండిగజేసినావలెనె దారుకరూపము నేర్పరించితా।నిండినభక్తిమీరగను నిత్యమునర్చనజేయుచుండగఁ॥ సీ॥ ఆపుష్పములనేనంగీకరింతునిట్లనుదినంబనిపల్కెనపుడునృపతి । నెఱిగునొందుచుహరి వేవేగబూజించిబిలము వెల్వడిపోయి భీముచెంత। జేరినరాజునీక్షించికులాలుడిట్టనెమహారాజనీవద్భుతముగ। శూద్రగృహమునకు జొచ్చివచ్చుట కేమిపనియానతిండన్న జనవిభుండు। పలికెనిట్లని భీమనీభక్తి శేష। శైలపతిమెచ్చినాడు నిశ్చయముగాను। నీవుచేసినసద్భక్తిభావరీతి । తేటగానాకిపుడునీవు తెలుపుమనఘ॥ చ॥ అనినకులాలుడిట్లనియె నయ్యనృపాలక శూద్రజాతివాడనుబహుల నీచకర్ముడజడత్వమనస్కుడ నేనువిష్ణుభా । వనగనినీకు జెప్పగలవాడనెభూధవ రేణ్య యంచున । య్యనఘుడుపల్కుచున్నతఱినంబరమార్గమునందుధీరుడై॥ తే॥ గరుడవాహనమెక్కి వేంకటవిభుండు । భీముడన్నట్టిచోటికి బ్రేమమీఱ । బోయిరావో యనీవహో పుణ్యపురుష । నీకుసాయుజ్యమిచ్చెదనేడటంచు॥ క॥ సరసిజనాభుడువల్కగ । సరగున భీముండు మ్రొక్కి సతితోనపుడే। హరిసాయుజ్యపదంబున। కరుగగగని తొండమానుడారటపడుచుఁ॥ సీ॥ హరికిట్టులనియెనోయజ్ఞాత నీభక్తుడగు భీముజూచినే నాప్తముగను । భాషించుచుండగా బరమపదమువానికిచ్చి పంపించితివింత తోనె । నాకుసాయుజ్యమెన్నటికీయ్యదలచియున్నావన్న విష్ణుండునవ్వి పలికె। నతనిసాత్వికభక్తినంగీకరించితిసాయుజ్యమిచ్చితిసజ్జనుండు। పూర్వమే మోక్షమడుగనీపూజపరుల। కెఱుక మైచక్రవర్తినీ యింటికెపుడు। వచ్చినప్పుడునీకునీవనిత కేను ।మోక్షమిచ్చెద నని యంటినీక్షణమున॥ క॥ వానికి మోక్షమునిచ్చితి। దీనికిజింతింపనేల ధీరుడవగుచుఁ । నీనందనునకుబట్టము

మానితముగఁగట్టియుంచు మానవనాథా॥ సీ॥ పట్టివిజ్ఞానసద్భక్తివైరాగ్యము
లలవాడవగుచు దుష్కామములను । విడిచినిర్మలుడవై విజనస్థలముఁజేరినన్ను
ధ్యానించుచు న్ననురయమున । సారూప్యపదవినిశ్చయముగా నిచ్చెద
ననియతనికిఁజెప్పి యంపెఁజక్రి। నిజనివాసము జేరి నిశ్చలుండై తొండమా
నుండు సుతుఁడైన శ్రీనివాసు । జేరి నేడ్కఁతో రాజ్యాభిషిక్తుఁజేసి। వెంక
టేశ్వరు చరణార విందములను । క్రమముగాఁ గొల్చినిత్యోత్సవము
లు సేయు । మనుచు సుతునకు నియమించె ననఘుఁడచట॥ ఆ॥ తొండ
మాను డంతదుర్య భక్తిజ్ఞాన । యుక్తుఁడై మహా విరక్తుఁడగుచు । వెం
కటాద్రిఁజేరి విజనస్థలము నందు।నిలిచి ధ్యానయోగనిష్ఠ నొందె॥ ఉ॥అంతట
గొంతకాలమున కంబుజలోచను డానృపాలకుఁ । స్వాంతమునందుమె
చ్చుచునుసత్కృపతోనట కేగినవ్వుచుఁ । వింతగఁజెంత నిల్చినటవిఁ వ
సించుంచినభూవిభుండుశ్రీ। కాంతునిఁజూచి లేచి కరకంజములఁ ముకుళించిన
ప్రముఁడై॥ ఉ॥సద్గుణ మొప్పగా మదినచంచలభక్తిరసంబు నిండగా । గద్గ
దకంఠుఁడైనృపుడు కన్నులబాష్పములొల్కఁ మ్రొక్కుచుఁ । మద్గురుచం
ద్రనన్నిచటమానసమందుదలంచివచ్చితే । చిద్గగనాత్మనీమహిమ శేషు
డుసన్నుతిసేయనేర్చునే॥ శా॥ నేనామానవమాత్రుఁడఁ జపలుఁడఁ నీచా
త్ముఁడఁ దుర్మతిఁ । నేనిన్నెమినుతింపనేర్తునను మన్నింపఁ స్వభావంబుచే।
నేనిర్హేతుక జాయమానకరుణ న్నేడిందువెంచేసినా। వానందంబొదవెఁ గృ
తార్థుడను నేనైతిఁ జగన్నాయకా॥ మ॥ మునునేఁజేసిన నేరముల్మరచినా
మూర్ఖత్వముఁ గర్వమె । ల్లనుబోఁగొట్టుచుదండ్రిచందమున నఁ లాలిం
చివిజ్ఞానమి । చ్చిననినొద్ధరుణంబు దీర్చఁగల నే శ్రీస్వామినీసత్కృపా । ఘ
నతం బ్రోచితివిన్ని నాళ్ళిపుడు మోక్షం బిచ్చిరక్షింపవే॥ చ॥ మతిసెడ
విప్రభార్యను గుమారునిబిడ్డలఁదేర కేనుజం । పితినటు వంటిపాపమిల భీ
కరవృత్తిని ముంచునంచునఁ । హితముగఁబ్రోవవారలకు హెచ్చుగదేహ
ము లిచ్చునట్టిసీ । యతిశయమెంచ శంభునకుహాటకగర్భనకైనశక్యమే॥
ద॥ సతిపతియేకమైనపుడు సారవివేకము లేక రాత్రిన । చ్చితినల నాఁడు నే
నటుల జేసిన ద్రోహము నెంచకింతబ్రో । చితివిటువంటి సైరణయుజిక్కునె
యెంతటివారికైన శ్రీ । పతినినుబోలువేల్పులు ప్రపంచములోఁగల రేప
రాత్పరా॥ వ॥ అనియనేప్రకారంబులవినుతించిన నృపాలకుఁ నెచ్చిహరి
యిట్లనియె ॥చ॥ వినునృపనీకుసాత్వికవి వేకముపుట్టుట కైతపంబుఁజే।య
నునియమించితిప్పుడు మహాపురుషోత్తమభక్తినిష్ఠనీ । మనమున నిల్చెగాన
ననుమానము లేదిక మోక్షమిచ్చెదఁ। ననుబరమాత్ముఁడంచు నెఱ నమ్మిన
నమ్మికరిత్తవోవునే॥ చ॥ జనవరయింకగొన్నిదివసంబులుభూతల మందుని

ల్పెదో। ఘనభుజ మోక్ష మీాక్షణమె కానలెనో నిజమిాపు సెప్పుమన్నను
హరిజూచినవ్వి నరనాథుడు మోక్షమెనాకొసంగవే। యనిశరణాగతుండ
గుచునంచుచు రాగని చక్రినవ్వుచుఁ ॥సీ॥ కరుణారసమునృ పాగ్రశిమీా
దనిండించుచుండగా గగనమందుండిదివ్య। పుష్పకంబచటికదృశ్యతము గా
వచ్చెనప్పుడు తొండమానునాపుష్పకంబు। నందుంచిసారూప్య మతనికి
దానిచ్చి శ్రీవైకుంఠపురంబుచేరనంపి। తనని వాసముజేరె దదనంతరమున
నాచక్రవర్తిసుతుండు సాంగములను। వేగదండ్రికి బరలోక విధులొన
ర్చి। శ్రీనివాసుని పాదరాజీవయుగళ। మందు భూభాగ మంచుచునచలు
డగుచు। దానువసుధానుడును రమాధవునికచట॥ సీ॥ పవిబలని
త్యోత్సవపక్షోత్సవము మాసోత్సవసంవత్సరోత్సవములు। నడిపించుచుండ
గానారాయణుడుశిలావిగ్రహుడైమహావిభవమునను। సొంపుగానంగీకరింపు
చువసుధానునా శ్రీనివాసాఖ్యు సాదరముగ। బాలనసేయుచుభక్తిభావింపు
చుసకలకార్యములనుస్వప్నములను। దానె చెప్పుచువానముద్రనుధరించి।
కుదిరెపద్మావతినిగృహగూడివివిధ। వరములందరికిచ్చుచువారిధనములాదరిం
చుచు శ్రీపన్నగాద్రిమీాద॥ ఉ॥ వేంకటనాయకుండనగవిశ్వమునన్ప్రసిద్ధిబొం
దుచుఁ।గొంకకభక్తినిత్తమునుగూరిమితోఁ గొనిగోర్కులిచ్చుచుఁ। సంకరజా
తిమర్త్యులకుచాలుగబైకమునొప్పగించుచుఁ। బింకముజూపుచుఁ ధరకు
బేరునివడ్డికిరూకలిచ్చుచుఁ॥ క॥ లీలామానుషచర్యలు। చాలంజూపుచుస
మస్తజనులకుహితుడై। మేలునొసంగుచునీకలి। కాలము ఫణిశైలమందెక
డపుచునుండుఁ॥ ఆ॥ కలియుగాంతమందు క్రమ్మఱవైకుంఠ। మందు
జేరికలియుగాదికాల। మవలవచ్చినప్పుడా వేంకటాద్రిపై। మరలజేరు
చుండు మాధవుండు॥ క॥ అనిసూతుడు వేంకటపతి। ఘనచరితములొప్ప
జెప్పగామునులెల్లన్। వినిహాసభగితులయిమన।ముల వెఱగొందియనిరి మరి
యిట్లనుచుఁ॥ మ॥ ఆహాహాసూత పరాత్పరుండు జలజాతాక్షుండు నిత్యుం
డు శ్రీ। యుహిరాట్పర్వత నాథుడవ్యయుడు సర్వాత్ముండు లీలార్థమై। మ
హిమర్త్యాకృతినొందిపిమ్మటమహా మాహాత్మ్యపాషాణవిగ్రహుడై లోకు
ల బ్రోచుసత్కథల మాకర్ణప్రమోదంబుగన్॥ క॥ చెప్పితివిచ్చటవరుస
గ। దప్పకవింటిమి మహాముదంబాదవెనుసి। గొప్పతనంబింతింతని।యప్ప
ప్పా పొగడశక్యముగునె మహాత్మా॥ చ॥ అనిఘనశౌనకాది మునులందఱు
గౌరవమొప్పబ్రస్తుతిం। చినవిని సూతుడిట్లనియె సింధుసుతాధిపుడైన ప
ద్మగో। చనునిచరిత్రముల్పొగడ శక్యముగాదు విధాతకైననే। నొనరగ
మీాకటాక్షమున నూహకుదోచినయంత జెప్పితిన్॥ సీ॥ అనుచుబల్కినగోమ
హర్షణుసుతుజూచి మునులిట్టులని రాదిమూలమైన। విష్ణుడేపాషాణవిగ్ర

హంబైయుంట హేతువేసూన సూతుడిట్లులనియె। ననఘాత్ములార శ్రీహరి
స్వస్వరూపంబు నందరికిని జూపడందువలన। దనచిహ్నములు సర్వజనులు
చూచి తరించుటకుఁ గృపాలోక విడంబనముగ। దారుపాషాణమృత్తిక
దారుమూర్తులందు దీపించి భూలోకమందు వివిధ। పుణ్యనామంబులను దా
ల్చి పూజగొనుచు। వారికిష్టార్థములనిచ్చు భూరిదయుచు॥ వ॥ ఇవ్విధంబుగా
నొప్పు నర్చావిగ్రహచిహ్నంబుల నీక్షించి యాచిహ్నంబు లిట్టివని తెలిసి యీ
చర్మచక్షుస్సులతో జూచిన విగ్రహంబులు మనోదృష్టికి బ్రత్యక్షంబు లగు
చుండగా హరివారి మనోమాలిన్య నివారణంబు చేయుచుండుంగావున సర్వ
జనులకడ తేకుటకు సర్వవిగ్రహంబులు ప్రథమసాధనంబు లగుం గావున
బ్రతిమార్చనంబులు చేసి తద్ద్వారా హరి సర్వాంతర్యామి యగుటం జేసి రా
మకృష్ణాదివిభవావతారధ్యానగుణానుభవంబులు చేయుచుండి దానయని
రుద్ధప్రద్యుమ్న సంకర్షణవాసుదేవ వ్యూహప్రభావంబు నెఱింగి ధ్యానించి
తన్నామ జపంబులు చేసి పరమగతి బొందుటకర్చా రూపంబులు హేతు
వులగునందు సకలజన సంరక్షణంబు జేయుటకొఱకు శ్రీనివాసుండు స్వయం
వ్యక్తార్చావిగ్రహుండయ్యెనని చెప్పి సూతుండు మఱియు నిట్లనియె॥ క॥
శృంగారాంగునకుజయు। మంగళమహిరాజశైలమందిరునకు శ్రీ। మంగా
పతికతిశయశుభ। మంగళమొనగూడవలయు మహియందెపుడున్॥ క॥ అ
ని సూతుడు నచియింపగ। విని శౌనకముఖ్యమునులు వేంకటపతికిన్। గొని
యాడుచు సూతుని సొ। నొనరగ శుభగోష్ఠి నచట నుండిరి వేడ్కన్॥ క॥ భా
వజజనకశుభాకర। భావజరిపుమిత్రభూతభావనవిలస। ప్రాభవాతీతజగన్మ
య। శ్రీవేంకటగిరినివేశ చిదచిదధీశా॥ తురంగవృత్తము॥ వికటసురరిపుహ
రణగురుతరవిశ్వ రక్షణాకరణా। సకలమునిజనహృదయకమల విచారణా
ఘనివారణా। మకుటకలితవిలసితమణిఘృణి మస్తకాఖిలపూరణా। ప్రక
టకనకరుచిరశిఖరియుత శేషనగాద్రి విహారణా॥ మాలినీవృత్తభేదము॥ కర్మ
విధాయక కర్మవినాశకకర్మ ఫలాశ్రిత కాంతియుతా। ధర్మవివేచనధర్మసు
ఖార్జన ధర్మమతవ్రతధర్మహితా। మర్మసుఖాస్పదమర్మఫలప్రద మర్మవిల
క్షణమర్మరతా। భర్మనగాత్మజ భర్మగిరీశ్వర భర్మనయాంబర బ్రహ్మ
మతా॥ విభూతివృత్తము॥ జ్ఞానమార్గదీపకా జ్ఞానదివ్యరూపకా। జ్ఞానయోగ
రక్షకా జ్ఞానవిజ్ఞశిక్షకా। జ్ఞానసద్విధాయకా జ్ఞానశక్తినాయకా। జ్ఞానక
ర్మసాధకా జ్ఞానపూర్ణబోధకా॥ మాలిని॥ సురహృదయవికాసక్షుద్రరక్షో
వినాశా। గురుతరసువిలాసకోటిసూర్యప్రకాశ। పరమపదనివాసా పాలితా
చార్యదాస। సురుచిరదరహాసా సుందరశ్రీనివాసా॥

గద్య॥ ఇది శ్రీ తరిగొండ లక్ష్మీనృసింహ కరుణాకటాక్ష కలితకవితా

విలాసవసిష్ఠగోత్ర పవిత్రకృష్ణయార్య ప్రఖ్యాతసుబోధవ వేంకమాంబా ప్రణీ
తంబైన శ్రీవేంకటాచల మాహాత్మ్యంబున భవిష్యోత్తర పురాణంబునందెలు
కకథయును హరి ధరణీదేవి కెఱుకసెప్పుటయు ధరణీదేవి పద్మావతి నాద
రించుటయు బద్మావతి తల్లికి హరివృత్తాంతంబు జెప్పుటయు వకుళవచ్చి ధర
ణీదేవితో సంభాషించుటయు నాకాశరాజు హరికి శుభలేఖ పంపించుటయు
హరియాకాశరాజునకు బ్రత్యుత్తరము లిఖియింపించుటయు వకుళ శేషాద్రికివ
చ్చి హరికివార్త లెఱిగించుటయు వివాహంబున కర్థంబు లేదని వకుళ వరాహ
స్వామితో జెప్పుటయు హరిచే శుభలేఖం గైకొని గరుడుండు సత్యలోకంబునకే
రుగుటయు జక్రిచే శుభపత్రిక గొనిచని శేషుండు శంకరునకిచ్చుటయు శ్రీనివాసు
డింద్రాదులతో సంభాషించుటయు సిరినిదలంచి హరి చింతించుటయు గొల్లా
పురవాసినియైన లక్ష్మి నిసూర్యాంశుదోడ్కొనివచ్చి హరి చెంతనిల్పుటయు సి
రితో హరి తనకష్టంబు జెప్పుటయు హరితో లక్ష్మి సంభాషించుటయు గులదేవ
తార్చనంబును హరికు జేయసకప్పు పత్రంబు వ్రాసియిచ్చుటయు సాయంకాల
వర్ణనంబును సూర్యోదయవర్ణనంబును బ్రహ్మాదులతో శ్రీనివాసుడు వివా
హంబునకు దరలిపోవుటయు స్వామికాకాశరాజు కన్యాదానంబు జేయుట
యు వివాహానంతరంబున హరియగస్త్యాశ్రమంబునకు బోయి బ్రహ్మాదు
లవీడ్కొల్పుటయు శ్రీలక్ష్మి క్రమ్మర గొల్లాపురంబున కరుగుటయు వసు
ధాతోండమానులు యుద్ధసన్నద్ధులగుటయు దొండమాన్ చక్రవర్తికి హ
రివిశ్వరూపంబు జూపుటయు శ్రీనివాసునకు విశ్వకర్మ దివ్యాలయంబు ని
ర్మించుటయు బద్మావతీ సమేతంబుగా హరి శేషాద్రి జేరుటయు గూర్మని
వృత్తాంతంబును శ్రీనివాసుండు భీమునకు సాయుజ్యమిచ్చుటయు దొండమా
నునికి జక్రీ సారూప్య మిచ్చుటయు నను కథలంగల.

పంచమాశ్వాసము-స్వంపూర్ణము.

---

శ్రీరస్తు.

## శ్రీవేంకటాచలమహాత్మ్యము-షష్ఠాశ్వాసము.

### పద్మపురాణంబను వీరలక్ష్మివిలాసము.

శా॥ శ్రీమత్కోమల నీలతోయదనిభం శృంగారపూర్ణేక్షణం। హే
మాభాంబర దివ్యభూషణధరం హేలావతీఖేలనం। కౌమారీశ్వర సన్ను
తాంఘ్రికమలం కల్యాణలీలాగుణోద్దామం శ్రీతరిగొండ శేషకుధరాధ్య
క్షంభజేహంసదా॥ క॥ శ్రీమద్గుహ వరశుభకర। శ్రీనృసింహ సింహదేవచ

స్మయభావా । శ్రీమహిళాధిప ఘనతర । శ్రీమద్వేంకట గిరీశ జితదనుజే
శా॥ సీ॥ అనిగురుదైవంబులను దలంపుచు వేంకటాద్రి మాహాత్మ్యమంచ
నుచుధరను। వెలయువరాహభవిష్యోత్తర పురాణములయందు నలువది
మూడునైన । భాసురాధ్యాయ ముల్పద్య కావ్యంబుగా మొనసియైదా
శ్వాసములురచించి । హరికి సమర్పించియవల బద్మపురాణమందునింతగ
వెంకటాద్రివిభుడు । సిరినిగూరిచి దపముమ్మఱ జేసినట్టి। చరితములుకొన్ని
దొరకగా సంగ్రహించి । సరవినాశ్వాసమున కవిచాలవనుచు । వేఱుక
ల్పన కొంతగా వింపవలసె ॥క॥ కావున నిపుడొక గతిగ్రృతి । గావిరచిం
చెదదప్పుగా జూడకనఱ । గావుడటంచును బెద్దల । సేవించెదనెల్ల బ్రా
ద్ధ చిత్తంబలరఱ॥ గీ॥ ఈకృతికిడగు నభిదాన మెద్దియనిన । శ్రీకరంబగు
వీరలక్ష్మీవిలాస। మనెడు నామంబు పెద్దలయనుమతిమున । నిర్ణయించితి
నన్ను మన్నింపవలయు॥ గీ॥ భారతినిజిహ్వ యందుంచి నారసింహు। డేవి
ధంబున బలికించునా విధమున । బలికెదను భాగవతులు నాబాలభాష।
లందసహ్యతలేక నెయ్యమునవినుడి॥ వ॥ తత్కథాప్రారంభం బెట్టిదనినభ
విష్యోత్తర పురాణంబునందొప్పుచున్న శ్రీనివాసస్వామి చిత్రచారిత్రంబు
లవిని శౌనకాది మహామునులు మఱియు నొక్కనాడుప్రాతః కాలంబున
స్నానసంధ్యాద్యనుష్ఠానానంతరంబున సూతుంజూచియిట్లనిరి॥ సీ॥ ఓసూ
త శ్రీశ్రీని వాసుచరిత్రంబు లెన్నివిన్న నుతృప్తినెనయ దాత్మ। కావుననీవుత
త్కథల క్రమ్మఱమనుజ వేషమునర మావిభుండు । ధీరుడై పద్మావ
తిం బెండ్లియాడిన వెనుక మహాలక్ష్మి విశ్వసించి । హరివక్షమందుండకరి
గి కొల్లాపురమందున్న పిమ్మట నర్థిసుతను । దలచునో లేక శౌరిసర్దయత
చేత । దలపకాకాశ పతిసుతఁ దానుగూడ । మఱచియూరకె యుండె
నో మరలలక్ష్మి। నెదను జేర్చెనో లేదు మాకెఱుగ జెప్పుము॥ క॥ అనివారడు
గగ సూతుడు। వినినవ్వుచు సంతసించి వేదవ్యాసుఁ । మనమున దలపుచు
నపుడిట్లనియెన్మును లారవినుడి హరిచరితంబుల్ ॥క॥ ననుమీరడిగిన విధ
మున। మునుల దేవలుడను గాను ముచ్చటమఱ ।ఘనుడైనదే వదర్శను।
డనఘుండిట్లనియె నతని కడ మెట్లన్నఁ ॥ మ॥ వినుమో దేవల వేంకటేశ్వరు
డు శ్రీవిష్ణుండు పద్మావతిఁ । మనముప్పొంగగగూడియుండియును వేమా
ఱుఁ రమాదేవినే। తనచిత్తంబున జాలిచేదలపుచుం దద్రూపలావణ్యచిం
తనమేజేయుచు బన్నగాచలముమీఁదఁ సర్వభోగంబులఁ ॥సీ॥ అనుభవిం
పుచునుండెనటుకొన్నియబ్దంబు లరిగిన వెనుక శేషాద్రివిభుడు । తనమది
లో దానుదలచెనిట్లనిసిరి నెడజేసి నరుడనైయున్నియేండ్లు। గడుపుచునుంటి
నింకనెడంబుగా నుంచియుంటుట మేరగాదు దధిసుతను । వక్షమంగుంచు

కోపలెగాన నేరీతినయిన బ్రార్థించి నెయ్యమున బటసే। నేనుదోడ్కొని రా
కున్న నిఖిలకార్య। ఘటనములు గావు కీర్తి దక్కదాకు వేరు। చేతదీసిన
ఋణము దీర్చెడి యుపాయ। మైనదొ చదు నాకిప్పుడంచు నెంచి॥ మత్త
కోకిల॥ నిరతము న్మది జింత జేయుచు సిరజేకుఁ డార్తుడై। నరుని చాడముగా
విరక్తుడనంగ నొప్పుచు సర్వము౯। మఱచి తాదనుజూచుచుండెడి మానిని
మాడ్కి ని బద్మమందిర విలాసగుణంబు లెల్ల మది దలంపుచు నుండగ౯॥
సీ॥ అపుడు పద్మావతి హరి సర్వవైరాగ్యకలితుడై యున్న లక్షణములెల్ల। భా
వించి భావించి భయమొంది యెక్కనాడే కాంతసమయమందిట్టులని యె।
శ్రీస్వామి యిపుడు మీచిత్తమందొక చింత బుట్టెట మీ ముఖాంబుజ ము
నందుఁ గనిపింపుచున్నది కాలనుందరుసు గానిటు చింత వొడమిన హేతు వే
మి। దాచక నుజెప్పుడనుచు బాదములమీద। ఫాలమును జేర్చి విడువక
బహువిధముల। వినుతి సేయుచు నడుగగా విభువదనుచు। సతిని గ
రములతో నెత్తి హితము మీఱ॥ క॥ లాలింపుచు బద్మావతి। నాలింగ
న మొనర జేసి యన్యోన్యముగా। శ్రీలక్ష్మీశ్వరుడపుడా। హేలావతి మో
ము జూచి యిట్లని పలికె౯॥ సీ॥ విన వె పద్మావతి వివరంబుగా నీకు జెప్పెద
నెట్లన్న సృష్టి లేని। కాలంబు నందొంటిగా నిర్వికారుండ నయి నిర్గుణబ్రహ్మమ
గుచు నుంటి। నాయందనాదియై పాయక మూలప్రధానమై మాయాభిధాన
మొంది। చిద్రూపమై లక్ష్మి సద్రూపమైసన్ను బొందగా నప్పుడానంద మొదవె
నందు మహదాది తత్వంబులన్ని వొడమె। వాని మేళనమున సృష్టి వరుసగా
ను। బట్టుగను బుట్టి సర్వప్రపంచమయ్యె। నప్పుడంతటికిని గర్తనగుచు నేను॥
క॥ అది మొదలుగ బ్రహ్మాదుల। పదపడి పుట్టింతు నీ ప్రపంచము నాలో।
కుదురై యుండును వెలిబెం। పొదవు మనీరీతి వెలుగుచుండు మృగాక్షీ॥ క॥
ఇంత మహత్వంబా శ్రీ। కాంత కటాక్షమున నాకు గలిగి నదిపుడా। యిం
తినెడ బాసియుండుట। కెంతయు జింతింపుచుండు నిందుని భాస్యా॥ సీ॥
అద్వయ బ్రహ్మంబునైన నిరాకారమై యచలమై యున్న నా యందుబొంది।
ఘనసుందరాకారమును నాకు గల్పించి తగుసుందరాంగియై తానుని
లిచి। గురుతర కల్యాణ గుణములు నాకిచ్చి ననుగొప్ప జేసె నానాటనుం
డి। చంద్రుని యందున్న చంద్రికవిధముగ వెలుగుచు నాయురస్థలిని నిలి
చి। వేడ్కతో నుండగా నొకవేళ భృగుడు। వచ్చి సిరియున్న యురముపై
హెచ్చి తన్నె। నందుచే లక్ష్మి నామీద నలుకజేసి। విరసములు వల్కి కర
వీర పురము జేరె॥ క॥ అప్పుడు సర్వజ్ఞత్వము। తప్పాననుని శ్రీలక్ష్మి మిసే
విని బొందక। నప్పార పాటున మార్గము। దప్పక యీగిరికి వచ్చి దైన్యము
చేత౯॥ సీ॥ విలసిల్లి తింత్రిణీ వృక్షమూలమ్ము నందున్న వల్మీకమునందు మంటి

నపుడు । నాకుసర్వజ్ఞత లేకుండగానిందు దేరకుగొల్లచేదెబ్బగలిగె । నిను
జూచిమోహింప సనఖజనము చెబలనుగాఁ బాళ్ళ ప్రేటులును గలిగె । సిరి
లేకయుండిన తఱివివాహేచ్ఛచే నాకు బేరునిచేత నప్పుగలిగె । వనితనీమా
తండ్రి తమ్ములిచ్చి నధనంబు । చేబుణము దీరక నేమిసేతునని । జాత
పుట్టిన దిపుడునాచిత్తమందు । దీనికాలోచ నంబేమిమీననయన॥ క॥ అ
నవినిపద్మావతి । యిట్లనియె మహాస్వామి మీకునగరగనాలో । చనమేను
జెప్ప నేర్తున । ననుమీరిట్లడుగురీతి నాయంబగునే॥ సీ॥ సృష్టిపూర్వమునం
దు చేపట్టినిమ్మింత గొప్పచేసిన లక్ష్మినిప్పుడిట్లు । నెడవాయ మేరగాదె
ట్లు యున ప్రార్థించితోడ్కొని వచ్చినాంతలోనుగాను । మీచెంతనిడి కొన్నమీ
కిశ్వరకు దాసినైకొల్చి సేవింతు నంతెకాని । నామదికాలోచనంబింత క
న్న వేఱొక నేమితోంచ లేదిందిరేశ । రయమున నఘున కొల్లాపురముఁ కరిగి ।
కమలమందిరమదిలోని కలతదీర్చి । యురుపురము దోడుకొని వత్తమిచటి
కనిన । జింతసేయ్కుమనియె నా శ్రీధరుండు॥ చ॥ వినుపద్మావతి యొంటి
కాపురము నీనేచేయుచుఁ వేడ్కగా । ననునర్ధక్షణమైన బాయకసదా
నందాత్మనై యుంటివా । వనజాతాలయవచ్చి సంతతము దావక్షస్థలం
బందు నిల్చిననిప్పుడు చూచి యోర్వగల వేచింతన్మదింబొందగన్॥ క॥
నీవిచ్చటననుగూడుట । కైవసనిధితన యువచ్చినప్పుడుతిరుగా । నావక్షస్థ
లినిడికొన । కావేళనె పంచితచటికి బ్జవళాక్షి॥ సీ॥ అనవినిచింతించి య
పుడుపద్మావతి పలికెనిట్లని రమాభామయిటకు । వచ్చియున్నపుడు మీ
వక్షస్థలంబునందిడి కొన్నకొదువ నాకేలగలుగు । నాలక్ష్మిమీకునాకనో
న్యముగ జేసియంతటికిసి గర్తయగుచునుండు । శ్రీరమాకాంతయై సీతయై
నను బెండ్లియాడు మటంచు మీకాంత్తముగరు । జెప్పినందున నే కదాచిత్త
గించి । నన్నుజేపట్టితిరి సదానందమొదవె । నింత భాగ్యంబుకృపనునాకి
చ్చినట్టి । సిరికి బ్రత్యుపకృతి నేను జేయగలనె॥ క॥ పరితినై ననిచటికి ।
గూరిమితో సిరిని దోడుకొనవచ్చిననే । నారామామణి పదములు । గౌరవ
మున గొలిచియుందు గమలదళాక్షా॥ మ॥ ననుగొల్లాపురమందు జేర్చుచ
టన్ నానాప్రకారంబులన్ । వనజాతాలయ నొప్పవేడికొని సర్వం
బున్ సమర్పించిర । మ్మనినేదో డ్కొనివత్తునన్నదరహాసాస్యంబు దీపిం
పన । వ్వనజాతాక్షుడు సంతసంబొదవనా వామాక్షితోనిట్లనెన్॥ క॥
సతినిలలితోక్తికినా । మదిసంతస మొందెవకుళ మాలికచెంతన్ । హిత
ముగనుండుము నేనిపు । డతిశ్రీఘ్రమునోడి తెత్తునబ్జజనిటకున్॥ వ॥ అని
శ్రీనివాసుండు నిశ్చయించె నట్టివృత్తాంతంబు లక్ష్మిభావించి తెలిసి తనలో
దానిట్లని వితర్కరించె॥ సీ॥ శ్రీవేంకటేశుడా శ్రితజనావనుడింక నిందుండ

నీయక హేంద్రగిరికి । ననుపత్న్య పనుదోషుకొని పోవ్రటకు వచ్చినప్పు
డు నేరానుబాస్మనను నాకు। నోరాడదిప్పుడ గారవంబుగదాగ నలయునే
నాసామి నకునూను । బగలు రేయుండిన బద్మావతికి జింతగలుగనా కేలసిగ
ర్మనుచుచు। రయమునను లేచి గొల్లాపురంబు విడిచి । దారిదప్ప కనగిరి
పాతాళమందు । జేరిహరి యంశుడయ్యు విశేష యోగి। మహిమచేపొప్పు
కపిలాఖ్యమౌని జేరె। క॥ అపు డాలక్ష్మి నిగనుగొని। కపిలమహేంద్రుండు చాల
గౌరవముగన । వ్విపుంగ్ర మతలమురా । చపలాక్షి విని త్వమదిని సం
శయపడకను॥ క॥ హరియంశము గలముపపై। నరమరమది నుంచుకొనక
నంబు నిసుతియం। దిరవుగ నిలిచిని జేసుని। స్థిరముగ హృదయమున బూజ
సేయు చునుండెను॥ సీ॥ అటుమీద శ్రీవేంకటాద్రి నాయకుడు ప్రాతఃకా
లమున లేచి తత్తపేము । చేలభూషణములు సిస్తుమీరధరించి హరిగరుడా
ఖ్య తురంగమెక్కి । యటబోయి వచ్చెదననుచు బద్మావతి కనుకూల
ముగ జెప్పి చనిన తరణి। నందున్న వకుళతో నావరాహస్వామితో జెప్పి క
దలియొంటిగో ముదమున । బోయి గ్రక్కున కరవీరపురమునందు । బద్మ
మాదిర యున్నట్టి భవనమునందె । చేరియందందు వెదకి యాక్షీరవార్ధి । క
న్యకామణి లేకున్న గలతనొందె॥ శా॥ ఖిన్నుండై మదినేమి దోచకచటం గ్లే
శాత్ముండై సారెసుం । గన్నెరూరకె నింపుచున్ వెదకుచుం గామాతురుం
డై మహా । పన్నుండై యకటార మానవుని నాపై మోహమే లేకనిం ।
దివ్యాశ్లేషపు డిందుడాగిన దానేనింకేడ శోధింపుచున్॥ సీ॥ అనిచిం
తజేయు చునచట నుండకపోయి పర్వతా దులజూచి పలికె జక్రి। గిరులార
తరులారకిన్న రాంగనలార కానరే మాగమాకాంతనచట । సురలార
మునులార నరులారమీరైన గానరే మాంగమాకాంతనచట । పద్మాకర
ములార పద్మాలయను జూచియుంటిరనచో జెప్పుమందుయుకి। నన్ను బాం
కించి యెచటనో యున్నదిపుడు । దానిజూడక నింక నేదాళలేను । గానజూచి
నవారు శ్రీకాంతనిపుడు । చూపుడనవారుహరి మోహముజూచియనిరి॥ మ
త్తకోకిల॥ దేవదేవమహాత్మ మేచకదేహ యిచ్చుట లేదు శ్రీ। దేవియెచ్చటనుం
డుచుందిను తేటగాగిన లేదుబో । కేవిధంబున విన్న విందుము హేంద్రసద్గిరి
నాయకా। నావుడున్ విని శోకచింతను నాల్గు దిక్కులజూచుచున్॥ వ॥ ఇ
విధంబున గొంతదడవుండి చింతించి మరల గొల్లాపురంబు చేరియందొక్క
చో లక్ష్మి నర్చారూపంబుగా దీర్చి యుంచి పూర్వంబున నగస్త్యుండు
పూజింపుచున్న లక్ష్మీవిగ్రహంబును బూజింపుచు దశవత్సరంబు లందు ద
పంబు సేయుచుండెనంత నొక్కనాడు సిరినిదలంచి యతి చింతాక్రాంతు
డై యున్న సమయంబున నశ్చర్యంబుగా నశరీరవాణి హరినుద్దేశించి యిట్లని

మె ॥సీ॥ దేవయిచ్చటరమా దేవిమీకిప్పుడుపాదసూపదీతపంబునకుమె
చ్చి। గాననిచ్చట కిజక్కగ దక్షిణాబుగా గీర్తింపదగి యున్న కృష్ణవే
ణి । యనునది ప్రవహించునటకు ద్వావింశతి యోజనంబులకవలనధిక ।
ముఖ్యమైనసువర్ణ ముఖరి యన్నదికినుత్తరతటంబుననిల్చి తపసివగుచు ।
గూఢసంభవుమున్న దిక్కునకుదూర్పు । గాప్రకాశించు సిద్ధసౌఖ్యస్థలము
న। స్వర్గమందున్న దివ్యసువర్ణకమల । మొకటిదెప్పించినాదియం దొనరసిలి
చి॥క॥ఆకమలమునకుదూర్పుడి। నాకరుని బ్రతిష్ట చేసియర్చించినచో। నాకమ
లమునుముకుళింపక। జోకగవికసించియుండుశోభనకరమై॥ శా॥నీవాకంజమునం
దుద్యత్ప్రతిష్ఠనిడుచునిష్టాగరిష్టుండవై। భావాబంధురమానసతిందలచితత్పద్మాంత
రాసీనగా। నేవేళన్నను నన్నుమార్చనమునందింపొందగ జేయుమా। దేవింపొంది
ప్రసన్నమైయురమునందేనిల్చు పొమ్మన్మహాత్మా॥ క॥ పదియును రెండబ్దంబు
లు । మదిశ్రీసతియుం జెసల్పివమానముగానిం । పొదవినలక్ష్మీమంత్రము । చె
దరనిష్టచుజ పంబు జేయుమహాత్మా॥ సీ॥ అనిభారతీదేవి యశరీరమై ప
ల్క విని వింతగాజక్రికనులుదెఱచి । నాల్గుదిక్కులజూచి ననుదేని కెవరం
డుగపిలింప కుండగాగగ ననాణి । చెప్పినదీమాటసిద్ధం బనుచు లేచిగరుడ
వాహానమెక్కికదలిదారి । దప్పక శేష భూధరము గ్రక్కునజేరి వేరెదా
నొకరాజ వేషముచట। గ్రమముగాధరియించిపుష్కరిణియందు। స్నానసం
ధ్యాదికృత్యముల్ సలుపుచున్న। గాంచిరా రాజకుండని గౌరవముగనెంచి।
వైఖానసార్యు లందిష్టులగుచు॥ గే॥ వేగ క్రతుభోక్త యగుమహావిష్ణుదే
వు। నతిథియనిపూజచేసి దివ్యాన్నముపుడు । పొసగనర్పించి విడెమిచ్చిపు
ణ్యకథలు । చెప్పిదయనుండుమంచునాశీర్వదించి ॥క॥ తను వీడ్కొల్పగబ
ర్వత । మునుడిగ్గియగస్త్యనామ ముఖ్యాశ్రమముం। గనుగొనిదానికి దూ
ర్పుగ । జనిసిద్ధస్థలమునందు సరగునజేరెన్ ॥ వ॥ అప్పుడు విష్ణుదేవుండు గ
రుడఘోటకంబుడిగ్గి యచ్చటనిలిచి వాయుదేవుని స్మరింపగా నతండువచ్చి
యాచక్రికి బ్రణమిల్లి యిట్లనియె॥ క॥ దేవానన్నుదలంచుట । కీవేళనుగార్య
మేమియెరుగింపు మమిం। సేవకుడనగుచుచేసెద । శ్రీవల్లభయనగ జక్రిచి
ఱునవ్వెసగన్ ॥ సీ॥ పలికెనిట్లని విను పవనసీవాస్వర్గమున కేగి యచ్చట
ముఖ్యమైన। యలఘుమందాకిని యందున్నవరకాంచ నాబ్జంబుసుర రాజు
నడిగి తమ్ము । పొమ్మనగా జక్రి కనూన్మరుతుమునిట్లులనియె హేమాబ్జం
బులమితములు । ముఖ్యాంబుగాస్వర్ణముఖరియందుగల్గగా వెతౌథ్రాబ్జంబు
వెదుకనేల । ననగనశరీరితనకు జెప్పిన విధంబు। లతసికెఱిగించి పంపగానన
లుడరిగి । వరసహస్రదళములసు వర్ణపద్మ । మమరపతిసెలవున దెచ్చిహ
రికొసంగి॥ క॥నిలువగమాధవు డిట్లని । పలికెనువిను పవన నేతపంబిచ్చో

టన్ । సలిపెదనికోప్యము । దెలిపితినిదియొకరి కొడ దెలుపకుమనఘా॥
గీ॥ అపునవినినవరుడుసుమహాప్రసాద। మనుచు మహాముయాజ్ఞగైకొనియరిగునం
త । గమలలోచనుడచటిపుష్కరిణిశనమున। కుంతమునుగ్రుచ్చిగోణ్ణమాత్ర
పైన। సీ॥ ఖాతంబు చేసియక్కడసువర్ణాంబుజనాళంబులొత్తుగా నాటిసిటి
పైనబద్మమునుంచి భాస్కరు నాదూర్పునందుంచిపూజించియచలమతిని ।
బద్మాకరమునకుపశ్చిమతటమందు జేరిపద్మాసనాసీనుడగుచు । నేత్రాగ్ర
మగుదృష్టి నాకాంచ నాబ్జమునందుంచి శ్రీసతినిభావించి యచట । నిలిపి
మానసపూజదాసిత్య మొనర। ధీరుడై చేయుచునురమాదేవిమంత్ర । ము
నుజపించుమనచొప్పట ముఖ్యతపము। జేయుచుండె నువిష్ణుండుసిరినిగూర్చి॥
క॥ హరియిటుతప మొనరించుట । హరిహాయుడెఱిగి యునుమఱచి య
వనీస్థలిపై । నరపతి యొకఁడోఘుతపము । నురుస్థ్మను నిలిచిచేయుచున్నా
డనుచున్ ॥గీ॥ తలచియతడుచేయుతపము పూర్ణంబైన । దనపదంబు జేరు
ననుభయంబు । వొడమదపమునకును బుడమిపై విఘ్నంబు । జేతునంచు
నెంచిజిష్ణుడపుడు॥ చ॥ తనమదినిశ్చయింపుచును దక్కకనప్పుడెవారకామి
నీ। జనములబిల్చి యిట్లనియెసాహసియొక్కడుమత్పదంబుజే। రనుదపమాచ
రించునలరాజును మోసముచేసితత్తపం। బును జెఱుపందగన్ జనుడుపుష్పశ
రున్ జతగూడివేడ్కగన్॥ మ॥ అనిరంభాదిసతీసమూహమును నెయ్యంబొప్పబం
పింపన। త్తనుమధ్యల్ మణిభూషణాంబులునువస్త్రంబుల్ విగల్ దివ్యచం। దన
ముందాల్చియుభూరముల్ చెలగగా తాంబూలముల్ చేయుచుం । జ
నివిష్ణుండు తపంబొనర్చు ఘనసుస్థానంబునం జేరగన్॥ క॥ కలకంఠముల
ఘులును జలు । కలుకలకలరవము జేయగా సూనశరుం । డలుక కమల
యానిలమును । జెలువలరగ గూడి యచటి చేడెల చెంతన్॥ క॥ చేరిన
మారునిగనియా । నారీమణులెల్ల మాఱిసి నగియచ్చటిశృం । గారవనము
లో జొరబడి । కోరికలుప్పొంగ బూలు గోయుచు వేడ్కన్॥ క॥ చిలుక
లవలె దగిజిలిబిలి। పలుకులు పలుకుచును జెలగి పక పక నగుచున్। గ
లిబిలిగా నొండొరులను। బిలుచుచు నిట్లనిరి చాల ప్రేమచెలంగన్॥ సీ॥అ
క్కలారా కొమ్మలెక్కి బువ్వులుగోసి చక్కగా వనమల్ల జల్లరమ్మ । భువి
నివ సంతమాధవు చెంతవనలక్ష్మి జేర్చి వివాహంబు జేయరమ్మ । మల్లె
పువ్వులు గోసి మగువలారా వేడ్కదలబ్రాలు వోయరే దంపతులకు।గీరం
బులను చెంతజేరపాటలుపాడ సెలవుమీరొసగ రేచేడెలార।యనుచుఘనతా
ళపద్ధతి నాడిపాడి। రభసములు చేయగా బరరాజవేష । ధారియై తప
మొనరించు దానవారి । నాక పతిసేత కాత్మలో నవ్వికొనుచు॥ చ॥ క
నులు విరోధియై తెఱచి కాంతులు దిక్కుల బిక్కటిల్లగా । వనజదళాయ

తేజుఁడు వారిని జూచి చలింప కాత్మలో । వనధిజనే తలంపుచు సువ
ర్ణమయాబ్జముదిక్కు చూడగా । ననిమిష కాంతలెల్ల భ్రమసియాహరిపై
దమ మోహ ముంచుచుఁ॥ మ॥ అపుడంచంచరు బోయి పూలసరము
ల్ హాస్యంబుగా బూనియు । త్రపసియాంగుని శౌరివక్షము వయిఁ దామే
యుచుఁ నవ్వుచుఁ । గపటం బుప్పచరించి నాట్యములు సద్గానంబులుం జే
సినఁ । జపలంబించుక లేకనచ్యుతుడు నిష్ఠన్నిల్చి దీపింపగఁ ॥ శా॥ వీణల్మీటుచు
బాడుచుఁ గులుకుచుఁ వింతల్వినోదంబులుఁ । జాణల్చూపుచు నందుదా
ముతమలో జాపల్య భావోక్తులై । నానాంబుప్రతిలంగబల్కుచును శ్రీనా
రాయణ స్వామినే । యేణాంకాస్యలు చూచిచూచితమ లోహైచ్చెన
మోహంబునఁ ॥సీ॥ కఱుగుచునుండగా గందర్పుడలుకతో కోకిల కాహ
ళికూచి చేసి। మలయానిలుని శోడమధుపాళిబలముచే జెలరేగి పురికొల్పి చిలు
కతేజిపై నెక్కి యిక్షుచాపం బెక్కువెట్టి బంభరమార్వి సారించి ప్రబలపుష్ప।
బాణంబులా చక్రిపై గాఢ నేయుచు వాగ్ఫివిజృంభించి యలసి నిలిచి। యతనిజలి
ఇంపసేయలేక వలనరిగె। జింతసేయురంభాదికాంతలబ్జలోచనుని జూచి తమకే
మితోచకితని। నే విధంబున వలపింతుమింక ననుచు॥సీ॥ ఒకరొక్కరిని జూచి మో
యక్కలా రయి నరపతితపమేఘనంబు చూడ। మొనసి విశ్వామిత్రముని త
పంబునకన్న ద్వైపాయనుడు సేయు తపముకన్న। నతిశయించిన దీమహారా
జునకు నేటికో డితిమింక బోవ్రదమటంచు । దలచుచుండ గజక్రీశన చెంత
నొక విశ్వమోహినీ దేవినిమ్ముగ సృజించె । దేవసఖులట్టి మోహినీ దేవి
నచట । గాంచి తమకన్న రూపరేఖా విలాస। విభ్రమంబుల భావించి వే
డ్కమీఱ । జూచి లజ్జించి తలవాంచి చోద్యమొంది॥ శా॥ ఈకాంతా
మణి నద్భుత క్రమముగా నీరాజు పుట్టించినా । డే కాలంబున నైన సిట్టిమ
హిమం బెందైన గన్గొంట మేలో కాతితుఁడు గాని యీ పురుషుడే లోకంబు
లో వాడుగా । డే కామ్రగ్స్థితి నిట్టి నిల్వమనుజుండెంత్రైన దానోపునే. సీ॥
అనుచు గొందఱు పల్కనట గొందఱిట్లని రహహా యీతపసి మహా గు
రుండు । కాకున్న నింత నిష్కామునై యుండునే తన చెంత నధిక సౌంద
ర్య వనిత । బుట్టించునే యీత పోధనుండిల నొక్కమనుజ మాత్రుడుగా
డు మాధవుండె । చెనకితి మూరక సిగ్గుపాట్లయ్యె నింకేమి సేయుదమం
చునింతులెల్ల । జింతసేయుచు నుండగా జిత్తజుండు । తలచె నిట్లని తండ్రి
మాతల్లి పొందు। కోరియిట జేయుతపమును జెఱుపఁబూని। యేలవచ్చితినని భీ
తి నేగనంత॥మ॥ దిగులుంబొందుచు నేమిదోచక పుడా దేవాదిదేవుఁ మహా। జ
గదీశుంగని భక్తి సాఁగనమస్కారంబులుం జేసి మెల్లగ మాట్లాడుచు సద్దుసేయక
టశ్రీలక్ష్మీశ్వరుం బాసియా। మృగనేత్రల్సని నాక నాయకుని సామీప్యంబునం

జేరగ ॥క॥ వారినిగని పురుహూతుఁడు। నారీమణులార ధరను నరపతి తపముం।
ధీరత చెఱిచితిరే యన। గా రంభా ప్రముఖ సతులు కళవళపడుచున్॥ సీ॥ పలికి
రిట్లని నీవు పంపింపగా పోయి నరపతే ననుచు నానావిధముల। దలకొని నృత్త
గీతములెంత జేసిన మాదిక్కు జూడక మహిని మీఱి। దనచెంత విశ్వమోహి
నిని బుట్టించినా డాకాంత కన్న మేనుందఱమును। దక్కు నైనందున దగ్గి
నచ్చి తిమిలజిర తరతపము జేసెడు ఘనుండు। మనుజుడనియుంటిమత డే
రమా విభుఁడు। గనుక చలియింపకున్నాడు కాముడతని। కదరి చని
వాడు తత్తరంబతిశయించి। యున్నదిదినిక్క మో పురుహూతయనిన॥
గీ॥ విని సురేశ్వరుండు విస్మయ స్వాంతుడై। చక్రి తపము సేయు సరణిమ
ఱచి। యేను జేసితిప్పుడిటువంటి యపచార। మనుచు హరికి మ్రొక్కియ
ఖిఁకుచుండె॥ సీ॥ దనుజారి యచ్చట దనమాయ చేబుట్టి సట్టి శక్తిని జూచి
యచలుఁడగుచు। బలికె నిట్లని నీవు ప్రజలచే నిందంధు బూజలొందుచునుండు
మమ్మటంచు। దాదాని బంపించి తదనంతరంబు సజిష్ణుండు నేరక చేయు
పనికి। కోపింపనేల్ల కొడుకు తప్పులు తండ్రిగాచి రక్షించిన కరణిబ్రోచి।
శాంతసుస్వాంతుడై హేమజలజముందె। పూర్వరీతిని మరల సంపూర్ణ దృ
ష్టి। నిలిపి చలియింపక తపస్సిష్ఠ మెఱయ। శ్రీరమేశుండు దపమొప్ప జేయు
చుండె॥ గీ॥ అచట బద్మావతీదేవి హరిని బాసి। నదిమొదల్నిద్ర లేక నాహారమైన
లేక నా చక్రధరుని పై వ్యాకులతను। విరహతాపజ్వరంబు చే వేగుచుండె॥ క॥ ఇ
రువది రెండేండ్లాయెను। హరి యిచటికి రాక పోయెనను కొని చింతం। బొర
లుచు మరచుచు దెలివిన్। వారకొని యొకనాడు వకుళతో నిట్లనియెన్॥
మ॥ వకుళా విష్ణుడు నన్ను శేషగిరిపై వర్తింప నేమించినా। డకలంకంబుగ
మాటలాడ చని రాడయ్యెన్ మహాచింతచే। నొకనాడొక్కయుగంబుగా
గడపలేనో యమ్మ నాప్రాణనా। యకుడాలక్ష్మిని గూడి యెందరిగినాడం
చున్ విచారింపుచున్॥ గీ॥ నిలిచియున్న చోటనిలువ సహింపదు। మఱచియుండు
దనిన మఱపురాదు। కనులగట్టినట్లుగా తోచుచున్నాడు। మాటలాడడిపుడు మహా
నివ లెను॥ సీ॥ కనుపింపుచున్నాడు కలలలో నిత్యంబు తపసి వేషము దాల్చి దగ్గ
ఱగను। ధ్యానయోగను నిష్ఠబూనినట్లున్నాడు జోడు లేకొక్కడున్నాడి
దేమొ। కమలయాస్వామికిగను పించెనో లేదొ నాకను మానమైన దిది
నంబు। నీకాని స్వప్నముల్ రాగారణంబేమి తెలియ లేదీమాయ దేవుడె
ఱుగు। ననుచు గన్నీరు నింక నయ్యబ్జముఖిని। జూచి జాలిని బొందుచు
లేచి వకుళ। మాలికాదేవి యాకొమ్మ మస్తకంబు। నివిరి కన్నీరు దుడిచి బ
ల్కెనరు మీఱ॥ గీ॥ పలికె నిట్లని తల్లి యీపామరంబు। విడువు భయమేల
మిత్రీనమహా విష్ణు నీకు। గడగి మునిరీతి గలలలో గానుపించు। ననుచు

జింతింపకిదియేను భావహంబు॥ క॥ అమ్మా సంతోషమునం। నెమ్మది
గానుండు కనులసిరిటు తేరా। దమ్మాధవుడాలక్ష్మిని। సమ్మతిగా గూడి
యిటకు సరగున వచ్చెన్॥ సీ॥ అనిపకుళాదేవి యచట బద్మావతి నాదరిం
పుచునుండె నంతలక్ష్మి। కపిలాశ్రమంబులోగానుండి పద్మావతీదేవిచిం
తను దెలిసి చక్రితనకొఱకై యేలతి పనుసేయగవలె నాకాంతకొండపైన
డలనేల। యనిచింత సేయుచు నందున్న కపిలమునీశ్వరుపేక్షించియిట్టుల
నియె। మాగపద్మావతిని జక్రిముహిని బెండ్లి। యాడివిడనాడి నా కొఱ
కద్రిదిగువ। దపము సేయుచు నున్నాడు దానికిప్పు। డేమి సేయుదు ననగ
యోగీంద్రుడనియె॥ క॥ హరియురమున వసియింపక। సిరిసీవపు డలిగివ
చ్చు చిత్రంబేమా। సరణిని ముందుగ దెలుపుము। శరన్నను నేవలవిన్న
వించెదనతివా॥ క॥ అనికపిలుండపు డనుగగ। విని శ్రీసతియిట్టులనియె విష్ణు
నియురమం। దొనరగనేనుండిన భృగు। మునిహరియురమునను దన్నె మహా
ఘాత్మకుడై॥ క॥ పనుడగు పురుషుని పాదం। బరుసగ సోకిన యురంబునం
దుండినపు। స్థిరపాతివ్రత్యబలం। బరిమురి జెడునంచు దూరమరిగితినన
ఘా॥ చ॥ అనవిని మౌనియిట్లనియె నాభృగుదెవ్వడు నీసుతుండుముర్। గ
నినకుమాతుడన్యడనగా దగదిట్టులటన్న వాడునీ। మనుమడు పుత్ర
తుల్యుడనుమానము నుంచకు మాత్మలోపలన్। దనుజవిరోధి యీసర
ణిదాచక చెప్పెనో లేదో మానినీ॥ చ॥ అనవుడు లక్ష్మి యిట్లనియె నంబుజ
నాభుడు నాకుమున్నుచె। ప్పినవిధమింపు చెప్పితివిభేదము లేదిసుమంతయు
న్నన। మ్మునిసిరిజూచి నవ్వికొనిమూర్ఖత జేసితి వర్తమానమున్।విను కొ
సినాప్రసిప్రకర వీరపురంబున కేలజేరగన్॥ క॥ ఆనికపిలుడు పల్కగవిని।
వనజాలయ చింతనొంది వారకనపుడా। ఘనయోగీంద్రుని గనుగొని। విన
యంబున నిట్టులనియె విశ్వాసమునన్॥ క॥ ఆవిప్రుండతిగర్వము। తోవి
ష్ణునిదన్ని నట్టిదుఃఖము చేతన్। నేవక్షస్థలి నుండక। పోవలెనని తలచితపు
డు పుణ్యవిచారా॥ ఉ॥ నావ్రకునవ్వికొంచుమునినా యకుడిట్లనియెన్నిజం
బుగా। నీవిభుడొప్పినట్టిపని నీమదికొప్పకనుండ వచ్చునే। నీవుపతివ్రతా
మణివినీమది దోచనిధర్మ మున్నదే। శ్రీవనితాలలాం మహరిచిత్త మెఱుం
గకయిట్లనేతురే॥ సీ॥ సిరియెన్ని లిపములో జేసిసి నాస్వామియురమందు
వసియించియుండె భృగుని। ముందుసరము బెట్టయులిగి పోవుటసకు దగునె
భృగుడేమి తప్పుచేసె। మూడుమూర్తుల గుణములబరీక్షించుటకై ముని
లీపగాన జూసి జేరి। యతనిరజో గుణంబట బరీక్షించి శంకరుసతి మోగు
క్రమము దెలిసి॥ హరిమహాసత్వగుణము బ్రహ్మాదులకును। దెలియజేసె
కొఱకు భక్తిని మనమున। నుంచికొని తన్ని నాడు గర్వంపతన్నె। నను

శ్రేష్ఠుఁడీతెరవదేహంబు ప్రత్యేకపూజ।లందుకారణముండుననుకొంచుమనిట్లనె
దేవినివిష్ణుఁడిందవసించి।తపముజేయుచునుండుతదనంతరమునసనాపద్మసరో
వరప్రాంతమునకు।జనిపాంచరాత్రిపూజలనందుకొనుచుండువందమపై నీ
చిత్తమంకుదలచి । నట్లనే చేయుమని లక్ష్మికానతిచ్చి । మరలనిట్లనియెను
లోకమాతనీవు । హరికినిత్యానపాయిని వగుచుజక్రి।యెన్ని యవతారముల
నెత్తుచున్ననీవు॥ క॥ అన్నిశరీరములమరఁగ।బన్నుగ ధరియించి భువినిబాయు
కకీర్తిఁగ । గన్నట్టినిప్రభావము । మున్నెఱుగుదునేను విశ్వమోహి
నిధరపై॥ క॥ నీవెత్తినదేహంబులు । నావిష్ణుం డెత్తినట్టియవతారములిం ।
కావేయుతలల శేషున । కానవనజజశంకరులకు నగు నెగణింపఁగ ॥క॥ మీరాది
మదంపతులై । భూరిజగత్త్రయము నిట్లపుట్టించినవా । రారయనిపుడెడ
బాయను । గారణమున్నందు వలనగార్యముగలిగెఁ॥ క॥ వేంకటగిరిపై
మీరిపు । డింకేశమునసనుండపలసినమున నాడా।శంకమనంబున బొడెమెను
బక్షజముఖినీకుభేదభావముగలదే॥ ॥నినునేదప్పనిపించితి।నసికోపమునుంచ
వలుపదాప్తుఁడనైనా।మనమునఁదోచినపార్థము।వినుపింపితిగూర్మిచేతవిమ
లేందుముఖి॥ గీ॥ అనగలక్ష్మియిట్లనియెనో మునినాథ। నీవు చెప్పినందు చేవి
రోధ । ముడగనిటకు వచ్చునప్పుడునాభావ। మిపుడువిన్నవింతునెట్టులనిన॥
క॥ అలపద్మావతిచక్రిని। కలసిమెలంగుచును వేడ్కగా నుండగనా । జలజా
క్షునివక్షముపై । నెలమిన్నేనిల్చి యుండు టొప్పులటంచుఁ॥ గీ॥ తలచిహరి
నన్ను గరుణతోబిలువవచ్చు। నపుడువంచించివచ్చి నీయాశ్రమంబు।నందు
జేరితినవగ సంయమివరుండు । చెలువగవునవ్వి లక్ష్మి వీక్షించిపలికె॥ గీ॥
వినుముఁ విష్ణుఁడుకృష్ణుఁడై వేలసంఖ్య। లైనకాంతలచేపట్టియుండలేకనీ నన్ని
రూపములై గూడునపుడు నీవు। శౌరినెడబాసియుంటివే చంద్రవదన॥ క॥
మాయాశ్రమముపవిత్రము - జేయుటకిటువచ్చితివి విశేషంబయ్యెఁ । నీ
యాత్మేశ్వరునిక నెడ।బాయక శేషాచలంబుపైనుండుసిరీ॥ క॥ అనియివ్విధ
మునజెప్పగ వినిసిరియాక పిలగురునివీడ్కొని వేడ్కఁ। దనయోగమహా
మహిమం । బును బెంచుచు లేచి లోకపూజ్యత కాఁకై॥ సీ॥ పూర్వాంగ
మునకు దపోనిష్ఠ బుట్టించియందుంచి దివ్యదేహంబుదాను । ప్రత్యేకముగ
దాల్చి పద్మనాళంబులో జొచ్చియాదారిలో వచ్చివచ్చి । పైనవెల్గుచునుం
డు పద్మకర్ణికయందుజేరి సుఖాసనాసీనయగుచు। గ్రొక్కారుమెఱుపులు
గుమిగూడినవి గ్రహం।బైనిల్చినట్టులయ్యబ్జమందు।శ్రీరమాదేవియున్ననీక్షిం
చివిష్ణు। దేవుడానందజలధిలో దేలిసరిని।జూడనాలేమహరి మోముజూచినసి
సిగ్గు।చేతబల్కకతల వాంచిచింతనొందె॥సీ॥ తనమదిలోదానుతలచె నిట్లనిల
క్ష్మినాకతంబుననిందు నావిభుండు । తపసినైయిఘనజటా ధారియైతానిరా

హరినై భోగంబులన్ని విడిచి । యీరీతిగానుండు వైరాగ్యవిగ్రహంబిట్టు
చూడవలసెనింకేమి సేతు । ననుచు జింతింపగా నాలక్ష్మిభావంబు భావించి
విలసితాభరణములను । గనకచేలము శంఖచక్రములు దాల్చి । నీలమేఘ
నిభాంగుండై నిలిచియున్న । హరిని శ్రీదేవి చాల మోహమున జూచు । మండ
గాజ్రక్రీతల వాంఛియూరకుండె॥ చ॥ సిరితనుజూచుచున్నపుడు శీర్షము నేలకు
వంచిలజ్జతో । నరమర జేయుచున్న పతినంబుధికన్యకజూచి సిగ్గునన్ । మఱి
లశిరంబు వంచియనుమానము నందనుజూడకుండగా । హరికమలాలయా
ననమునప్పుడు మోహమునమీఱిజూచెగన్॥ క॥ కందర్పునుమదినిభయం
బొందక సిరినెదకు బిలువకున్నాడంగో - విందుని మదిలో జొరబడి । సం
దడిసేయుచునుబుష్ప శరము లుగ్రముచ్చెన్॥ సీ॥ అప్పుడు గోవిందు డళికియు
నళుకక ధీరుడై శ్రీరమాదేవితోఁ బలుత । దనుజూచి మాట్లాడినను దాను మాట్లా
డక లెనంచు శిరమర వాంచియుండె । హరిపిల్చినపుడు మాట్లాడెదననిలక్ష్మికమ
లంబుపయి నిల్చికదలకుండె । బ్రహ్మరుద్రాదులా భావముల్ భావించి తమవాహ
నములెక్కి తరలి వచ్చి । రమ్యతరమైన పద్మసరస్సుచెంత । జేరి శుభవాద్యములను
ఘోషింపజేసి । పుష్పవర్షంబు గురియించి పొగడి వారి । కిర్వురకు భక్తితో మ్రొ
క్కియిట్టులనిరి॥ దండకము॥ శ్రీమత్పరంధామ జీవాళిసుస్తోమ శ్రీమానసానందలశృం
గారసల్లీలకందర్పలావణ్యకంజోద్భవాగణ్యసౌజన్య సంపన్న సంరక్షితాప
న్నసత్యవ్రతాచార సాధువ్రజోద్దార సారాంబుదశ్యామ సంపూర్ణ సత్కామ వే
దాంతసంచారవిశ్వంభరాధార శ్రీవేంకటాద్రీశ సచిత్ప్రకాశా పరాకా
శలోకేశ వాగీశ నాదీశ । నాకేశ వంద్యాంఘ్రిపద్మద్వయానిత్య సత్యాద్వ
యాసద్దయాసాంద్ర యోగీంద్ర హృత్పద్మ భృంగాశుభాంగాసు చారి
త్రమిత్రాబ్జనేత్రా ధరిత్రీ మహోల్లాస దాసప్రియా శ్రీనివాసా మముర్
సత్కృపం జూడుమో తండ్రి తర్గొండవాసా నృసింహావతారా నమస్తే
నమస్తే నమస్తే నమః॥ క॥ అనిమ్రొక్కుచు హరినిట్టులనె । వినుతింపుచుబ
ద్మమందు వెలిగెడులక్ష్మిం । గనుగొని బ్రహ్మ శివాదులు । వినయము
తోనిట్టులనిరి విశ్వాసమునన్॥ సీ॥ క్షీరసాగరజాత చిత్తసంభవమాత
ప్రథితగుణోపేత భాగ్యదాత । యమృతాంశుసోదరి యార్తిదోషవిదారి
నవ్యసుందరి సదానందలహరి । బహుభక్తపరిపాల పాపకర్మవిపాల హిత
సర్వమూలసంతతసుశీల । కనకపంకజవాస కమనీయదరహాస వదనమనో
ల్లాసవరవిలాస । లక్ష్మినీస్వామి వక్షస్థలంబునందు । జేరి శేషాద్రిపై భూ
ప్రసిద్ధముగను । వెలసి మామీద సత్కృప నిలుపవలయు । ననుచు బ్రా
ర్థించి వారిట్టులనిరిమరల॥ సీ॥ పరగ గార్తికశుద్ధ పంచమీభృగువార ముత్త
రాషాఢ గావున దినంబు । మంచిశుభమైన మైత్రతారగుజక్రి వక్షస్థలము

చేరవలయు నిపుడు । తడవేలననుచు విధాతయును రుద్రుండు విన్నవించినను
హరివిజయలక్ష్మి । పలుకకుండినఁ జూచి బ్రహ్మదేవుఁడు భృగుసంయమీంద్రు
నికన్ను సన్నచేసె । నపుడు భృగుముని సిరిదారికరిగి మ్రొక్కి । మాతృదేవ
తనాతప్పు మఱచి యొప్పు । గైన నేనిఁక బుత్రుండ నంచు నెంచి । హరియు
రంబున నిల్వుమాయమ్మయనుచు॥ క॥ బహువిధముల వినుతింపఁగ । సహ
జజ్ఞానమున నధిక సంతసమున శ్రీ । మహిళామణి భృగుమానిని । విహితంబున
నాదరించి వేడ్కఁ గననియెన్॥ క॥ ముని నీదృఢతర భక్తియు । ననుపమ
ధైర్యమును మెచ్చి తలసత్వగుణుం । డనదగు నాదేవుఁడిపై । ననుమానము
నొందిదూర మరిగితి నయ్యా॥ సీ॥ నారజోగుణమున కారీతి కాఁగల గతిజత
గూడిన కారణమున । బ్రాణేశు నెడవాసి పరదేశినయ్యెందు కొక్కటి విభు
నిచే నుగ్రతపము । జేయుంచుటొక్కటి సిద్ధించెనాదుచే గాలమంతటి
వారు గడువలేరు । నీతప్పుగాదది నాతప్పుగాదది కపటనాటకసూత్ర
కరుఁడునైన । చక్రిచేయువినోదములఁ జక్కిజేయుకె । యనుచు భృగుముని
నంతు వీడ్కొని ముదమున । నవల హరిపాద పద్మంబులందు నొత్తి । బెట్టి
చూచుచు భక్తియుం బ్రేమమీఱ॥ క॥ పుత్తడిబొమ్మ విధంబున । నత్తన్వి
సువర్ణపద్మమందుండి విభుం । డెత్తి యురంబున నదుకొను । నిత్తఱి కనితలచి
కదలక డిరయుండెన్॥ చ॥ వనజజశంభులిద్దఱును వార్ధితనూభవ మోము
జూచితఁ । ద్వనమున నుండి పట్టి యనుమానము తాము బ్రశంసించి పద్మలో ।
చనునకు మ్రొక్కి యుల్లనిరి సాగరకన్యక నెత్తి వక్షమం । దొనరగ నుంచు
కొవలయునో జగదీశ యటంచు బల్కఁగన్॥ చ॥ వినిహరి నవ్వి యుల్లని మో
వింతగఁ జూచుచు నుండ నేల న । వ్వనధిజ కెల్లకాలమును నివాసముగా దగి
నట్టి నాయురం । బున నికనైన నిల్వుమని పొందుగ జెప్పను మీరలిప్పుడ ।
న్నను విధిరుద్రులిద్దరు మనంబున సంశయమొంది వేడుకన్॥ తే॥ పలికరిల్లని
దేవిని ప్రాణవిభుని । వక్షమున జేరియుండగా వలయు నిపుడు । మంచిలగ్నము
గనుక తామసము జేయ । వలవదని విన్నవింప నవ్వనధికన్య॥ సీ॥ ఘలుఘల్లు
రని కాళ్ళ గజ్జెలందెలు మ్రోయ మొలనూలి ఘంటలు లిమ్ముగనటింప । జెలువ
గు బంగరంచుల నొప్పు తెల్లని చీరకుచ్చులు చాలశిస్తుమీఱ । రహినిజం
దును కావిరవికెతో బంగారు గింజ్ల చందముల బాలిన్ల మెఱయ । జారుకొ
ప్పున బూల సరులు చిందులు ద్రొక్కముంగురుల్ నుదుటిపై ముద్దుగుల్క ।
గర్ణకంఠాభరణ కరకంకణములు । వరశిరోభూష ణంబులు సురుచిరంబు ।
లైన పందిటి దండలు హారములును । విలసితాంగములను జాల వెలుగు
చుండ॥ సీ॥ భాసుర నాసికాభరణంబుతోఁ గూడి బింబాధరము కాంతి పి
క్కటిల్ల । దిద్దినకస్తూరి తిలకంబుతో గూడి నిటల తటద్యుతుల్ నివ్వటిల్ల ।

నెలవంకబొమలును నేత్రాంజనము సరిగా సొగసైనీల కళలనీన । బరిమ
ళగంధలేపనముతో నెనసి సత్కుసుమ సౌరభము దిక్కులను నెఱయ ।
హంసగతి నొప్పమథిత దుగ్ధాబ్ధియుండి । వెడలి మునువచ్చు హరిజేరు విధ
ముగాను । రమ్యతరమైన పద్మసరస్సు వెడలి । శ్రీరమాసతి పతిచెంత
జేరినిలిచి॥ క॥ మునుతనకుని వాసంబై । ఘనమగు హరివక్షమందు గర
ములతోజం । దనమలది మహామోహం । బునురక్తియు బెనగొనంగము
చ్చటమీఱన్॥ సీ॥ తులసీదళంబులు దూర్వాంకురంబులు మల్లెపువ్వ
లును జేమంతిపూలు । మొదలైన విరులతో ముచ్చటగాగట్టి నటువంటి
ఘనపుష్పహారమొకటి । కరముతోనెత్తి కంకణములు మ్రోయగ హరి
కంఠ మందుంచి యచటనిలిచి । యున్నలక్ష్మినిజూచి మన్నించిరెండుహ
స్తంబులనెత్తి వక్షంబుపైన । జక్రధరుడుంచికొనియె నాసమయమందు ।
వారిశిరములపై పుష్పవర్షములను । దొడరిగురియించి దేవదుందుభులు
మొఱయ । జేసిజిష్ణుడుహరి చెంత జేరిమ్రొక్కె॥ సీ॥ ఆడిరిరంభాదులంబ
రంబునవిల్చి పాడిరిగంధర్వపతులసతులు । తుంబురునారదాదులు వీణ
లనుమీటిగానముల్ జేసిరికశ్యపాది । మునులునుదేవతల్ మొదలైనభ
క్తులునిగమాంతసూక్తులబాగడిరపుడు । శైలజయునుసరస్వతిమంగళార
తులిచ్చసేసలుచల్లిరీశ్వరుఁడు। జలజజుండునుసంతోషకలితులగుచు। వేడ్క
గాదాపసులగూడి వేదఘోష। ణములుగావింపవిష్ణుడానందమొంది । గరుడ
వాహనమెక్కె శ్రీకాంతతోడ॥ వ॥ అప్పుడా బ్రహ్మేంద్రాదులుమహాలక్ష్మియుద
యించినయాపద్మసరస్సునందు కార్తీకశుద్ధపంచమీదినమందుస్నానంబు
లు చేసినవారలు లక్ష్మీకటాక్షపాత్రులై సుఖంబు లనుభవించి ముక్తులగు
దురని స్తోత్రంబు సందఱన్ని విధంబుల బ్రస్తుతించి మ్రొక్కి శిరంబులను
బ్రోక్షించుకొని తమ తమ వాహనంబు లెక్కి రప్పుడా లక్ష్మీనారాయ
ణులు వారలం దోడ్కొని వేంకటాచలా హణంబు చేసి వరాహస్వా
మి యనుమంతమున విష్వక్సేనాది పరమ భాగవతు లలంకరించియున్నని
జనివాసము జేరిరప్పుడు పద్మావతి సకల భూషణాంబరాలంకృతయయి
తదానంద నిలయంబులో బ్రవేశించి హరికి సిరికినమస్కరించె నప్పుడప
ద్మాలయ పద్మావతిని దీవించి చెంత నుంచికొని వకుళ నాదరించి యి
చ్ఛామాత్రంబున సకల పదార్థంబుల నాకర్షించి బ్రహ్మాదులకు విందు
జేయించిన వస్త్రాభరణ చందన పుష్పఫల తాంబూలంబు లందఱికి నిప్పిం
చి యాదరించె నప్పుడు వారలందఱు సంతుష్టాంతరంగులై వినుతించి
మ్రొక్కి లక్ష్మీనారాయణాజ్ఞాధారులై నిజనివాసంబుల కరిగిరంత వేం
కటేశ్వరుండు లక్ష్మీపద్మావతీ సమేతుండై సుఖస్థితి నుండి యటనొక్క

నాడు వినోదంబు గాసిరిసి జూచి యిట్లనియె॥ గీ॥ శ్రీరమా దేవినీవు వచ్చి
న కతమున । నాకుసంతోషమయ్యె నానాఁడు ధనదు । చేతదీసిన ఋణ
ముదీర్చెడియుపాయ। మేమినాకిప్డు దెలుగించు మిందువదన॥ క॥ అనుచు
వినోదంబుగనా । వనజాక్షుం డడుగనప్పుడు వనజాలయయు । ట్లనె ఋణ
ము చేయునప్పుడు । నను నడిగితి వేయటంచు నగిమఱి పల్కెన్॥ మ॥ అ
నఘా పెండ్లికి నేనువచ్చినపుడిం దర్థంబు లేదంచు నె । ప్పినతప్పే మాటు
చెప్పినన్ ధనమునే ప్రేమంబుతో నియ్యనే।నను నీవప్పుడు తేరజేసి ధన
దున్ నాపెండ్లి కీవర్థమిమ్మని। యాచించి ఋణంబు జేయ పని కేమంటిన్
జగన్నాయకా॥ క॥ అపుడర మఱ జేయగగద । కపటాత్ముఁడ వనుచు
దెలిసి కరవీర పురం। బుపముగ జేరి తినాగిసే। జపలత శాతాళమునకు
జనుటమహాత్మా॥ ఉ॥ నాపుడు విష్ణు డిట్లనియె సన్నిడ బాసిన జాలిచేత
నే । నీవతి చింత నొందగను నేను ముదంబున బెండ్లి కర్థము । గావలె
నంచు నిన్నడిగి గైకొన బుద్దెటు పుట్టు నోరమా। దేవిదితప్పుచేసినను దే
రగ జూడకుమంచు బల్కగన్॥ శా॥ ఆమాటల్ విని లక్ష్మి యిట్లనియె
నాడారీతియయ్యెంగదా । యామీదండడవైన వడ్డిబళ్ళునై యాపత్తురా
దేమినీ । కీమర్యాదను నిల్పు కోరిన ధనంబీవేళ నేనిచ్చెదన్ । స్వామీ
వాని ఋణంబు దీర్చు మనినన్ సంతోషసు స్వాంతుడై॥ సీ॥ హరి
యిట్టులనె నీమహా మహిమంబునే నెఱుగనే మునుప్రోత్త్రయే తలంప।
నిపుడు కుబేరున కీనర్థమీనేల నానాటి వడ్డి నిర్ణయము గాను । క్రమ
ముగా నిచ్చుచు గలియు గాంతంబునం దంతయు దీర్చి విశ్రాంతి బొంది।
వైకుంఠపురి జేరవచ్చు నంతకు శేషశైల మందుండి భూజనుల నెల్ల। బా
లనము జేసి వారిపాపముల నింక । బరిహరింపుచు రక్షించు [illegible]వాల
గలిగియున్నవి గనుక శీఘ్రముగనప్పు । తీర్చబనిలేద దేలన్న దె[illegible]
ము॥ సీ॥ కలియుగంబున బాపకర్మంబు లొనరించు ప్రజకురోగాది తాప
త్రయములు । కలుగగా వెఱచి తత్కాలంబుగా నన్ను బేర్కొంచు బలు
మొరల్ బెట్టునపుడు । వారియాపదలని వారించి ప్రోవకనే నూరకుండు
ట నీతిగాదు।కనుక నానరుల దుష్కర్మముల్ వారి ద్రవ్యంబుపై నాకర్ష
ణంబుచేసి। వచ్చు నాపదలను దీర్చి వారిధనము। నేనుగొండకు దెప్పించి
నిస్పృహుండ। నగుచు దత్పాప రూపమైనట్టిద్రవ్య। మజ్ఞ జనములకిప్పిం
తున చలమతిని॥ గీ॥ ఇలను ఋణ్యాత్ములైన వారిచ్చినట్టి। ధనమునే గొం
తగైకొని ధనదునకును । గొంత వడ్డికి జెల్లించి వింతలీల । జేయుచుం
డె దనను చు మచ్చికను బలికె॥ సీ॥ మరల నిట్లనె నోరమాదేవి ద్రవ్యంబు
నెల్ల వారికిని నీవిచ్చుచుండు । మాద్రవ్య మిచటకే నాకర్షణము చేసి సు

జన దుర్జనుల కిచ్చుచు క్రమముగ । నాప్రభుత్వము నిందు నడిపించికొనుచు నీకలి కాలమీ రీతిగ జుప వలయు। నందుచే ధనపతి కప్పిప్పుడే తీర్చదగదని కలియుగాంతంబు గడువు । పెట్టి వ్రాసిన వ్రాత కుబేరు చెంత। జేరినది దా నిప్పుడే చెలుపదలప । నేలవానికి మొదలీయునేల ననుచు । దం... కొప్పుకన్న శ్రీరమా తరుణి పలికె॥ క॥ దేవా మీచిత్రమునం । దీవి ధనము తలచియుండి యీబుణామిక నే । నేవిధమున తీరుతునని । యీవేళ వినోదలీల నడిగినదేలా॥ క॥ అనుచు రమాసతి యడుగగ । విని హరి యిట్లనియె నీవు విత్తము ప్రజకున్ । ఘనముగ నిచ్చిన నదిగై। కొని యెదనని నిన్ను వేడుకొంటి నిలచ్చి॥ వ॥ అనిన వినిలక్ష్మి యిట్లనియె॥ క॥ మనమలరగ నేద్రవ్యం । బనఘా నీకిత్తు దీర్చుమాబుణ మనినన్ । వినక పరస్పరముగభూ। జనులకు నన్నియు మనెడి సరణిని జెపుమా॥ సీ॥ అనుచును నరల నిట్లనియె నో ప్రాణేశ కలియందు నరులతి కఠినహృదయు । లగుచు దానములు సేయరుగాన జన్మ జన్మాంతరంబుల చంద్రాంశనొంది నశియింతు రటువంటి నరులకు ధనము నీ వీయుమటన్న నేనీయలేను । వరదనీ కెంత ద్రవ్యాంబైన నిచ్చెద నీవు వారల కిమ్ము నెనరుమీఱ । ననగ హరి యిట్టులనియె మోక్షార్థులైన । వారలకు ముక్తి కోరికల్ కోరిపుణ్యా । కర్మములుచేయు వారికా కర్మఫలము । లిచ్చి రక్షించు పనులునా కిష్టమతివ॥ సీ॥ కలుముల చెలినీవు గావున గలుము లిచ్చెడు పని నీవంతు చెలగివారి । మొ దురూకల నాక్రమించి యాపదలని వారించి సంతానవరములిచ్చి । సంతసించుటకు నావంతని పల్కగా హరిని వీక్షించి యిట్లనియెలక్ష్మి । మనుజులు దానధర్మ పరోపకారముల్ జేయరువారికి సిరుల నొసగు । టెల్లవారది దెచ్చినీకిచ్చుటెల్ల । ధనము గల్గగ నేదంభ దర్ప లోభ । ములను బెంచుదు రాద్రవ్యమును సజముగ । నీకు దెచ్చిత్తురే వారు నీరజాక్ష॥ వ॥ అనిన విని నవ్వి హరి యిట్లనియె లక్ష్మి నీవు చెప్పినట్లు కలియందు బుట్టిన నరులట్లలోభులగుటకు సందియంబు లేదనిక్కంబగునం దొక్క యుక్తిగల దది యెట్లంటే నీజనులు పాపంబులు సేతురు అందున రోగాది బాధలనుభవింతురు అట్టి సమయంబుల నన్నుదలంతురు అపుడు నేను వారిస్వప్నా వేశంబులందు ప్రత్యక్షంబై వారికలిమి కొద్దిగా ముడుపు లెత్తించి యాస్వల్ప విత్తంబునకు విస్తారంబుగా వడ్డిపెట్టుగనిచ్చి ప్రతివత్సరంబును వారిని దండించి యీవేంకటాద్రికి దోడ్కొని వచ్చి వారుదెచ్చిన ద్రవ్యంబు నీక్షించి పుణ్యపాపవితంబుల నెర్పరించెసు జనదుర్జనులకుబంచిపెట్టించి నాకు సంతర్పణంబు జేయుండనియాజ్ఞయుంచి వారిచేత నన్నదానంబులును జేయింపుదు నందున వారు ద్రవ్యాన్న దా

నంబులు చేసిన వారగు చుందురు గావున వారుచేసిన స్వల్పదానంబైన నధికంబుగా నెంచి నీవు వారికి ధనధాన్యంబుల నిచ్చుచుండ వలయునేను వారికి నయభయభయంబులజూపితద్ద్రవ్యాన్నంబు లిచ్చుటకిదెప్పించి వారిచేత దానంబులు చేయింపు చుండ వలయు నీవేంకటాద్రి యందు జేసిన దానంబులు స్వల్పదానంబులైన నధిక ఫలంబుల నిచ్చునందుననే యుక్తి జేసితి నీయుక్తి చేయకుండిన గలి పురుషుండు సకల ధర్మంబులం జెఱిచి ప్రజల ననేక విధంబుల బాధించి రౌరవాది నరకంబులం ద్రోయించుగావున మంగళ సంభవులైన జీవుల కలికాలంబునందీ ప్రకారంబు గారక్షించు కొఱకైనే నీవేంకటాద్రియందునిలిచితి నీవునునాకును సాహాయ్యంబు జేసి మదర్పణంబులు సేయుటకై ప్రజలకు భాగ్యంబుల నిచ్చుచుండు మ నినిన్ను బ్రార్థించితి నీవిప్పుడే కుబేరుని యప్పు దీర్చితివేని నీనిందుని రుద్యోగంబు గానుండ వలయు నట్లూరకుండుట నాకు సహింపదు గావున నీవిట్టి యుద్యోగంబు నాకొసంగు మనిన విని నవ్వి లక్ష్మి యిట్లనియె॥సీ॥ ధన్యాత్మ నీతోడ దబ్బరాడగరాదు చెప్పెద నిప్పుడే సిద్ధముగను। మహి యందు దాన ధర్మపరోపకారముల్ చేసినీకర్పణ చేయుచున్న। వారికి ధనధాన్య వరసంపదల నిత్తునందులో లోభ పాపాత్ములైన। నరుల ధనంబులు నానాట నశియింప జేయుదునది వృద్ధిజేయ ననుచు। వారికిసమ్మతముగ జెప్పి నరులకెల్ల। సంపదల నిచ్చుచుండె నాసమయమందు। సకల జనములు వేంకటాచలముజేర। వచ్చి ధనరాసులా స్వామికిచ్చిరమొక్క॥ వ॥ అదియునుం గాకనా శ్రీనివాసార్పితంబుగా ననేక బ్రహ్మాదులకు సకల దానంబులు చేసి యిహపర సౌఖ్యంబులను భవింపుచుండిరా శ్రీనివాసుండు సకల జనుల సకల విధంబుల రక్షింపు చుండెనని దేవదర్శనుండు చెప్పినవిని సంతసించి క్రమ్మఱ దేవలుం డిట్లనియె॥ సీ॥ ఘనదేవదర్శనముని శుకాశ్రమ మందు దపసియై చెలుండు తపముజేయు। నప్పుడా యోగీంద్రు డందుండెనో లేదో యనిన దేవలున కిట్లనియె సతడు। విను విప్రవరతపం బానరింప కటమున్నె బ్రహ్మానందా భరితుడగుచు। శుకయోగిచంద్రుండు సూర్య మండలములో జొరబడి పోజూచి సూర్యుడతని। నిలిపి యిట్లని పలికెనో నిర్మలాత్మ। నీకు గురుడైన వ్యాసు డీలోకమందు। నిన్ను వెదకుచు నుండగా నీవు నింగి। కెగిరి పోవుట మేరగా దెట్లయనిన॥ క॥ నీవాశ్రమ ధర్మములను। బోవిడిచి మహావిరక్తిబొందుటతగునే। దేవర్షి పిత్రృణంబుల। బావన మతివగుచు దీర్చిపై కరుగుమయా॥ సీ॥ ఆదియం దమరగా వేదముల్ చదివితి వందుచేఋషిఋణంబపుడె తీరె।సతినింకచే పట్టి సవనముల్ గావించి ధీరుడవైతీర్చుదే

నబుణము । పుణ్యాత్ములగునట్టి పుత్రకులమును గాంచి పెంచి గ్రక్కున
దీర్చు పితృఋణంబు । కొంకకఋణ విముక్తుడవయి విరక్తుండవగు బ్ర
హ్మవేత్త వైయుపల నిటను । వచ్చి నామండలము దాటి పెచ్చిపైకి గ్ర
మముగా బోయి మీదిలోకములు గడచి । పరమ పదమును జెందుమో
పరము మాని । యనిన జలునవ్వు మెఱయ నిట్లనియె శుకుడు॥ వ॥ మా
ర్తాండ నీవుత్రి మూర్త్యాత్మకుండవైకర్మసాక్షివై జగచక్షువై ప్రకాశింపు
చున్న నీచిత్తంబునకు నీకు దెలియని యర్థంబు లేదైన నామనంబున దో
చిన యర్థంబు విన్నవించెద నెట్లన్నను మాతృ గర్భంబు సొచ్చి దేహధా
రియై భూమియందు దగించిన దినంబు మొదలుకొని యుదయాస్తమ
యవ్యాజంబున బురుషాయువును గాలంబు వంచించి కొనిపోవుచుండు
గావున జలబుద్బుదంబున నిత్యంబుగాని దేహంబు నందుండి చతురాశ్ర
మంబుల నడపి దేవ ఋషిపితృసంబంధ ఋణంబుల దీర్చి జ్ఞానవైరాగ్యం
బు లభ్యసింప వలయునంటిరిది వేదోక్త కర్మ మర్యాదయ గుంగావుననా
చరింపు దగునైనను దేహంబ నిత్యంబై నందున ముముక్షుండైన వాడు
కర్మారణ్యంబునందు బ్రవేశింపడనిన శుకుంజూచి సూర్యుం డిట్లనియె॥
శా॥ ఆదిం విశ్వము వృద్ధి జేయుటకు బద్మాక్షుండు గల్పింపగా । వేదో
క్తా శ్రమ ధర్మ కర్మతతి భూవిఖ్యాతమై యుండగా । గాదంచుం విడనా
డి నివెగరి పోగాపచ్చునే యుంచున । య్యాదిత్యుండు వచింపగాశుకుడు
నెయ్యంబొప్పగానిట్లనెం॥ సీ॥ వనజాప్తనీనుసర్వవర్ణాశ్రమాచార ధర్మం
బులును మోక్షధర్మములును । మాతండ్రి బోధింపగాదత్వవిజ్ఞాన మాత్మ
యందు దయించెనపుడెగురుని। గాంచియిల్లంటనిష్క్రష్నగా ప్రథమాశ్రమ
మునాత్మవివేకమునురగలిగి। నట్టివాడావలియాశ్రమధర్మముల్ విడువగావ
చ్చునో విడువరాదో । తేటగానిశ్చయమునాకు దెలుపుడనుచు । నేనుబ్రా
ర్థింపగాజూచి ననరుచేత। జెప్పజాలక మిథిలేను జేరియడుగు । మనగనేబో
యి జనకునట్లడుగనతడు॥ సీ॥ ననుజూచపలికె నోమునివరవిజ్ఞానమబ్బుటకై
చతురాశ్రమములు । నడపింపగానపెనాటినజన్మ జన్మాంతరవాసననంటిన
ట్టి। సదములవిజ్ఞానముదయించి నప్పుడాశ్రమధర్మ కర్మముల్ సల్పకవునె ।
పట్టుబునస్వస్వరూప పరస్వరూపముల్ తెలిసివర్ణాశ్రమాతీతుడగుట।వి
హితధర్మంబనుచు జెప్పిపిడుకొల్పె। నదిమొదల్ గాఢవైరాగ్యమందుబొం
ది । నట్టినన్నుగృహస్థుడవగుమటంచు । నింతగానిందుమీరానతీ యదగు
నె॥ చ॥ అనిశుకయోగి పల్కవినియంబు జమిత్రుడునవ్వియిట్లనెం । జన
కుడుజ్ఞానకర్మములసల్పుచు సర్వసమత్వమొందిభూ । మినిబరిపాలనంబె
పుడుమెచ్చుగజేయుచునుండిబిడ్డలం।గని నటువంటివాడు నినుగాఢవిరక్తిని

బొందఁ జెప్పెనే॥ సీ॥ హరినాభిపద్మజుఁ డజునియందు వసిష్ఠుఁడా మునినా
థునియందు శక్తి। శక్తియందు పరాశరుఁడా ఘనునియందు వ్యాసుఁడా వ్యా
సునియందు నీవు। పుట్టి విరక్తిని బొందియూరక పోక పుణ్యాత్ముఁడైనట్టి పుత్రు
నొకని। గాంచి ధరిత్రిపైనుంచి వచ్చిననన్ను బోసత్తునందాఁక పోవనియ। నను
చు సూర్యుఁడు పల్కఁగా నా శుకుండు। సమ్మతింపుచు నిజతనుచ్ఛాయ నొక్క
పుణ్యపురుషునిగాఁ జేసి బుద్ధి నిచ్చె। నప్పుడా పురుషుండు మహాత్ముఁడనుచు॥ చ॥
శుకునకు బద్మమిత్రునకు సుస్థిరుఁడై ప్రణమిల్లి భక్తితో। ముకుళితహస్తుఁడై
నిలిచి ముందరనుండఁగ జూచి సూర్యుఁడా। శుకముని యోగసిద్ధి కతిచోద్య
మునొందుచు సంతసించి తా। నకుటిలచిత్తుఁడై జనితుఁడైన కుమారునిఁ జూచి
యిట్లనెన్ ॥ సీ॥ మాయఁగ శుకముని దేహ। చ్ఛాయను బురుషుండవగుచు జని
యించిన నీ వవనిస్థలి నరుఁడుగ। ఛాయాశుకుఁడ నెడి పేరఁ జరియించుమయా॥
క॥ అని సూర్యుఁడానతిచ్చిన। విని ఛాయాశుకుఁడు చాల వినయము మీఱన్। వి
నుతించి యావల నా శుకు। గనుఁగొని యిట్లనియె జాలగౌరవ మొప్పన్॥ క॥ జన
కా నన్ను సృజించిన। ఘని యేమిపుడానతిచ్చి పంపుడటంచున్। వినయంబున
బ్రమొక్కఁగ నగను। గొని ఛాయాశుకున కా శుకుఁ డిట్లనియెన్॥ సీ॥ పుణ్యాత్మ
నీవింక భూలోకమున కేగి శ్రీ వేంకటాద్రిదక్షిణముగాను। ముఖ్యమైన సువ
ర్ణముఖరికినుత్తరతటమున వెలుసిద్ధస్థలమున। మహిమనొప్పు మదాశ్రమ
మునందు నీవుండు మదిగాక శ్రీగంగ కరిగి మాకు। తండ్రియైనట్టి వేదవ్యాస
ముని నన్ను బేర్కొనినపుడతిప్రేమమీఱ। నీవు నారీతిగానందు నిలిచి వలికి।
చెలఁగి వారికి శుశ్రూష జేసి వారి।యనుమతిని బెండ్లి యాడి నందనులఁ గాంచి।
చెలఁగి సంతతి ధరవృద్ధి జేయుమయ్య॥ గీ॥ ఇపుడు ముందుగ శ్రీకాశి కేగి యు
చట। నచలభక్తిఁ బాదరాయణుని గొన్ని। వత్సరంబులు గొలిచి యవ్వాలమ
దాశ్ర। మస్థలంబున జేరు కుమారయనుచు॥ సీ॥ వాసికి నియమించి వసుధకు
బంపించి పంకజాప్తుని గాంచి పలికె నిట్లు। మార్తాండ నీకృపామహిమ చేసు
తుఁడుదయించెనన్నింక బోనియ్యుమనిన। నగి సూర్యుఁడిట్లనె నాస్వరూపంబ
గు జీవతత్త్వంబెద్ది జెప్పుమనగ। శుకుఁడిట్టులనె జగజ్జ్యోతిస్వరూప నీ చిన్మా
త్రసత్త్వనే జెప్పఁగలనె। నాకుదోచినయంత నిర్ణయముగాను। సద్గురుని సత్క
టాక్షసన్మహిమ చేత। విన్నవించెద మదిని భావించియనుచు। బద్మబాంధ
వునకు బ్రమొక్కి పలికె మరల॥ వ॥ మిహిరా చిత్తగింపుము ప్రకాశసుకర స్వ
స్వరూప నారాయణ పరబ్రహ్మంబను చిద్బిందువువల్ల బ్రణవస్వరూపం
బైన శబ్దంబు పుట్టె నా శబ్దంబువల్ల బయలైన నభంబునందు స్పర్శవలన వా
యువు పుట్టెను వాయువు గగనసంబంధముచేత సూక్ష్మరూపమైన తేజస్సుగ
లిగె నందగ్ని పుట్టెనయ్యగ్ని విస్తారమై ప్రకాశించి తనలో వ్యాపింపగా నబ్బిం

దువు రసాత్మకంబైన సారమునుమహాజలముగా సృజించి తేజోరూపంబగు
నప్పరమాత్మతానా మహాజలమునందు నిలిచెనదియే హిరణ్మయమైన తేజ
మై యొకొంతకాలంబునకునారికేళవృక్షంబులు ఫలంబులబుట్టించు చందం
బున ననేకకోటిబ్రహ్మాండంబులసృజించి యాబ్రహ్మాండంబులలో నొక్కొ-
క్క-బీజమువృక్షఫలంబు లనన్ బీజరూపంబై నిల్చినట్టుగా మూలకార
ణంబయినహిరణ్మయ తేజస్సు సూర్యరూపమై స్థావరజంగమాత్మకంబ
యిన జగత్తునుదనరసాంశమువల్ల జీవమై పోషించును తేజోంశమువల్ల హ
రింపుచును వటబీజముభూజల సంబంధముచేత వృక్షాకృతినై వృక్షము
లో రసరూపమైనిలిచినట్లు హిరణ్మయ తేజస్సు సప్తద్వీపసప్త సాగరసప్త
కులాచలాధారంబగు బ్రహ్మాండముగా బరిణమించి సూర్యరూపమైనిలి
చియున్నది. ఆస్వరూపమైన సకల భూతములయందును రసరూపమైన
జీవంబగునారసముం దైలవర్తి యందు జ్వాల వెలిగినట్టుగా దెలివి వెలుగు
చుండునా తెలివి యేతన్నను చెవులవినిన శబ్దంబులను జర్మంబువలన దెలి
యుస్పర్శంబులను గన్నులవలనజూచు రూపంబులను జిహ్వచేతగ్రహించి
నరుచుల నుఘ్రాణంబువలననాఘ్రాణించిన గంధంబులను గర్మేంద్రియవి
షయంబులైన వచనాదాన గమనవిసర్గ నానందంబులను మనోబుద్ధిచిత్త
హంకారవిషయంబులైనసంశయనిశ్చయవిచారకర్తృత్వంబులను దెలియు
నెలుకేచిన్మాత్రంబైనస్వస్వరూపంబగునింక బరస్వరూపం బెద్దియన్న నువ్యష్టి
సమష్టిరూపంబులైనపిండాండ బ్రహ్మాండంబులయందే రూపంబై వ్యష్టిస
మష్టిరూపంబులయందు మేఘమండలమందలి జలము వర్షించిన భూమియం
దున్న వాపీకూపతటాకాదులయందు నిలిచినట్టుగా నీశ్వరచైతన్యంబనుమే
నుజలంబు జరాయుజాండ జోద్భిజ్జస్వేదజలంబులను చతుర్విధ భూతములు
యందునిలిచియుండునని భాస్కరుండిట్లనియె॥ గీ॥ ఆహిరణ్మయ తేజమీయ
ఖిలభూత। వితతులందే విధమున బ్రవేశమగును। మరలస్వస్థానమందే క్రమ
మున జేరు। నా సరణిదెల్పు బాదరాయణకుమారా॥ వ॥ అనిన శుకుండిట్లని
యె॥ సీ॥ కమలజాండమును బ్రకాశింపజేయుచురమణీయ విశ్వకారణమునై
న। మహితహిరణ్మయ మండలంబధిక తేజోరసాత్మకమై విబుద్ధమయ్యో। నం
దురసాంశమేయమృతాంశు రూపమహానది కాలవశమున ననిలమగుచు। దా
మేఘమగుచు జరద్రసాత్మకంబైన జలముచేబూర్ణమై చల్లనగుచు। వర్ష
ధారలునిండింపవసుధమీద। సస్యములువృద్ధి బొందుసస్యములయందు।
సారతరమైనఘనజీవసత్తునిలిచి । ధాన్యమైమర్త్య తతులకోదనమునగును
వ॥ మఱియుదృష్ణరూపమైపశువుల కన్నంబగు వివిధఫలరూపంబులనొంది
విహంగాదిజంతువులకన్నంబగుహాయి రూపంబై సర్పాదులకన్నంబగు న

య్యన్నంబు తత్తద్భూతముల యందున్న జఠరాగ్ని వల్ల బచనమై పాలంగో ఘృతంబు పైకి దేలిన చందంబున బిందురూపమై పురుషుల యందు నిలిచి స్త్రీ గర్భంబులందు జొచ్చి పిండరూపంబగు తత్తత్పిండంబుల యందు జరాయుసంబాధము వల్ల నాఱు నెలలకు వహ్ని దాని యందు బ్రకాశించు కరణి చైతన్యంబు దీపించు దదనంతరంబున గాలకర్మ హరి పూరితంబై నతతి నుదయించు మఱియు నవ్వర్ష జలంబు వేవృక్షౌదులందు రసాత్మకమై జీవనంబగు నిదియుత్పత్తి ప్రకారంబింక లయ ప్రకారం బెట్లన్న నువాతపైత్త్య శ్లేష్మాది రోగంబుల వల్ల భూతంబులు లోపడి నప్పుడు పల్లములనిలిచిన వర్ష జలంబుల సూర్యకిరణములు పీల్చు కరణి కాలస్వరూపమైన సూర్యుడు సర్వభూతములయందలి జీవరసంబు బీల్చి పోవునప్పుడా రసస్వరూపంబు సూర్యకిరణములలో మిళితమై వాయు మండలమందే కంబై గగనమార్గంబున జంద్రమండలంబు జొచ్చి చంద్రుడు సూర్యునియందే కీభవించి నప్పుడు సూర్యునియందు జెందునని మద్గురుండుపదేశించెనని నవిని నవ్విశిరఃకంపంబు జేసి భానుండిట్లనియె॥ గీ॥ దేవరాత్రుసముఖులసుస్థితిలయములు। వరుసగా జెప్పుమనగ నవ్యాససుతుడు। జలజబాంధవుని జూచిసంతోసించి। మరలనిట్లని పలికె సమ్మతినుగాను॥ వ॥ దేవా వటబీజంబునకు వ్రీహిబీజంబునకు భూసంబంధంబొక్కటియైనగాని వ్రీహిపరిణామంబు షణ్మాసంబులును వటపరిణామంబు సహస్రసంవత్సర పర్యంతంబు గలదా ప్రకారంబుగా బ్రహ్మాదిదేవశరీరములకును మనుష్య శరీరంబులకునుగాల భేదంబున్నది యాహిరణ్మయ తేజస్సత్వాంశంబధికంబుగా గనిలావృతఖండాదిదేశముల యందు దేవజాతులుత్పత్తియై దీర్ఘాయుష్మంతులై వర్తింతురు సామాన్య దేవజాతులకు సుర్మాపధియు నింద్రాదిలోకపాలురకు మన్వంతరావధియు బ్రహ్మదులకు బ్రహ్మాండప్రళయావధియుగలిగియుండునంతటికి నాధారమై సచ్చిదానంద నిత్యపరిపూర్ణుండై వాఙ్మనసాతీతుండైన నారాయణుండు ప్రకాశించు దత్ప్రకాశంబునీవనిని నిశ్చయించియుండుమని మఱియు సకల వేదాంతసార నిశ్చితార్థానుభవక్రమంబు విన్నవింపవిని సూర్యుడు శుకుం జూచి యిట్లనియె॥ సీ॥ ఓమహామౌనీంద్ర నిమనోదార్ఢ్యంబు యోగసిద్ధియు దెలియుటకును జాల। నాక్షేపణులు చేసి యడిగితి నన్నిటికన్నియుత్తరము లీవనుభవముగ। జెప్పితివందు చేజిత్తంబు రంజిల్లె మహితాత్మ నీవు నామండలంబు। లోజొచ్చి వెడలి పైలోకంబులను దాటి పట్రిపైనుండెడు పరమపదము। నందు బొందుమటంచు నద్యుబ్జసఖుడు। చాల మన్నింపగా శుకసంయమీంద్రుడు। డతులితానంద రసమగ్నుడగుచు లేచి। దినకరుసమండలంబు భేదించి వెడలి॥ వ॥ తదనంతరంబున నూర్ధ్వమండలంబులనూర్ధ్వలోకంబుల నతిక్రమించి శుకుండు నిర్వాణపదంబునొందె నంత ఛా

యాశుకుండు కాశి జేరి వేదవ్యాసులకు వివిధశుశ్రూషలు చేయుచుండి కొ
న్నియుగంబుల కాకృష్ణద్వైపాయనునియనుమతంబున శుకాశ్రమస్థలంబు
నందు జేరి విప్రకన్యకను బాణిగ్రహణంబు చేసి సంతానంబువడసె నని దేవ
దర్శనుండు చెప్పినవిని దేవలుండిట్లనియె॥ గీ॥ శ్రీరమాదేవి పూర్వశరీరకలి
త।మైతపము కపిలాశ్రమమందు జేయు। చుండెనంటివిమరల నీయుర్విమీద
జేరినటువంటికథ నాకు జెప్పుమయ్య॥ వ॥ అనియాదేవల మానిశానడుగగా
నాదివ్యయోగీంద్రుడిట్లనె నాదేవిసుశీలమై హృదయమం దాచక్రి నర్చిం
పుచుండె। మన మాస్వామి పదారవిందములపై మగ్నంబు గావింపు
చుండె। దనదేహస్మరణంబు లేకజగమం తావిష్ణురూపంబుగన్॥ క॥ భా
వింపుచు గొన్నేండ్లా। శ్రీవనితా మణితపంబు చేయగ నపుడీ। శ్రీవేంకట
గిరినిలయుం। డావెలదిని మెచ్చితలచె నపుడిట్లనుచున్॥ సీ॥ తనుగూర్చి
తొలుతన తప మాచరించితి నని నన్నుగూర్చి యాద్యాదిలక్ష్మి। పా
తాళమందేతపం బాచరింపుచు ననుజక్కబట్టి యున్నదిధరిత్రి।పైకిచ్చట
కేయుపాయంబుగా వింతుననివీరలక్ష్మిహృదబ్జమందు। వెలిగెడితనరూపము
లనునచ్చట తిగోధాన మొందింపగ ధ్యాననిష్ఠ। చలన మొందకనప్పుడాశ్చర్య
మొంది। కన్నుగవవిప్పి చూచిపంకరుహనాభు। నచట గానక చింతించి
యపుడు లేచి। కపిలముని పాలికరిగి శ్రీకాంత నిలిచె॥ క॥ అపుడా లక్ష్మిని
గనుగొని। కపిలమునీంద్రుండు చాలగరుణను బలికెన్। జపలత్వరహిత
మగు నీ తప। మఫలంబై ఫలించె దామరసాక్షీ॥ క॥ ఇకనీవిందుండకచని
ప్రకటిత శేషాద్రి దిగువబద్మ సరస్సం। దకుటిల మతివై చేరుము। శుక
ముని సుతుడంపునిన్ను జూచి ముదమునన్॥ సీ॥ ఘనపాంచరాత్ర ప్ర
కారంబుగానిన్ను బూజించు నచటికే పొమ్మటంచు। బలికి పంపింపగా
బాతాళమందున్న శేషుండు లక్ష్మి నీక్షించి మ్రొక్కి। బహురత్న విలసి
తాభరణాంబరంబులు చందన సుమదామ చయములొసగి। రమణీయ
మగుదివ్య రథములోదగు సహస్రార హేమాబ్జంబునందు వెలుగు। కర్ణికా
పీఠమున మంచిగజ చతుష్ట। యంబుతో వీడుకొల్పనయాద్యాది లక్ష్మి।సం
తసింపుచు మధ్యాహ్న సమయమునకు। ధరణి భేదించుకొనుచు మోద
మునవచ్చి॥ గీ॥ మహిమతో నూటయెనిమిది మంది సేవ। కజనులును జేరి
గొల్వగా ఘనతమీఱ। శేషపర్వతమునకు దక్షిణముగాను। గలుగుస్వ
ర్ణముఖరికి దద్భాగమందు॥ సీ॥ ఘనతరంగయుతంబు గంగోపమానంబు
నలినకైరవ కోకనదయుతంబు। భాసురమకరంద పానమత్తమిళింద పట
ల విహారంబు పావనంబు। మత్స్యకచ్ఛప భేకమకరకుళీరక వ్రాతనివా
సంబు శీతలాంబు। పరిపూర్ణ మలఘుసోపానా వృతంబు సుస్వాదు గ-

దాక్ష్యమై జగతిమీఁద। రమ్యమైయున్న పద్మసరస్సునడుమ। వెలయునావీ
రలక్ష్మిదా వెడలిరాగ । బాలెజాత ములాలక్ష్మిపైననించి । వెలగిజయజ
యశబ్దముల్ చేసిసురలు॥ చ॥ పొగడు చునుండగాజలధి పుత్రికదివ్యశరీర
కాంతులే । జగతినినిండిదిక్కులను సాంద్రముగాబ్రసరించిపిమ్మటన్ ।గగన
మునావరింపనది గాంచి ఫణీంద్ర గిరీశ్వరుండుదా । ఖగపతి నెక్కియచ్చ
టికి గ్రక్కునవచ్చె బ్రమోదచిత్తుడై॥ గీ॥ అప్పుడు బ్రహ్మశివాదులు । త
ప్పకనక్కడికిబోయి తమ వాక్యతతుల్ । గొప్పగ మెరయం జేయుచు
నుప్పొంగుచుసిరిని లోచనోత్సవ మెసఁగన్॥ సీ॥ చూచుచుగార్తీకశుద్ధపం
చమియుత్తరాషాఢ భృగువార నుమరగూడి । యున్ననాడరుదుగా వ్యూ
హమహాలక్ష్మిహరికి ముఖ్యప్రీత్యతనుమ్యెట్టి । విమలదినమునందవీరలక్ష్మి
ప్రసన్నమయ్యెనందరికి మహాదినంబు । ముఖ్యంబనుచు బ్రహ్మముఖ్యులా
లోచించి ఫణి గిరీంద్రునిజూచి పలికి రిట్లు । దేవ యీపుణ్య తీర్థమందే
ముదంబు । వెలయుగా వ్యూహ లక్ష్మియువీరలక్ష్మి । వెడలి వచ్చిరిగనుక
నీ విమలంబోయ । మవనిపై బద్మ దీర్ఘాఖ్య నమరియుండు॥ వ॥ అటుగావున
నీపుణ్యతీర్థంబులోనిట్టి శుభదినంబు నందుస్నానంబుజేసినవారు పాపవిము
క్తులై భాగ్యంబులను భవింతురని నిర్ణయించి తామందఱు స్నానంబులు
చేసి యప్పద్మ తీర్థంబున కాగ్నేయ భాగంబున దివ్యాలయంబు విశ్వక
ర్మచేత నిర్మాణంబు చేయించి యావీర లక్ష్మిని ప్రార్థించి దోడ్కొనివ
చ్చి సకలోత్సవంబులతో నాలయంబునందుంచి ఛాయాశుకునిచేత బాం
చరాత్రోక్తంబుగా సకలోపచార పూజలు చేయించి రందు చక్రితన
కంఠమందున్న పుష్పహారంబు నవ్వీర లక్ష్మికంఠంబు నందుంచి శుకాశ్ర
మంబు నగ్రహారంబు చేయించి ఛాయాశుకున కొప్పగించి బ్రహ్మదుల
కు విందుచేయించి వస్త్రతాంబూలంబు లిప్పించి సెలవిచ్చి వారినంపించి
వీరలక్ష్మితో నిట్లనియె॥ సీ॥ పాలేటిపట్టి నీ ప్రథమ శరీరంబు కనుగొంటిగ
న్నుల కరువుదీర। నీవ్యూహలక్ష్మితో నెనసి వేంకట శైలమందుండవచ్చు
నిచటికిపుడు। రమ్మని నారమారమణి చక్రికి మ్రొక్కి పటుభక్తిదీపించి
బలికెనిట్లు। నాప్రాణ నాయక నాకొఱకై నీవ్రతము చేసినమహాస్థలము
గనుక । శ్రీకరంబైన దీనికి క్షేత్రమందె। నిలిచెదను నాహృదయములో
నీవు నిలిచి । వ్యూహలక్ష్మి నురంబుపై నుంచికొనుము । నన్నిచటనుంచి
రక్షించు నలిననాభ॥ క॥ నాకిది సమ్మతమైనది । నీకను మానంబువలను
నిఘన కరుణే । యీకాయము నంగుంచుచు। నాకనకాచలము చేరుమబ్జ
దళాక్ష॥ గీ॥ నేను రాలేదనుచు మదినీవుకొదువ। నుంచవలదింక నేనె
శ్రీ వ్యూహలక్ష్మి । రూపమును దాల్చివచ్చి నిరొమ్ము మీఁద।గునుపుగా

నిల్చితిక నీవు గావుమ యో॥ క॥ కరుణను బద్మావతిసుం । దరసురలే కేలు
చుండు మహీగిరిపైకిన్ । బరులను రక్షించుచు ఘన । వరముల కృపని
చ్చుచుండు వారిధిశయనా॥ సీ॥ సురుచిర కార్తీక శుద్ధపంచమి వచ్చినప్పు
డు సపుష్పహార మొకటి। ప్రియమైన వస్త్రంబు ప్రేమతో బంపించుచుం
డుము నిచట మహోత్సవముల। నంగీకరించి నాయాత్మతో వెలుగు నీకన్ని
యు నర్పించి యచల మతిని। నిన్నుఁజూచుచు నిందె నే నుండెదను మీరు
శేషాద్రిమీఁద వసించియుండు। డనుచు బాదంబులకు మ్రొక్కి యపుడు
చక్రి । వీరలక్ష్మిని వీడ్కొని వెంకటాద్రి । చెంత నావ్యూహ లక్ష్మితో
స్నేహమెసఁగ । గలసి క్రీడించు చుండె నుత్కంఠ మెఱయ॥ చ॥ అపుడు
శుకాగ్రహార వరమందు శుకుఁడతి భక్తిమీఱఁగా । నెపుడు మహో
త్సవ క్రమము లిందిర కిచ్చట నాచరింపఁగా । నపరిమితంబుగా గలుగు
లందజేకిచ్చుచుం బూజలందు మేల్ । విపులసుఖస్థితిన్నిలిచి పేరరమావతి యుండె
నచ్చటన్॥ సీ॥ అంతకుముందుగా నాది శుకుండను జేరినప్పుడ భూప్రసిద్ధము
గను। బలకృష్ణమూర్తుల భక్తితో భావింపయుంచుచి పూజించియతడు చనిన
వెనుక ఛాయా శుకుండనెడు విప్రుడు పాంచరాత్రోక్తముగ రమారమణి నచట
నర్చింపబర కాంతలయుగులప్పి హరి చెంత జేరి యుద్ధక యున్న జేరినపుడు నేనిచటని
ల్చియుండుట సతిగాదు। తిన్నగా లేచి యిప్పుడె తీర్థయాత్ర। చనుకుననిసిరి లే
చెనా సమయమునను । బట్టికృష్ణుండు గూర్చుండ బెట్టెనతని॥ క॥ అప్పుడు కృష్ణు
నిగనిబలు। డప్పు కూర్చుండ బెట్టెనర్మంబగునే । గొల్పై పరసతి వేడ్కఁగ। ని
ప్పుడు దానిందు నిలిచె నింపు దలిర్పన్॥ సీ॥ కావున నేను వేంకటగిరిపై కేగియుం
దొకతీర్థంబు నాశ్రయించి । యుండెదననఁగ నన్నొంటిగా నిందుంచి పో
యన్న పోనేల నుండుమిచట । ననిన కృష్ణుని జూచి హాలపాణి పల్కె నీవు నుర
మ్ము నా వెంటన నగ కృష్ణ। దేవుఁడిట్లనెర మాదేవినిం దొంటిగా నుంచి నే వచ్చు
టకుచితముగు నె। యనుచుఁ గృష్ణుఁడు పలుకఁగా హాలధరుండు । మరలనిట్లనె గరవీ
రపురము జేరి। యొంటిగా నీ మహాలక్ష్మి యుండినపుడు । నెవ్వరో తోడుగ నుంటి
వె నిర్మలాత్మ॥ చ॥ అని హాలపాణి పల్కఁ నపుడల్లన నవ్వుచు గృష్ణదేవుఁడి । ట్లనె నసి
రిదవ్వుగా నిలిచి నప్పుడు రీతి దలంప నేలని । దొనరగ జేరియున్న దిపు డొంటి
గ నిచ్చటనుంచ నేను బో। యినజనులయినవప్పరె మహీంద్రగిరీశ్వరుడైన మె
చ్చునే॥ గీ॥ మనకుభయ మేమియుం జట రమాలలామ। విభవములు చూచు
చుందము వేడ్కనిలిచి । యనినఁ బలభద్రుఁడా మాట విని భయమును। జెందె శ్రీకృ
ష్ణదేవుఁ డీక్షించి పలికె॥ సీ॥ భృగుమునీంద్రుఁడు పూర్వమున గడు సేయుచు పరపు
రుషుండనుచు మది బెరికియుంచి । హరి బాసి కరవీరపురి జేరి పాతాళమున కే
గి విభుని చేత నె తపంబు। చేయించి తపముదా జేసి యీస్థలమందు జేరియుచ్చు

టనిల్చెవీరలక్ష్మి।యనగ బ్రసిద్ధమైహరివలెనే చతుర్భుజములతో మహాస్ఫురణమొఱయ। నిలిచినదిగాక నెనిందునిలువ వెఱతు। ననినదరహాసితాస్యయై యన్న మోముఁగాంచికృష్ణుండు పలికెనోకామపాల। శ్రీతరుణిమీదకొదువలెంచేదిమేల॥ సీ॥ వైకుంఠపురమందు నరమ్యమృదుతల్పమైయున్న తాకృతినిసీవుండినపుడు।హరిగూడిసీమీద నానందముగనుండు నంతియకానినిన్నన్యుడనుచు। దలచునెలక్ష్మి సీతాదేవివైయె నప్పుడిలను లక్ష్మణుడవై యెల్లయెడల। చరియించునపుడైన బరుడంచు సీమీద నరమరనుంచె నేయునినబలుడు। నవ్వియిట్లనిపలికెనానాడుసీత। యన్నమాటలు మఱపురాకున్న విపుడు। సరిరజోగుణమును దలంచినభయంబు। నామదినిబుట్టుచుండునో నందతనయ॥ క॥ అనితాలాంకుడువలుకగ। వినికృష్ణుండిట్టులనియె విశ్రవసునిపు। త్రునిరాముని చేజంపి। పనుబనిగలు గంగనట్ల పలికె గదన్నా॥ క॥ ఆమాటలుమఱువకయుపు। డీమాడ్కి-ని లక్ష్మితప్పులెన్నుచు మదిలో। క్షేమము నుంచకయడుగగ।సీమహితాశ్రమము విడువ నేమిటికనఘా॥ గీ॥ మించిసిరిమీడనిటు తప్పులెంచకిపుడు। శాంతమునుబొందుమీశుకాశ్రమతలంబు। విడిచిపోవగదనుచు వివేకసరణి। నన్నతోగృష్ణు డేకాంతమాడుచుండె॥ సీ॥ ఛాయాశుకుడుతన జనకుడర్చించిన రామకృష్ణుని రమా రమణినటు। నర్చింపుచుండగా నప్పుడగన్యామాసమందు బ్రహ్మోత్సవం బదిమీద।సాగగా నటకేగిఛాయాశుకుడు వీరలక్ష్మిసేవకులైన లలితమతుల। మొనసితానొకమాట యెనుబదిమందిని హరియాజ్ఞవడసివాహకులజేసి। శుకపురముజేరిరామ కృష్ణులనువీర। లక్ష్మినర్చింపుచుండె సలక్షణముగ।న చటహరిసల్పి నటువంటి యబ్జసఖుని। జేరివైఖానసులుబూజ సేతురనుచు॥ వ॥ ఇవ్విధంబున దేవదర్శనుండు దేవతులకు జెప్పెనని సూతుంజూచి శౌనకాదులిట్లనిరి॥ సీ॥ ఓసూత శ్రీశ్రీనివాసుని శేషాద్రియం దెవ్వరెవరుమున్న ర్చనములు। చేసిరాచందముల్ చెప్పగావలెనంచునా శౌనకాదులిట్లడుగునపుడు। వినిసూతుడిట్లనెమునినాథులారమీ రతిశయప్రశ్నన్నడిగినారు। చెప్పశక్యంబుగాదిప్పుడావ్యాసగురుండు నాజిహ్వయందుండిదయనుబరగబలికించినటులనేబలుకవలయు। ననుచువ్యాసుని ధ్యానించియాచలుడగుచు। శౌనకాదిమునీశ్వరసంఘములను। జూచిసంతోష చిత్తుడై సూతుడనియె॥ సీ॥ వేంకటాచలమందువిధి రుద్రముఖులకు హరితానుబ్రత్యక్షమైనయపుడ।కమలాసనుండువైఖానససూత్రక్రమంబుగ బానర్చనంబుజేసి। మొనసికన్యామాసమునరథోత్సవము గావించెనా పిమ్మటవిఖసనుండు।నర్చించెనమ్మునియాజ్ఞచేత మరీచియర్చించె నటుమీదనత్రిపూజ। చేసెగశ్యపుడనలనర్చించె భృగుడు।నంతబూజించెపుల్లమహామునీంద్రుడు। డవలనర్చించి

రట్టిసంయమికిశిష్యు! లైనయతులుస్వాయంభు వాక్యమనువు॥ సీ॥ సమయం
బునను సంధిసంవత్సరములతో మొనయుముప్పదికోటు లెనుబదియును! నా
లుగులక్షలునలువదియెనిమిది వేలయింటికి బ్రహ్మవిశ్వసృష్టి! తా జేయనూహిం
చి ధ్యానకాలమును గోటియ డెబ్బదియులక్షలనుచుబలుకు! నివినఱువది
నాల్గువేలబ్దముల్ గాగనిల్చినయేండ్లు గణింపసరవి । గుదిరియిరువదితొ
మ్మిదికోట్లపదియు! మూడులక్షలునదిగాక మొనసిపైన! నెనుబదియునాలుగ
గు వేలనెన్ని లెక్క । చేసిభాగించిచూడవిశేషమగుచు॥ తే-గీ॥ ఇన్నిముప్ప
దికోటులు వెను బదియును । నాల్గులక్షలునది గాకనలువదెనిమి దైనవే
లేండ్లయింటికి నరసిచూడ । నందుబహు ధాన్యవత్సరం బాదిగాగ॥ వ॥
అఱువదియెనిమిది చతుర్యుగంబులయింటికిప్పటి యీశ్వరనా మాబ్దం
బువరకు జతుర్యుగమొక్కింటికి సంవత్సరములు నలుపదిమూడులక్ష లిరు
వదివేల లెక్కను మహాయుగములులోడ జెప్పినక్రముగానలువది యెనిమి
దింటికి సంవత్సరములు యిరువదితొమ్మిదికోట్లు ముప్పదియేడులక్షలఱువ
దివేలును వైఖానససూత్రక్రమముగా విఖనస్రబహ్మకుశిష్యుడైన పుల్లమ
హామునికిశిష్యులైన యతులర్చించిరందు॥ సీ॥ నలువొప్ప బహుధాన్యనా
మసంవత్సరంబాది గావైఖానసాగమోక్త । పద్ధతిఁ విఖనస్రబహ్మసం
తతివారునట కోటినలువదియాఱులక్ష । లెనుబదియును మఱియెనిమిదివే
లేండ్లు చిరభక్తులై పూజచేసిరవల । మహినిస్వాయంభువు మనుకాలమిన్ని
యేండ్లయ్యెనీక్రమము గానబ్దసంఖ్య । దనరస్వారోచిషుండు నుత్తముడు
తామ! సుడురైవతుడును జాక్షుషుండునవెడు! పంచమనువులకాలమేర్ప
ఱచిసంధి । యబ్దములతోడ లెక్కింపనవనిమీద॥ తే-గీ॥ నలువురుగానూ
టయేబదినాల్గుకోట్లు । నిరువదియురెండులక్షలునిదియుగాక । నొక్కనలు
వదివేల యేండ్లొనరనయ్యె । నవలవైవస్వ తాఖ్యమన్వంతరమున॥ క॥
ఆవిధముగనేత్క్షితిపై । నా వేంకటశైలభర్తకానందముగా । నావైఖాన
సులిపుడును । సేవింపుచునర్చనములు సేతురుఘనులై॥ గీ॥ మరలనా
లెక్క మనువులకందఱకిసి! జరుగుకాలము తొరుభూచక్రమెల్ల । గ్రమము
దప్పకదమ తమకాలములను! బాలనము సేతురనితానుబలికెయవల॥ సీ॥ జ
గతిపైదివ్య వత్సరములునాల్గు వేలాకృతియుగము నందమరినడచు ।
నదిగాక తత్సంధియగు నెనిమిదినూర్లుమొనసి త్రేతాయుగమునకుమూ
డు । వేలగుతత్సంధివివరింపనాఱు నూఱా ద్వాపరంబునకరసిచూడ ।
నొకరెండు వేల యేండ్లొనరగా దత్సంధియబ్దముల్ నన్నూఱు నవలవ
చ్చు! కలియుగమునకు వేయేండ్లు గాగదాని । సంధిసంవత్సరంబు లెంచం
గద్విశత । మగుచతుర్యుగ కాలంబు లవనిమీద । సార్వకాలంబు నీరీతి

జరుగుచుండు॥ గీ॥ భామినీ యీనాల్గు యుగములు బుట్టిపుట్టి। వేయుమారులు పోయినవిధికి నొక్క ।దినముగుఱ్ఱ రాత్రికాలమందే యుటంచు । గురువొకటి జెప్పి సూతుండు సురల సనియె॥ వ॥ వినుం డివ్విధంబున జతుర్యుగ సహస్రంబులు గడచినంతకు బ్రహ్మసృష్టిం జేయుచుండు నది గడచినతుద నిద్రం జెందినప్పుడు లోకంబు లడంగు నతండు మేల్కాంచినప్పుడన్నియుంబుట్టుచుండునట్టి బ్రహ్మదినంబునందు జతుర్దశమనువు లివ్వసుంధర బాలింపుచుండురట్టి మనుకాలం బెట్టిదనిన స్వాయంభువు మొదలగుమనువులకొక్కరొక్కరికి దివ్యయుగంబులు డెబ్బదియొక్క మూఱుచనిననది యొక్క మనుకాలంబని చెప్పనొప్పునొక్కొక్క దేవేంద్రుడు దేవతలు సప్తఋషులు రాజులు హరియంశంబులను ధరియించి లోకంబుల బాలింతురు నారాయణుండు దేవతిర్యఙ్మనుష్యరూపంబుల ధరియించి సర్వంబు దానై సమర్థించి రక్షింపుచుండు శ్రీవేంకటేశ్వరుండు మూడుయుగంబుల ముని యతీంద్రుల చేత బూజింపుమండి ప్రతికలియుగంబు నందు మనుష్యపూజ లంగీకరించి భక్తులరక్షింపు చుండునని చెప్పి మఱియు నిట్లనియె॥ సీ॥ మునివరులారమీర నఘులు సర్వజ్ఞులగుచు నుండియు నన్నడుగగాను । భక్తితో శ్రీవ్యాసభట్టారకుల దయఁ విశదంబుగా బదివేలసంఖ్య । నమరు బ్రంహపురాణమందు ద్వాదశసహస్రములచే బ్రహ్మాండమమర నొకటి । సరవి నెన్నగ బంచశతసంఖ్యనమరుచువలనొప్పు బ్రహ్మకైవర్తనంబు । వెలయునిరువది నాలుగు వేలసంఖ్య। నమర విష్ణుపురాణంబు నదియుగాక । దశసహస్రిక సంఖ్యతో దనరి ధరను । నాణెమగు వామనసుపురాణంబు మఱియు॥ సీ॥ యిదిగాక నేబదియైదువేలగు సంఖ్యనెనయుపద్మ పురాణమెనిమిదియును । పదివేలనగు సంఖ్య నొదవు భాగవతంబు వెలయగా బదిరెండు వేలసంఖ్య । నొనరు మత్స్యపురాణము నుబదియేడు వే లయి కూర్మపురాణమదియుగాక । నలువొప్పనిరువదినాల్గు వేలగు లెక్కయమరు వరాహమహాపురాణ మిరువదియు నొక్క వేలునైవరుసగాను । రచితమైనట్టి గరుడపురాణ మొకటి। పంచవింశతిసాహస్రి మెంచ నారదపురాణంబునదిగాక తొడరిమఱియు॥ గీ॥ గురుతరంబుగ నొకపదకొండు వేల। నొదవు లింగపురాణంబునదియుగాక। నరయనిరువది రెండు వేలైదనర్చి । రమణ జెలువొందు శివుని పురాణ మొకటి॥ గీ॥ ఎనుబదియునొక్క వేల సంఖ్యను ఘనముగ । రచితమా స్కాంద నామపురాణ మొకటి । వింశతిసహస్రసంఖ్యతో వివిధకర్మ । రంజితాగ్నేయనామ పురాణ మొకటి॥ సీ॥ వెలయుగానిరువది వేలగు సంఖ్యతో దనరు మార్కండేయ ముని పురాణ । మదిగాక నిరువదియగు వేల సంఖ్యతో సారమై తగు భవిష్యత్పురాణ। మెన్న నెనిమిది పదునెనిమిదియగు పురాణంబులు మీకు నిర్ణయము

గాను। జెప్పితినిదిగాక శ్రీవరాహపురాణమున భవిష్యోత్తరమునను మఱియు।రమ్య తరమైనపద్మపురాణమునను। వింతలగుచు బ్రకాశించు వేంకటాద్రి। పతిచరితములుకొన్ని యేర్పఱచిమీకు। జెప్పితిని నేను మోక్షంబు జెందుకొఱకు॥ క॥ అనియాసూతుఁడుపలుకఁగ। విని శౌనకముఖ్యమునులు విశ్వాసముతో। గనుఁగొని యతనిముదంబున। వినుతించుచు నిట్టులనిరి వేడుకమీఱన్॥ చ॥ సురుచిర భక్తియుక్తులును సూనృతవాక్యములాత్మనిష్ఠయుం। బరమవివేకశీలములు పావన మోక్షవిచారధర్మముల్। కరుణయుశాంతముర్ మొదలుగాగల సద్గుణముల్ దృఢంబుగా। నఱిమఱినిల్చె నీహృదయమందతి ధన్యుడవైతి విద్ధరన్॥ శా॥ నీవాచక్రిగుణంబులం దలఁపుచున్ నిర్వాణబోధస్థితిన్। భావం బందు గ్రహించి మాకొనరఁజెప్పన్ జాలయోగ్యుండవై। నావిబ్భాగినకొందు లేకనిచటన్ నానాపురాణార్థముల్। ధీవిజ్ఞానుడవై వచించితివి సందేహంబులన్ దీర్చుచున్॥ ఉ॥ కావుననీవుధన్యుఁడవు కంజదళాక్షుఁడునీ హృదబ్జమందేవసియించియుండి బహుదివ్యతరోక్తులనిల్చి సత్కృపం। బ్రోవఁగనిక సాధ్యములుపుట్టవటంచు మునీంద్రులందఱా। దావిమలాదిసూతు సుగుణావళినెన్నుచు నాదరంబునన్॥ చ॥ పలుకఁగసూతుఁడిట్లనియెబద్మ దళాక్షుఁడు బాదరాయణుం। డలశుకయోగిపుంగవుఁడు నాగ్యులునైతగు మీరలందఱున్। విలసితమైన సత్కరుణ వీక్షగ నాయెడనుంచియుండఁగా। జెలువలరంగ దోఁచినవి చెప్పితి నంచువచించినమ్రుడై॥ క॥ మునులనుసన్నుతి సేయగ। వినవారలుమెచ్చియతని వినయోత్కర్షం।బునకలరుచు గ్రమ్మరనిట్లనిరింకొక ఘనరహస్యమడిగెద మపఘా॥ గీ॥ వినుము నేకమర్త్యవితతులలో మోక్ష। కాములైనవారు కాయములను। విడిచియెచట నెచటవిమలులై పొందుదు। రావిధంబు దెలుపుమయ్యసూత॥ క॥ అనవినిసూతుండప్పుడు। తనగురునిమనంబునందు దలచియచలుఁడై। కనుగవ ముకుళించుచు విష్ణునిధ్యానముచేసి విమలసుస్థిరమతియై॥ సీ॥ సూతుఁడిట్లనియెనో సూరిజనములార వివిధశ్రుతిస్మృతుల్ వినినమీకు। నఖిలంబు దెలియు నాయందుసత్కృపనుంచి యతిరహస్య ప్రశ్నయడిగినపుడు। చెప్ప లేదన నేల చెప్పెద దప్పొప్పులంగీకరించి నెయ్యమున వినుఁడి। పాపకర్ములుపోయిబహు నారకములందుబడి పుట్టుచుందురు ప్రజ్ఞలేక। పుణ్యకర్ములు పోయితత్పుణ్యఫలము। లనుభవించిన తుదభూమియందు బ్రాలి। క్రమ్మఱను బుట్టుచుందురు కామముఖ్య। శత్రువులగెల్చి గురుకటాక్షమును బొంది। నట్టివారుజనింపరీయవని మీఁద॥ సీ॥ అట్టివారెపరన్న నాచార్యభక్తులై పరమవిరక్తులై పటువివేక। కలితులై శాంతులై గర్వవిముక్తులై హేయగుణం

బులనెరగ మీాటి। గురుతర కల్యాణ గుణులై యచంచలచిత్తులై విజ్ఞాన సిద్ధులగుచు। హెచ్చుకతగ్గక నేకాంతనిష్ఠులై నారాయణధ్యానపూరితాత్ము। లయినఘనులంగములవిశి యఖిలలోక। ములనపుడెదాటి మండలములనుగడచి। వరుసమహదాదులయిన యావరణములను। గడచిమూలప్రధానముగడచి మఱియు॥వ॥ సహస్రశీర్షుండైనవిరాట్పురుషునతిక్రమించి యమృతవెల్లియననొప్పు విరజానదియందు గ్రుంకిలింగదేహంబులనువిడిచి యప్రాకృతదివ్యదేహధరులయి శతసహస్ర దివ్యావరణామృతంబై యనేకకోటిసూర్య చంద్రప్రకాశమై యొప్పుచున్న పరమపదమందు ప్రకాశింపుచున్న నారాయణపరబ్రహ్మసాన్నిధ్యంబునం బొందుదురు మఱియు భక్తిజ్ఞానవైరాగ్యంబులనభ్యసింపుచు నధ్యాత్మవిద్యానుభవులగు నాత్మవేత్తలుస్వరూప విలక్షణంబులేక నిరాకారప్రకాశమైన కైవల్యపదమందుబొందుదురు విజ్ఞానంబ బ్రహ్మంబని అనుభవసిద్ధులైన జ్ఞానవేత్తలు అమృతసముద్రంబును విరజయుంబొందుదురు సహస్రశీర్షుండైన విరాట్పురుషుండె పరబ్రహ్మంబని నిశ్చయించి తద్ధ్యానారూఢులైనవారావిరాట్పురుషునిశిక్షోపరి ప్రదేశంబునందు జేరుదురు వీరన్దఱును బునరావృత్తిరహితులై యున్నరు మఱియు నవ్విరాట్పురుషుని భూమధ్యాధః ప్రదేశంబునందు ద్రిగుణమిశ్రమైయున్న మూలప్రకృతినేపర తత్త్వంబ నిశదనుష్ఠానమాత్ర సిద్ధులైన వారుదుర్గధామంబునందు నొందుదురు తత్ప్రకృతిజన్యంబు లయినమహదాది సప్తావరణంబుల నేపరతత్త్వంబుగా జూచువారలయ్యావరణంబులందుదురు వాసుదేవ ద్వాదశాక్షరీ నారాయణాష్టాక్షరీ నారసింహ గోపాలాది మహామంత్రసిద్ధులును సదానారాయణస్మరణనేమరక జేయువారునువాసుదేవసంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధవ్యూహంబులందు బొందుదురు విష్ణుండొక్కడ మహద్భూతంబనిమఱియనేక భూతంబులు పృథగ్భూతంబులనివిష్ణుండే సాత్వికబ్రహ్మంబనినిశ్చయించివిష్ణుషడాక్షరీమహామంత్ర సిద్ధులయిన విష్ణుపరాయణులు శ్రీవైకుంఠముజేరుదురు మఱియు సద్వ్రతనిష్ఠులయిజ్ఞాన భక్తివైరాగ్య సంపన్నులయినవిష్ణుమతములవారు కారణవైకుంఠంబులందును బొందుదురువీరలందఱును వటపత్రశయనునినాభికమలమందు ప్రళయకాలంబులందు జొచ్చి వెడలుచుందురు బ్రహ్మపరతత్త్వమని బ్రహ్మగాయత్రీమహామంత్ర సిద్ధులయినవారు బ్రహ్మలోకమందును దపసిద్ధులైన వారుతపోలోకమందును శమదమాది సద్గుణసంపన్నులైన వారుజనలోక మందును బొందుదురు ప్రళయజలము జనలోకంబున కెగదట్టినప్పుడు జనలోకవాసులు మహర్లోకమందు జేరుదురు మఱియు యజ్ఞాది సత్కర్మసిద్ధులు సువర్లోకంబునందును దా

నధర్మపరోపకారు లయినవారు భువర్లోకమందుదురు సూర్యమంత్రో
పాసనాసిద్ధులైనవారు సూర్యలోక మందును జంద్రమంత్రోపాసనాసిద్ధు
లయినవారు చంద్రలోక మందును చేరుదురు తత్తత్పుణ్యంబులు క్షీణించి
నప్పుడు భూలోకంబున బుట్టవత్తురు మిక్కిలి పాపకర్మంబులు చేసినవారు
భూత ప్రేత పిశాచగ్రహమండలముల జేరి కాలాంతరములకు బాపం
బులు క్షీణించినప్పుడు భూలోకమున గ్రమ్మఱబుట్టి జన్మహేతు కర్మముల
జేయుచుందురనవిని శౌనకాదులిట్లనిరి॥ సీ॥ వెలయగర్మము లెన్నివిధములై
జీవుల కేయేశరీరంబు లిచ్చుచుండు। బుణ్యాతిశయమును బుణ్యమధ్యమ
మును బుణ్యసామాన్యంబు భూరిపాప। మును మధఃపాపంబు మొన
సిన సామాన్య పాపంబు నరులకే ఫలము లిచ్చు। మిశ్రకర్మాధి
క్యమిశ్రాధమము మిశ్ర సామాన్యమేగతుల్ జనులకొసగు। గామ్య
కర్మంబులును గతకాలకర్మ। ఫలము లేమార్గముల జూపు బ్రజలకనిన। విని
మనంబున భావించి మునివరులను। జూచి గురునిదలంచి యాసూతు డని
యె॥ వ॥ మహాత్ములారా వినుం డిట్టికర్మములచేతనే జీవులకు జన్మంబులు
గలుగుచుండు నట్టి కర్మంబు లెన్నివిధంబు లనిన పుణ్యపాపమిశ్ర కర్మంబు
లను మూడువిధంబులు తత్కర్మఫలానుభవంబు లెట్లనిన బుణ్యకర్ములు
దేవాదిశరీరంబులందును పాపకర్ములు తిర్యగాదిశరీరంబులందును బుణ్య
పాపమిశ్రకర్ములు మనుష్యాదిశరీరంబులందును బొందుదురు మఱియును
బుణ్యాతిశయులును హిరణ్యగర్భరూపంబునందును పుణ్యమధ్యము లిం
ద్రాదిశరీరంబులందును సామాన్యపుణ్యులు యక్షరక్షఃప్రముఖ తామస
దేహంబులందును బొందుదురు మఱియు నుత్కృష్టపాపంబుల చేసినవారు
జనతాపకరంబులైన కంటకవృశ్చిక వనమక్షికాది క్రూరజంతువులగుదురు
పాపమధ్యములు కదళీనారికేళాదివృక్షంబు లగుదురు సామాన్యపాపు
లు గోగజాదులగుదురు మఱియు సామాన్యమిశ్ర కర్ములు వర్ణాశ్రమధర్మా
ర్థకామ్యకర్ములై యుదయింతురు అత్యుత్కర్ష పుణ్యపాపమిశ్రకర్ములు
నిష్కామసత్కర్ములై పుట్టి యీశ్వరార్పిత పుణ్యకర్మంబు లాచరించి
యంక వలన చిత్తశుద్ధిగలిగి యందువలన సాధనచతుష్టయ సంపత్తిగ
లిగి యందువలన సద్గురుభక్తిగలిగి వారికి జతుర్విధశుశ్రూషలు జేసి మె
ప్పించి వారి కరుణకు బాత్రులై వేదాంతసిద్ధాంతరహస్యోపదేశంబు
వడసి శ్రవణమనననిదిధ్యాసనపూర్వకంబుగా సంపూర్ణజ్ఞానము నవలం
బించి యజ్ఞానకారణావరణ విక్షేపశక్తులంగెలిచి శబ్దానువిద్ధ శ్యానువిద్ధ
సవికల్ప నిర్వికల్ప సమాధుల నభ్యసించి జ్ఞానజ్ఞాతృజ్ఞేయంబు లనెడి త్రి
పుటిందాటి సచ్చిదానంద నిత్యపరిపూర్ణబ్రహ్మంబునందు బొంద జీవన్ము

క్తు లగుదురు కామ్యకర్మాచరణులైనవారు సుఖదుఃఖకారణంబు లయిన స్వర్గనరకము లందు బొంది క్రమ్మర బుట్టిగిట్టుచుందు రని చెప్పిన విని శౌన కాదు లిట్లనిరి॥ క॥ చటులోగ్రప్రళయంబున । నటమటమయి విశ్వమడగి నపుడులయాబ్ధిక౯। వటపత్రమునందాహరి। యెటువలె వర్తింపునుండు నెఱిగింపవయా॥ గీ॥ అనిన విని సూతు డనియె లయాబ్ధిమీద । మహిమమీఱ నంగుష్ఠమాత్రదేహుఁడై నిజాంగుష్ట మాస్యమం దమరనుంచి।లీలవటపత్రమున బవ్వళించునపుడు॥ సీ॥ పటుతరంగాహతిక౯ వటపత్ర మటునిటు లుయ్యాలవలె నూగుచుండగాను । జిరజిర నెగరెడు సీకరమాలిక నుయ్యాలజేరు వట్లొప్పగాను । ఫేనంబుచుట్టు గప్పి విశాలమయ్యాది యుయ్యాలతెరవలె నుండగాను।ధ్రువమండలంబడ్డ దూలంబుకైవడి నుయ్యాలచేర్లతో నొఱయగాను । బరమపదకాంతు లుప్పొంగి పద్మరాగ । ముఖ్యమణి జాలముల రీతిముద్దుగుల్క । జెండ్లవలెజాడ్క కెదురుగా నుండ దాని । జూచుచును బాలుడాత్మలో జొక్కుచుండ॥ గీ॥ బాలకుండు దాని బట్టనుద్యుక్తుడై। ముఱిసిముఱిసి నవ్వికరముసాచి। పట్టికొందుననుచు నట్టెట్టుచునుగుచు । నుబ్బినాట్యలీల నొప్పుచుండు॥ క॥ ఘనపద్మ జాండకోటుల । దనుసూక్ష్మోదరము సాపదాచిముఱియుచుఁ౯ । వనరాసిమీద దేలుచు । నొనరగ డోలోత్సవంబు నొందిసుఖించుఁ౯॥ క॥ వనజసభాకాదుండై । వననిధిలో దేలు చున్నవటపత్రముపై । దనుదానెచూచిచొక్కుచు । నెనవుగనానందయోగనిద్రం జెందుఁ౯॥ వ॥ ఇవ్విధంబున యోగనిద్రం జెందియుండి బహుకాలంబునకు గ్రమ్మరమేల్కాంచి నిజగర్భగతప్రపంచంబును వెలిపూర్వ ప్రకారంబును నిర్మించునప్పుడు ముక్తజీవులుదక్క దక్కినకర్మజీవులు యథాప్రకారంబుగా బుట్టిగిట్టుచుందు రనిజెప్పి క్రమ్మర సూతుండిట్లనియె॥ సీ॥ పుట్టిగిట్టుచునున్న భూలోకవాసుల రక్షించుటకు రమారమణితోడ । వేంకటాచలమందు విఖ్యాతిగానుండి నరులచే గోవిందనామభజన । మొనరఁ జేయింపుచు ఘనపాపములనైన క్షీణింపజేయుచు సిరులనిచ్చి । పాలింపుచున్నట్టి ఫణిగిరీశ్వరునకా వ్యూహమహాలక్ష్మి కుర్విమీద । వెలయునావీరలక్ష్మికి విమలహృదయ । యగుచు నలమేలుమంగాఖ్య నద్భుతముగ । నమరె బద్మావతికి వేంకటాద్రికిలను। వెలయు శుభమంగళముగల వలయు నన॥గీ॥ అప్పుడామును లెల్లదథా స్తటంచు । బలికి శ్రీవేంకటేశ్వరభక్తికథలు । సూతుడెఱిగింప వినుచు మెచ్చుచునువార । లందఱుండి రానందమతిశయింప॥ క॥ ధరణీశ్రీనీళాధిప । కరుణారస పూరితాత్మ కామితఫలదా। వర వేంకటగిరినాయక। తరిగొండనృసింహదురితదళనసుభాహ్వ॥

మాలిని.

సులలితమణిభూషా సూరిచిత్తాబ్జపూషా।
కలుషజలధిశోషా కంజగర్భాండవేషా।
కలియుగజలదోషా క్రాంతజీవాళిపోషా।
విలసితసవిశేషా వేదవేదాంగభాషా॥

శ్రీకృష్ణాయ నమః.

గద్యము.

ఇది శ్రీతరిగొండ లక్ష్మీనృసింహ కరుణాకటాక్షకలిత విచిత్రవసిష్ఠగోత్ర పవిత్ర కృష్ణయామాత్యతనూభవ వేంగమాంబాప్రణీతం బైన శ్రీవీరలక్ష్మీ విలాసంబను వేంకటేశ్వర మాహాత్మ్యంబునందు లక్ష్మినిగూర్చి హరి కొల్లాపురంబున దపంబు జేయుటయు శుకాశ్రమంబున దపంబు జేయుమని చక్రి కశరీరవాణి బోధించుటయు నాస్వామి పద్మసరోవరతీరంబున జేరి దివాకరప్రతిష్ఠ జేసి లక్ష్మినిగూర్చి తపంబు జేయుటయు దత్తపోవిఘ్నంబు జేయుట కింద్రానుమతంబున రంభాదులువచ్చి హరినిజయింపనేరక నోడిజనుటయు హరినిదలంచి పద్మావతిచింత నొందుటయు లక్ష్మీకపిలముని సంవాదమును వ్యూహలక్ష్మి హరికిబ్రసన్నం బగుటయు రమాసహితుండై బ్రహ్మాదులతోడ జక్రి శేషాద్రి జేరుటయు లక్ష్మీనారాయణులు వినోదంబుగా భాషించుటయు శుకమార్కాండ సంవాదంబును ఛాయాశుకోత్పత్తియు వీరలక్ష్మిశుకాశ్రమంబు జేరియుండుటయు బలకృష్ణసంవాదంబును శ్రీనివాసుని బ్రహ్మాదు లర్చించినకాలక్రమంబును కాలనిర్ణయంబును అష్టాదశ పురాణప్రశంసయు బుణ్యజీవులు పొందుసద్గతిక్రమంబులును ననుకథలం గల శ్రీవేంకటేశ్వర మాహాత్మ్యంబునందు వీరలక్ష్మీవిలాసం బను షష్ఠాశ్వాసము సంపూర్ణము.

అమెరికన్ డైమండు ముద్రాక్షరశాల చెన్నపురి. 1924.

# ప్రకటన.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA119B184 |
| పుస్తకం పేరు | వేంకటాచలమాహాత్మ్యము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 221 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Rehana |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |